# వాఙ్మయి

త్రైమాసిక పరిశోధనా పత్రిక



సంచిక - 1 మే - జూలై 1997 సంపుటి - 1






పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు - 500 004.

**Vāṅgmayi : Journal of Telugu Studies** (Quarterly)

| | | |
|---|---|---|
| ***Honorary Editor*** | : | **Prof. Nayani Krishnakumari**<br>***Vice - Chancellor*** |
| *Editor* | : | Prof. Jayadheer Tirumala Rao<br>*Director, Publications Division* |
| *Asst. Editor* | : | Mr. T. Nagaraja Chetty<br>*K.V.L. Centre for Encyclopaedia* |
| *Subscription* | : | Per Copy : Rs. 25/- $ 15<br>Per Annum : Rs. 100/- $ 60 |



| | | |
|---|---|---|
| *గౌరవ సంపాదకులు* | : | ఆచార్య నాయని కృష్ణకుమారి<br>ఉపాధ్యక్షులు |
| *సంపాదకులు* | : | ఆచార్య జయధీర్ తిరుమల రావు<br>డైరక్టర్, ప్రచురణల విభాగం |
| *సహాయ సంపాదకులు* | : | శ్రీ టి. నాగరాజ శెట్టి<br>విజ్ఞాన సర్వస్వ కేంద్రం |
| *విడి ప్రతి* | : | రూ. 25/– $ 15 |
| *సంవత్సర చందా* | : | రూ. 100/– $ 60 |



| | | |
|---|---|---|
| *Published by* | : | Registrar,<br>Potti Sreeramulu Telugu University,<br>Public Gardens,<br>Hyderabad - 500 004. |

Printed at : Akruthi Process, 1-8-540/2, Ist Floor, Chikkadpally, Hyderabad - 20

# వాఙ్మయి గురించి ....

ఒక జాతి తేజానికి ఆ జాతి వాఙ్మయం ప్రతీక. ఆ తేజాన్ని ప్రతిబింబిస్తూ, తెలుగులో జరుగుతున్న ఆధునిక పరిశోధనను, అధ్యయన ప్రగతిని అందరికి అందించాలన్నది వాఙ్మయి ఆశయం.

వివిధ రంగాలలో తెలుగు వాడకం పెరిగే కొద్ది తెలుగులో ఉన్నత స్థాయి పరిశోధనా పత్రికల అవసరం పెరుగుతూ వస్తూంది. తెలుగులో విభిన్న క్షేత్రాలలో జరుగుతున్న పరిశోధనా కార్యక్రమాలను సమన్వయ పరచి యువ పరిశోధకులకు సహాయకారి కాగలిగే పరిశోధనా పత్రిక అవసరం ఎంతైనా ఉంది.

ఈ అవసరాన్ని దృష్టిలో ఉంచుకొని తెలుగులో పరిశోధనకే పరిమితమైన పత్రికలు ఎక్కువగా లేనందున ఆ లోటును తీర్చడానికి లోగడ తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన వాఙ్మయి అర్ధవార్షిక పరిశోధన పత్రికను త్రైమాసిక పత్రికగా ఇప్పటి నుండి క్రమం తప్పకుండా వెలువరించాలని నిర్ణయించాం.

మొదటి త్రైమాసిక సంచికను 1997 మే - జూలై సంచికగా మీకందిస్తున్నాం. వీలైనంత నిర్దుష్టంగా భాషా, సాహిత్య, సాంస్కృతిక, చరిత్ర, సాంఘిక, వైజ్ఞానిక, కళా రంగాలకు సంబంధించిన అంశాలపై రచనలతో పత్రికను తీసుకురావడానికి ప్రయత్నించాం. పరిశోధకుల, రచయితల పాఠకుల అభిప్రాయాలకనుగుణంగా పత్రికను తీర్చిదిద్దగలం.

ఈ సంచికను అందంగా తీర్చిదిద్దిన సంపాదకుడు ప్రొఫెసర్ తిరుమలరావు గారికి, వ్యాసాలను ఎంపిక చేయడంలో సహకరించిన ఆచార్య ఎల్లూరి శివారెడ్డి గారికి, ఆచార్య రవ్వా శ్రీహరి గారికి కృతజ్ఞతలు.

**నాయని కృష్ణకుమారి**

ఉపాధ్యక్షులు

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం.

హైదరాబాదు

మే 23, 1997



కీ॥ శే॥ బెజవాడ గోపాలరెడ్డి స్మారకాంకం

# ఈ సంచికలో.....

# తెలుగు సాహిత్యంలో శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

- ఆచార్య నాయని కృష్ణకుమారి

1997 మార్చి 9న శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు తమ 90వ యేట కన్నుమూశారు. ఈ సంఘటన, ఆయనను ఎరిగిన వారందరినీ అత్యంతమూ కలచి వేసింది. రెడ్డి గారి జీవన చిత్రానికి ఎన్నో ముఖాలు. అందులో ప్రముఖమైనవి రెండు. ఒకటి రాజకీయ విషయం కాగా, మరొకటి సాహిత్య విషయం. రాజకీయంగా ఆయన కుట్రలూ, కూహకాలూ, మంత్రాంగాలూ వంటి వాటి జోలికి పోకుండా, నళినీ పత్ర స్థిత జలబిందువు లాగా మసలిన వారు. ఆయన అంటీ పట్టనితనం ఆ రంగంలో ఆయన్ని ఋషిని చేసింది. సాహిత్య రంగంలో ఆయన ప్రవేశం చాలా ఆలస్యంగా జరిగింది. ఈ ప్రవేశాన్ని గురించి ముచ్చటించుకునే ముందు, రాష్ట్రంలో నెలకొన్న సాహిత్య స్థితి గతుల్నీ, వ్యక్తిగతంగా రెడ్డిగారి సాహిత్య నేపథ్యాన్ని ఒక్కసారి అవలోకనం చేసుకోవడం ఎంతైనా అవసరం.

తెలుగులో నవ్య సాహిత్య ప్రాదుర్భావం ఈ శతాబ్దపు ప్రథమ దశకంలో జరిగిందన్న విషయం అందరికీ తెలుసు. లార్డ్ మెకాలే ప్రవేశపెట్టిన విద్యా సంస్కరణల వలన అప్పటి భారతీయ యువత ఇంగ్లీషు భాషా సాహిత్యాల వైపుకు ఆకర్షింపబడ్డది. దేశవ్యాప్తంగా షెల్లీ, కీట్స్, వర్డ్స్‌వర్త్, బైరన్ వంటి కవుల రచనలు ఆమోదయోగ్యాలయినాయి. తెలుగు సాహిత్య రంగంలోని ప్రాబంధికమైన శరీరాశ్రిత శృంగారాన్ని వెనక్కు నెట్టి, ఆత్మాశ్రితమైన అమలిన శృంగార భావధార తొలి వరసలో కొలువు తీరింది. నిడివి కలిగిన పూర్ణ కావ్యాలు పోయి ఖండ కావ్యాలు రూపుదిద్దుకున్నాయి. సాంప్రదాయిక ఛందోబద్ధ రచనలు వెనుకబట్టి, మాత్రాగతీ, వచన గతీ ప్రాచుర్యంలోకి వచ్చాయి. ఈ శతాబ్దపు ప్రథమార్థంలో మన రాష్ట్రంలో ఇంత మార్పు కలుగుతుండగా, వంగ దేశంలో శ్రీ రవీంద్ర కవీంద్రుడు, ఈ కొత్త పద్ధతులకు, తన రచనల ద్వారా దిక్ప్రదర్శననూ, కొండంత అండనూ కల్పించాడు. ఆంధ్ర దేశపు యువత, వంగ దేశపు శాంతినికేతనం వైపుకు ఆకర్షితమై, గురుదేవుని పాద సన్నిధిని, కొత్త పోకడలను గ్రహించడమే కాక, వాటిని తెలుగు దేశంలో పాదుకొల్పగలిగింది. ఆ రకంగా నవ్యాంధ్ర కవితా స్రోతస్వినికి ప్రవాహ వేగాన్ని సంతరించి పెట్టిన పాయలు రెండు. ఒకటి ఇంగ్లీషు కవిత్వం. మరొకటి గురుదేవుని భావధార - గోపాలరెడ్డి గారిని ఎక్కువగా ప్రభావితుల్ని చేసిన వారు గురుదేవులు. అంతేకాక ఆయన ఉద్యోగవశాత్తూ ఉత్తర హిందూ స్థానంలో నెలకొనినప్పుడూ, హైదరాబాదు నివాసిగా ఉన్నప్పుడూ, అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషా సాహిత్యాలాయనను ఆకట్టుకోగలిగాయి.

తొలుతగా ఆయన కేవలం అనువాదకుడిగానే సాహిత్య రంగ ప్రవేశం చేశారు. రవీంద్రుని నాటకాలూ, కథలూ, కవితలూ తెలుగులోనికి అనువదించినట్లుగానే ఇక్బాల్, గాలిబ్ కవితల్ని కూడా అనువదించారు.

ఆ కవిత్వంలో వియోగ ప్రణయం ఎంత గాఢమైన స్వయం వ్యక్తిత్వ ప్రతిభతో వేళ్ళు తన్నుకుని నిలిచి పోయిందో, ఆయన్ని కదిలించివేసింది. ఆ భావధారను తెలుగులో బలంగా ప్రవేశపెట్టాలన్న ఆలోచన ఆయన్ని నిలువనీయలేదు. చాలా ఆలస్యంగా 1978లో ఆయన తెలుగు కవిత్వ రంగంలోనికి ప్రవేశించినా, ఆయన తొలి కావ్యమైన 'ఆమె', ఆయన కవిత్వాదర్శాన్ని

'ఆమె' అనే మాట ఏ ఒక్క స్త్రీ నో సూచించేది కాదు. ఆమె పరిపూర్ణ స్త్రీత్వానికి ప్రతీక. ఆమె కోరికలు, కోపాలూ, ప్రేమలూ, ఆర్ద్రతా, చిలిపితనం, విశృంఖలతా, అన్నీ ప్రపంచ వ్యాప్తంగా ఏ స్త్రీ మూర్తికైనా సంబంధించినవే. 1978లో 'ఆమె' సంకలనంతో రంగప్రవేశం చేసిన ఆయన 1982 నాటికి 'ఆమె'నే వస్తువుగా చేసుకుని మరొక నాలుగు కవితా సంకలనాలు వెలువరించారు. ఈ ఐదింటికీ 'ఆమె పంచకం' అనే నామకరణం చేసుకుని ఆనందించారు. అవి, ఆమె - ఆమె జాడలు- ఆమె నీడలు - ఆమె తళుకులు - ఆమె చెణుకులు అనేవి. 'విశ్వ వస్తువై'న ఆమెను గురించి రెడ్డిగారు, తమ అనుభవాన్నీ అనుభూతినీ, లోకజ్ఞతనూ, లోకరీతినీ సంపూర్ణంగా వెచ్చించి, పిండీకృతంగా ఒక అద్భుత సృష్టిని ఆవిష్కరించగలిగారు. తమ భావాలు నిద్రా సమయంలో పొదుగబడే గుడ్ల లాటివనీ, తెల్లవారే సరికి అవే పిల్లలై అటూ ఇటూ తిరుగుతాయనీ చెప్పుకున్నారు. వేగంగా ఒక చోటు నుండి మరొక చోటుకు కదిలే భావాలు పట్టుకుందామంటే అందకుండా పారిపోతాయనీ వివరించారు.

ఆయన కవిత్వ దాహం ఆమె పంచకంతో చల్లారలేదు. అదే కాలంలో సమాంతరంగా మరో నాలుగు సంకలనాలను సృష్టించుకోగలిగారు. అవి కాలవాహిని (1979), సాహిత్య సుందరి (1980), ప్రసూన మంజరి (1981), పరిమళ తరంగాలు (1982). ఈ అన్ని కవితల్నీ విషయపరంగా నాలుగు రకాలుగా విభజించవచ్చును. ఆ విషయాలు (1) కాలం (2) నేడు (3) కాలపు ఆత్మ కథ (4) నిన్న లు.

కాలాన్ని గురించి ఆలోచనను కవి సారించడమంటే ఆయన తన్మయత్వాన్ని భజించడమే. కాలమూ ప్రకృతీ ఒకదానికొకటిగా ఉనికిని సార్థకం చేసుకుంటూ, మచ్చలేని క్రమశిక్షణతో సాగిపోతుంటాయి. జరిగిన గతమేమిటో జరగబోయే భవిష్యత్తేమిటో విలువ కట్టి అంచనా వేసేవిగా ఎవరికీ ఎదుట సాక్షాత్కరించవు. మనిషికి నూటికి నూరుపాళ్ళూ కలిసి వచ్చేదీ, తెలిసి వచ్చేదీ వర్తమానం ఒక్కటే. మనం మనుష్యులం. కాలాన్ని మన సౌకర్యం కోసం సంవత్సరాలూ, నెలలూ, వారాలూ, రోజులూ, గంటలూ, నిముషాలూ, సెకండ్లూ అంటూ విభజించుకుంటాం కానీ, అది అవిభాజ్యమైనది. కాలం ఒక నది. అది ప్రవహిస్తూనే ఉంటుంది. ఎప్పటికీ ఎండిపోదు, ఆగిపోదు. ఈ కాలవాహినిలో మంచి చెడులు రెండూ మునకలు వేస్తూ ముందుకు సాగుతూనే ఉంటాయి. ఒక ప్రసిద్ధ వ్యక్తి తన దిన చర్యను ముఖ్యాముఖ్య సంఘటనలతో అక్షరబద్ధం చేసినట్లుగా రెడ్డి గారి కాలవాహిని సాగింది. ఈయనలోని ఆత్మాశ్రయ లక్షణం, స్వీయానుభవ ప్రకటన ఒక సంకలనం కంటె మరో సంకలనంలో ముమ్మరంగా కనిపిస్తాయి. సాహిత్య సుందరి, ప్రసూన మంజరి, పరిమళ తరంగాలు, మలయ మారుతాలు, సౌరభ నీరాజనాలు - ఇవన్నీ ఆయన ఆత్మీయతా ముద్ర కల సాహిత్య సౌధానికి అమర్చిన మెట్లు.

ఆత్మీయతా ముద్ర ఈయన వర్ణించిన అన్ని వస్తువుల లోనూ పూసలలో దారం వలే కనిపిస్తున్నా ఈయన వర్ణించడానికి చేపట్టిన వస్తు సౌభాగ్యమేమీ అల్పమైనది కాదు. ప్రకృతి, రాజకీయ జీవితం, పరిచయాలు, జీవన రంగంలోని వివిధ ఘట్టాల పైన ప్రేమ, ఇవన్నీ ఓహో! అనే రీతిలో వర్ణింపబడడం మనకు కనపడుతుంది. ఉదాహరణకు - కవి, వేసవిని తిట్టుకునే జనాన్ని చూచి, ఏ ఋతువైనా మనిషి ఆహ్వానింపదగినదే. ప్రతి ఋతువుకూ వెలుగూ చీకటీ తప్పనిసరి. ఎప్పుడూ వెలుగును వెతికి పట్టుకుని ఆనందించడమే మనిషి చేయవలసిన పని. వేసవి వేడిమిలోని బాధనూ చిరాకునూ అనుభవిస్తేనే కదా తరువాత వచ్చే వర్షర్తువు చల్లదనాన్ని హృదయపూర్వకంగా ఆస్వాదించగలిగేది?

రెడ్డిగారికి ఉపమలు అయాచితంగా అప్రయత్నంగా లభిస్తాయనిపిస్తుంది. నిత్యమూ మనం చూసే అతి సామాన్య విషయాలను బ్రహ్మాండమైన ఉపమా సామగ్రిగా వినియోగించుకోవడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్యగా భాసిస్తుంది. వాహనాల వేగాన్ని అరికట్టే వేగ నిరోధకాలను చూస్తూ. - అతి వేగంగా కదిలిపోయే ఏ జీవన చర్యకైనా నిరోధం అవసరమే. అంతు లేని కోరికలకు అసంతృప్తి, అడ్డుకట్ట, విజయం, పరాజయం, ఆరోగ్యం, అనారోగ్యం, అమావాస్య, పౌర్ణమి, శాంతి, సమరం, ఈ ద్వంద్వాల కన్నిటికీ అడ్డుకట్టలు కావలసిందే- అవి లేకపోతే జీవన గమనంలో ఉత్సుకత ఉండదు అంటారాయన, జీవనానికి మృత్యువు అడ్డుకట్ట - ఆధునిక ప్రపంచానికి ప్రళయం అడ్డుకట్ట అని వివరిస్తారాయన.

గతించిన సుదూర కాలానికి సంబంధించిన 'ఫొటో ఆల్బమ్'ను చూస్తూ, ఆ చిత్రాలన్నీ ఆయనకు అహల్యలుగా భాసిస్తున్నాయంటారు. తన కొన వేలి స్పర్శ చేత, జ్ఞాపకాల సమ్మర్దంతో అవి సుప్త స్థితి నుండి జాగృతిలోకి వస్తున్నాయంటారు. "భావ నిర్భరాలయిన మాటల నన్నిటినీ పెదవుల సంచుల్లో దాచుకుంటావు. నీ మాటల ముత్యాలు ఆ సంచుల్లోంచి ఒలికి పోతాయని నీ భయం. నీవు పరమ లోభివి. నన్ను రవ్వంత కూడా ఖాతరు చేయవు" అంటూ ఏ అజ్ఞాత తత్వాన్నో నిలువరిస్తారు.

తాను రాజ్య పాలకుడైనా రాజ్యం లేనివాడు. "సాహిత్య సౌధం వాకిలి కావలి వాణ్ణిగా నన్ను నేను చెప్పుకోవడం నాకిష్టం.. నా పేరు గోపాలుడు కదా నేను జన హృదయ వేణువుల్ని పూరించే గోపాలుణ్ణి.. నన్నూ, నా గతాన్నీ నేను చేపట్టిన పదవుల్నీ అన్నిటినీ జనం మర్చిపోవచ్చు. నా కవిత్వం వెదజల్లిన సుగంధం కూడా అనంతమైన ఈ సాహిత్యారణ్యంలో కలిసిపోయి తన అస్తిత్వాన్ని పోగొట్టుకోవచ్చు. అయితే ఏం? ఎందుకు నాకు అసంతృప్తి? ఈ జీవన నాటకంలో నా పాత్ర నేను చక్కగా నిర్వహించానన్న తృప్తి నాకుంది. నా జీవితాన్ని నేను మనోవాక్కాయ కర్మలా ఒక వీరుడిగా గడిపాననే ఆత్మ తృప్తి నాకుంది. అది చాలు" - అంటారాయన. ఆయన అసంతృప్తితో వేగిపోవడం తెలీని అచ్చమైన కవి. ముసలితనంతో రాజీపడని ధీర హృదయుడు. వృద్ధాప్యమనే ముసుగు ఆయన్ని కమ్ముకుంటున్నా, మరణ చింతనను దరి చేరనీయని స్థిత ప్రజ్ఞుడు.

తన కవిత్వమంతటా గుబాళించే జీవనాదర్శం ఆయన కొకటి ఉంది. జీవితం, ఏ అడ్డుకట్టలకూ అంకెలకూ లొంగని సర్వ స్వతంత్రమైనదని ఆయన విశ్వాసం. ఆ విశ్వాసాన్ని ఆయన ఎప్పుడూ మార్చుకున్నట్లు కనిపించదు.

ఎవరైనా ఆయన జీవితంలో ఆయనకు విడువరాని బంధం ఏమిటని ప్రశ్నిస్తే చిత్రంగా ఆయన "కాంగ్రెస్" ను ప్రసక్తిలోనికి తెస్తారు. నేను కాంగ్రెస్ ను నా తల్లిగా భావిస్తాను. ఆమె ఒడిలోనే పెరిగి నేనింతవాణ్ణయ్యాను. ఆమె నా చేయి పట్టుకుని నన్ను ఋజు మార్గం వైపుకు నడిపించింది. ఆమె చేతి వెలుగే నన్ను అపమార్గం పట్టకుండా దిక్ప్రదర్శనం చేసింది. నేను జైలు జీవితాన్ని అనుభవించినా నాకు విచారస్ఫోరక ఘటనలు ఉండేవి కావు. అప్పటి నా ధ్యేయమంతా ఒకటే. అయితే జన హృదయాల్లో నా పట్ల ప్రశస్తి, కాకపోతే మరణం! ఏదైనా నాకు సంతోష ప్రదాలుగానే ఉండేవప్పుడు.

ఆయన కవిత్వం విస్తరించుకున్న బలమైన వట వృక్షం వంటిది. అందులో జీవన సత్యాలు తప్ప మరేమీ కనపడవు. ఆయన కథన విధానాలన్నీ పలు శాఖలుగా నలుమూలలకూ వ్యాపించి అక్కడ కనిపిస్తాయి. అందులో రూపక సౌందర్యం ఆకులలాగా చిగుళ్ళలాగా అందగిస్తుంటుంది. ఆయన కవితా రీతీ, విన్యాసమూ మనోహరమైన పువ్వులై మెరుస్తుంటాయి.

ఆయన ఒక స్వాప్నికుడు కూడా! భవిష్యత్తును గూర్చి, వాస్తవం మీద ఆధారపడి అయినా సరే,కలలు కనడం ఆయన కవిత్వంలో మనం చూడవచ్చు. తన కవితా చంద్రహాసాన్ని ఆయన వాస్తవమనే కొలిమిలో కాల్చి దానికి తీక్షణమైన వాదరను తీర్చుకుంటారు. దానిని సత్యమనే గీటురాయి మీద ఒరిపిడి పెట్టి మేలిమి బంగారం లాగా తయారుచేసుకుంటారు. ఆయన భావాలన్నీ హృదయకుహరంలో నుండి ఎన్నో నిలువుల లోతు నుండి పైకి చేదబడినవే. అవన్నీ ప్రేమతో, అనురాగంతో కూడినవే. కల్పనా సుగంధాన్ని అలతి అలతిగా ఆలదుకున్నవే. అవి స్థిరమైన జ్ఞాపకాల నుండి రూపు చెందినవి. ఇంద్రధనుస్సులో రంగులు కరిగిపోయినట్లుగా అవేవీ కరిగి చెదిరిపోవు. అవన్నీ ఒకటిగా నేసిన ఒక వస్త్ర కవచం! కవిత్వ కవచం!

నా కవిత్వం, సాహిత్యోద్యానానికి ఎంతో కొంత సుగంధాన్ని అలరిందనే నేను భావిస్తున్నాను. ఒక వృద్ధ వృక్షం చిటారు కొమ్మన శోభించే చిగురు నా కవిత్వం అని చెప్పుకున్నారాయన.

తన ''ఆమె పంచకాన్ని'' ప్రస్తావిస్తూ, ప్రతి వాళ్ళూ 'ఆమె' ఎవరు అని ప్రశ్నిస్తున్నారు. సందేహ దృక్కులు వెలారుస్తున్నారు. ఊర్వశి నుండి పరాశక్తి వరకూ, ఇంకా నేనెరిగిన ఎందరో ''ఆమె''లు - ఈ మొత్తం స్త్రీ తత్త్వం యొక్క సమాహార స్వరూపం ఆమె. ఆవిడ గుణాలెన్నెన్నో! అట్లాగే రూపాలు కూడా ఎన్నెన్నో! ఆవిడ సృజనశక్తి యొక్క సాకారం. అందానికి పరాకాష్ఠ. 'ఆమె' ఒక వ్యక్తి కాదు. ఒక శక్తి. నా జీవన మూలం అంటారు. 'ఆమె'మిమ్మల్ని ఆకర్షిస్తే, ఆరాధించండి. కాకపోతే ఆమె మానానికామెను వదిలేయండి. ఆవిడ ఎవరా అని ఆలోచించి తలలు బద్దలు కొట్టుకోకండి. ఆమె చిత్ర వర్ణశోభిత, మాయా కనక మృగం. ఎవరికీ అందదు. నా కవితత్వమంతటా ఆమె తళుకు తళుకున మెరుస్తూనే ఉంటుంది అంటారాయన. అచ్చమైన ఆత్మాశ్రయ కవిగా గోచరించేది యిటువంటి స్థలాలలోనే. ఒక్కొక్క చోట కవిత్వం కనిపించదు. పూర్తి వాచ్య గుణమూ, తారీకులూ, సంఘటనలూ కనిపిస్తాయి. తన ఉద్యోగాలనూ, అక్కడి అనుభవాలనూ, సంఘటనలనూ వివరించేటప్పుడీ ధోరణిని ఆయన కవితా సంపుటుల్లో మనం చూడవచ్చు. ఈ ధోరణి కొనసాగుతుండగానే ఉన్నట్లుండి ఉన్నతమైన తాత్త్విక భావ ధోరణిలోనికి ఎగసిపోతారు. పాఠకుణ్ణి ఉత్కృష్ట కల్పనా జగత్తులోనికి నడిపించుకుపోతారు. ఒకచోట, "నేను రెండు సార్లు ''ఎక్స్'' అనిపించుకున్నాను. గవర్నరుగా, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ అధ్యక్షునిగా అంటూ ఉన్నట్లుండి, ''అవును నేను ఎక్స్‌నే. గతానికి సంబంధించిన నాలుగు దిక్కులకూ నా ప్రయాణాన్ని సాగించాను. అయినా నేను వర్తమానాన్ని కూడా. అసంతృప్తినీ నిరాశనూ ఎరుగని వర్తమానాన్ని! నేను సూర్యుని వైపుకే ప్రయాణం చేస్తున్నాను. "మృత్యు సూర్యు"ని వైపుకు - వెలుతురుకు అభిముఖంగా ఎవరు ప్రయాణం చేసినా అతని నీడలెప్పుడూ అతని వెనకనే ఉంటాయి. ముందుకు రావు'' అని చిక్కనైన తాత్త్విక ధోరణిలోనికి కరిగిపోవడం మనస్సును ఆశ్చర్యచకితం చేస్తుంది.

ఆయన కవితా సంపుటులు దాదాపు ఇరవై ఉన్నాయి. వాటిని నిశితంగా పరిశీలిస్తే ఆయన మనకు జాతీయవాదిగా, ప్రకృతి ప్రేమికుడుగా, కాంగ్రెసువాదిగా, ఆర్ద్ర హృదయుడుగా, ప్రతి పువ్వునూ, ఆకునూ, చెట్టునూ గట్టునూ, నదినీ, పిట్టనూ, అన్నిటినీ ప్రేమించే ఆరాధకుడిగా కనిపిస్తాడు. తన జీవితానుభవాలే కవిత్వమై ఆయన చేతిలో రూపుదిద్దుకున్నది.

ఆయన వృద్ధాప్యాన్ని రెండు చేతులూ, చాచి ఆహ్వానించినవాడు. మంచినీ, మమతనూ గుర్తించి మానవుల్లో ఆ గుణాన్ని చూచి ఆనందించిన వాడు. డాంబికానికీ, అనవసర ప్రాకట్యానికీ ఇష్టం చూపనివాడు. తనకిష్టం కాని సంఘటనలు తన చుట్టూ కనిపిస్తే అందుకు కారకులైన వారి మీద కోపం కంటే జాలినీ, విచారాన్నీ ప్రకటించిన వాడు. తన జీవితంలో నూటికి నూరుపాళ్ళు గాంధీగారి తత్త్వాన్ని రంగరించుకున్నవాడు. అసలు సిసలైన మనుష్య ప్రేమికుడు.

ఈ గుణ గణమంతా ఆయన కవిత్వం ద్వారా లోకానికి వెల్లడైనవి. మనస్వి అయిన ఈ కవికి కీర్తిశేషులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారికి, నమస్కారాలు.



# సత్యభామ మూర్తిమత్వ విశ్లేషణ

- డా॥ పి.ఎన్. పార్వతీదేవి

ఒక వ్యక్తి యొక్క విలక్షణమైన ప్రవర్తనను, ఆలోచనను నిర్ణయించే అతని మానసిక భౌతిక వ్యవస్థల యొక్క (Psychophysical systems) గతిశీలక వ్యవస్థాపనయే (Dynamic organisation) మూర్తిమత్వము అని ఆల్‌పోర్ట్‌వ్రాసిన *Dictionary of Psychology* వలన తెలుస్తుంది. ఒకవ్యక్తియొక్క మూర్తిమత్వ గుణగణాలను గురించి తెలుసుకోవడానికి, ముఖ్యంగా రెండు విషయాలను గమనించడం అవసరం. 1. ఒక మూర్తిమత్వ లక్షణం విలక్షణంగా ఉండి కొంత కాలమైనా, అది స్థిరంగా ఉండాలి. 2. మనం తెలుసుకోవడానికి ఎన్నుకున్న మూర్తిమత్వపు అంశాలు ప్రత్యేకమైనవిగా ఉండాలి. అంటే ఇతరుల నుండి ఆ వ్యక్తిని వేరుపరచే విధంగా ఉండాలి.

ఒక వ్యక్తిలోని మానసిక శారీరక లక్షణాలే అతనిని విలక్షణమైన వ్యక్తిగా నిలుపుతాయి. అతని శారీరక నిర్మాణం, మానసిక ప్రవృత్తి బుద్ధి నైశిత్యం, ప్రవర్తనావళి - ఇవి అతని విలక్షణతను ప్రదర్శిస్తాయి. ఒక వ్యక్తి ఒకానొక సందర్భంలో ఒక విధమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తే, దానికి అతని జీవితంలోని పూర్వానుభవం కూడా ఒక కారణం కావచ్చును.

ఒక వ్యక్తిలో అనేకమైన మూర్తి మత్వ లక్షణాంశాలున్నా, అవి ఆయా పరిస్థితులలో మార్పుచెందుతున్నా, మౌలికమైన లక్షణాంశాలు మాత్రం ఎన్నటికిని మారవని కాటిల్, ఐసెంక్, ఆల్‌పోర్ట్ మొదలైన మనస్తత్వ శాస్త్రజ్ఞులు అభిప్రాయపడ్డారు.

షేక్సిపియర్ నాటకాలలోని పాత్రలను, ముఖ్యంగా లియర్, హేమ్లట్, ఒఫీలియా మొదలైన పాత్రలను, కొందరు మనో విజ్ఞాన శాస్త్ర దృక్పథంతో విశ్లేషణ చేసి, కొన్ని కొన్ని మానసిక నాడీ రుగ్మతల అపవ్యవస్థలు ఏవిధంగా ఏర్పడతాయో, ఉదాహరించడానికి ఈ పాత్రలను లక్ష్యాలుగా కూడా చూపించారు. ఇవి నాటకాలలోని పాత్రలే అయినా, వాటిని ప్రాణమున్న వ్యక్తులుగా భావించి మనోవిశ్లేషణ జరపడానికి, ఆ పాత్రల సజీవత్వమే కారణం. ఆంధ్ర సాహిత్యంలో మనకు కనిపించే సత్యభామ కూడా సజీవ పాత్రే.

శ్రీకృష్ణుని యొక్క పదహారు వేల ఎనమండుగురు భార్యలలో అష్టమహిషులు ముఖ్యులు. కాని శ్రీకృష్ణుని భార్యలని అనగానే ముందుగా మన మనోనేత్రాల ఎదురుగా సాక్షాత్కరించేవారు రుక్మిణీ సత్యభామలే. తనకింతమంది కాంతలున్నప్పటికీ, కృష్ణుడు అగ్రమహిషితో సమానంగా, నిజానికి అంతకన్న ఎక్కువగా, సత్యభామనే ఆదరించడానికి, ప్రేమానురాగాలు చూపడానికి ఆమెలోని విలక్షణలే కారణమనిపిస్తుంది.

తెలుగు సాహిత్యంలో వేలకొలది పాత్రలున్నాయి. కాని మన మనస్సులో నిలిచే పాత్రలు వేళ్ళమీద లెక్కపెట్టుకోవచ్చు. అటువంటి పాత్రలో సత్యభామ ఒకతె. ఆమె పాత్రను పురాణ ఇతిహాస కవులు మాత్రమేకాదు, ప్రబంధ, కూచిపూడి భామాకలాప, యక్షగాన, నాటక, హరికథ, జానపదములనే వివిధ సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన కవులు కూడా ఎంతో ప్రేమతో

ఆదరించారు. ఆమెకంతటి ప్రాధాన్యం కలగడానికి ఆమెలోని వైవిధ్యమే కారణం భర్తపైన ఎంతోప్రేమ, అంతలో ఎందుకో కోపం - కోపంలో ఎన్నెన్నో ఆరోపణలు - సాంత్వన పరచగానే శాంతం - ఇలా సత్యలో శృంగారం - వీరం, కోపం - తాపం, సరసం - విరసం - రకరకాల భావప్రకటనలలో, ప్రవర్తనలో ఎంతో వైవిధ్యం, కనిపిస్తుంది.

శ్రీకృష్ణుడికే కాదు, కవులకు సామాన్య జనులకు కూడా సత్యభామ ప్రీతి పాత్రమవడానికి కారణం, ఇతర కాంతలెవ్వరిలోను కనిపించని విభిన్నమైన ప్రవృత్తి ఆమెలో ఉండడమే. కోపం, తాపం, జాణతనం, స్వాతిశయం ప్రదర్శించే అందమైన మానినులను అపర సత్యభామలని మనం ముద్రకూడా వేస్తుంటాం. కాబట్టి ఈ పాత్రయొక్క మూర్తిమత్వాన్ని శాస్త్రీయ దృష్టితో విశ్లేషించడం అవసరం: సాహిత్యంలో విభిన్న ప్రక్రియలో కనిపించే సత్యభామను పరిశీలిస్తే, ఇతర కృష్ణ కాంతలెవరిలోను కనిపించని ప్రత్యేకత, విలక్షణత ఈమెలో కనిపిస్తుంది. ప్రస్తుతం ఇక్కడ తిమ్మనగారి పారిజాతాపహరణ ప్రబంధంలోని సత్యభామ మూర్తిమత్వాన్ని పరిశీలిద్దాం.

**ఫ్రాయిడ్ నిర్దేశించిన మూర్తిమత్వం.**

మూర్తిమత్వం అచిత్తు (id), అహం (ego), అధ్యహం (super ego) అనే ముఖ్యమైన మూడు అంశాలతో ఉంటుందని మనోవిశ్లేషణ స్థాపకుడైన ఫ్రాయిడ్ విశ్వాసం*. 'ఇడ్' అనేది మానసికమైన కోరికలన్నింటికిని మూలస్థానం. దీనికి మంచి చెడు అనే విచక్షణా జ్ఞానం ఉండదు. అన్ని విధాలైన కోరికలు దీని నుండే పుడతాయి. తాను చూసింది, కోరుకున్నది అది సాంఘికంగా గాని, నైతికంగాగాని, జీవిత వాస్తవికతలకు, విరుద్ధమైనాగాని అది తనకే చెంది తీరాలని, దాని నేవిధంగానైనా సాధించి తీరాలనే పట్టుదల 'ఇడ్' ప్రభావానికిలోనైన వ్యక్తిలో అధికంగా ఉంటుంది.

వ్యక్తి తన చుట్టూ ఉన్న వాతావరణ సంపర్కాలలోనికి వచ్చినపుడు ఈగో (అహం) ఏర్పడుతుంది. 'ఇడ్'కు (అచిత్తుకు), అహం సాధారణంగా కళ్ళెం వేస్తుంది. ప్రపంచంలో మనం సమర్థవంతంగా వ్యవహరించడంకోసం అభ్యసించవలసిన ప్రవర్తనల, ఆలోచనా రీతుల గురించి, 'అహం' తెలుపుతుంది. ఇది ప్రేరకాలను (Motives) తృప్తిపరచడంలో ఆలస్యం చేస్తూ, వాటిని సాంఘికంగా ఆమోదయోగ్యమైన పద్ధతుల ద్వారా తృప్తి పరుస్తుంది.

అధ్యహంలేక సూపర్ ఈగోను, మనం అంతరాత్మకు సమానంగా చెప్పుకోవచ్చు. 'ఇడ్' ప్రేరకాలను తృప్తి పరచడానికి అహం చేసే కార్యాలను అధ్యహం తప్పని నిందించి, వ్యక్తిలోని విలువలను కాపాడుతుంది. దీనినే నైతిక శక్తి అనికూడా అనవచ్చు.[1]

పారిజాత వృక్షాన్ని తెచ్చి యిస్తానని కృష్ణుడు సత్యతో కలసి, ఇంద్రలోకానికి వెళ్ళాడు. నందనోద్యాన విహార సమయంలో సత్య, పారిజాత వృక్షాన్ని చూడగానే ఏమ్మాత్రం నిగ్రహించుపించక, ''......ఏల తామసంబీ విబుధాధినాయక మహీరుహముం బెకలించి లోకసంభావితమైన నీ పలుకుబంతముసెల్లమదీయ గేహకేళీవనవాటి వేడుక దలిర్పంగ

* According to Fraudian concept the human personality consists of three important structurers. id, ego, super ego. - M.B. Ghorpade - *Essentials of Psychology* - p466

1. *Essentials of Psychology* p. 460.

నిల్చుము జీవితేశ్వరా"(పారి 4.11) అని తొందరపెడుతుంది. అతిథులుగా వచ్చిన తాము, ఆపనిచేయవచ్చా అని గాని, పారిజాత వృక్షాన్ని తెచ్చియిస్తానని ప్రతిన చేసిన, శ్రీకృష్ణుని మనసులో ఏ ఆలోచన ఉన్నదో అనిగాని, అతడు సాధించవలసిన ఆకార్యంలో తాను, తల దూర్చవచ్చా అనే ఆలోచన గాని, ఆసమయంలో ఆమెకు తట్టలేదు. అంతేకాదు మహా మహిమాన్వితమైన ఆ వదాన్య నగాన్ని అపహరిస్తే, యుద్ధం వస్తుందని తెలిసికూడా భర్తను ఆ పనికి ప్రోత్సహిస్తుంది. దీనికి కారణం ఆమెలో 'ఇడ్' ఆధిక్యమే. కష్టతరమైన అసాధ్యమైన వస్తువుల కొరకు పట్టు పట్టడం వీరి లక్షణం. "The id is completely selfish, concerned only with the immediate gratification of instinctual needs without reference to reality or moral considerations"[1] అని జేమ్స్. ఇ. కాల్‌మెన్ 'ఇడ్' లక్షణాన్ని వివరించాడు. ఆంధ్ర సాహిత్యంలో వేర్వేరు ప్రక్రియలో చిత్రితమైన సత్యభామ కూడా, ఇదే విధంగా 'ఇడ్' ఆధిక్యానికిలోనై వ్యవహరించడం మనం చూస్తాం.

ఇతర కాంతలెవ్వరు ఆలోచించటానికి కూడా సాహసించని సమయంలో సత్యభామ మాత్రం, నరకాసుర వధకోసం బయలుదేరే కృష్ణునితో, తానుకూడా యుద్ధరంగానికి వస్తానని పట్టుబట్టి, పంతం చెల్లించుకోవడం, పోతనగారి భాగవతంలోను, తరిగొండ వెంగమాంబ కృతమైన విష్ణు పారిజాతయక్షగానంలోను, పేరాల వేంకటప్పలాచార్య వ్రాసిన దీపావళి నాటకంలోను - మనం చూడవచ్చు. అంతేకాదు, భర్త వారిస్తున్నా, తనంతటతానే యుద్ధానికి పూనుకోవడం, భాగవతం, సత్యభామ సాంత్వన ప్రబంధాదులలో కనిపిస్తుంది. పారిజాతవృక్షం కనిపించగానే, వెంటనే కావాలని కోరుకోవడం (హరివంశం, భాగవతం, విష్ణు పురాణం, మాతృభూత కవి విరచిత పారిజాతపహరణ యక్షగానం మొదలైన వానిలో), రుక్మిణి దగ్గరున్న పారిజాత పుష్పాన్నే నాకు ఇప్పించమని మొండితనంతో అడగడం (చిలకమర్తి వారి పారిజాతాపహరణ నాటకం మొ॥ వానిలో) భర్తను తులాభార వ్రతం కోసం బలవంతంగా ఒప్పించడం (ముత్తరాజు సుబ్బారావు గారి శ్రీకృష్ణ తులాభారనాటకం, కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారి శ్రీకృష్ణ తులాభార హరికథ మొ॥ వానిలో) - మొదలైనవి. సత్యలో, ఈగో, సూపర్ ఈగోల కన్నా 'ఇడ్' ప్రభావం అధికంగా ఉన్నదనే విషయాన్నే తెలియచేస్తున్నాయి.

**ఎరిక్ బర్న్ నిర్దేశించిన మూర్తిమత్వం.**

దాదాపు ఫ్రాయిడ్ చెప్పిన సిద్ధాంతం వంటిదే, మరొక సిద్ధాంతాన్ని 'ఎరిక్‌బర్న్' మహాశయుడు చెప్పాడు. ఇతని సిద్ధాంతం ప్రకారం మానవ మూర్తిమత్వం చైల్డ్ ఈగో స్టేట్ (Child ego state) అడల్ట్ ఈగోస్టేట్ (Adult ego state) పేరెంట్ ఈగో స్టేట్ లచే (Parent ego state) నిర్మించబడి ఉంటుంది.[2]

ప్రతివ్యక్తిలోను, ఈ మూడు దశలు ఉంటాయి. కాని ఒక్కొక్కరిలో ఒక్కొక్క దశ అధిక ప్రభావం వహించి ఉంటుంది. కాబట్టి ఆవ్యక్తిని ఆదశలో ఉన్న వ్యక్తిగ మనం గుర్తించవచ్చు.

1. *Abnormal Psychology and Modern life.* 5th Edition. P.55
2. According to Berne the Human personality is composed of three ego states, which he designates as child, Adult and parent and which are somewhat similar to Freuds "id, ego and super ego" respectively — *The Essentials of Psychology- P. 534*

వయసుకు మించిన ఆ దశలో ఉన్న వ్యక్తిగ మనం గుర్తించవచ్చు. వయసుకు మించిన అధికార ధోరణి "పేరెంట్ ఈగో స్టేట్" లో ఉన్న వ్యక్తి ప్రదర్శిస్తాడు. పెత్తనం చెలాయించడం వీరి లక్షణం. 'అడల్ట్ ఈగో స్టేట్'లో ఉన్నవ్యక్తి హేతుబద్ధంగా ఆలోచించి, విచక్షణా శక్తితో నిర్ణయాలు చేసుకుని నడుచుకుంటాడు. బాల్యావస్థతో కూడినది "చైల్డ్ ఈగో స్టేట్" ఈ స్థితిలో ఉన్న వ్యక్తి యొక్క ఆలోచనలు, ప్రవర్తనలు అంతా పసితనాన్ని పోలి ఉంటాయి. అంటే సంతోషం వస్తే పొంగిపోవడం, దుఃఖం వస్తే విపరీతంగా క్రుంగిపోవడం.

ఇతరులు తనను మెచ్చుకోవాలని తపన చెందడం, తన ప్రత్యేకత గుర్తించబడాలని ఆశించడం ఇది నాకు కావాలనిపట్టుబట్టడం, అప్పుడప్పుడు చిన్నపిల్లలా ఇతరులను నిందించడం రోదించడం, విశేషంగా నాట్య భంగిమలు వంటి భంగిమలను ప్రదర్శించడం, మొదలగునవి వీరిలక్షణాలు[1] తనకు వ్యతిరేకంగా ఏదైనా జరిగిన, తనను గురించి ఎవరైనా విమర్శించిన కోపంతో, కక్షతో విపరీతంగా ఆక్రోశించడం ఈ దశలో ఉన్న వ్యక్తిలో కనిపిస్తుంది.

సత్యభామ వయసు పరంగా ప్రౌఢగానే చిత్రితమైనా, ప్రవర్తనా పరంగా ఆమె మూర్తిమత్వం మాత్రం అధికంగా 'చైల్డ్ ఈగో స్టేట్' లోనే ఉన్నట్లుగా మనం గమనించ గలం.

రుక్మిణికి పారిజాత పుష్ప ప్రదానం జరిగిన సంగతి, చెలిద్వారా వినగానే "ఓ చెలీ! శౌరికిచ్చెనట యొక్కలతాంతము దెచ్చి నారదుండాచపలాక్షి కిచ్చెనట యాతఁడు. నవ్విరి యిట్టి మాటలా హా! చెవుల న్వినం బడియుఁబ్రాణము దాల్చెదమేన నింతగా నోచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మెయి నున్నదాననో" (1.90) అని సవతికి పుష్పాన్ని ఇచ్చినంత మాత్రాన తనకు మానహాని జరిగినట్లు క్రుంగిపోయి, ప్రాణత్యాగం చేయాలనే నిర్ణయానికి వస్తుంది.

భర్త, తనకు అందరికన్న ఎక్కువ చనువు లివ్వడం వలన, సవతులెవరు, తలలెత్తయిన తనను చూడలేరు. అంతటి భయం! కాని అట్టిది ఈ నాడు ఈ అవమానం జరిగిన తరువాత తనను ఇంక లెక్కచేయరట! "వారు ననుందలలెత్తి చూడఁగా, సన్నుల఼జాయలంబలుక సైతునే, ప్రాణము లెంత తీపొకో" (1.88) అని క్రుంగి పోయింది. సవతులింక తన ప్రాధాన్యాన్ని గుర్తించరు. ఇంత అవమానం తర్వాత ప్రాణధారణం అనవసరం అని తలచింది.

శ్రీకృష్ణుడు తనకు అందరికన్నా అధికంగా చనవులివ్వడం వలన అత్తగారైన దేవకీదేవి తనదు కోడండ్రులోన పెద్దగ మన్నిస్తూ ఉండేది. కాని ఇంతటి అవమానం తరువాత "ఆసాధ్విసేవ సేయఁబోవంగ నాకింక సిగ్గుగాదె" (1.130) అని కుమిలిపోయింది. తన ప్రత్యేకత, గొప్పతనం అందరు గుర్తించాలనే తపన ఆమె మాటలలో కనిపిస్తుంది. సవతికి పుష్పం ఇచ్చినందులకు భర్తను నిందించింది. తన పాదాలకు మ్రొక్కిన ఆ జగన్నాథుని శిరస్సును 'తాడనం' చేసింది. చివరకు కృష్ణుడు పారిజాత వృక్షం తెచ్చి యిస్తానని ప్రతిన చేయగానే మేఘ గర్జనకు పులకించే "నీప లతికవోలె", పులకించి పోయింది (1.137).

పారిజాతాన్ని తెచ్చి అర్పించగానే "ప్రాణనాథుని పెక్కు మాటల ప్రస్తుతించింది" (5.50) ఈ విధంగా దుఃఖం కలిగినపుడు అంతులేని ఆవేదనకులోనుకావడం, ప్రాణత్యాగం

1. Oswald Summerton - *Transactional Analysis - Basic concepts* - p. 8-10

చేయాలనుకోవడం, సంతోషం కలిగినపుడు వెంటనే పులకించి పోవడం, చూడగా సత్య 'చైల్డ్ ఈగో స్టేట్'లో అధికంగా ఉన్నట్లు తెలుస్తుంది. పదహారువేల ఎనమండుగురు కాంతలల్లో సత్యలో తప్ప, మరెవ్వరిలోను ఈ విధమైన ప్రవర్తన కనిపించదు. పారిజాతవృక్ష ప్రతిష్ఠాపనం చేత, పుణ్యకవ్రతాచరణంచేత పారిజాత పుష్పాలను సవతులకు దానంచేయడం చేత సత్యప్రాభవం పెరిగి, ఖ్యాతి ఇనుమడించగా, ఆమెలోని 'చైల్డ్‌కు' సంతృప్తి కల్గింది.

పారిజాతాపహరణాన్ని వారించే నందనోద్యాన పాలకులతో "ఏమో వచింపబూను హృదయేశ్వరుని" కరసంజ్ఞ మాన్పడం (4.57) పారిజాతం కావాలనుకుంటే శచీదేవి "తనదు ప్రాణేశ్వరుడైన మఘవునిట బంపి సత్యభామా విధేయు వలన మరలంగ గొనుటే పో వాసి తనము' (4.58) అని తానే హెచ్చరిస్తూ, పరోక్షంగా తన భర్తను యుద్ధానికి సన్నద్ధుడుకమ్మని సూచించడం, ఆమె 'పేరెంట్ ఈగోస్టేట్'లో ఉండడాన్ని తెలియచేస్తుంది. అయినా ప్రబంధంలో ఎక్కువ సన్నివేశాలలో ఆమె 'చైల్డ్ ఈగో స్టేట్'లో ఉండడమే కనిపిస్తుంది. తెలుగు సాహిత్యంలోని ఇతర ప్రక్రియలలో కూడా అధికంగా చైల్డ్ ఈగో స్టేట్‌లోనే ఉండే సత్యభామనే చూస్తాము. 'అడల్ట్ ఈగోస్టేట్', 'పేరెంట్ ఈగోస్టేట్' కన్నా, 'చైల్డ్‌ఈగోస్టేట్'లోనే ఆమె ఎక్కువగా ఉండడం వలననే, ఆమె కోరిన కోరిక తీరాలనే పట్టుదలను మొండితనాన్ని అధికంగా ప్రదర్శిస్తూ ఉండేదని, కోరినది లభ్యం కానపుడు ఏడవడం, ఎదుటి వారిని నిందించడం, దండించడం మొదలైనవి కూడా చేస్తూ ఉండేదని తెలుస్తుంది.

### భద్రతారాహిత్య భావం (Feeling of insecurity)

మనోహరమైన శృంగారవనంలో సత్యభామ ఉన్నది. అక్కడి అలికులారావాలు గాని కిసలయాకుల కోకిలకాకులీకలకల నాదాలుగాని, కమ్మని తమ్మి కొలంకు తెమ్మరలుగాని అప్పటి ఆమె బుద్ధికి నేమియు నింపుగాలేక" పోయాయి (1.72). అంతలో దక్షిణాంసుక, చూచుక, నయన ప్రకనంపాలుకలుగగా "ప్రాణనాథుడొండీక చపలాక్షింగూడి ననునొల్లని చెయ్దము లేమిసేసెనో" (1.73) అని సందేహించి భయాందోళనలకు గురియైంది. ఇంతటి మనోహర వాతావరణంలో సహితం సత్య మనశ్శాంతి కోల్పోవడం, ఏ అపశకునం కల్గినా ఈ విధంగా అనుమానించడానికి కారణం ఆమెలోని భద్రతా రాహిత్య భావమే తనకో, తనభర్తకో, ధనానికి సంబంధించిన విషయంలోగాని, ప్రాణానికి సంబంధించిన విషయంలోగాని, లేక ఆరోగ్యానికి సంబంధించిన విషయంలోగాని అనుమానమో, ఆందోళనో పొందక పై విధంగా అనుమానించ డానికి ఆమెలోని భద్రతా రాహిత్య భావమే కారణం. మనశ్శాంతిలేకపోవడం. పిరికి తనం, అధికోద్రేకం, భయాందోళన మొదలైన ఉపలక్షణాల ద్వారా భద్రతారాహిత్య భావం వెల్లడవుతుంది.[1]

మగనికూరిమి కలది, సౌందర్యవతి, భాగ్యవతి అయిన సత్యలో భద్రతా రాహిత్య భావం కలగ వలసిని అవసరం ఏమున్నదని అనిపించవచ్చు. సత్యకు భర్తను మించిన భాగ్యం లేదు. వివాహితయైన స్త్రీకి భర్తే సర్వస్వం. అతని నీడలోనే తనకుభద్రత ఉంటుందని నమ్ముతుంది.

---

1. James E. Colemon - *Abnormal psychology and modern Life*- 5th Edition P. 103.

భర్త, తనను గాక, పరస్త్రీ వైపు చూసినా, తన భద్రతకు ప్రమాదం వాటిల్లినట్లుగా ఆందోళన చెందుతుంది. అటువంటప్పుడు పదహారు వేల ఏడుగురు సవతులున్న సత్యకు భద్రతా రాహిత్య భావం ఉండడంలో ఆశ్చర్యం లేదు.

నిజానికి ఆమె పుణ్యక వ్రతం చేయడానికి కూడా ఆమెలోని భద్రతా రాహిత్య భావమె ప్రధాన కారణంగా అనిపిస్తుంది. ముఖ్యంగా "తానుం బతియున్ మనమున నఱగొఱలెఱుగక" ఉండడం కొనమో (5.62), అంటే పూర్తి భద్రత కొరకే ఆ వ్రతం ఆమె ఆచరించినట్లు కనిపిస్తుంది.

భారతంలో, అరణ్య వాసం చేస్తున్న ద్రౌపదిని చూడడానికి, కృష్ణునితో కలసి వెళుతుంది, సత్యభామ. నీ భర్తలు అయిదుగురు నీ యెడల ఇంత అనురక్తులుగా ఉన్నారు, దానికి కారణం, "వ్రతములా? మంత్రౌషధములా? నరసనైపథ్య కర్మ కౌశలమా? చతుర విభ్రమోల్లాసరేఖయా?" చెప్పమని, అడుగుతూ నీ వలన అందతా తెలుసుకుని, "కమల దళాక్షుం, బూని వశగతునిఁ జేసి యనూన స్నేహాను భావయుక్త దలిర్తున్" (5.29) అని ద్రౌపదితో ఆ "కృష్ణ ప్రియ"అనడంలో, ఆమె భద్రతా రాహిత్య భావం స్పష్టంగా వెల్లడవుతుంది. ఇదే విధమైన ప్రవృత్తి, సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలో కనిపించే సత్యలోను మనం చూస్తాం.

**కుంఠనం (Frustration)**

గమ్య చర్యాశీలతకు అడ్డంకులు కలగడం వలన వ్యక్తిలో కలిగే నిస్పృహాత్మక ప్రక్రియ కుంఠనం. కుంఠనానికి ఇక రకారకాలున్నప్పటికీ, ముఖ్యంగా ప్రేరణాత్మకమైన సంఘర్షణల వలన, లక్ష్య సాధనకు ఆటంకం కలగడం వలన, ఇది ఏర్పడుతుంది. ఈ ఆటంకాలు (Obstacles) 1. స్థితి గతమైనవి (Situational) 2. పరస్పర వ్యక్తుల వలన కలిగేది (Interpersonal) 3. వ్యక్తి గతమైనది (Intra-Personal) అని మూడు విధాలుగా ఉంటాయి.

పతి ప్రేమనంతా, తానే గుత్తగొనాలనే సత్య లక్ష్యానికి, శ్రీకృష్ణుడు రుక్మిణికి పారిజాత పుష్పాన్నివ్వడం, ఆమె యింట ఉండడం మొదలైన ఆటంకాలు కారణంగా కుంఠనం కలిగింది. సవతులకు ధనమిచ్చి పుచ్చుకున్నా సహించగలదు గాని, చనవులిచ్చి పుచ్చుకుంటే ఆమె జీవిత లక్ష్యానికి ఆఘాతం కలిగినట్లుగా ఈ మానిని భయపడుతుంది. కుంఠనం వలన క్రోధం కలుగుతుంది.[1] అందుచేతే "అమర్షము" జనించగా 'కోపసదనాని'కేగింది.

**హిస్టరికల్ మూర్తిమత్వం (Hysterical personality)**

ఒక వ్యక్తి తీవ్ర కుంఠనానికి (Frustration) లోనైనపుడు అతడు నాడీ రుగ్మతలు (Psychoneurosis) మనో నిక్షిప్తుల (psychosis) అనే రెండు రకాల మానసిక అప వ్యవస్థితులకు (Mental disarder) గురియయ్యే అవకాశం ఉంది. నాడీ రుగ్మతలు మనో విక్షిప్తులకు వలె ప్రమాదకరమైనవికావు. నాడీ రుగ్మతలు వ్యక్తులలో అల్పదశలో ఉన్న మనోవ్యాధులు. వీని వలన వ్యక్తి యొక్క మూర్తిమత్వం పూర్తిగా దెబ్బతినదు.

---

1. *Esentials of psychology.* P. 268

నాడీరుగ్మతలవలన బాధితులైన వారిని పిచ్చి వారిగ భావించనక్కరలేదు ఏరు తీవ్రమైన హింసాత్మకమైన చర్యలకు పూనుకొనరు. వ్యక్తి మనసులో ఇడ్ (అచిత్తు), ఈగో (అహం), 'సూపర్ ఈగో' (అధ్యహం) మధ్య ఏర్పడిన తీవ్ర సంఘర్షణల వలన కలిగిన పీడనలు, దుర్భరం కావడం వలన భిన్న భిన్న నాడీరుగ్మతలు ఏర్పడతాయి. వీనిని చాల వరకు మానసిక చికిత్స ద్వారా సరి చేయవచ్చు.

మానసిక రుగ్మతలలో హిస్టీరియా ఒకటి. జీవిత సమస్యలను ఎదుర్కొనలేక, వ్యక్తి, జీవన యాతనల నుండి పారిపోవడానికి ప్రయత్నించే అసమర్థత ఇది. ప్రేరకాల సంఘర్షణ శారీరక లక్షణంగా పరివర్తన చెందడం హిస్టీరియా. శరీరంలో ఒక భాగానికి పక్షవాతం రావడం, పరిమిత ప్రదేశంలో స్పర్శ జ్ఞానం నశించడం, అంధత్వం, చెవుడు లేదా మూర్ఛ వంటివి, ఏదో ఒక అశక్తత పొందడం జరుగుతుంది. ఈ రుగ్మత ఉన్న వ్యక్తికి, అది ఒక రుగ్మత అనే విషయం తెలియనే తెలియదు. కొంతమందిలో హిస్టరికల్ మూర్తిమత్వం ఉంటుంది. ఇది హిస్టీరియాకాదు. కాని ఆ రుగ్మతకు లోనైన వారికి ఉండే లక్షణాలు వంటివే వీరికిని ఉంటాయి. ఇది ఎక్కువగా స్త్రీలలోనే కనపిస్తుంటుంది. అపరిపక్వత, అనూహ్యమైన భావోద్రేకం పొందడం, తీవ్రమైన ఉద్వేగానికి లోనుకావడం, స్వార్థ పరత్వం, అ పరిమితమైన ఆత్మాభిమానం, మొండిపట్టుదల, ప్రభోదనాత్మకమైన (impulvise) ప్రవర్తన, ఇతరులు తనను గుర్తించాలని, పట్టించుకోవాలని తపించడం, ఎదుటివారిలో శృంగారోద్రేకం కలిగించేటట్లు ప్రవర్తించడం (Seductive) మొదలైనవి వీరి లక్షణాలు.[1] ప్రదర్శనత్వం (Exhibitionism) ఎక్కువగాఉంటుంది. లేని తలనొప్పి మొIIనవి వీరు ప్రదర్శిస్తుంటారు. ఇతరుల దృష్టిని ఆకర్షించటానికి నాటకీయంగా వీరు ప్రవర్తిస్తుంటారు.[2] ఒక్కొక్కమారు తాము ఈ విధంగా ప్రవర్తిస్తున్నట్లు ఆ వ్యక్తికే తెలియదు. తమ పంతం నెగ్గించుకోవడానికి కొన్ని మారులు ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించడం కూడా చేస్తారు.[3] సత్యభామలో ఈ విధమైన హిస్టరికల్ మూర్తిమత్వాన్ని మనం గుర్తించవచ్చు.

"ఏ పదార్థంబు నా యెదుట పెట్టకమున్న

యెవ్వారి కొసం గడుయిగురుఁబోఁడి" (1.94) అని చెలితో, సత్య చెప్పుకునే మాటలలో, ఏ వస్తువైనా, ఎంత విలువైనది అయినా భర్త, తనకే ముందు ఇచ్చి తీరాలనే ఆమె స్వభావం తెలుస్తుంది.

"ఓ చెలి! శౌరికిచ్చెనట యొక్క లతాంతము దెచ్చి నారదుం

డా చపలాక్షి కిచ్చెనట యాతఁడు నవ్విరి"... (1.90) అని కుమిలిపోతుంది ఆ పుష్పాన్ని తనకు గాక రుక్మిణికీయడం అపరాధంగా భావించింది. ఇది ఆమెలోని స్వార్థాన్నే తెలియచేస్తుంది.

సత్యభామ తన కోపాన్ని ప్రకటించడంలో ఎంతో నాటకీయత (dramatization) ప్రదర్శిస్తుంది. కోపగృహంలో ప్రవేశించిన సత్య

---

1. Abraham Varghees. *Introduction to psychiatry.* P 55
2. *Abnormal Psychology and modern life.* 5th Edition P. 374
3. James. D. page- *Abnormal Psychology.* P 120

"మాసిన చీర గట్టికొని మౌనము తోడ నిరస్త భూషయై

వాసెన కట్టు గట్టి నిఢు వాలిక కస్తురి పట్టు వెట్టిలో

గాసిలి చీకటింటి కడకం కటిపై........" గాఢ మనోజ విషాద వేదనలో పొర్లింది. (1.99). తలనొప్పి లేకపోయినా, కస్తురి పట్టు పెట్టింది. ప్రతి దినం ఇష్టంగా కట్టుకునే 'సన్నీకావు'లు విడిచి మాసిన తెల్లచీర కట్టింది. ఆ విధంగా చీర మార్చడానికి గాని, నిరస్త భూషకావడానికి గాని, కస్తూరి పట్టు పెట్టుకోవడానికి, వాసెన కట్టు కట్టుడానికిగాని, చీకటింట మూలనున్న మంచంపై పొర్లడానికి గాని అవసరం ఏముంది? తనకు కోపం వచ్చినదనే విషయం చెలులకు, ముఖ్యంగా భర్తకు తెలియాలి. అందుచేతనే ఈ నాటకీయమైన ప్రదర్శన. తనను అనునయించడానికి శ్రీకృష్ణుడు రాగా, అతతనిని ఉపేక్షించింది. తన పాదాలకు మ్రొక్కిన ఆ జగన్నాథుని శిరస్సును తన వామ పాదంతో తాడనం చేసి, ఇంకా కోపం తీరక ....మేయఱదోఁప నిక్కవీఢిన కచ పంక్తి ఁబల్మఱు ముడిన్వెడ దోపుచుఁ బై చెఱంగు గ్రక్కనఁజనుదోయిఁజేర్చుచు మొగంబునలేఁ జెమరంకురిపంఙంకెననెఱి చూపు"తో "చలిత పల్లవాధరయై" (1.124) నిందించడానికి ఉపక్రమించింది. ఇక్కడ సత్య చేష్టలు నారీ జనులు సంభ్రమవశంలో చేసే చేష్టలే అయినప్పటికి, పతిని లోగొనే శృంగార చర్యలుగా కూడా భావించవచ్చును. "కాముకునిలోఁగొనునయన గూడ నిట్టివానిని నొనర్తు రనియు దెలియనయ్యెడను"అని దూసి రామమూర్తిగారు[1] దీనిని శృంగార చేష్టగానే భావించారు.

"నిను నమ్మినా, గుట్టును దేజమున్నిగులఁగోల్పడిపోయితి నేమి సేయుదన్" (1.127), అని నిను నమ్మియుండిన ఫలంబిదె తోడన కల్గెనాకు" (1.125) అని నిందించడంలోను.

"నన్ను నాతోడి సవతులు నగక మున్న పంతమలరంగ నిన్ను మెప్పింతుఁగాక" (1.131) అని బెదిరించిడంలోను, భర్త దృష్టి తనపై మాత్రమే కేంద్రీకృతం కావాలనే ఆమె స్వభావం, తన మాట చెల్లించితీరాలనే మొండితనం, కనిపిస్తుంది. చివరికి ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించి పంతం నెగ్గించుకుంటుంది

రుక్మిణికి పారిజాతపుష్పం లభించినపుడు, ఇతర సపత్నులెవ్వరు సత్యభామలా ప్రవర్తించలేదు. అంతేకాదు. సత్యభామకు పుష్పానికి బదులు పారిజాత వృక్షమే దక్కినప్పుడు, కూడా, రుక్మిణిగాని ఇతర సపత్నులుగాని తమ అసూయ ద్వేషాలను ఆమెకులా చూపించుకోలేదు. నిజానికి దివ్యనగం సత్యభామ సొంతమయినపుడు రుక్మిణికి అసూయ కలగకపోలేదు. "కృతక దరహాసమచ్చువడ" రాఁదగవౌనని" (5.74)పుణ్యక వ్రతానికి వచ్చింది. కాని సత్యకులా కోపాన్ని గాని, ద్వేషాన్ని గాని ప్రదర్శించలేదు.

సత్యభామలో ఉన్నది హిస్టరికల్ మూర్తిమత్వం. అంతేగాని అది హిస్టీరియా కాదు. ఇది హద్దులో ఉన్నపుడు తీవ్రమైన నాడీరుగ్మత కాలేదు. శ్రీకృష్ణుడు సాంత్వన పరచగానే సత్యభామలో కోపతాపాదులు ఉపశమింపబడ్డాయి. పారిజాతపరణ ప్రబంధంలోనేగాక, పురాణాది సమస్త వాఙ్మయ ప్రక్రియలలోను ఈ విధంగా సత్యభామ సాంత్వనం చెందడం కనిపిస్తుంది. కాబట్టి ఇది ఆమె మూర్తిమత్వమనే అనిపిస్తుంది. 

1. పారిజాతాపహరణం - సురభి వ్యాఖ్య పు. 95

"మాసిన చీర గట్టికొని మౌనము తోడ నిరస్త భూషయై
వాసెన కట్టు గట్టి నిడు వాలిక కస్తురి పట్టు వెట్టిలో
గాసిలి చీకటింటి కడకం కటిపై........" గాథ మనోజ విషాద వేదనలో పొర్లింది. (1.99). తలనొప్పి లేకపోయినా, కస్తురి పట్టు పెట్టింది. ప్రతి దినం ఇష్టంగా కట్టుకునే 'సన్నీకావు'లు విడిచి మాసిన తెల్లచీర కట్టింది. ఆ విధంగా చీర మార్చడానికి గాని, నిరస్త భూషకావడానికి గాని, కస్తూరి పట్టు పెట్టుకోవడానికి, వాసెన కట్టు కట్టుడానికిగాని, చీకటింట మూలనున్న మంచంపై పొర్లడానికి గాని అవసరం ఏముంది? తనకు కోపం వచ్చినదనే విషయం చెలులకు, ముఖ్యంగా భర్తకు తెలియాలి. అందుచేతనే ఈ నాటకీయమైన ప్రదర్శన. తనను అనునయించడానిక శ్రీకృష్ణుడు రాగా, అతతనిని ఉపేక్షించింది. తన పాదాలకు మ్రొక్కిన ఆ జగన్నాథుని శిరస్సును తన వామ పాదంతో తాడనం చేసి, ఇంకా కోపం తీరక ....మేయఖదోఁప నిక్కవీడిన కచ పంక్తి (బల్మఱు ముడిన్వెడ దోపుచుఁ బై చెఱంగు గ్రక్కనఁజనుదోయిఁజేర్చుచు మొగంబునలేఁ జెమరంకురిషంజంకెననెఱి చూపు"తో "చలిత పల్లవాధరయై" (1.124) నిందించడానికి ఉపక్రమించింది. ఇక్కడ సత్య చేష్టలు నారీ జనులు సంభ్రమవశంలో చేసే చేష్టలే అయినప్పటికి, పతిని లోగొనే శృంగార చర్యలుగా కూడా భావించవచ్చును. "కాముకునిలోఁగొనునయన గూడ నిట్టివానిని నొనర్తు రనియు దెలియనయ్యెడను"అని దూసి రామమూర్తిగారు[1] దీనిని శృంగార చేష్టగానే భావించారు.

"నిను నమ్మినా, గుట్టును దేజమున్మిగులఁగోల్పడిపోయితి నేమి సేయుదన్" (1.127), అని నిను నమ్మియుండిన ఫలంబిదె తోడన కల్గెనాకు" (1.125) అని నిందించడంలోను.

"నన్ను నాతోడి సవతులు నగక మున్న పంతమలరంగ నిన్ను మెప్పింతుఁగాక" (1.131) అని బెదిరించిడంలోను, భర్త దృష్టి తనపై మాత్రమే కేంద్రీకృతం కావాలనే ఆమె స్వభావం, తన మాట చెల్లించితీరాలనే మొండితనం, కనిపిస్తుంది. చివరికి ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించి పంతం నెగ్గించుకుంటుంది

రుక్మిణికి పారిజాతపుష్పం లభించినపుడు, ఇతర సపత్నులెవ్వరు సత్యభామలా ప్రవర్తించలేదు. అంతేకాదు. సత్యభామకు పుష్పానికి బదులు పారిజాత వృక్షమే దక్కినప్పుడు, కూడా, రుక్మిణిగాని ఇతర సపత్నులుగాని తమ అసూయ ద్వేషాలను ఆమెకులా చూపించుకోలేదు. నిజానికి దివ్యనగం సత్యభామ సొంతమయినపుడు రుక్మిణికి అసూయ కలగకపోలేదు. "కృతక దరహాసమచ్చువడ" రాఁదగవౌనని" (5.74)పుణ్యక వ్రతానికి వచ్చింది. కాని సత్యకులా కోపాన్ని గాని, ద్వేషాన్ని గాని ప్రదర్శించలేదు.

సత్యభామలో ఉన్నది హిస్టరికల్ మూర్తిమత్వం. అంతేగాని అది హిస్టీరియా కాదు. ఇది హద్దులో ఉన్నపుడు తీవ్రమైన నాడీరుగ్మత కాలేదు. శ్రీకృష్ణుడు సాంత్వన పరచగానే సత్యభామలో కోపతాపాదులు ఉపశమింపబడ్డాయి. పారిజాతపరణ ప్రబంధంలోనేగాక, పురాణాది సమస్త వాఙ్మయ ప్రక్రియలలోను ఈ విధంగా సత్యభామ సాంత్వనం చెందడం కనిపిస్తుంది. కాబట్టి ఇది ఆమె మూర్తిమత్వమనే అనిపిస్తుంది. 

1. పారిజాతాపహరణం - సురభి వ్యాఖ్య పు. 95

అంతేగాక ఆజీవో జీవికా వార్తా వృత్తి ర్వర్తన జీవనే" అని ఆజీవ, జీవికా, వార్తా, వృత్తి, వర్తనం, జీవనం ఈ ఆరు జీవనోపాయాల పేర్లుగాను, "కృషిః పాశుపాల్యం వాణిజ్యంచేతి వృత్తయః" అని అవి వైశ్యవృత్తులుగాను అమరం చెపుతోంది.[5]

అమరకోశంలో ప్రస్తావింపబడినట్లు వార్త పదం ఒకటి వాగ్వర్గంలోను, మరొకటి వైశ్య వర్గంలోను పేర్కొనటం జరిగింది. క్షత్రియ వర్గంలో ఈ పదం ఉటంకింపబడలేదు. అమరకోశం టీక వార్త అంటే వృత్తాంతాల పేర్లుగాను, వాగ్వర్గంలోను చెప్పడమే గాక ఆంగ్లేయ భాషాపదాలను కూడా ఉదాహరిస్తూ Tidings, News అని పేర్కొన్నారు.

వ్యవసాయం, పశుపాలన, వాణిజ్యం వైశ్యుని వృత్తులుగా అమరమే చెపుతోంది. తిక్కనగారు ఆంధ్రమహాభారతం శాంతి పర్వంలో కేకయరాజు రాక్షస సంవాద ప్రకారము వివరించే సందర్భంలో "గోరక్షణాది వార్తా వినీతులై వైశ్యులు నడపుదురు"[6] అని పేర్కొన్నారు. "కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్"[7] అని భగవద్గీతలో చెప్పబడింది. కృషి (గోరక్ష) పశుపాలన వాణిజ్యాలు వైశ్య వృత్తులుగా పై ఆధారాలు స్పష్టంగానే చెపుతున్నాయి.

పైన ఉటంకింపబడిన సందర్భాలేగాక సంస్కృత లాక్షణికుడు రాజశేఖరుడు తన లక్షణగ్రంథం అయిన కావ్య మీమాంసలో ఈ వార్త పదాన్ని తరచి చూచిన సందర్భం ఉంది. దానిని కూడా పరిగణనలోకి తీసుకుని తెలుగులో వార్త విషయానికి వస్తాను.

రాజశేఖరుడు సాహిత్య శాస్త్ర ప్రాధాన్యాన్ని తెలుపుతూ ఒక అధ్యాయాన్ని కేటాయించాడు. దానిలో శాస్త్ర వాఙ్మయం, కావ్య వాఙ్మయం, అపౌరుషేయాలు - పౌరుషేయాలు, వేదాలు, వేదాంగాలు, పురాణము, అన్వీక్షకి మొదలైన వాటి గురించి చెప్పిన తరువాత కావ్యం పదిహేనవ విద్యాస్థానమని పేర్కొని వార్త విషయానికి వచ్చాడు.

"వార్తా కామసూత్రం శిల్పశాస్త్రం దణ్డనీతి రితి పూర్వైః సహాష్టాదశ విద్యాస్థానాన్ని, ఇత్యపరే.- అన్వీక్షకీ త్రయీ వార్తా దణ్డనీతిశ్చేతి విద్యాః. దణ్డనీతిరేవైకా విద్యా ఇత్యౌశనసాః, దణ్డభయాదికృత్స్నోలోకః స్వేషు స్వేషు కర్మ స్వవతిష్ఠతే. వార్తా దణ్డనీతిర్ద్వే విద్యే ఇతి బార్హస్పత్యాః. వృత్తిర్వినయ గ్రహహణంచ స్థితి హేతుర్లోక యాత్రాయాః. త్రయీ వార్తా దణ్డనీతయ స్తిస్రో విద్యాః ఇతి మానవాః త్రయీహి వార్తా దణ్డనీత్యోరుపదేష్ట్రీ. అన్వీక్షకీ - త్రయీ - వార్తా - దణ్డనీత్యోయః ప్రభావతి"[8].

దీనికి "చతుర్దశ విద్యాస్థానాలలో వార్త, కామసూత్రం, దండనీతి అనేవాటిని కూడా చేరిస్తే అష్టాదశ విద్యాస్థానాలని కొందరు చెపుతున్నారు. న్యాశాస్త్రాదికాలు, వేదత్రయం, వార్త (పశుపాల్యాదికం), దండనీతి అనునవి విద్యలు. విద్య అనగా దణ్డనీతి ఒక్కటియే అని శుక్రాచార్య మతానుయాయులు చెప్పుదురు. సమస్త జనులును దండభయము వలననే కదా తమ తమ కర్తవ్యములు చేయుచున్నారు. వార్త, దణ్డనీతి అనుననవి రెండును విద్యలు అని బృహస్పతి మతానుయాయులు చెప్పుదురు. (వార్త వలన కలుగు) ఆయా వృత్తులకు సంబంధించిన జ్ఞానము చేతను, (దండనీతి వలన కలుగు) వినయ గ్రహణము చేతను, అనగా నియమబద్ధ జీవన విధానమును అలవరచుకొనుట చేతను లోకయాత్ర నడచుచున్నది. వేద త్రయము, వార్త, దండనీతి అనునవి మూడు విద్యలు అని మను మతానుయాయులు

చెప్పుచున్నారు. వార్తా, దండనీతులను ఉపదేశించునది వేదత్రయమే కదా? ఆన్వీక్షకి, త్రయి. వార్త, దండనీతి అను నాలుగు విద్యలని కౌటిల్యుని అభిప్రాయము. అన్వీక్షకిచే బాగుగ వివేచనముచేసిన వేదత్రయమే వార్తా దండనీతులను ఉపదేశింప సమర్థమగును కదా?[9]" అని బాలనన్దినీ వ్యాఖ్య.

పై ఆధారం వలన వార్త అష్టాదశ విద్యలలో ఒకటిగా తెలుస్తోంది. వార్త అంటే పశుపాల్యాదికమని వివరింపబడింది.

పైన చెప్పబడిన అభిప్రాయాలను అనుసరించి ఆంధ్రమహాభారతంలో నన్నయగారు వాడిన వార్తని వింగడించడం ఔచిత్యం. అయితే నన్నయ ఏదో కథలో సందర్భవశా. ఈ వార్త ఒకదాని గురించే చెపితే వివేచన సులభమయ్యేది.

నారదుడు పాండవుల వద్దకు వచ్చి. ధర్మరాజును రాజనీతి విషయాలు కొన్నిటిని అడుగుతున్న సందర్భంలోదీ వార్త. ధర్మార్థ కామాలు ఒక దానితో మరొకటి బాధించకుండా కాల విభక్తంచేసి ధర్మం విషయంలో బుద్ధిని నిలుపుతున్నావా? అని ప్రారంభించి రాజభృత్యులు, మంత్రులు, చారులు, సేనాధ్యక్షులు, ధనం దుర్వినియోగం, దైవజ్ఞులు, వైద్యులు. ఔషధసేవనం, రాజభృత్యుల జీతాలు, రాజభృత్యులకి సత్కారాలు, ధనలుబ్ధులు, చోరులు, నీటి చెరువులు, హీనులగు కర్షకులు, వణిజులు, పంగులు, మూకాంధులు, వికలాంగులు. ఆదాయ వ్యయాలు మొదలయిన విషయాలు అడిగి "కరుణఁబేదరికము వారయకుండఁగ బ్రోతె - సకల జనులు నిన్ను సన్నుతింప"[10], అని తర్వాతి పద్యంలో "గొలువుండుదే లోకమెల్లఁగొని యాడంగన్"[11] అని

"పరికించుచు బాహ్యాభ్యం
తర జనముల వలన సంతత నిజరక్షా
పరుఁడ వయి పరమహీశుల
చరితము వీక్షింతె నిపుణచర నేత్రములన్"[12]
"వెలయఁగ విద్యజ్జనము
ఖ్యుల తోడ నశేష ధర్మ కుశలుఁడ వయి యి
మ్ముల లోకవ్యవహార
మ్ములు దయఁబరికింతె నిత్యమును సమబుద్ధిన్"[13]
"వార్త యందు జగము వర్తిల్లుచున్నది
యదియు లేని నాఁడ యఖిల జనులు
అంధకార మగ్నులగుదురు గావున
వార్త నిర్వహింప వలయుఁబతికి" [14]

అని ఇప్పటికి నారదుడు (లేదా నన్నయ) వార్త విషయానికి వచ్చాడు. ఈ సందర్భంలో కొన్ని అననూకూలమైన అంశాలు ప్రశ్నార్థకాలు అవుతున్నాయి.

"కృషి పాశుపాల్యే వాణిజ్యాచ వార్తా"[15] అని నిర్వచనం. దీని విషయంలో అలంకారికుడు రాజశేఖరుడికి గాని, అమరంలో చెప్పిన దానికిగాని, తిక్కన శాంతి పర్వంలోని ఆధారానికి

గాని, భగవద్గీతలోని ప్రవచనానికి గాని ఏ విధమైన అభిప్రాయభేదం లేదు. ఈ మూడు వృత్తులు వైశ్యులకి చెందినవిగా ఒక్క రాజశేఖరుడు తప్ప తక్కిన ఆధారాలు స్పష్టం చేస్తున్నాయి.

**నన్నయగారు :** "హీనులగు కర్షకులకును
భూనుత ధాన్యంబు బీజములు వణిజులకున్
మానుగ శతైక వృద్ధిన
నూనముగా ఋణము లిత్తె యుత్తమబుద్ధిన్" [16]

అని అంటున్నాడు. వ్యవసాయం వృత్తి వణిజులకి చెందినదిగా చెప్పటం లేదు. వణిజులకి వ్యాపారం నిమిత్తం ఋణంగా ఇచ్చేవి ధాన్యపుబీజాలు (విత్తనాలు) మాత్రమే. కర్షకులకి, వణిజులకు శతైక వృద్ధిగా (వందరెట్లు) ఋణాలు ఇస్తున్నావా? అని నారదుడు ధర్మరాజుని అడుగుతున్నాడు. వైశ్యకర్మగా చెప్పవలసిన వ్యవసాయాన్ని ఇక్కడ వేరుచేసి చూపించాడు.

కృషి, పశుపాలన, వాణిజ్యం ఈ మూడు వార్త అయినపుడు, యదియలేని నాఁడఖిల జనులు - అంధకారమగ్నులగుదురు, గావున - వార్త నిర్వహింప వలయుఁబతికి అని చెప్పడం అనౌచిత్యం అవుతుంది.

జనులు అంధకార మగ్నులవడానికి ఈ మూడే ప్రధాన కారణాలు కావు. నన్నయ ఈ వార్త విషయం ప్రస్తావించకముందు చాలా విషయాలు ప్రస్తావించాడు. అవికూడ జనులు అంధకారమగ్నులు అవడానికి ప్రధాన కారణాలే. నమ్మిన వారిని కాకుండా, నిపుణులు, పరాక్రమవంతులు కాని వారిని సేనాధ్యక్షులుగా నియమిస్తే రాజ్యం ఏమైపోతుంది? ఇది కారణంకాదా? దక్షుడైన మంత్రిలేకపోయినా, భృత్యులకి తగినంత భృతి ఇవ్వలేకపోయినా, దుర్జనుని రాజకార్యాల్లో నియోగించినా, కర్షకులకి - వణిజులకి ఋణాలు ఇవ్వలేకపోయినా, పంగులు - మూకాంధులు - వికలాంగులు - అబాంధవులని దయతో చూడలేకపోయినా, ఆదాయ వ్యయాలు సరిచూసుకోలేకపోయినా, పొరుగున ఉన్న రాజుల వృత్తాంతాలు తెలుసుకోలేక పోయినా, ఎల్లప్పుడూ బాహ్యాభ్యంతర నిజరక్షణ లేకపోయినా జనులు అంధకార మగ్నులు అయిపోరా? ఇవి కారణాలు కావా? కేవలం ఆ మూడు వృత్తులే కారణాలా?

ఇది తార్కికంగాను, యుక్తి సహంగానే గాక, వార్తయందు జగము పద్యానికి పై పద్యంతో దీనికి సంబంధం ఉంది.

ప్రతి నిత్యం విద్యజ్జన ముఖ్యులతో అశేష ధర్మాలను అడిగి తెలుసుకుంటూ లోకవ్యవహారాలని దయతో పరికిస్తున్నావా? అని అడిగి వార్తయందు పద్యంలోకి వెళ్ళాడు. అశేష ధర్మాలని, లోకవ్యవహారాలని నిత్యం తెలుసుకుంటున్నావా అని అనడంలోనే వార్త పదానికి అర్థం అంతరార్థంగా ఇమిడి ఉంది. అలా చేసిననాడు నారదుడు పైన అడిగి తెలుసుకున్న సమస్త విషయాలు అంతర్భాగం అవుతాయి.

కాబట్టి వార్త అంటే సమస్త వృత్తాంతాలు అనే అర్థం రావడానికే అవకాశం ఎక్కువగా ఉంది. వృత్తులకే (మూడిటికి) అన్వయించుకుంటే ఔచిత్యం లేదు.

పైగా నన్నయ వాడిన "కుశలవార్త" మొదటనే ఉటంకించిన రెండు సందర్భాలలోను

కుశల వృత్తాంతము, మంగళ వృత్తాంతము అనే అర్థాన్ని ఇచ్చేవేగాని వృత్తిపరమైన అర్థాన్ని ఇచ్చేవి కావు. కాబట్టి నన్నయ వాడిన 'వార్త' మూడు ప్రయోగాల్లోను రెండు ప్రయోగాలు వృత్తాంతము అనే అర్థాన్నే ఇస్తున్నాయి. ఒకటి ఔనా కాదా? అనే సంశయానికి లోనుచేసింది.

ఈ వార్త పదప్రయోగాన్ని ఇతర కవులు కూడ ఎక్కువగానే చేసారు. వారి ప్రయోగాలలో ఔచిత్యాన్ని కూడా పరిశీలిద్దాం.

**తిక్కన** : "ఇవ్విధంబున గార్యంబు నిర్ణయించి మన యగ్నిహోత్రంబు నెల్ల ధౌమ్యులు రక్షించువారు, వంటవారును, మహానసాధ్యక్షులును, పాంచాలీ పరిచారకులును ద్రుపదు పురంబున నిలుచువారు, రథంబులుగాని యింద్రసేనాదులైన సారథులు ద్వారకానగరంబున కరుగువారు. వీరెల్లరు దమ్మెవ్వరైనను 'మన వార్త' లడిగిరేని ద్వైత వనంబున మమ్ము విడిచిపోయిరట యెఱుంగ మనం గలవారమని చెప్పి"[17] ఇది ధౌమ్యుడు పాండవులను సముదాయించే సందర్భంలోది.

"కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడువారుమీ
రందఱు వేఱయొక్కయెడ నాజకి సేనల గూర్చుఁడెల్లవాఁ
డుం దనవారిఁదోకొని కడున్ రభసంబునఁగ గూడి "వార్తకున్'
ముందఱబోయి గోధనము ముట్టుకొనన్ వలయున్ మహోగ్రతన్"[18]

సుశర్మ దక్షిణ గోగ్రహణం చేసే ముందు దుర్యోధనుడు, దుశ్శాసనుడు, సుశర్మ మంత్రాలోచన చేసిన సందర్భంలోది.

"ధుర్యోధను దుర్నయంబున నేను 'దుర్వార్తలు' వినుచు దుఃఖంబులనుభవించు వాడనైతి[19] శల్య నందనుడు ధృష్టద్యుమ్నునితో యుద్ధం చేసి చనిపోయిన సందర్భంలో సంజయుడితో ధ్రుతరాష్ట్రుడు పలికిన వాక్యం ఇది.

"గురుఁడును భీష్ముఁడం గలన గూలుదు రట్టెకిరీటికింక నె
వ్వరెదురు కౌరవక్షయ మవశ్యము నయ్యెడు 'వార్తలేమి' గాఁ
బురపురఁబొక్కుచున్ వినఁగ బుద్ధి దలంచెద నైన ద్రోణు సం
గర పరిపాటి వినఁగా వలతున్ వివరించి చెప్పుమా"[20]

ఇది ద్రోణాచార్యుని మరణవార్త విని ధ్రుతరాష్ట్రుడు పరితపించిన సందర్భంలోది. ఇలా తిక్కన తాను రచించిన భారతభాగంలో ఎన్నో మార్లు ఈ వార్తని ప్రయోగించిన సందర్భాలు ఉన్నాయి. ఈయన సమాచారము, వృత్తాంతము అనే అర్థాల్లోనే ప్రయోగించాడనడానికి పై ఆధారాలుచాలు.

**పాల్కురికి సోమన** : వార్తని చాల సందర్భాలలో వాడాడు. "నిటమీద సిరియాలు నీశ్వరువార్త"[21] "గొఱియల వార్తలు గూడునే త్రవ్వ"[22], "వచ్చిన దాదిగా వార్తయుఁబూస - గ్రుచ్చిన యట్లుగా గురువుగా జెప్పి"[23], "నిబ్బసవని వార్త యెఱుఁగుదు గొంత"[24], "వసది జినుఁడను వార్త లేకుండ"[25], "మొన్నటి వార్త యింకిన్నియునేల"[26], "కన్నభక్తులు వార్త విన్న భక్తులును"[27], "పెద్దయు బుట్టునో పిమ్మటి వార్త"[28], అని బసవపురాణంలోను, "నిటువిందుమే భక్తి హీనంపువార్త"[29], "బసవన్న వార్త యేర్పడ విన్నవింప,"[30] "యిట్టి - వార్తయే లేదు నావలన

నిక్కంబు"[31] "పుట్టితిగాని మున్ పుణ్యమన్వార్త"[32] "వసుధ జైనుండను వార్తయు'[33] అని పండితారాధ్య చరిత్రలోను అనేక సందర్భాలలో ఈ వార్త ప్రయోగింపబడింది.

**నాచన సోమన** : ఉత్తర హరివంశంలో మరొకడుగు ముందుకువేసి వార్తా పత్రికని స్ఫురింపచేసాడు. "కిసలయ పత్రికన్ మకరకే తన నూతన వార్తలనియం'[34] అని వాడాడు. కిసలయ పత్రికలో వ్రాసిన మకరకేతన నూతన వార్తలట.

**శ్రీనాథుడు** : పల్నాటి వీరచరిత్రలో వార్తని విరివిగానే ఉపయోగించాడు. "వార్తకెక్కిన శశి వంశ వర్ధనుఁడు'[35], "ఆ వార్త బాదరాజంతయు నెరిఁగి'[36], "ఆవార్త వినిపింప అనుఁగు భూవిభుఁడు[37], "కమ్మలో వ్రాసిన కల వార్తలెల్ల'[38], "వింటివా ఈ వార్త విమలచారిత్ర[39], "వినిపించె నా వార్త విశదంబుగాను'[40], "వార్త లేమైన వినవచ్చెనో యనుచు'[41], "మాచర్లలోపల మరిక్రొత్తవార్త[42], "ప్రజలాడుచుండెను పలువార్త వింటి[43], "బ్రహ్మనాయుని వార్త బరవశమయ్యె[44], "ఇటచూడుడీ వార్తలన్నియు కల్ల[45], "వీర విజ్జల దేవి విని వింత వార్త'[46] "వింటివే వార్తలు విన విచిత్రంబు[47], "చెలువగా నిటువలె చేసిన వార్త"[48], "పగవారి వార్తలు పరికింపగారాదు"[49] అని పల్నాటి వీరచరిత్రలో లెక్కకు మిక్కిలి వార్త ప్రయోగం కన్పిస్తుంది.

పండితారాధ్య చరిత్రలోగాని, బసవ పురాణంలో గాని, పల్నాటి వీచరిత్రలోగాని కేవలం విషయం, సమాచారం, వృత్తాంతం అనే అర్థాలలోనే వార్త వినియోగింపబడింది.

**వేమన** : తన పద్యాలలో చాలా మార్లు వార్తని ప్రయోగంచాడు.

"పుత్తడిగల వాని పుండు బాధయుగూడ
వసుధలోన చాల వార్తకెక్కు
పేద వాని యింట పెండ్లైన నెఱుఁగరు"[50]

**పోతన** : ఆంధ్ర భాగవతంలోను వార్తను ఎక్కువగానే వినిపించాడు.

"ఏమినోము ఫలమొ యింత ప్రొద్దుక వార్త
వింటి మబలలార వీనులలర
మన యశోద చిన్ని మగవానిఁగనెనఁట
చూచి వత్తమమ్మ సుదతులార"[51]
"అరవిందాక్ష పదారవింద మకరందాసక్తులైయున్న స
త్పురుష శ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విడంబించి దు
ర్భర వార్తా కథన ప్రపంచములు గర్ణ ప్రాప్తముల్ సేసి వా
సరముల్ వ్యర్థతఁద్రోచుచుండఁ జనదీ సంసారమోహంబునన్"[52]

ఒకటి శ్రీకృష్ణ బాల్య వృత్తాంతంలోది. మరొకటి పరీక్షిత్తు మహారాజు భూ ధర్మదేవతల సంవాదాన్ని ఆలకిస్తున్న సందర్భంలోది. ఇలాగే మరికొన్ని సందర్భాలలో వార్తని ప్రయోగించాడు.

**రామరాజభూషణుడు** : ప్రయోగించిన వార్తని కూడ ఉటంకించి ఈ వార్త వ్యాసానికి ముగింపునిస్తాను.

"అబ్జ ముఖులార యేఁబోయి యచలకన్య
యుత్తలముఁదెల్పి వసురాజు చిత్తమరసి
వత్తునత్యలత శుభవార్త దెత్తుననుచు"[53]

"ఈ శుభవార్త మీ చెలియ కిప్పుడు పోయి యెఱుంగఁజెప్పి'[54] మంజువాణి గిరికాదేవి చెలికత్తెలతో అనిన సందర్భంలోవే పై రెండు శుభవార్తలు.

ఈ విధంగా ఎవరు ప్రయోగించినా వృత్తాంతము, సమాచారము అనే అర్థాలలోనే ప్రయోగించారని, వృత్తిపరంగా ప్రయోగించలేదని పై ఉదాహరణలన్నీ సాక్ష్యాలు గానే నిలుస్తాయి.

రాజాస్థానాలలో స్థానాపతి ఉద్యోగం ఉండేది. ఇతడే దూతగాగాని, మధ్యవర్తిగాగాని వ్యవహరించేవాడు. ఆయా వ్యవహారాల్లో ఆయావృత్తాంతాన్ని వినడం, రాజుకు చేరవేయడం చేసేవాడు. ఇతనినే వార్తాయనుడు, వార్తాహరుడు అని నిఘంటువులు చెపుతున్నాయి.

ఇది వృత్తి పరంగా అన్వయిస్తే వార్తావృత్తి సమాసం వాణిజ్యం వలన జీవించే ఒక వైశ్యుడికే చెల్లుతుంది. వార్తా వృత్తి చేసేవాడిని వార్తికుడుగా కూడా నిఘంటువులు చెపుతున్నాయి. ఆ అర్థంతోపాటే దూత, సందేశాల్ని తీసుకువచ్చేవాడు, సందేశాల్ని తీసుకువెళ్ళేవాడు అనే అర్థాలు ఉన్నాయి. కాబట్టి వార్త అంటే కేవలం వృత్తికాదు. సందేశము, వృత్తాంతము అనే అర్థాలే రూఢికెక్కాయి. ఇదంతా వివేచనేగాని ఈ వార్త పదాన్ని తెలుగు సాహిత్యంలో ఎవరైనా నిర్వచించారా? అది మిక్కిలి ప్రబల ప్రమాణంగా ఉంటుంది అనుకుంటే -

వివేక చింతామణి కృతికర్త పరమానంద తీర్థయతి వార్త అంటే స్పష్టంగా నిర్వచించాడు. "సకల జన వృత్తాంత జ్ఞానంబు వార్త యనంబడు"[55] అని చెప్పాడు. ఆంధ్ర సాహిత్యంలో వార్త అంటే ఇంత స్పష్టంగా నిర్వచించిన వారు లేరని చెప్పడానికి సాహసిస్తున్నాను. ఇతని నిర్వచనం ప్రకారం వృత్తాంతమనే అర్థం. ఇతడే మరో రెండు మార్లు వార్తని ప్రయోగించాడు. గృహస్థాశ్రమ లక్షణాన్ని వర్ణిస్తూ "వేసట పుట్టిన వార్తలు చెప్పరాదు", "లోకవార్తల నుపేక్షింపరాదు[56] అని అంటాడు.

వార్తకెక్కు అనే పదబంధం చాలా చోట్ల కన్పిస్తుంది. "వార్తకెక్కనెవ్వడా త్రిపురాంతక (క్రీడాభిరామం. 22), "వార్త కెక్కిన శశివంశ వర్ధనుండు" (పల్నాటి వీరచరిత్ర)', "వసుధలోన బాల వార్తకెక్కు" (వేమన), వార్తకు నెక్కఁగఁ బ్రోచి - సువర్తనుఁడగు రాజు (వాణీ విలాస వనమాలిక, ద్వితీయశ్వాసం), ఈ ప్రయోగాలలో వార్త కెక్కు అంటే అతని సమాచారము లేదా వృత్తాంతము ప్రఖ్యాతిచెందు అనే అర్థమే గాని వేరే అర్థంరాదు.

వార్తలలో అనేకాలైన వార్తలున్నాయి. "కమ్మలోపల వ్రాసిన కలవార్త లెల్ల" అనేది వ్రాతపూర్తకమైన వార్త. క్రొత్తవార్త, బసవని వార్త, బ్రహ్మినాయుని వార్త, వింత వార్త, చేసిన వార్త, పగవారివార్త, దుర్వార వార్త, భుభవార్త, కుశల వార్త, నూతన వార్త, పిమ్మటి వార్త, ఉపచారరీతి వార్త, ప్రాతవార్త గొటీయల వార్తలు, ఈశ్వరువార్త, మొన్నటి వార్త, వేసటపుట్టిన

వార్త, లోకవార్త, భక్తిహీనంపువార్త, పుణ్యమన్వార్త, ఇన్ని రకాలైన వార్తలు కవులు ఉదాహరించారు. ఇంకెన్ని వార్తలున్నాయో! కాలానుగుణంగా, వ్యక్తిపరంగా, గుణ పరంగా, జన సామాన్య పరంగా, సమాచార వైవిధ్య పరంగా, వివిధ విశేషణాలతో ఈ వార్తా ప్రపంచం దర్శనమిస్తుంది. పరమానందయతి చెప్పిన నిర్వచనం సాహిత్యాన్ని, పదార్థజ్ఞానాన్ని కాచివడబోసి చెప్పినట్లుగా కన్పిస్తుంది.

ఇది కేవలం తెలుగు సాహిత్యంలో అర్థపరిణామమో. అర్థ వైపరీత్యమో అనుకోవడానికి వీలులేదు.

రాజశేఖరుడిదే మరొక ప్రయోగం ఉంది. "దృష్టం కించి దదృష్ట మన్యదపరం వాచాల వార్తార్పితం" అని వాచాల వార్త అంటే వదరుబోతులమాట అనే అర్థమే బాలానందినీ వ్యాఖ్య ఇస్తోంది[57]

భర్తృహరి సుభాషిత త్రిశతిలో -
"వచసి భవతి సఙ్గత్యాగ ముద్దిశ్చవార్తా
శ్రుతి ముఖర ముఖానాం కేవలం పండితానాం
జఘన మరుణరత్న గ్రన్థి కాఞ్చీ కలాపం
కువలయ నయనానాం కోవహాతుం సమర్థః"

దీనిని ఏనుగులక్ష్మణ కవి ఈ క్రింది విధంగా ఆంధ్రీకరించాడు.

"నిగమ సుభాషితాభ్యసన నిష్ఠలు గల్గిన యట్టి పండితుల్
మగువల పొందు నింద్యమని మాటికి వార్తలు చెప్పనేర్పరుల్ [58]
- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -
- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

లక్ష్మణకవి ఉద్దేశ్యం కూడా మాట లేదా ఉక్తి అనే.

వృత్తి పరమైన అర్థం గ్రహించాలంటే స్పష్టమైన సందర్భ ఔచిత్యం ఉండాలి. కాబట్టి వార్త అంటే సమాచారం, వృత్తాంతం అనే అర్థాలే ఆంధ్రసాహిత్యంలో రూఢికెక్కాయి.

**సూచికలు :**

1. ఆది పర్వము, ప్రథమాశ్వాసము, 39
2. ఆది పర్వము, అష్టమాశ్వాసము, 180
3. సభాపర్వము, ప్రథమాశ్వాసము, 51
4. అమరకోశము, ప్రథమకాండము, వాగ్వర్గము, 164
5. అమరకోశము, ద్వితీయ కాండము, వైశ్యవర్గము, 577 - 78
6. *శాంతి పర్వము*, ద్వితీయాశ్వాసము, 341
7. *మోక్ష సన్న్యాస యోగం*, 44
8. ద్వితీయోధ్యాయః, శాస్త్రనిర్దేశః, పుట. 4,5
9. *కావ్య మీమాంస*, బాలానందినీ వాఖ్య, పుట. 4,5,

10. సభాపర్వము, ప్రథమాశ్వాసము, 47
11. సభాపర్వము, ప్రథమాశ్వాసము, 48
12, *13, 14,* సభాపర్వము, ప్రథమాశ్వాసము, 49-51
15. కావ్యమీమాంస, ద్వితీయధ్యాయం, పుట. 14
16. సభాపర్వము, ప్రథమాశ్వాసము, 44
17. ఆంధ్రమహాభారతము, విరాట పర్వము, తృతీయాశ్వాసము, 126
18. ఆంధ్ర మహాభారతము, ద్రోణపర్వము, ప్రథమాశ్వాసము, 102
19. ఆంధ్ర మహాభారతము, భీష్మపర్వము, ద్వితీయాశ్వాసము, 200
20. ఆంధ్ర మహాభారతము, ద్రోణపర్వము,ప్రథమాశ్వాసము, 126.
21. ఆశ్వాసం 4, పుట 293
22. ఆశ్వాసం 5, పుట 337
23. ఆశ్వాసం 5, పుట 413
24. ఆశ్వాసం, 5, పుట 373
25. ఆశ్వాసం, 6, పుట 454
26. ఆశ్వాసం 7, పుట 514
27. ఆశ్వాసం 7, పుట. 580
28. ఆశ్వాసం 3, పుట 148
29 దీక్షా ప్రకరణం, పుట 59,
30. దీక్షా ప్రకరణం, పుట 83
31. పురాతన ప్రకరణం, పుట 79
32. పురాతన ప్రకరణం, పుట 83
33. వాద ప్రకరణం పుట, 135
34. పంచమాశ్వాసం, 123
35. పుట 6, పంక్తి 20
36. పుట 22, పంక్తి 14
37. పుట 23, పంక్తి 31
38. పుట 31, పంక్తి 3
39. పుట 41, పంక్తి 25
40. పుట 43, పంక్తి 7
41. పుట 73, పంక్తి 12
42. పుట 73, పంక్తి 24
43. పుట 147, పంక్తి 15
44. పుట 148, పంక్తి 127
45. పుట 149, పంక్తి 16
46. పుట 190, పంక్తి 144
47. పుట 257, పంక్తి 354
48. పుట 268, పంక్తి 679
49. పుట 273, పంక్తి 847

50. వేమన పద్యరత్నాకరం, పుట 94, పద్య సంఖ్య 350
51. ఆంధ్రమహాభాగవతము, ధశమ స్కంధము, 163
52. ఆంధ్ర మహాభాగవతము, ప్రథమాశ్వాసము, 103
53. వసుచరిత్రము. చతుర్థాశ్వాసము, 25
54 వసుచరిత్రము, చతుర్థాశ్వాసము, 125
55. తృతీయ ఖండము. పుట. 200
56 ద్వితీయ ఖండము, పుట 113
57. కావ్య మీమాంస. షష్ఠాధ్యాయము, పదవాక్య విభాగము, 21
58. భర్తృహరి సుభాషిత త్రిశతి, శృంగార శతకం, దుర్విరక్త పద్ధతి, 71

## References


1. అమరకోశము. అమరసింహుడు, ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీస్, మద్రాసు, రెండవ కూర్పు. 1988.
2. ఆంధ్ర భాగవతము.. పోతన, తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ, ఏడవ ముద్రణ. 1994.
3. ఆంధ్ర మహాభారతము (నాల్గు సంపుటాలు). తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ, 1990
4. ఉత్తర హరివంశము. నాచన సోమన. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1967.
5. కావ్య మీమాంస. రాజశేఖరుడు. బాలానందినీ వ్యాఖ్య : డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు. ప్రథమ ముద్రణ, 1979.
6. పలనాటి వీరచరిత్ర. మల్లయ్య - కొండయ్య - శ్రీనాథుడు, పరిష్కర్త : పింగళి లక్ష్మీకాంతం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్ వారి ద్వితీయ ముద్రణ, 1991.
7. బసవపురాణము. పాల్కురికి సోమన. వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్‌సన్స్ చెన్నపురి వారిచే ప్రకటితం, 1966.
8. భగవద్గీత. అధ్యాయం 18, శ్లోక సంఖ్య 44
9. భర్తృహరి సుభాషితత్రిశతి. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ చెన్నపురి వారిచే ప్రకటితం, 1961.
10. మధుకళ (సాహిత్య వ్యాస సంపుటి) పి.ఎ.వి. వల్లభాచార్య, ప్రథమ ముద్రణ, 1993.
11. మల్లికార్జున పండితారాధ్య చరిత్ర. పాల్కురికి సోమన, తెలుగు విశ్వవిద్యాలయం. ప్రచురణ. 1990.
12. వసుచరిత్ర రామరాజభూషణుడు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, 1967
13. వాణీ విలాసవన మాలిక. బేకు మల్లరంగశాయి. ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ మద్రాసువారి ప్రచురణ, 1953.
14. వివేకచింతామణి. పరమానంద తీర్థయతి. తంజావూరు సరస్వతీ మహల్ వారి ప్రచురణ, 1962.
15. వేమన పద్యరత్నాకరం. బాలసరస్వతీ బుక్ డిపో. మద్రాసు వారిప్రచురణ. 1993.




# వచన కవిత ఆవిర్భావ వికాసాలు

**(1930 - 1960)**

- సోమసుందర్, ఆవంత్స

ఆధునిక కవిత్వానికి వచనకవితారీతి ప్రధానవాహికగా స్థిరపడింది. ఈ అంశంలో ఎవరికీ సంశయం ఉండనక్కరలేదు. అన్నంత మాత్రంలో మిగిలిన పూర్వ ఛందోమార్గాలన్నీ నశించిపోయాయని చెప్పకూడదు. నూత్నయుగీనధర్మం పురోగమిస్తూ సూచ్యమానమవుతున్నా పూర్వయుగావశేషాలెన్నో బ్రతుకును పట్టి విడువవు ఇదీ అలాంటిదే!

ముప్పైయేళ్ళ క్రిందటి సంగతి. అస్మదాదులమంతా కలసి ఈ అంశంపై ఎన్నో వ్యాసాలువ్రాసి ఒక సంపుటి ప్రచురించాం. తదుపరి కొన్నాళ్ళకు కీర్తిశేష కవిమిత్రుడు వే॥ నరసింహా రెడ్డి నన్నడిగిన పాతిక ప్రశ్నల ఆధారంగా - కావ్యాత్మవిముక్తి పథంలో సాగుతున్న మహాయాత్ర అనే శీర్షికతో ఒక బృహత్వ్యాసం రచించి జనధర్మలో ధారావాహికగా ప్రచురించాను. ఈ విధంగా ఈ అంశం - వేడివేడిగా తిరగేసి, మరగేసి చర్చించవలసిన మీమాంసాగ్రం నుంచి తప్పుకుంది.

తెలుగు కవితారంగంలో స్వచ్ఛంద కవితా స్వరూపం అరవైఏళ్ళుగా స్థిరపడి పురోగమిస్తోంది. మరీ ముఖ్యంగా ఏభయ్యవదశకం నుంచి అప్రతిహతంగా సాగుతోంది. సర్వామోదకర చైతన్యధారగా ప్రవర్థిల్లింది. వచన కవితాస్వరూపమే ఆధునిక కవితా వాహికగా ఒక స్థిర సంప్రదాయాన్ని స్థాపించుకుంది. దీనికి కుందుర్తి 'వచన కవిత'గా నామకరణచేశాడు. నేను 'ముక్తచ్ఛంద కవిత'గా పేర్కొన్నాను. శ్రీ వరవరరావు 'స్వచ్ఛందకవిత' అని పేరుపెట్టాడు. కాని కుందుర్తి పెట్టిన పేరే సర్వులూ ఆమోదించి ఉపయుక్తం చేస్తున్నారు. ఆ సమాసంలో ఒక అంతర్వైరుధ్యం ఉన్నప్పటికీ బహుజన ప్రయోగంవల్ల స్థిరపడింది.

రాజధానిలో కుందుర్తి ఫ్రీవెర్సు ఫ్రంటు నెలకొల్పినదాదిగా విపరీత వాదోపవాదాలు చెలరేగాయి. తద్వారా ఒక ఉద్యమోత్సాహాన్ని భజించింది. వచన కవిత సర్వామోదకరంగా స్థిరపడిన ప్రస్తుత సమయంలో యీ కవిత ప్రాదుర్భావ స్థితికి షష్టిపూర్తి చేసుకుందుకు - తెలుగు విశ్వవిద్యాలయ సాహిత్యప్రాంగణం ఒక గోష్ఠి కార్యక్రమం విశాలప్రాతిపధికపై రూపొందించడం ముదావహమైన సంగతి.

ప్రస్తుతం వాదోపవాదాల వేడిచల్లారి, సంశయాందోళనల నుంచి నిర్ముక్తమై, స్థిరమార్గంగా ఆమోదకరమవుతున్న దశలో దీని ప్రాదుర్భావ వికసనాల గురించి, నేపథ్యంనుంచి ఆంగ్ల సాహిత్య ప్రభావంగురించి విపులంగా చర్చించుకొని - ఒక చారిత్రకగుణానుశీలనం చేసుకోవడం భవిష్యత్తుకు ఉపయుక్తం కాగలదు.

ఈ నేపథ్యంనుంచి ఆలోచించేమనకు కొన్ని నిరంతర సత్యాలు ఎదురుకాక తప్పదు. ప్రజాహృదయంలోనికి రెక్కలు కట్టుకొని, త్వరమాణంగా ప్రయాణించే అనుస్యూతశక్తిగా పాటకున్నంత సహజరంజకత్వం వచనకవితకుగానీ, మరేయితర వాహికకుగానీ ఉండబోదని

ఇటీవల కొందరు రాజకీయోద్యమోత్సాహులు మళ్ళీ తిరగతోడుతున్నారు. విరసం వారూ అరసం వారూ గత రెండు దశాబ్దాలుగా ఈ విషయం గురించి పునరాలోచనలు చేస్తున్నారు. ఆ మాటకువస్తే పాటగాని, పద్యంకాని, వచనకవితగాని - వాటికి నిర్దిష్టమైన ఆవరణలలోనే అవి మనగలుగుతాయి. పాటకు అభివ్యక్తి యోగ్యమైన భావం వచనపద్యానికి సరిపడదు. వచనపద్యం మరింత ఆలోచనా స్ఫోరకతను ఆంతరధాతువుగా పోషించుకుంటుంది. రాగయుక్తంగా పాడటానికి దాదాపు వేయ్యేళ్ళుగా అలవాటు పడిన ఛందోబద్ధ పద్యంలో సైతం - పరిమితావరణలోనే భావం భాసించగలుగుతుంది. పాటనీ పద్యాన్నీ ఎదురుబదురుగా నిలిపి ఏది ఉత్తమ ప్రయోజనకరి - అని ఆలోచించడం ఎంత అనర్థదాయకమో, పాటనీ వచనకవితనీ పోటీకిపెట్టి ఏది సమగ్రశక్తివంతమని పరీక్షించడం సైతం అంతే అనర్థకారకం!

పాట మనిషి హృదయచలనంతోపాటు పెంపొందిన నిసర్గసుందరి. పద్యం తెలుగులో శిష్టజన కవితాహార్యంగా స్థిరపడింది. సామాజిక మనోరంగాలలో యీరెండు ప్రక్రియలూ రెండు భిన్నపార్శ్వాలను ఉద్దీప్తి చేయగలుగుతున్నాయి. చెవులూ ఆర్ద్రహృదయమూ ఉంటేచాలు, పాటను శ్రోత రసిస్తాడు. చక్షురక్షర సంయోజనక్రియాశక్తి ఉన్నవారినే పద్యం అధికతరంగా ఆకట్టుకో గలుగుతుంది. కవిత్వమంతా శ్రవ్యకళేననడం పాతమాట. ఆధునికకాలంలో ముద్రణా యంత్ర ప్రభావం వల్ల సాహితీప్రక్రియలన్నీ వచనాన్నే ఆశ్రయించనారంభించాయి. ఒక్క కవిత్వమే మడిగట్టుకొని దేవతార్చన పీటనుంచి దిగరాదని శాసించడం - పొసగనిమాట! కవిత్వంసైతం వచనకళగా మారిపోకతప్పని పరిస్థితిని ఆధునిక జీవితమే కల్పించింది.

ప్రాథమికంగా కవిత్వమంతా లయబద్ధ గేయ స్వరూపమే. ఈ సత్యాన్ని మనమీనాడు కొత్తగా స్థాపించుకోవలసిన పనిలేదు. ఆదిమానవుల ఆహారోత్పత్తి క్రమంలో ప్రతిపనినీ లయబద్ధంచేసినది గుండెలయబద్ధసంచలన క్రమమే! ఆహారోత్పత్తి శ్రమోపశమన చర్యగా పాటప్రాదుర్భవించింది. కడుపునిండిన మరుక్షణం ఆనందాన్వేషణ ప్రారంభంకాక తప్పదు. ఆ సమయాలను మరింత కాంతిమంతం చేయడానికి సైతం ఆటపాటల లయబద్ధ అంగవిన్యాసాలే అక్కరకువచ్చాయి. తదనుకూలంగా కంఠశ్రుతనాదం ప్రస్తారంచేయవలసి వచ్చింది.

భాషకన్న పూర్వమే లయబద్ధ నాదాన్ని మానవుడు సాధించాడనే యథార్థం విస్మరించ కూడదు. అతిప్రాచీన వైదిక వాఙ్మయాన్నికాని, ప్రాచీనగ్రీకు సాహిత్యాన్నిగాని పరిశీలించిన వారికి ప్రాచీన కవితాస్వరూపం గీతమేనన్నది స్పష్టపడుతుంది. ఐతే ఆ దశ సాధించేనాటికి మానవజాతి కొన్నివేల వత్సరాల విస్తృతచారిత్రక పథంలో యాత్రించిందన్న సంగతి మనకు కొత్తకాదు. "ఆదిమ కవితా స్వరూపం మనకీ భాషా సాహిత్యాలలోనూ, లిఖిత పూర్వక ప్రాచీన సాహిత్యాలలోనూ లభించదు. ఆదిమ కవిత స్వతస్సిద్ధంగా అలిఖిత గాన రూపంగానే వెలువడి వుంటుంది. అందుకే మనం దానిని ఆదిమ సాహిత్యంగా పిలుచుకోకతప్పదు." అంటున్నాడు - ప్రఖ్యాత మార్క్సీయ సాహిత్య శాస్త్రవేత్త కీ॥శే॥ జార్జిథామ్సన్. (చూ. 'కవిత్వము మార్క్సిజమూ' అనే నా అనువాద గ్రంథం).

## 2. కవిత్వము విమర్శ :

ప్రథమాస్థాన కవి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి 1952లో యిలా అన్నారు. "యతియున్ ప్రాసయు కూర్చుమాత్ర కవియే యంచేసు వాకొంటి గీరతమన్ కావ్యమునందు, నారచన లారాధ్యమ్ములే యైన నేకతమో తెల్పుడు సంతసింతు! గణసంఘాతంబు కావ్యంబె?" అంటూ పద్యగతంగా సాగిన వారి ప్రశ్న మౌలికమైనదే! ఒక కవి రచనలు ఆరాధ్యాలో కావో సకారణ వ్యాఖ్యానంతో తేల్చవలసింది విమర్శకులే!

ప్రతికవికీ శుష్క ప్రశంసలు వినివినీ విసుగు జనించడం సహజమే! ఇలాంటి సవాళ్ళు విసరడమూ ఎప్పుడో ఒకప్పుడు తటస్థించకనూ తప్పదు.

యతిప్రాసలు కూర్చడమే కవిత్వమనిపించుకుంటుందా? గణసంఘాతమే కావ్యమవుతుందా? అనే ప్రశ్నలు తరతరాలుగా కవులకు కలుగుతున్నవే! మనపద్య కవిత్వంలో ముప్పాతిక ముప్వీసం ఏతన్మాత్రంగా పొగులు పడడంవల్లనే సభ్య సమాజం తన అసమ్మతిని ప్రకటిస్తూ వచ్చింది. 19వ శతాబ్దంలో యీగబ్బు మరీ పెరగడంతో తీవ్ర విముఖతనూ ప్రదర్శించింది.

పద్యరచనా వ్యగ్రత వీలైనంత అధికంగా పశ్చాద్దృక్కునే సంతరించుకుంటూ వచ్చింది. ఆధునికులమైన మనమే ఈ ఆరోపణను ఆపాదించవలసిన అవసరంలేనేలేదు. పద్యకవితా సంప్రదాయాన్ని బహుధా కీర్తించే పెద్దలే ఆ విషయం చెప్పకయే చెప్పియున్నారు. గడియారం శేషశాస్త్రిగారి రఘునాథీయ కావ్యానికి రాసిన పీఠికలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ యిలా అంటున్నారు. "కవులు ప్రవచించినది ఆధ్యాత్మిక సత్యమేగాని, ఆధిభౌతిక సత్యంకాదనుట మహాకవులు నాడును, నేడును, రేపును గమనించి ఆచరించు ధర్మము. ఆ ధారిలో ఉదాత్త భావములను తేజోవంతముగా వెలువరించి ప్రజల అంతఃకరణములను సంస్కరించుటయే కావ్యకామనీయమునకు పరమఫలము!" అన్నవారి ఉద్ఘాటనలోని ఉద్దేశ్యం - ఆధిభౌతిక యథార్థాన్ని తృణీకరించి కల్లబొల్లి ఆధ్యాత్మిక సత్యాన్ని ఆరాధించడం సంప్రదాయక కావ్య ధర్మమన్నది స్పష్టమే! పరమ ప్రామాణికంగా మన కవులయందు నిలిచిన బాహ్య వాస్తవికతను కాదని, లేనిపోని ఊహల ఊయలలో ఊగుతూ సర్వసౌఖ్యాలనూ తలపోసే వారికి పద్యకవిత్వం పరమావధికాక తప్పదు. అది సంప్రదాయక ఖూ(మూ)ఢ మార్గమే! సందేహం లేదు.

ఆధునికుల ప్రమేయం భౌతిక ప్రపంచంతోనే అట్టి ప్రాపంచిక వాస్తవికతను వ్యాఖ్యానిస్తూ కూర్చోవడమూ కవుల పనికాదు. ధాని విషకలుషిత స్వభావాన్ని కూలంకషంగా మార్చడానికి - భావుక చైతన్యాన్ని ఉద్దీప్తంచేయడమే ఆధునికుల అభ్యుదయదృక్పథం. అట్టి దృష్టికి వెసులుబాటు కలిగించే నూత్న మార్గాలను అన్వేషించవలసిందే. తప్ప పాడిందేపాటగా మారిన పద్యకవితను ఆరాధించడం నిర్వీర్యమే కాగలదు.

ఈ కాలపు పద్య రచయితలు ఏ ఎత్తుగడతో ఏ శైలీ విన్యాసంతో పద్యాన్ని రచించపూనినా ఆ మార్గం పూర్వకవి చుంబితమే తప్ప అన్యంకాకుండా శిలీభవించిపోయింది. పద్యరచనా శక్తిని పూర్వకవులు సంపూర్ణంగా కొల్లగొట్టి విడిచారు. ఏ రూపం తీసుకోదలచినా ఎవడో ఒక పూర్వకవికి అనుకరణగానే మిగులుతుంది. ఈ సత్యాన్ని విశ్వనాథసైతం అంగీకరించక తప్పలేదు. ఆయన యిలా అన్నాడు : "ఔనని ఏ దారిన బోయిపూర్వకవి పాదాంకంబులే తోచి లోన లజ్జా పరిగూఢ మానసుడనై నాలో నేనే వినూతన శంకాహృదయుండనౌదు, మరి క్షంతవ్యుండ విశ్వేశ్వరా!' అంటూ నిస్సహాయంగా మొరపెట్టుకున్నాడు.

ఇటీవల ఒక ఆధునిక కవి. వచన కవితా వాహికలో యిలా అన్నాడు.

"మన్నుదినేపాముల కలలమైకం అబద్ధం

మౌనంవీడని క్రిముల ఒంటరి తపస్సు అబద్ధం"

అనే పాదద్వయిలోని భావాన్ని స్వీకరించి ఛాందసత్వంతో ఒక వెంగళాయి యిలా పద్యీకరించాడనుకుందాం. "మన్నునుదిన్న పాములది మైకపు స్వప్నమబద్ధబద్ధమౌ!" అంటూ వ్యర్థపద వ్యర్థాక్షర భూయిష్ఠంగా సాగలాగేడనుకుందాం. వచన కవితా పాదాలలోని ఓజస్సా కుంఠితమైపోయింది, పదాలవెంట లగువుతీసే అర్థస్ఫోరకశక్తి చచ్చింది. పద్యపాదమూ యీడ్చినట్లుగా సాగింది.

సరిగ్గా అరవైమూడేళ్ళక్రితం (1927) మొట్టమొదటి వచనకవితలో యుగశక్తికి ఆహ్వానం పలికిన ఆదికవి శిష్ట్లా ఉమామహేశను స్మరించుకుంటూ ఈ ప్రసంగవ్యాసాన్ని కొనసాగించడం సముచితం. కారణమేమంటే - ఆయన ఆహ్వానించిన యుగశక్తి పరంపరాభివృద్ధిపొంది స్థిరపడింది కనక, వెనుకచూపులు విడనాడి ఆగామి శతాబ్దికి సుదృఢగాత్రంతో ఆవాహన పలుకుతోంది కనక!

ఇక్కడే ఒక యథార్థాన్ని చెప్పక తప్పదు. నిరంతరశ్రమ జీవనులైన ప్రజల ఆహారోత్పత్తి కార్యక్రమంలో ప్రాచీనదశ నుంచీ బాసటగా నిలుస్తున్నపాట - మానవజాతి మనినంతకాలమూ అప్రతిహతంగా సాగకతప్పదు. శిష్టజనుల కవిత్వం ఎన్నెన్ని రూపాలు సంతరించుకున్నా - ఎన్ని రాజాస్థానాలలో తలదాచుకున్నా, నిసర్గసుందరమైన పాటమాత్రం సాధారణ ప్రజల నాలుకలపై సదా త్రుళ్ళింత లాడుతూనే వచ్చింది. జీవనోచ్ఛ్వాసంగా బ్రతుకును పరిమళభరితం చేస్తూనే వచ్చింది. శ్రమజీవనోపశమనధాతువుగా బలవర్ధకమవుతూనే వచ్చింది.

ముద్రణాయంత్రం నిత్యజీవితంలోనికి ప్రవేశించిన తర్వాత సర్వజ్ఞానప్రేరక, సర్వహృదయ రంజక సాహిత్యప్రక్రియలూ వచనాన్నే ఆశ్రయించాయి. కవిత్వం సైతం సహజ పరిణామంగానే వచన గ్రంథిలమవుతోంది. కావ్యం శ్రవ్యకళగా పరిమితం కావడంమాని పఠనపాఠనానుకూలంగా వచనస్వరూపాన్ని పొందడం సహజపరిణామమే.

ఈ సత్యాన్ని మహాద్రష్ట సామినేని ముద్దునరసింహం నూట ఏభయ్యేళ్ళ క్రిందటే గ్రహించి, యిలా ఎలుగెత్తి చాటాడు. "చందోబద్ధమైన గ్రంథము రచించేటప్పుడు ఆది రచించే మనిషి యొక్క బుద్ధి ఛందస్సును కుదుర్చుకోవడమందు కూడా సక్తమై ఉంటుంది. గనుక ఆ మనిషి తన అభిప్రాయమును సులభముగా బోధపడేలాగు రచించడమునకు వల్లవుండదు. త్వరితముగానున్ను, సందేహములు లేకుండానున్ను బోధకాదు." (చూ. హితసూచని, విద్యా ప్రమేయము పు.4)

ఆ మహనీయుడే ఆధునిక వచనానికి శ్రీకారం చుట్టాడు. తెలుగులో ప్రథమ వ్యావహారిక భాషావ్యాసరచనకు ఆద్యుడయ్యాడు. ఈ యుగీన సహజపరిణామంగానే కవిత్వం వచన స్వరూపాన్ని ఆశ్రయించి, ముక్తచ్ఛంద స్వరూపాన్ని భజించింది. ఆధునిక కవిత్వానికి వచన కవితా స్వరూపమే ప్రధాన వాహికగా ప్రవర్ధిల్లక తప్పదనే యుగశాసనాన్ని ముక్తకంఠంతో ఉద్ఘాటించింది.

### 3. కొత్త మలుపు :

1926 భావకవిత్వానికి శిఖరాయమాణమైన రెండు మహాకావ్యాలు వెలువడ్డాయి. అవి దేవులపల్లి కృష్ణశాస్త్రి, రచించి పదేళ్ళుగా దేశమంతటా గానంచేస్తూ ప్రచారంచేసిన కృష్ణపక్షం, రెండోది విశ్వనాథ సత్యనారాయణ తన భావకవితాశ్రేణికి చరమకావ్యంగానూ, పరమాద్భుత రమణీయ కావ్యంగానూ తనరారిన ``కిన్నెరసాని పాటలు - కోకిలమ్మపెళ్ళి'' దీనితో కవితాప్రియుల కళ్ళు మిరుమిట్లు క్రమ్మాయి. కవి అనేవాడికెవడికైనా యిటు కృష్ణశాస్త్రినో, అటు విశ్వనాథనో అనుకరించడంతప్ప గత్యంతరం లేకపోయింది. అనుకరణ బాహుళ్యం అంధయుగానికి దారితీస్తుంది. సృజనశక్తి మందగిస్తుంది. కవులు తమలో నిద్రాణమై ఉన్న ప్రతిభాంకురాన్ని జాగృతమొనర్చుకుందుకు దీక్షతో ప్రయత్నించరు. అట్టి అంధానుకరణల చీకటిరోజులకు స్వస్తిచెప్పడానికి ఒక సాహసి అవసరం!

ఆ సాహసే సామినేని ముద్దుకృష్ణగా అవతరించాడు. తనముత్తాత ముద్దునరసింహం వ్యావహారిక వచన వ్యాసరచన కాద్యుడైనట్లే - డబ్బయ్యేళ్ళ తర్వాత మనుమడు వచనకవితకు ఆరంభప్రవక్త కాగలిగాడు. విజయవాడనుంచి 'జ్వాల' అనే పక్షపత్రిక నెలకొల్పాడు. దేశభక్తియుత కవిత్వంలో విప్లవాత్మక బీజాలను నెలకొల్పాడు. జ్వాల బ్రతికింది నిండారెండేళ్ళు లేకపోవచ్చు. ఆ స్వల్పకాలంలోనే ఈ శతాబ్దికంతటికి వెలుగునిచ్చే రచనలెన్నో ప్రచురించాడు. శ్రీ శ్రీ ప్రభవ తర్వాత రచించిన తొలిరచనలనూ, చలంగారి విప్లవాత్మకరచనలనూ జ్వాల ద్వారానే అందించాడు. ప్రప్రథమంగా అమెరికన్ ప్రజాతంత్రకవి శేఖరుడువాల్ట్‌విట్మన్‌ను పరిచయంచేశాడు. అతని సంవిధానంలో వచన కవితలు (లేక స్వచ్ఛంద కవితలు) ప్రవర్తిల్లడం ఎంత సమయోచితమో నొక్కి వక్కాణించాడు. తాను స్వయంగా ఎన్నో వచన కవితలు రచించాడు.

జ్వాల పత్రిక ఎన్నో పుటలతో వెలువడేదికాదు. పల్చని కాగితంపై పత్రిక సైతం బక్కపల్చగా ఉండేది. అయితేనేం - జ్వాల అన్ని పత్రికలనూ సంపాదించుకుని ప్రతిపుటనూ మైక్రోఫిలింపై భద్రపరచుకోవడం ఎంతో అవసరం. ముద్దుకృష్ణ 'మలుపు తిరిగాను' అనే మంచి కవిత రచించి జ్వాలలో ప్రచురించినట్లు శ్రీ శ్రీ తన ''కవిత్వంలో నా ప్రయోగాలు'' అనే వ్యాసంలో వివరించాడు. (అనంతం-పు.125) పాత జ్వాల పత్రికలు పరిశీలిస్తే ముద్దుకృష్ణ కవితలన్నీ లభిస్తాయన్నాడు శ్రీ శ్రీ. చారిత్రక దృష్టితో పరిశీలిస్తే ముద్దుకృష్ణ కవితలు అవిస్మరణీయాలే. ఆయన ఆద్యకవే!

''కాయండి యువకులు
కాయండి భుజములు
కష్టంగ వుంటుంది -
కాని తప్పదు మనకు
చచ్చిపోయిన తల్లి
స్తన్యమ్ము గుడుపదు.''

అనే ఉదాహరణ, 'మలుపు తిరిగాను' నుంచి శ్రీ శ్రీ అనంతంలో యిచ్చాడు. ఆయన వచన కవితలన్నీ జ్వాల పత్రికకోసమే రాశాననీ, కాని జ్వాల ఆగిపోయిన తర్వాత ఉదయని.

పాటిబండ మాధవరామశర్మగారి వీణ పత్రికల్లోనూ ప్రచురించాననీ ఈ వ్యాసకర్తతో స్వయంగా చెప్పాడు. ముద్దుకృష్ణ చివరిరోజులలో మద్రాసులో కృష్ణశాస్త్రిగారింట గడిపారు. ఉదయిని - కొంపెల్ల జనార్దనరావు అష్టకష్టాలుపడి అద్భుతంగా నడుపుతున్న పత్రికలో 1935 మే, జూన్ సంచికలో (సంపుటి 1 - సంచిక 3) ఈ క్రింది కవిత ప్రచురితమైంది. ముద్దుకృష్ణ చెప్పినమాటననుసరించి చూస్తే ఆ కవిత ప్రచురింపబడే నాటికి ఐదారు సంవత్సరాల ముందే రచించబడినట్లు మనం భావించవచ్చు. ఆ కవితకు శీర్షిక పెట్టలేదు.

★★★ ఈ మాదిరిగా మూడు నక్షత్రాలు వేసి కవిత ప్రారంభించాడు. ముద్దుకృష్ణ ప్రతి కవితలోనూ దేశభక్తినీ తత్కాలీన కర్తవ్యాలనూ సందేశించాడనీ, కేవలం ప్రయోగం కోసమే వ్రాయలేదనీ మనకు తేలికగానే బోధపడుతుంది. ఆ కవితను యిక్కడ ఉదహరించుకోవడం అవసరం.

★
★ ★

రెండు లక్షలజనులు
స్వాతంత్ర్యప్రియులు
త్యాగశీలురు, వీరులు
గుమిగూడినారు
ఒకపెద్ద మైదానమునను,
జనుల కోలాహలము,
జయ జయ ధ్వానాలు!!
ఉత్సాహము, వెఱ్ఱి ఆవేశము!!!
ఒక వింత శక్తి
సంపూర్ణ స్వాతంత్ర్యానురక్తి
మనిషి మనిషిని పెనవేసుకుంటు,
గుండె గుండెను నూటిగ వ్రానుకుంటు (ధూ)
వెఱ్ఱి అన్వేషణాన తిరిగినది
ఆ మైదానమునె నాడు కలతపెట్టి,
ఇంతలో వెన్నెలబోసినవ్వులవాడు
వింత ఆకర్షణంపు వెఱ్ఱివాడు
అతడు, వచ్చినాడు, ప్రజమెచ్చినాడు,
సంపూర్ణ స్వాతంత్ర్యాను రక్తిని
రగుల్కొలుపు ఆ వింతశక్తికి
వినయాంజలులుఘటించి
ప్రేరేపించినాడు -

ఈ కవిత ప్రధానమైనది కావడాన ఉదాహరించాను. అనాటి స్వాతంత్ర్యేచ్ఛ ప్రజలలో ఎలా గుబులుకుంటున్నదో, భారతదేశ ఏకైక నాయకుడు బాపూజీపట్ల ప్రజలలో ఎంత ఆకర్షణావేశాలు ప్రోగులుపడుతున్నవో ఈ కవితలో ముద్దుకృష్ణ అలతి అలతి పదాలతో,

సంక్షిప్తతను ఆసాంతం భజిస్తూ - మాత్రాఛందస్సులోనికి పోకుండా పాదాలను బిగియపట్టి ముక్తచ్ఛంద కవితగా తీరుస్తూ ఎంతో నైపుణ్యం ప్రదర్శించారు. ఈ కవితలో ఈ సన్నివేశం ఫలానాచోట జరిగినట్లు లోకల్‌గాని, ఫలానా సంవత్సరంలో జరిగినట్లు కాలసూచనగాని ఎక్కడా కవి వివరించలేదు. కనుక 1921 నుంచి 1932 వరకూ ఎప్పుడైనా ఎక్కడైనా జరిగినట్లు సార్వత్రికతనే కవి ఇచ్ఛాపూర్వకంగా అభివ్యక్తీకరించాడు. జరిగిన సన్నివేశాన్ని వర్ణించడంద్వారానే పాఠకులకు సందేశం అంతర్గర్భితంగా ధ్వనించబడిందే తప్ప కవి ప్రత్యక్షంగా పిలుపునివ్వలేదు. కవి వ్యక్తిత్వం పరోక్షమై - సన్నివేశం ప్రత్యక్షం కావడం ఇందలి ప్రధాన సంవిధానం. చివరి పాదాలలో కవి ఒక నర్మగర్భ ప్రతిపాదనచేసి పాఠకుల ఆలోచనలకు జాగా కల్పించాడు. ముక్తచ్ఛంద కవితాచరిత్రలో ఈ కవిత చిరస్మరణీయమైనది.

'మలుపు తిరిగాను' అనే కవితనుంచి ఆరుపాదాలనే శ్రీశ్రీ తన జ్ఞాపకంనుంచి ఉదాహరించాడు కాని ఆ కవిత పూర్తిపాఠం దొరికితే మన పరిశీలనకెంతగానో ఉపయుక్త మయ్యేది. ఆ కవితలోని - 'చచ్చిపోయిన తల్లి స్తన్యమ్ముగుడుపదు' అనే నర్మోక్తి ఆలోచించతగినది. ఆనాటికి యావద్భారతంలోనూ కవులు మనదేశగత వైభవాలను కీర్తిస్తూ, గతానేక గాథలను పునఃస్మరణచేస్తూ తలకెత్తుకుంటున్నారు. గత వైభవకీర్తనం ద్వారా వర్తమాన దుస్థితిపట్ల ఆక్రోశం కలిగి ప్రజలలో కర్తవ్యోన్ముఖత కలుగుతుందని వారాశించారు. కాని ఆచరణలో దానికి వ్యతిరేకంగా జరగడమూ కద్దు. పైగా నైరాశ్యమూ ప్రోదిచేయబడింది. గతం వర్తమానానికి తల్లి. ఆ తల్లి చనిపోయింది తిరిగిరాదు. స్తన్యం గుడిపి తన బిడ్డల ఆకలిబాపదు! అనే సందేశం యివ్వడానికి ఆనాటికవి కెన్ని గుండెల్లో ఉండాలి! ఆ సాహసమే ముద్దుకృష్ణ తన కవితద్వారా జరిపి చిరస్మరణీయుడయ్యాడు. కాలక్రమేణా పాతపత్రికలన్నీ సంపాదించి ముద్దుకృష్ణ కవితలన్నిటినీ ప్రచురించుకోగలిగితే ధన్యులమవుతాము.

ఆయనే అడవిబాపిరాజును ప్రోత్సహించాడు. ఎన్నో వచనకవితలు రాయించి ప్రచురించాడు. అవన్నీ ఎత్తిచూపి వ్యాఖ్యానించడానికిక్కడ వ్యవధిచాలదు, లభ్యమూ కావడంలేదు. ఆనాటి జ్ఞాపకాలను శ్రీశ్రీ యిలా వివరించాడు. "మేం వచనగీతాలు రాస్తున్న తొలిరోజులలో పూడిపెద్ద వెంకటరమణయ్య (మా బంధువుడే) 'అల్పీలు - సూదులు' అనే అరవందకు తక్కువగాని ఖండకావ్యాలు సంపుటిగా తయారుచేశాడు. వాటిలోకొన్ని చిత్రగుప్త వంటి పత్రికలలో వెలువడ్డాయి. కొన్నేళ్ళపాటు శ్రీ శివశంకరశాస్త్రిగారు 'వచన గీతాలకు ఆద్యుడు పూడిపెద్ది వెంకట రమణయ్యగారే' అంటూ ప్రచారం చేశారు. చిత్తశుద్ధిగలవ్యక్తి కాబట్టి - వెంకటరమణయ్య - "మొర్రో నేను శ్రీశ్రీ ప్రభృతుల రచనలు చూసిన తర్వాతనే 'అల్పీలు - సూదులు' రాశాను!" అంటూ అంగీకరించాడు.

కాని అచ్చమైన వచనకవితలో సంపూర్ణకావ్యాలు రాసిన మొదటివాడు శిష్ట్లా ఉమామహేశ్వర రావే! అతని 'ఊట్ల వెర్రెమ్మ'ను జ్ఞాపకం చేసుకుంటూ శ్రీశ్రీ ఇలా ఉల్లేఖించాడు.

'ఊట్ల వెర్రెమ్మ
ఊళ్ళో వుందంటే
ఊరందరికీ
ఉబుసుపోక...'

అని ప్రారంభమైన వచన కవిత నవమి చిలుకలో సంకలితమైందని తెలిపాడు. శ్రీ ఆరుద్ర నా నుంచి విష్ణుధనువు ప్రతిని తీసుకువెడుతూ - "నవమి చిలుక" ఎక్కడవుందో నాకు తెలుసు సంపాదించి నీకో ప్రతిపంపుతాను." అన్నాడేగాని ఆ దొరకేస్థలం రహస్యంగా దాచుకున్నాడు. ఇంత వరకూ ఆ కావ్య ప్రతి నాకు లభించలేదు. ఆరుద్ర మళ్ళీ ఫికరులేదు.

శిష్ట్లా జ్ఞాపకాలు రాస్తూ శ్రీశ్రీ యింకా ఇలా అన్నాడు : "ఒకానొక రాత్రి... దీన్ని ఉమ్మయ్యతో గుంటూరు రాత్రి అనిగాని, గుంటూరులో ఉమ్మయ్యరాత్రి అనిగాని, ఉమ్మయ్యా నేనూ నాటుసారా అనిగాని. లేదా టూకీగా హోమోహోమం అనిగాని అనవచ్చు. ఏమీ అనకుండానే రాయవచ్చు. ఉమ్మయ్య అంటే శిష్ట్లా ఉమామహేశ! అతనే ఉమామహేశ్వర వినాయకం. క్షమాపరాత్పర కృపాకరం, దయారసార్ద్ర దవానలం (ఇందులో మొదటిదే అతను పెట్టుకొన్న పేరు) మిగిలినవన్నీ ఆ జాతిలో నాసొంతకల్పన ఇప్పటికే నవమిచిలుక కూడా వెలువడిందనుకుంటాను. అప్పటికింకా నా మహాప్రస్థాన గీతాలు పత్రికలలోనే నిద్రపోతున్నాయి. కవుల వలయాల్లో మాత్రం కల్లోలం పుట్టిస్తున్నాయి - వంటి రిఫరెన్సులెన్నో శిష్ట్లా శ్రీశ్రీ తన అనంతంలో తెలిపాడు. అవన్నీ మనకు అవసరమూ లేదు. కానీ పై వాక్యాలలో - "నవమి చిలుకకూడా వెలువడిందనుకుంటాను" అన్న శ్రీశ్రీ మాట - నవమి చిలుక ముందస్తుగా ఎన్నోరోజుల క్రిందటే అచ్చయింది. ...హుజనులు విశ్వసిస్తున్న అభిప్రాయాన్ని అనుమానాస్పదం చేస్తోంది కీ॥ శే॥ కంచుర్తి శిష్ట్లాతో తనకు వ్యక్తిగత సన్నిహిత పరిచయం ఉందని. నవమి చిలుక 1930 ప్రాంతంలోనే అచ్చయిందనీ చెప్పేవాడు. కనక శ్రీశ్రీ రెఫరెన్సును ఖాతరుచేయ్యనక్కరలేదు.

**4. ప్రాహ్లాద కవిత్వం :**

ముప్పయి నాలుగేళ్ళ చిన్నతనంలోనే బ్రతుకు చాలించి వెళ్ళిపోయిన శిష్ట్లా ఉమామహేశ్వర రావు ఆధునికులలోనే విశిష్టకవి. 1938లో నవమి చిలుక, విష్ణుధనువు అనే రెండు కవితా సంపుటాలు ప్రచురించేవరకూ నిర్దిష్టమైన ఖ్యాతినందుకోలేదు. అతని తొలికావ్య సంపుటి నవమి చిలుక ప్రకీర్ణకావ్యం. కవితానంకలనాలలోనూ భారతీ, ప్రతిభ వంటి సాహిత్య పత్రికల పాతసంచికలలోనూ నవమి చిలుకలోని కవితలు లభిస్తున్నాయి. అంతేతప్ప సమగ్రరూపంలో ఆ గ్రంథం ఇంతవరకూ లభించలేదు.

శిష్ట్లా తనది ప్రాహ్లాద కవిత్వమని చాటుకున్నాడు. అతని కవితాధర్మం సాధించిన చారిత్రక ప్రాధాన్యతను సమగ్రంగా పరిశీలించుకోగల అవకాశం అభించలేదు. తెలుగు సాహిత్యానికి జరిగిన దుర్ఘటనలలో శిష్ట్లా వంటి ప్రముఖకవి విస్మృతుడు కావడం ఒకటి. నవమి చిలుక పూర్తి గ్రంథంకూడా లభిస్తే తప్ప అతని కవితా ప్రాధాన్యతను అంచనా వేయడానికి వీలుండదు. లభించినంతవరకూ నవమి చిలుకలోని కవితల గురించి వ్యాఖ్యానించుకోవలసిన అవసరం ఉంది. హృద్యమైన కవితాకృతులుగా బీదమందు, జ్ఞాపకాలు సదా స్మరణీయాలే! సామాన్యపదాల బలహీన శరీరాలపై భావబంధురమైన అమేయశక్తిని ఆపాదించి అమృతశక్తిమయం చేస్తాడు. రీతిలో అపూర్వతను సాధిస్తాడు. శైలిలో తనదైన ఇడియోసింక్రసీని పొదుగుతాడు. అతని సంవిధానం అతనిదే! అపూర్వ సహజకాంతులు ప్రసరిస్తుంది.

బీదమందు అనే లఘుకవితలో, జీవనదైన్యం ఆవిష్కృతమవుతుంది.

"తూర్పుతెల్లారింది వానవెలిసింది
అమ్మపోయే, మందెట్టుకురాయే!
కాండబ్బయినా లేదు, కాసైనా లేదు
కాలెకూ కూతెకైతే డాక్టెరురాడే!
సందేళ సలిజరం ఊర్కేపోదే...
సందొచ్చిపిల్లోడు ఉలుకుతున్నాడే!
ఏమాకో తింటుంది గజ్జెట్టిన కుక్క
నేపాళం మాత్రెయ్యే నేత్తాడు పిల్లోడు...
పాతాళం బలిసెక్రవర్తీ - సంకురాంతి
పండక్కు నేపాళం సెట్టిక్కిరా!
జబ్బులన్నీ పోతాయి....!

ఈ కవిత పూర్తిపాఠం యింతే. ఇంత లఘు స్వరూపంలో అనంతజీవన విషాదం ఇమిడింది. ఎక్కడ ఈ కవిత ప్రారంభమవుతుందో, అక్కడు ఒక యథార్థ జీవనగాథ పరిసమాప్తమవుతోంది. కుక్కలకు జబ్బుచేస్తే ఏ ఆకో అలమో మింగి పోగొట్టుకుంటాయి. బీదలకు ఆ ప్రకృతి జ్ఞానమూదూరమై పోయింది. అందరికి తెలిసిన నేపాళం ఉండనేవుంది. పాతాళలోకానికి దిగద్రొక్కబడిన బలిచక్రవర్తి సంక్రమణ సమయంలో నేపాళం చెట్టెక్కి భూమిమీదకువస్తే సమస్తరోగాలూ నేపాళంవల్ల నివారణ కాగలవని విశ్వసిస్తారు.

కల్పన కవితా సంపుటిలో స్వీకృతమైన జ్ఞాపకాలు అనే మరో కవితకూడా నవమి చిలుకలోనిదే. లీల అనే ఒక అభాగ్య, 'నాపేరు లీల' అంటూ స్వగతంగా ఈ కవిత ప్రారంభమవుతుంది. తానున్న ఊరి గోల పడలేక పొరుగూరు వచ్చేసింది. ఒక అందాలవాడిని నమ్మింది. అతనితో సొంతూరులోనే అక్రమసంబంధం సాగించింది. ఊరుమారింది. గోలపెట్టింది. తీరా యిల్లు విడిచి వచ్చేసరికి - ఆ అందాల మగరాయుడు పరారయ్యాడు. ఆమెబతుకు అడవిపాలయింది. నిరాధారగా పొగిలింది. అయినవాళ్ళనీ కానివాళ్ళనీ తలుచుకొని దురపిల్లుతోంది. ఇలాంటి వాస్తవిక జీవితాన్ని ఇతివృత్తంగా స్వీకరించడానికి కవి సంస్కారంలో పరోక్షానుభవం సంసిద్ధమై ఉంటేచాలు.

ఇది ప్రతినిత్యం జరుగుతున్న సామాన్యదీనగాథే! కనకనే సార్వజనీన జీవనేతి వృత్తంగా కవి సాధించగలిగాడు. తల్లితండ్రుల్ని తోడబుట్టిన వాళ్ళని విడిచి అతనిప్రాపు నమ్ముకొని వచ్చిన ఆమె ఏకాకిగా బ్రతకవలసివస్తోంది. అనాథ అందరికీలోకువే! దారినిబోయే అమ్మలక్కల ముళ్ళ చూపులు ఆమె గుండెల్ని చీలుస్తున్నాయి. సమీపించి భోగట్టాలాగిన కొందరు బుగ్గలు నొక్కుకుంటున్నారు. ఆ అవమానాలు భరించలేకపోతోందామె.

ఒకనాడు నడిరేయివరకూ మేలుకుని కూర్చుంది. మృత్యువును బ్రతిమాలుకుంది. తెగించి సాహసం చేద్దామంటే అమ్మమ్మ జ్ఞాపకం, అమ్మ జ్ఞాపకం వచ్చింది. చెల్లెలు, నాన్న, అన్నలు, తమ్ముడు అంతా జ్ఞాపకాల్లో వేధిస్తున్నారు. మమకారాలపట్టు సడలడంలేదు. చావురావడంలేదు.

ఆమె శూన్యాన్ని అడుగుతోంది. "రావేల రావేల రాత్రి వచ్చింది! మధురమవు మగవాడ! నా ప్రేమ నిజమోయి!" అంటూ ఆక్రోశించింది. ఆమెకు కునుకు పట్టినా "ప్రాభాతమౌవేళ జ్ఞాపకాలొచ్చాయి!" ఆమె ఆర్తికి అవధిలేదు. పవళింపు సమయాన మళ్ళీ జ్ఞాపకాలు. తనకు తలనొప్పి తీర్చే తలగడగా అతని బాహువే అమరేది. చలికాలం వచ్చిందంటే అతని జ్ఞాపకాలు కాలుస్తాయి. చైత్రమాసంవస్తే జ్ఞాపకాలు చుట్టూ మూగికూస్తాయి. వానకాలంవస్తే తట్టి తట్టి పిలుస్తాయి.

తనరక్తాన్ని తప్పించుకోవడమెలాగ? రక్తంలో లీనమైన అతని జ్ఞాపకాలను తప్పించుకోవడ మెలాగ? తాను నమ్ముకొన్న కొండ విరిగి మీదపడింది. అతగాడు వేరొక పిల్లను మరులుగొని తనకు ఉరులు బిగిస్తున్నాడు కాబోలు! అతనిపొందులో తాను బులుబులులహాయి కోసం ఉవ్విళ్ళూరింది. పసిపాప నవ్వులకోసం వేగిపోయింది. ముద్దుటుయ్యాలలో తన కల పరుంటే హాయి హాయీ అంటూ ఊపుతూ జోలపాడింది. తన కలలోనే మిగిలిన ఆ పసిపాప ఆడదో మగదో! మగవాడే అయితే తన తండ్రిలాగే మాయదారిగా మారిపోతాడేమో! ఆడపిల్లే అయితే తనలాగే బ్రతుకును అర్ధమర్ధాంతరంగా అడవిపాల్చేసుకుంటుందేమో!

మొుత్తానికాబాధ తనకు తేకుండాపోయింది. తానుపొందని గర్భాన్ని ఎన్నెమ్మ పురుడు పోసింది. క్షుద్రదేవతగా మనవాళ్ళు విశ్వసించే ఎన్నెమ్మ! దాని పరివారం కొత్తెమ్మా - పోతురాజున్నూ - ఈ కొత్తెమ్మను కొన్నిప్రాంతాలలో గొంతెమ్మగా పిలుస్తారు. ఆమె హృదయంలో మాత్రం లీలగా మాతృత్వపు ఆశ గుబులుకుంటోంది.

తన పాపనెవరో చంకన పెట్టుకుపోయారల్లే వుంది. అందుకే తనకు పాలు చేపుకు వస్తున్నాయి. అర్ధరాత్రి గడవక ముందే తన బ్రతుకు అడవిపాలయింది. నీలాలసముద్రం బావురుమంటోంది. నేల నిప్పచ్చరంగా నోరు తెరుస్తోంది. తాను రాయిగా మారిపోయినా బాగుండేది. ఇదీ శిష్ట్లా విశిష్ట చిత్రణ జీవన వాస్తవికత - కవితలో ప్రాతినిధ్యం పొందడానికి ఇదే ప్రథమం. దానికి ఇతివృత్తమే పూర్తిగా సహకరించదు. ఖ్రాప్‌షెంకో అనే ఆధునిక సోవియట్ విర్శకుడనినట్లు - కవినైపుణ్యంతో దానిని తీర్చి దిద్దినపుడే ప్రదర్శన జీవనశక్తిని భజిస్తుంది. లీల శాపగ్రస్త. కాని అహల్యవలె రాయిగామారిపోలేదు. అతడు శ్రీరామచంద్రుడై వచ్చి పాదధూళి ప్రసరిస్తే ఎంత బాగుండును! తన శాపం విముక్తమవుతుంది. తన కా యోగంలేదు. అందుకే అనుకుంటుంది "రామ, రామ, నాపేరు లీల" అంటూ తన కథ ముగిస్తుంది. ఇందులోని కథాంశం కవితాశక్తిని ఇనుమడింపచేయడానికి వినియుక్తమైంది. విషాదజీవన ఇతివృత్తం కరుణరసభావాన్ని ప్రోదిచేసింది.

మూడు దశాబ్దాల కాలం పాలించిన భావకవితాయుగాన్ని చీల్చుకుని, మరొక ఆధునిక కవితా ప్రకరణం ప్రారంభమయ్యే యుగ సంధిలో శిష్ట్లా ఉమా మహేశ ప్రయోగవాదిగా నవ్యతాన్వేషిగా. కొత్తపంటలు పండించిన కవిధీరుడు. ప్రౌఢ వయః పరిపాకాన్ని అందుకోక ముందే మృత్యువాతవడటం తెలుగుసాహితి దురదృష్టం. అలా జరక్కపోతే మరెన్నో బంగరుపంటలు పండించి యుగకర్త కాగలిగేవాడు!

## 5. విశిష్టకావ్యం విష్ణు ధనువు :

ఆంధ్రపత్రిక సౌమ్య సంవత్సరాది సంచిక (1969) వారు ఆధునిక వచన కవితకు ముప్పయ్యేళ్ళు నిండిన సందర్భంగా ప్రముఖకవులు సర్వశ్రీ కుందుర్తి ఆంజనేయులు కె.వి. రమణారెడ్డి గార్లచే వ్యాసాలు రాయించి ప్రచురించారు. తొలివ్యాసంలో శ్రీ కుందుర్తి ఇలా అంటున్నాడు. "ఈ వచనగేయ రూపంలో పూర్వ కావ్యభాష ఎమాత్రం ఇమడలేకపోయింది. వ్యవహారభాషలో పద్యం ఎంత అసందర్భంగా ఉంటుందో, వచనగేయంలో కావ్యభాష అంతవికారంగా ఉంటుంది. కాగా ఆధునిక కవులు తమకు తెలియకుండానే కవిత్వంలో వ్యావహారికభాషవైపు, సారళ్యంవైపు, ప్రయాణం సాగించారు. మాత్రచ్ఛందస్సువల్లా కావ్యభాషా గుణంవల్లా వచ్చిన ఊపు, విసురు, నుడికారపు సొంపునూ తేవాలనే ప్రయత్నం వచనగేయంగా రూపొందింది. ఇదొక చారిత్రక పరిణామం (పుట. 152)

కుందుర్తి నిరూపించిన ఈ కారణంవల్లనే భావకవులు వచన రచన నచ్చేసరికి ఎంత పెద్ద వ్యావహారికవాదులైనప్పటికీ పద్యరచనలో గ్రాంథికభాషా శృంఖలాలను త్రెంచుకోలేక పోయారు

అత్యంత ఆధునిక వచన కవితారీతికి శిష్ట్లాయే ఆద్యుడన్న సంగతి నిర్ద్వంద్వంగా తెలిపోతోంది. అతని తర్వాతనే శ్రీశ్రీ, నారాయణబాబు, పురిపండా ప్రభృతులు వచనగేయ రీతిని అవలంభించారు. స్వరూపం వరకూ అదే చారిత్రక సత్యం. శివశంకరశాస్త్రి పేర్కొన్న కవులలో కొడాలి ఆంజనేయులు కూడా ఒకరని తెలుస్తోంది. కాని వారి ఆధునిక కవితలేమిటో ఎవరికీ తెలయడంలేదు. పూడిపెద్ది వంశీకులు ముగ్గురు ఆధునిక కవితా చార్యులు కావడం విచిత్ర సన్నివేశమే! శ్రీశ్రీ, నారాయణబాబుల తండ్రులిర్వురూ పూడిపెద్దివారి బిడ్డలే. శ్రీరంగం వారికి దత్తులయ్యారు. "పూడిపెద్ది వెంకటరమణయ్య ఇంటర్ రైమింగ్ (అంతర్లయ) కోసం యత్నించినట్లు కనపడుతుంది. శ్రీశ్రీ, నారాయణబాబూ పాటర్న్ వెర్స్ పద్ధతిని వెళ్ళారు. కొంతమంది వెర్స్ లిబర్ వ్రాశారు. ఎలాగయినా వీటిలో ఎక్కువభాగం ఫార్మల్‌గా వుంటుంది. ఈ కవులకు సంగీతంలో అట్లే ప్రవేశంవున్నట్లు తోచదు. కొంత ఇయర్ ఫర్ మెలోడీ వుండటంచేత అల్లిక బాగానేసాగింది. ఉమా మన సంగీతమూ, తెల్లవారి సంగీతమూ తెలిసినవాడు కావడంచేత కొంత విపరీతమార్గంలో విహరించినాడు. రచనలో ఫార్మల్ బ్యూటీ యితనికి ఇష్టంకాదు - " అంటూ శివశంకరులే వివరించారు.

విష్ణుధనువు ప్రేమ ఇతివృత్తంగాగల కావ్యమే. ఐతే ఇది భావకవుల ప్రేమవంటిదికాదు. ఇందులో విప్రలంభంలో ఇకసమిష్టి ఆర్తివ్యక్తమవుతుంది. సెల్ఫ్ పిటి కనిపించదు. ఈ కావ్యంలో వైదేహి, జనకుడు, లక్ష్మణుడు శివధనుసువంటి పురాణస్ఫురణకు సంబంధించిన పదాలున్నాయి. కాని వాటికి రామాయణ గాథాసంయోజనా, స్మృతీ కనిపించవు.

"విష్ణుధనువు ప్రథమంలో పచ్చివెలక్కాయ గొంతునపడ్డట్టు వుంటుంది. ఓపికపట్టి చదివితే కావ్యహృదయం కనుక్కోవచ్చు." అని శివశంకరులు ఏభయిరెండేళ్ళ క్రితం అన్న మాటలు ఇప్పటికీ నిజమే! శిష్ట్లా కవిత్వమంతా ఆధునిక కవితా పాఠకులకు అందరానిమ్రాని పండుగానే మిగిలిపోయింది. అసూర్యంపశ్యగా అతనికావ్యాలు అదృశ్యమయ్యాయి. అతనిపేరు తప్ప కవిత్వమంతా అచుంబితమైపోయింది. కావ్య పరిచయం గాఢమయ్యేకొద్దీ కవిత్వ అంతస్సారం కరతలామలకమవుతుంది.

ఈ కావ్యానికి సమీక్ష విశ్వనాథవారు రచించగా గ్రంథాంతంలో ప్రచురితమైంది. ఏడుపుటల (1/4 క్రౌను సైజు) సుదీర్గ సమీక్షలో వారెన్నో మౌలిక విషయాలు చర్చించారు. "ఈ కవి భావనాపటిమ మిక్కిలి గొప్పది. కవికి ముఖ్యముగా ఉండవలసిన పరిశీలనాశక్తి ఈయన వద్దనున్నది. అనేక స్థలములందితను దివ్యమైన కవి!" ఇత్యాది ప్రశంసలెన్నో కనిపిస్తాయి.

శిష్ట్లా విష్ణుధనువు కావ్యం వ్యంగ్యాత్మకంగా సాగింది. "నిబిడాంధకారాంధ్ర దేశాకాశాన వజ్రాయుధమువలె ఏనాడుకన్పడెదవో?" అంటూ కావ్యనాయికను ఆహ్వానిస్తాడు. ఈ కవి దర్శనంలో ఆమె - "రక్తారుణ ప్రభావ సమరకల్లోలములో ప్రజలప్రఫుల్ల సౌందర్య జీవితానందమే!" ఈ కావ్యగతసత్యాన్ని స్థాపించడానికి ఎన్నో ఉపపత్తులు కల్పించుకున్నాడు. కవిత్వ సత్యమెక్కడా వాచ్యం చేయబడలేదు. వక్రోక్తి మయంగానే - దేశస్వాతంత్ర్య సుందర వ్యవస్థను అభిలషిస్తాడు. కనకనే విష్ణుధనువు ఇన్ని దశాబ్దాల తర్వాత యిప్పుడుకూడా నవనవంగానే భాసిస్తోంది.

వస్త్వైక్యంగల సంపూర్ణకావ్యం విష్ణుధనువు. కానీ విరామాలతో భిన్న ఖండకావ్యాలవలె స్థూలదృష్టికి కనిపిస్తోంది. విభిన్న గతులలో సర్వత్రా అంతర్లయనుపోకార్చని వచనగ్రంథి రచన ద్యోతకమవుతుంది. ప్రాచ్య, పాశ్చాత్యసంగీత సంప్రదాయాలెరిగిన శిష్ట్లా ఈ కావ్యాన్ని అద్భుతావహంగా చదివేవాడని విశ్వనాథవారు తెలిపారు. జలసూత్రం రుక్మిణీనాథకూడా శిష్ట్లా గానమాధుర్యం గురించి ఎన్నో మార్లు చెప్పగా విన్నాను. "ఇందులో కొన్ని ఆయన చదువుతూంటే మరీబాగా ఉంటవి. ఎందుచేతనంటే ఒకజానపదగీతం యొక్క ఫణితిలో చదువుతాడు. ఊపుగా చదువుతాడు." అని విశ్వనాథవారున్నూ తెలిపారు. ఆయన సమీక్ష కూడా 1938 జనవరి నెలలో పూర్తిచేసినట్లు తెల్లమవుతుంది. గ్రంథాంతంలో శిష్ట్లా - విశ్వనాథచేసిన కొన్ని అభియోగాలను క్లుప్తంగా జవాబుచెప్పాడు. భాషా సాంకర్య సమస్యలనెత్తుకొని - 'నిజానికి యివన్ని ఫిలోలజీకి అలంకారశాస్త్రానికి సంబంధించిన విషయాలు. ప్రత్యేకంగా పరిశీలించాలి. తత్త్వశాస్త్ర విషయాలు అంతే! అంటూత్రోసిపుచ్చాడు.

సర్వాత్మనా ఈకావ్యం ప్రతీకాత్మకంగా సాగింది. సమకాలీన పాశ్చాత్య కవితాధోరణులనూ, రీతులనూ, ఆకళింపుచేసుకున్నది. పాశ్చాత్య సాహితీ పరిచయం బలంగా ఉన్న శివశంకరుల వారికే కొంత అవగతమైంది. కాని విశ్వనాథకు మాత్రం సమగ్రావగాహన లభించలేదు. ఎడనెడ కొక్కిరింపులు వెక్కిరింపులూ సాగకపోలేదు. అంతమాత్రంలో వారి సహృదయతకు లోపం జరిగినట్లు శంకించనక్కరలేదు.

## 6. కావ్యనేపథ్యం :

1930 తొలిరోజులనుంచీ భారతరాజకీయ చరిత్ర ఒక కొత్త మలుపు తిరిగింది. తనప్రభావాన్ని సాంస్కృతిక శాఖలన్నింటా ప్రసరించింది. తెలుగులో భావకవిత్వానికీ అందలి ప్రధానధాతువైన వ్యక్తి స్వేచ్ఛానిరతికీ ఒకదశాంతం ఏర్పడింది. శిష్ట్లా, శ్రీశ్రీ, నారాయణబాబు ప్రభృతులు ఆత్మాశ్రయధోరణికి స్వస్తిపలికారు. ఆధునిక సామాజిక వాస్తవికతాప్రాతినిధ్యం నెలకొల్పుతున్నారు. వ్యష్టినుంచి సమిష్టికి కవిత్వంలో చైతన్యయుత పరివర్తనం జరుగుతోంది. రీతిగతమైన ఆధునికధోరణికి శిష్ట్లాయే ఆద్యుడనీ, అతని "మారోమారో" అనేగేయం తనమరోప్రపంచం అనే పల్లవికి ఉత్ప్రేకం కలిగించిందనీ స్వయంగా తెలిపాడు శ్రీశ్రీ!

శిష్ట్లా కావ్యనిర్మాణవైఖరి ఒక సంధియుగాన్ని అభివ్యక్తంచేస్తుంది. కావ్యనిర్మాణంలో ప్రాచీనతను పూర్తిగా తొలిగించుకోలేదు. వాక్యనిర్మాణంలో సంప్రదాయబంధాలతో పెనుగులాట కనిపిస్తుంది. కవితాభివ్యక్తిలో గుడిసుళ్ళు తిరగడమూ కనిపిస్తుంది. ఐనా అతని కవిత్వంతోనే ఆధునిక హేతువాద దృష్టికి అంకురార్పణ జరిగింది. వేయ్యేళ్ళుగా కొలవబడుతున్న విగ్రహాలు ప్రప్రథమంగా విచ్ఛేదించబడ్డాయి. కాని ఆధునిక బూర్జువా యుగవిలక్షణమైన పీడితవర్గ దోపిడీని శిష్ట్లా నిరసించలేదు. వేయ్యేళ్ళ తెలుగు కవిత్వచరిత్రలో ఆధునికరీతికీ, కార్మికవర్గ ప్రాతినిధ్యానికీ సంపూర్ణ సుష్టురూపం శ్రీశ్రీ కవిత్వంతోనే దర్శనమిస్తుంది.

శ్రీశ్రీ పుట్టిన రెండేళ్ళు తర్వాత శిష్ట్లా 1912లో, గుంటూరుజిల్లా మంచాళ అగ్రహారంలో- "ఉత్తమవైదిక కుటుంబం'లో జన్మించినట్లు శివశంకరులసాక్ష్యం. మహేశ్వర్, వినాయక పండితుడు, విజయమహేశ్వరం మొదలైన ఎన్నో పేర్లతో ఎన్నోరచనలు ప్రచురించాడు. (ఈపేర్లను వెక్కిరిస్తూ శ్రీశ్రీ అన్నమాటలు ఇంతకుముందే ఉల్లేఖించాను) కీ॥ శే॥ పిల్లలమర్రి హనుమంతరావు నవ్యాంధ్ర సాహిత్యవీధులలో (పుట 734) శిష్ట్లానే విపులంగా పరిచయంచేశారు. "ఈతని జీవితం చిత్రమైనది. విశృంఖల విహారం, ఎక్కడానిలకడ అంటూ లేకపోవడం, కారణాలుగా యువకులలో ఎవరికీ లేనన్ని స్వేచ్ఛాజీవితానుభవాలు ఇతనికి లభించాయి. ఈతని ప్రతిభ అద్వితీయమైనది. హాస్యప్రియుడు, మంచిమాటకారి, కళాశాలల్లో పనిచేసి విద్యార్థులతోనూ, బొంబాయి ఫరమ్స్‌లో పనిచేసి కార్మికులతోనూ, మిలటరీలో పనిచేసి సిపాయిలతోనూ - ఇంకా ఇతరులతోనూ ఈతడు సంపాదించిన అనుభవం విచిత్రమైనది. అతని రచనలలో అది సర్వత్రాకనిపిస్తూనే ఉంటుంది. నూతన ఛందస్సులతో, కొత్తభాషతో ఇతడు సులభంగా అందరికీ అంతుపట్టని కవిత్వం చెప్పినాడు. ఆంగ్లంలో ఎం.ఏ., అయి, ఆంగ్ల కవితా రీతులన్నిటినీ పరిశీలించి జీర్ణించుకున్నాడు. 1931 నుంచే అతడాధోరణులలో రచనసాగిస్తున్నట్లు తెలుస్తుంది. 1938వరకు అజ్ఞాతంగానే ఉన్నాడనవలె. ఇతనికి తగినప్రసిద్ధి రాకపోవడానికి తాను అందుకు ప్రయత్నించక పోవడం కారణమనవలె!" అంటూ శిష్ట్లా కవిత్వ జీవితవిశేషాలు పిల్లలమర్రివారు విశదీకరించారు.

శిష్ట్లా రచించిన నవమి చిలుక ప్రకీర్ణ కావ్యమే! దానిమున్నుడిలో అతను విశ్వసించిన నూత్న కవితా సిద్ధాంతాలను ఇలా విరరించాడు. "అతనికి సాక్షాత్కరించిన కవితా స్వరూపమే నవమి చిలుక. అదే కులుకుతూ పలుకుతుంది. పలుకులో నవ్యకవిత్వం రాలుస్తుంది. నవ్య కవిత్వం అంటే నూతనత్వంలో బహునూతన కవిత్వం. ఇది పూర్వకవిత్వంకాదు. ఇంత వరకు ఏది నవ్యకవిత్వమని పిలవబడుతున్నదో అదిన్నీకాదు. భావకవిత్వమసలేకాదు." ఇన్ని మాటలలో వివరించడానికి ప్రయత్నించిన శిష్ట్లా ఎందువల్లనో ఆధునిక పదాన్ని మాత్రం సాధించలేకపోయాడు.

కవి మరొక విచిత్ర ఉద్ఘాటన కూడా చేశాడు. "ప్రహ్లాద కవిత్వంలో సావిత్రి సత్యవంత జీవితమున్నది'' అని. విగతప్రాణుడైన భర్తను బ్రతికించుకుందుకు మృత్యువుతో పోరాడిన విజేతననిపించుకున్నది. జడమయ భౌతిక జీవితాన్ని జాగృత మొనర్చు ఆత్మచైతన్యానికి సావిత్రి ప్రతీక! సత్యవంతుడు భర్తగా తాను సాధించినది ఏమీలేకపోయినా భార్యసిద్ధివల్ల పునరుజ్జీవితుడయ్యాడు. ఈ సత్యవంత శబ్దంద్వారా బాహ్య వాస్తవికతను స్ఫురింపచేస్తాడు కవి. సావిత్రి సత్యవంతుడును వ్యక్తికి సమాజానికి ప్రతీకలుగా భాసింపచేశాడు. సవితృ సంబంధి

సావిత్రి' కనక సముజ్జ్వల ప్రాణశక్తికి ప్రతీక కావించబడింది. బాహ్య వాస్తవికతా, అంతశ్చైతన్యమూ అవినాభావ దాంపత్యంగా తాను ప్రారంభించే ప్రాహ్లాద కవిత్వానికి రూపురేఖలను ప్రసాదించాలని కవి ఉద్దేశిస్తున్నాడు.

"ప్రాహ్లాద కవిత్వంలోని గాయత్రి అందరికీ తల్లి" అనే కవివాక్కులో శరీరమును రక్షించేది గాయత్రి కనక సహజంగా అందరికీ మాతృత్వశక్తిగా పరిగణింపబడుతుంది. అదే ప్రాహ్లాద కవితాశక్తిగా రూపాంతరం పొందాలని కవి సంకల్పం. అలాంటి ప్రాహ్లాద కవితా బ్రహ్మయే నవమి చిలుకగా కవి దర్శనం. అది అమూల్యమైనదే కాదు మూలద్రవ్యం వంటిది కూడా నంటారు.

శిష్ట్లా ఆంధ్రకవితా సంప్రదాయాలను ఆకళించుకొన్నాడు. వైదేశిక కవితా సంప్రదాయాలనూ అర్థంచేసుకున్నాడు. దేశీరీతులను వంటపట్టించుకున్నాడు. ఇంత నేపథ్యంలో అతి నవ్య కవితా స్వరూపాన్ని భావనచేశాడు. దాని అంతస్తత్వాన్ని నవమి చిలుక మున్నుడిలో అభివ్యక్తంచేశాడు. కనక శిష్ట్లా ప్రారంభించిన నవ్యరకవితకు అదే ప్రారంభంకావలసి వచ్చింది. ఈ కవితా నిర్వచన ప్రసక్తి విష్ణుధనువులో లేదు కనక నవమి చిలుకే తొలికావ్యంగా మనం వక్కాణించుకోవచ్చు. నవమిచిలుక తోనే శిష్ట్లా సశక్త కుంజరంగా ముందుకువచ్చాడు. అతని కవితారీతి అననుకరణ సాధ్యం అతని వ్యంజనా వైఖరి, సంవిధానచాతురి అపూర్వ సహజకాంతులందుకున్నాయి.

### 7. కావ్యనిర్మాణ దక్షత :

విష్ణుధనువును ప్రచురిస్తూ - గ్రంథకర్తనామం - ఉమా విజయమహేశ్వరం గా పేర్కొనబడింది. ఈ కావ్యం సార్వత్రికంగా ముక్తచ్ఛందంలోనే ప్రయుక్తమైంది. ఫ్రీవెర్సు సంవిధానంలో వెలువడిన ప్రప్రథమ సంపూర్ణకావ్యం యిదే. నాల్గవ పుటలో ఒకే ఒక వాక్యం ఐదుపాదాలుగా ముద్రించబడింది. మిగిలిన కాగితమంతా ఖాళీ.

"జన్మనక్షత్రమే
అహంకారమనే
విష్ణుధనువే
వెన్నెముక నంటియే
ఉంటుంది...."

ఈ వాక్యం ద్వారా కావ్యనామాన్ని కావ్యోద్దేశాన్ని సూచించాడు. తాను జన్మించిననాటి నక్షత్రం అహంకారం. అది విష్ణుధనువు వంటిది. జీవితాంతమూ అది తన వెన్నెముకను అంటి పెట్టుకునే ఉంటుంది. విచిత్రమైన అభిజన్యంతో ఈ కావ్యం అవతరించింది. కావ్యమంతా విశిష్టాభివ్యక్తులకు ఆలవాలమైంది.

ఏమైనా ఈ కావ్యం గురించి సమగ్రచర్చచేయడం ఇప్పటి విషయ పరిధికి అతీతం. సమకాలీన భావాలకు ఎన్నో ప్రతిమలను నెలకొల్పుతూ, ఎన్నో ప్రమిదలు వెలిగిస్తూ - ఈ కావ్యం ఒక మహా ప్రవాహంగా సాగిపోతుంది. శ్రీశ్రీ, నారాయణబాబు, పురిపండాత్రయంకన్న శిష్ట్లా కావ్యాలు ముందుగా వచ్చినవేగాని, యీకావ్యాల ప్రభావం క్వాచిత్కంగాగాని,

సార్వత్రికంగాగాని వారిపై కనిపించదు. 1938లోనే వెలువడిన పఠాభి ఫిడేలు రాగాల డజన్‌పై కొంత శిష్టా ప్రభావం కనిపిస్తుంది. ముఖ్యంగా వచన వాక్యాన్ని వికృతీకరిస్తే కవితా వాక్యం అవుతుందనే భ్రమ ఇరువురిలోనూ కనిపిస్తుంది. కాని పఠాభి తన పద్యాలను దుడ్డుకర్రలుగానే భావించాడు. తప్ప చెరుకుగడలుగా భావించనూ లేకపోయాడు తన కవిత్వాన్ని మధురీకరించనూ లేకపోయాడు.

నాల్గవదశకంలో వచన కవితా స్వరూపం విచిత్రగతులుపోయింది మణిప్రవాళశైలి ఫ్యాషనైంది. పదాల అర్థాలతో నిమిత్తంలేని ఆవేశ స్ఫూర్తికోసం చేసిన ప్రయోగాలూ కనిపిస్తాయి. 'ఆరోజుల్లో మా యువకవుల మీద ఒకరి ప్రభావం ఒకరిమీద పడుతూ ఉండేది గ్రంథచౌర్యం ఒకటే క్షమించరాని నేరం కాని కావ్యానుసరణ గర్హ్యంకాదు. (శ్రీశ్రీ అనంతం 65వ పుట) అన్నది అక్షరాలా నిజమే. ఆ దశావిశేషమేవిటో గాని చిత్రవిచిత్రగతులు కవితలు ఒకరిని చూసి మరొకరు. అనుసరించి పేరడీలు దింపి చిత్ర కవితలల్లారు. అన్నిటికీ ప్రాణధాతువు వచన కవితా సంవిధానమే!

అనంతంలోనే (141 పు.) ఈడెత్ సిట్‌వెల్ రచనల్ని కవిత్వంలో క్యూబిజం అంటారు.

"సెడ్ఇల్ మాగ్నిఫికో ఎ
విల్ ఎ స్టాక్కాటో
అండ్ ఎ గంజాటో
ఫిస్ - పిస్ కొత్రే సెయస్
రౌండు ఆర్క్‌దయస్
లేసియస్ పార్రేసియస్
ఫ్రూట్ ఈజ్ ఎ లై!

ఇది నేను చదివి ఉండకపోతే

తురాయి కంటే
కురాయి కంటే
చురాయి కంటె - హిమాం
శురాయి గొప్పవాడు!"

అని రాసి ఉండకపోదును." అన్నాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ మహా ప్రస్థానంలో శుద్ధమైన వచన కవితలనదగినవి ఒక్కటి రెండుకన్న ఎక్కువలేవు. కాని మహాసంకల్పంలో ఈ సంవిధానం మెండుగా కనిపిస్తుంది.

శ్రీశ్రీ, నారాయణబాబు లిరువురూ పేటరస్‌వెర్సు రాశారని ఒకే తక్కెడలో తూచి శివశంకరులన్నారేగాని - శ్రీశ్రీ మాత్రాబద్ధ రచనలు అధికాధికంగాచేస్తే - నారాయణబాబు ముక్తచ్ఛంద కవితలు అధికతరంగా సృజించాడు. ఇరువురూ భిన్నమూర్తులతో వ్యక్తిత్వాలు నిలుపుకున్నారు.

"మేడమీద నేను, మేడకింద, పాకలో నీవు, చైతన్య స్రవంతిలోన, మేడమీద / మేడకింద, నీతోనేను' అంటూ గేదెపెయ్యను గురించి చెప్పిన కవిత ప్రసిద్ధమే. రుధిర జ్యోతిలో ఎన్నో

కవితలు వచన పద్యాలే, ముఖ్యంగా మౌనశంఖం ముక్తచ్ఛందకవితేగాక సంవిధానంలో అపూర్వమైనదీ, సత్రియ లిజంకు తిరుగులేని ఉదాహరణ ప్రాయమైనదీను. దీని ఆంతరిక రహస్యాలను బహిరంగంగా వ్యాఖానించుకోగల ధైర్యం - ఇంత బూతు సాహిత్యం వార పత్రికలనిండా పేట్రేగుతున్నా - మనకు కలగడంలేదు.

వచన కవితకు ఎంతో పూర్వంనుంచీ మూలాలున్నాయని నిరూపించబోయి కొందరు సింహగిరి వచనాలవంటి వాటిని సోదిలోకి తెస్తూ ఉంటారు. ఇది ఎంతమాత్రం పొసగని సూత్రీకరణ. ఆధునిక వచన కవిత ఆధునిక చైతన్యం నుంచి తప్ప ఉద్భవించనంత పెంకిది. కావాలిస్తే మచ్చుకి సింహగిరి వచనాలతో తులనాత్మక పరీక్షచేయవచ్చు.

*సింహగిరి వచనములు : నం. 10*

"దేవా శమ దమాది గుణంబులు కలిగిన బ్రాహ్మణుడుత్తముండు. శమదమాది గుణంబులు గలిగిన క్షత్రియుండుత్తముండు. శమదమాది గుణంబులు గలిగిన శూద్రుండుత్తముండు. అతండేముఖ్యుండు. ఎట్టి పురాణవాచనలు (వాదనలు) విన్ననేమి... మొ॥ (పు.9)

## 8. వచన కవితా పరంపరాభివృద్ధి :

ఈ సందర్భంలోనే ముప్పయ్యేళ్ళ క్రితం శ్రీ కుందుర్తి తనవ్యాసాన్ని ముగిస్తూ చేసిన ఉద్ఘాటనను ఉల్లేఖించుకోవలసిన అవసరముంది. "వర్తమాన సాహిత్యం అప్పుడప్పుడు ఎన్నివక్రమార్గాలలో పయనించినా, ప్రయోగవాద ధోణిలోపడి ఎన్ని అపశ్రుతులు పలికినా, మొత్తం మీద ఈ ముప్పయి సంవత్సరాల కాలంలో కవితా వికాసం అభ్యుదయ కవితాయుగం, వచనకవితా వికాసం అనే రెండు దశల్లో జరిగిందని చెప్పవచ్చు." (సౌమ్య సంవత్సరాది సంచిక) అన్న సూత్రీకరణతో స్థూలంగా ఏకీభవించని వారుండరు. ఐతే 1943లో అభ్యుదయ సాహిత్య ఉద్యమం ప్రాదుర్భవించే నాటికి 1930 దశకంలోని శ్రీశ్రీ, నారాయణబాబు వంటి ముగ్గురు నలుగురు కవులు మాత్రమే మార్గదర్శకులుగా నిలిచారు. మిగిటిన అసంఖ్యాకులు జారుడు నేలపై అడుగులు వేస్తూ నడిచినవారే!

"గుండెల్లేని శవానికి గాయాలబాధలేనట్లు
గుడ్డివాడు మాత్రమే జాస్తీగా చూస్తాడు..."

అని శ్రీశ్రీ చెప్పిన వైఖరిలో కొందరు పండితమ్మన్యుల విమర్శలు ఆకుకు అందక పోకకు పొందక విపరీత పథాలు పట్టిపోతున్నాయి.

ఆంగ్ల భాషా సాహిత్యాల ప్రభావంతో 19వ శతాబ్దం నడిమికాలంనుంచి భారతీయ, సాహిత్యంలో గతానుగతిక జడత్వం తొలగిపోయింది. కొత్త చిగుళ్ళు పొటమరించనారంభించాయి. తెలుగు సాహిత్యంలో సైతం ఆ ప్రభావం అతివేలంగానే ప్రసరించింది. ఇరవయ్యో శతాబ్దంలో మూడు దశాబ్దాలు గడిచిపోబోతున్న సమయంలో అవతరించిన వచన కవితపై ఆంగ్ల సాహిత్య ప్రభావం ఈ యీ తావులలో ఉన్నదని చెప్పుకోవడం వ్యర్థప్రయత్నమే. సార్వత్రికంగా ఆంగ్ల

భాషద్వారా అందుతున్న ప్రపంచ కవిత్వ ప్రభావం ఆధునిక తెలుగు కవిత్వంపై అపారంగా ఉంది. కనక ఆంగ్ల సాహిత్య ప్రభావం ఎక్కడుందో నిరూపించ చూడటం మేనమామ అమ్మ తమ్ముడు కాడా అనే పరిశోధన లాగుంటుంది!

1969తో గడచిన ముప్ఫయ్యేళ్ళలో వచన కవితలో పొడసూపిన అభివృద్ధి గురించి పైన పేర్కొన్న వ్యాసంలో కుందుర్తి పరామర్శించాడు. తదుపరి ముప్పయ్యేళ్ళలో వచనకవిత తామరతంపరలుగా పరంపరాభివృద్ధి సాధించింది. గత ముప్పయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో వచన కవితా ప్రక్రియలో వెలుబడిన కవితా సంపుటాలు దాదాపు సహస్రాధికమయ్యాయి. పట్టిక రూపొందించాలేగాని, ఈ వేయి సంఖ్యను మాటవరసకుగాని, బడాయి చెప్పుకుందుకుగాని నేనడంలేదు. విద్యాధికుడవుతున్న ఆరంభయౌవనుడు తెలుగు కవిత్వానికి ఆకర్షితుడైతే తన ధ్యానాన్ని వచన కవితా సృజనకే అంకితం చేసుకుంటున్నాడు. మాతరం చిన్నతనంలో కవిత్వానికి ఆకర్షితులైన ఆరంభయౌవనులను పద్యమూ, భావకవిత్వమూ ఆకట్టుకొనేవి. దానికి బదులుగా వర్తమాన స్థితిలో అభ్యుదయ భావధారకూ వచన కవితా రీతికి యౌవనహృదయాలు ఆకృష్టమవుతున్నాయి. గత ముప్ఫయ్యేళ్ళలో పెంపొందిన కవులెందరున్నారో, వారు రచించిన కావ్యాలెన్ని ఉన్నాయో ఇంతవరకూ ఎవరూ లెక్కలు తేల్చలేదు. నిజానికి గుణగణాల నిభాయింపుతో పాటు సంఖ్యాబల నిర్ణయమూ అత్యవసరమే! ఇంత బహుముఖీన ప్రజ్ఞాపారంగతతతో అభివృద్ధి పొందుతున్న వచన కవితా ప్రక్రియ ఈ యుగవాణిగా సమకాలిక చైతన్యాన్ని ప్రతిబింబిస్తోందంటే కాదనేవారుండరు.

కనకనే ఆరంభం దగ్గరకే మళ్ళీ వచ్చి ఒకవృత్తాంతాన్ని పరిసమాప్తి చేయదలిస్తే అదే ఉద్ఘాటన మళ్ళీ చేయవలసివస్తుంది. ఆవిర్భావం పూర్వరంగంగా విపులీకరింపబడితే - వచన కవితా వికాసం ఉత్తర రంగంగా సూచించవలసి వస్తుంది.

ఆధునిక కవిత్వానికి వచన కవితారీతి మాత్రమే ప్రధాన స్వరూపవాహికగా స్థిరపడింది. వర్తమాన జనజీవన గాథాలహరిని వచన కవితా ప్రక్రియమాత్రమే ప్రతిబింబిస్తూ అదే ప్రధాన కవితా ప్రతినిధిగా నిలచింది. వచన కవిత ఒక్కటే అప్రతిహత శక్తితో జనతాహృదయ పరీరంభ సరస్వతిగా పురోగమిస్తోంది.

# యక్షగానాల్లో వచనం

– డా॥ ఎం. కులశేఖర రావు

తెలుగు సాహిత్యంలో నూత్న ప్రక్రియగా వెలిసి, మనకు రూపక రచనలెన్నో పొస్తు తెలగించిన కృతులు తెలుగు యక్షగానాలు. ఈ రచనలను యక్షగానప్రబంధాలని, యక్షగాన నాటకాలని కూడా వ్యవహరించడం ఉన్నది. తెలుగు ప్రబంధాల్లో ఉండె కొన్ని రీతులు వీటిలోను ఉండడం చేత, సంభాషణలు, పాత్రలద్వారా కథను నడిపించె పద్ధతి ఉండడంవలన యక్షగానాలకు ఈ రెండు పేర్లు కూడా నిరర్థకం కాలేదు. ఇవి జక్కుల పాటలనుండి వచ్చినవని కొందరు, కొరవంజ నుంచి ఏర్పడినాయని కొందరు భావించడం అందరికి తెలిసిందే. ఏది ఏమైనా యక్షగానాలు దేశీయమైన తెలుగు నాటకాలని చెప్పడంలో వివాదం లేదు.

యక్షగానాలు ప్రధానంగా గేయప్రధానాలు, సంగీత ప్రధానాలే. అయినా వీటిలో అక్కడక్కడ వచన రచన కనపిస్తూ ఉంటుంది. కథా గమనంలొ రచనాపద్ధతిలో ఈ వచనాలకు వైశిష్ట్యం ఉన్నది. ఇటువంటి వచనాలు ఈ యక్షగానాల్లో ప్రవేశించదానికి కారణాలు, వాటి ప్రయోజనాలు, తద్రచనా విశేషాలు పరిశీలించడమే ఈ వ్యాసానికి ప్రధాన ఉద్దేశ్యం.

అనంతర ప్రబంధయుగంలో వెలువడిన యక్షగానాలను, రచనా కాలాన్ని బట్టి రెండు విధాలుగా విభజించవలె. తంజావూరు నాయకరాజులకు పూర్వం వెలువడినవి మొదటి విభాగంలో చేరుతాయి. తంజావూరు నాయక రాజులకాలంలో రచితమైనవి రెండవ విభాగంలోనికి వస్తాయి. మొదటి విభాగంలో కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవ విజయమూ, పరమానంద తీర్థ విరచిత ముక్తికాంతా పరిణయము అనేవి చేరుతాయి ఈ రెండుకూడ దక్షిణాంధ్రయుగానికి ముందు వెలువడినట్టిదే. ఇంక, రెండవ విభాగంలో ప్రముఖములైన మన్నారుదాస విలాస నాటకము (రంగాజమ్మ) రాజరంజక విద్యావిలాస నాటకము (తుళజాజి శ్రీకృష్ణ విలాస నాటకము (విజయరాఘవనాయకుడు) అనే వాటిని గ్రహించినాను, విస్తృతంగా ఆనాడు వచ్చిన యక్షగానాలకు ఈ మూడు ప్రతినిధి ప్రాయంగా ఉన్నాయి. అందుచేత వీటిని పరిగణనలోనికి తీసికోవడం జరిగింది.

ఈ రెండు విభాగాల్లో మొదటి దశకు సంబంధించినవి, సుగ్రీవ విజయము, ముక్తికాంతా పరిణయము. మొదట ఈ రెండు యక్షగానాలను చూచి, తరువాత రెండవ దశలోని వాటిని పరిశీలింతము.

ఈ రెండు యక్షగానాల్లో, తెలుగు వచనం, ఇతర గేయ పద్యరీతులతో బాటు ఉపయోగింపబడినప్పటికి దాని పరిణామం స్వల్పంగా ఉన్నది. సుగ్రీవ విజయం మొత్తము 680 పంక్తుల రచన దానిలో 62 పంక్తుల వచనం మాత్రమే ఉన్నది. దీని బట్టి పదకొండు శాతము వచన మున్నదని చెప్పవలె. ఇంక, ముక్తికాంతా పరిణయంలో మొత్తం 800 పంక్తులున్నాయి. దానిలో వచనం 64 పంక్తుల్లో ఉన్నది. ఇది ఎనిమిది శాతం వస్తుంది. ఈ సంఖ్యావివరాలు, రచయితలకు వచన రచనా పరిమాణం మీద అంతటి శ్రద్ధ లేదనే విషయాన్నే స్పష్టం చేస్తుంది.

పరిమిత పరిమాణమైన నాటి వచన రచనలకు ఏమైనా ప్రయోజనం ఉన్నదా అనే విషయం చూతము. ఈ రెండు యక్షగానాలు ఏకాంకికా నాటకం, లేక ఏకాశ్వాస ప్రబంధంవంటివి. క్లుప్తంగా ఉండాలి. వాటిలో వచనాన్ని తద్రచయితలు కథోపక్రమణానికి ఉపయోగించుకున్నారు.

'అని కవీశ్వరుండు, కృతీశ్వరుండగు కందుకూరి జనార్ధన స్వామినేమని కొనియాడు చున్నాడు'

'అనియు మరియు నద్దేవతా సార్వభౌమునకు షష్ఠ్యంతంబులు చెప్పిన విధంబెటువలెను'

'అని యంకితంబుగా నా యొనర్పంబూనిన సుగ్రీవ విజయంబను యక్షగానంనకు కథాక్రమం బెటువలెను' సు.వి. పేజి - 1

'అనియిట్లు గురుదేవతా నమస్కార పూర్వకంబుగా మంగళా చరణంబులొనరించి. నారచియంపంబూనిన ముక్తి కాంతా పరిణయంబునకుఁ గధా సూత్రం బెటువలె నుండేను'

ఈ రెండు వచనాలు, రెండింటిలోనివి, స్వరూప స్వభావాల్లో ఏకీభావం కలిగి ఉన్నాయి. వీటి ప్రయోజనం కావ్యోపక్రమణమ్. ఈ ప్రయోజనాన్ని వారు. తమకు పూర్వులైన ప్రబంధ కర్తల నుంచి గ్రహించినట్లే కనిపిస్తుందికాని, కొత్తయేమిలేదు ఇది కావ్య పద్ధతేకాని, నాటక పద్ధతికాదు. వారుకూడా వచన రచనలో ప్రబంధ సంప్రదాయాన్ని పాటించినారంటే సరిపోతుంది.

వచనం వలన వీరు సాధించిన రెండవ ప్రయోజనం కథనం. యక్షగానాల్లో కథ సాంతంగా సంభాషణల్లోనే నడవదు. సూత్రధారుని వంటి నాటక ప్రయోక్త, కొన్ని కథాభాగాలను, ముఖ్యంగా రంగం మీద ప్రదర్శించడానికి సాధ్యంకాని వాటిని, స్వయంగా ప్రేక్షకులకు వివరిస్తూ ఉంటాడు. ఇది కథా కథనం చేసినట్లుగా ఉంటుంది. ఇటువంటి సందర్భాల్లో ఈ యక్షగానరచయితలు వచనాలను మాత్రమే గ్రహిస్తూ ఉంటారు. ఈ ఉదాహరణములు పరిశీలింపదగినవి.

'ఇవ్విధంబున దుందుభి కళేబరంబు దన బొటనవ్రేల బదియోజనంబుల బొడవుబడజిమ్మి నిలిచిన రామచంద్రునితో సుగ్రీవుడేమనుచున్నాడు' సు.వి. పుట. 7

'అంత నొక్కవిధంబున వాలిచేత విడిపించుకొని సుగ్రీవుండు ఋష్యమూక పర్వంతంబెంక్కి తన్నుంజేరవచ్చిన రామచంద్రుంజూచి తలవంచుకొని సుగ్రీవుండేమనుచున్నాడు.'సు.వి పుట. 8

'అనంతరంబు సకలాలంకార శోభితంబైన స్వయంవర స్థానంబునకు సమస్త దేశ మతాధిపతులు నానావిధ వస్త్ర భూషణాలంకృతులగుచు నేతెంచి తత్తదికార బేదంబులకు నవరత్నఖచిత సింహాసనంబులం గూర్చున్న సమయంబున నంతః పురంబునంగల యిచ్ఛాజ్ఞాన క్రియాది నామధేయంబులుంగల వధూజనంబులు ముక్తి కాంతాలలామకలంకారంబు సేసిరట యేలాగునను' ము. కా. ప. పుట 7

ఇటువంటివింకా ఈ రెండు యక్షగానాల్లో ఉన్నాయి. కథాకథనానికి వచనాన్ని ఉపయోగించడం దృశ్యకావ్యాలైన వీటిలో చాలా ప్రయోజనకారిగానే కనిపిస్తుంది. సదృశ్య కావ్యమైనా, దానిలో సమస్త కథాబాగాలను ప్రదర్శించడం సాధ్యంకాదుఁదా. ఆ అసాధ్య విషయాన్ని ఈ వచనాలు సులభంగా నెరవేరుస్తున్నాయి. చదివేవారికి, దృశ్యాన్ని తిలకించేవారికి సౌలభ్యం సమకూరుస్తూ ఉన్నాయి.

యక్షగానాల్లో రచయితలు అనేక గేయ పద్యరచనలను ఉపయోగిస్తూ ఉంటారు. సందర్భాన్ని బట్టి, ద్విపద, దరువు, అర్ధచంద్రిక వంటి గేయాలు, సీసము, గీతము కందము, అప్పుడప్పుడు చంపకమాలాది వృత్తాలు, పద్యాలు కనిపిస్తూ ఉంటాయి. ఇటువంటి ఛందోరీతుల్లో మార్పు కోరినప్పుడీకవులు, ఛందోరహితంగా ఉండే వచనాలను ప్రయోగిస్తారు. ఇవి గేయాలకు, పద్యాలకు, మధ్యన వచ్చి వైవిధ్యాన్ని సృష్టిస్తాయి. ఈ ఉదాహరణ చూడండి.

జంపె॥ 'తరణి కులమున బుట్టి శరచాపముల బట్టి
తరుణి గోల్పదు కంటె మరణమే మేలూ,
నను శౌర్యవంతుడని తన పుత్రినిడినట్టి
జనక విభుడీవార్త విని వగవ కున్నే!
ఒకటి నొచ్చెము లేక నున్న రని వంశమున
కక్కటా నీయింతికపకీర్తివచ్చె

వ. అని మరిన్నేమనుచున్నాడు.

అర్ధ చంద్రికలు :
కన్నుల నశ్రులు గ్రమ్మగ వగచున్
పటికి ప్రాణములిక నని దలచున్
క్రమ్మర సొమ్ములు రొమ్మున నొత్తున్
అవురా విధివశమని తల యూచున్
ఏ గతి నోరుతు నికనని పలుకున్
బాపురె విధియని ఫాలము ముట్టున్. సు.వి.పుట.4

ఈ రెండు గేయరచనల్లో గమనము, లయ మారినాయి. ఒకదానితో ఒకటి జోడించి వ్రాస్తే చదివేవానికి, వినే వానికి క్లేశకారిగా ఉంటుంది. గతిలో ఈ మార్పును క్లేశాన్ని 'అని మరిన్ని ఏమనుచున్నాడు' అనేచిన్న వచనం లంకెగా పరిణమించి, చాలవరకు సుగమంచేసింది.

ముక్తికాంతా పరిణయంలో నుండి ఈ ఉదాహరణ కూడా ఇటువంటిదే.

దరువు : సారెజన్మస్థితి సంహారకర్తా
భైరవ మూర్తి మాపాలింటి వేల్పు
విరివైన జగములు వేరువేరై
హరునితో వేరుగాదని చూతుమెపుడు.

వ. మరిన్నాకాపాలికుండేమనుచున్నాడు.

దరువు : పరగబ్రహ్మ కపాల పాత్రలోపలనిండ
సురనించి మాంసము చుట్లనమరించి
వనబలి యర్పించి వరభైరవేశ్వరుని
కరమర్థి పూజించి....' ము.కా.ప.పుట 14

ఈ భాగము భాషించిన వాడొక్కడే. రచనలు దరువు అనే గేయభేదమే. అయినా రెండు భాగాల్లో భావ వైవిధ్యమున్నది. మొదటిభాగంలో కాపాలిక మతసిద్ధాంతం చెప్పబడింది. రెండవ దానిలో తన్మతా చరణము సూచితమైంది. ఈ రెండు భాగాలకు 'మరిన్నా కాపాలికుం డేమనుచున్నాడు' అనే చిన్న వచనం లంకెగా ఉపయోగించి, భావసారళ్యం కలిగిస్తున్నది.

ఈ యక్షగానాల్లో ప్రథమ పురుషలో ఉండే భాషణానికి కవులు వచనాన్ని ఉపయోగించే పద్ధతి కనిపిస్తుంది. ఇది సార్వత్రికం కాకపోవచ్చు. అయినా, రచనకు ప్రయోజనవంతంగా ఉంటుంది.

'అంతనేను చింతాక్రాంతుండనై రాక్షసుని చేత మృతుండయ్యెనని నిశ్చయించి, యా గుహవాకిట నొక పాషాణంబు ద్రోసి యింద్రజునకు తిలోదకంబులిచ్చి కిష్కింధకు వచ్చునప్పు డెటువలెనుండెను' - సు.వి. పుట. 5

'ఇతడు కర్మకాండి రాజధర్మయుక్తుండు. సఖియ చాలుచాలు రమ్మని యిట్టు చెలికత్తెంగూర్చుకొని యవ్వలంజనుచు....' ము.కా.ప. పుట 17

ఈ ప్రత్యక్షభాషణములు, దృశ్య కావ్య సదృశములైన ఈ యక్షగానాల్లో ప్రాణప్రదంగా ఉంది - చదివేవారికి, వినేవారికి ఆహ్లాదాన్ని కలిగిస్తాయి.

యక్షగాన కర్తలు తమ రచనల్లో సాధ్యమైనంత వరకు వైవిధ్యాన్ని సాధించడానికి ప్రయత్నం చేసినట్లు కనిపిస్తుంది. అనేక గేయ రచనా భేదాలతోపాటు మధ్య మధ్య వచనాన్ని ప్రయోగించడం చూస్తే, ఈ వైవిధ్యం అనేలక్షణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. దేశీయమైన ఈ దృశ్య ప్రబంధాలు సాహిత్యకంగా ప్రమాణం కలిగి ఉండవలనని ఈ రచయితలవాంఛ. అందుచేతనే వీరు అర్థాలంకారాలను, శబ్దాలంకారాలను సందర్భోచితంగా చంపూ కావ్యకర్తల్లాగ ఉపయోగిస్తారు. అలంకార ప్రయోగానికి నామ వచనాన్ని అనర్హంగా భావించినట్లు కన్పించదు కాని, స్వల్పమైన వచనాలే ఇట్టివి కనిపిస్తాయి. ఈ ఉదాహరణాలు చూడండి.

'అప్పుడయ్యంగదుడు శోకంబునకు భరింపలేక, సుగ్రీవాది వానరంబులు మహా రోదనంబులు సేసిరక్కోలాహలంబు మందర మథితి మహాఘోషంబుననుకరించె' - సు.వి. పేజి. 4

'ఇట్లు పలికిన వేదాంత సిద్ధాంత పతినిగని ముక్తికాంత సంతోష కలితస్వాంతమై తనకుందగిన వరుండు గలిగెనని...' ము.కా.ప. పేజి 21'

ఇంక, రెండవ దశలో అనగా క్రీ.శ. 17, 18వ శతాబ్దుల్లో మనకు చాలా యక్షగానాలు వచ్చినాయి. ఇవి స్వరూప స్వభావాల్లో చక్కని పరిణతిని స్వతంత్ర ప్రవృత్తిని కలిగినట్టివి. వాటిలో ఇతర విశేషాలతో బాటు వచనాలు కూడ విరివిగా ఉపయోగింపబడినాయి. ఈ రెండు శతాబ్దాల్లో చాల యక్షగానాలు వచ్చినాయనే విషయం సాహిత్యకులకు తెలుసు. అన్నింటిని గ్రహించడం వాటలోని ఉదాహరణలు చూపించడం సాధ్యంకాదు కాబట్టి కొన్ని ముఖ్యమైనయక్షగానాలనే పరిశీలనలోనికి గ్రహిచండం సముచితంగా కనిపిస్తుంది. వాటిలో మన్నారు దాసవిలాస నాటకము (1633-73-రంగాజమ్మ), శ్రీకృష్ణవిలాసము - విజయరాఘవ నాయక విర్నచితము. (1635 - 73) రాజరంజక విద్యావిలాస నాటకము – తుళజాజి మహారాజు వ్రాసింది (1729-35) అనేవి ప్రతినిథిప్రాయంగా ఉన్నాయి. ఈ యక్షగానాల్లో మొదటి దశవారు ఉపయోగించిన వచనాలున్న సందర్భాలు, అంటే కథోపక్రమణము, కథనము, లంకెలు మొదలైన వాటి తిరిగి చెప్ప పనిలేదు. ఈ పరిణత యక్షగానాల్లో వచనాలతో వీరెట్టి ప్రయోజనాలను సాధించినారో దానివలన ఈ ప్రక్రియకు ఎటువంటి పరిణామం ఏర్పడిందో చూడవలె.

ఇదివరకు యక్షగానాల్లో లేనిది, ఈ యక్షగానాల్లో ఉన్నది కైవారము అనే ఒక ప్రక్రియ. ఇది ఈ మూడు యక్షగానాల్లోనూ ఉన్నది. ఇది కేవలం వచనంలో ఉండడం విశేషం. ఇది సంస్కృత రూపకాల్లోని నాందీ సదృశంగా ఉంటుంది. ప్రారంభంలోని ప్రార్థనాన్విత పద్యం తరువాత ఇది కనిపిస్తుంది.

కైవారము : 'శ్రీమదరుణారవిందేందిర హృదయారవింద కందళన్మకరంద సంతతాస్వాదన మిళింద బృందారక సందోహ వంద్యమాన సౌందర్య గాంభీర్యాది గుణబృంద నిష్ఠుర ముష్టి నిర్ఘాత నిర్ధూత దుష్టతర ముష్టిక చాణూర నృశంస కంసాసుర దురాసద శరాసక నిరాస కరాసి ధార మోఘీకృత మేఘవాహనవిగ్రహ అమోఘీకృత విజయ రాఘవానుగ్రహ రంజిత గుణాలవాల రాజగోపాల పరాకుస్వామి' మ.దా.వి. పేజి 2

ఈ యక్షగానాల్లోని ఈ కైవారాల్లో ప్రార్థన, నమస్సు, వస్తునిర్దేశం, సూచితమైనాయి. సమాసాఢ్యమై సమానాంతర వాక్యవిన్యాసం కలిగిన ఈ వచనం బిరుదు గద్య సంప్రదాయానికి చెందింది. రాజసభల్లో వందిమాగధులు బిరుదగద్యలు పఠించడం సంప్రదాయం. నాటక ప్రదర్శన కూడా సభయే కాబట్టి కైవారము అనే గద్యను యక్షగాన కవులు ప్రవేశపెట్టి ఆ ప్రయోజనాన్ని సాధించిరి. దృశ్యకావ్యాల్లో ఇది వీరు అందించిన నూతన ప్రయోగమే. రచనలో కైవారాలను ఉత్కలికాప్రాయమనే వచన విభాగం చేర్చవచ్చు.

తెలుగు ప్రబంధ కవులకు వలె. ఈ యక్షగాన కవులకు కూడ శబ్దాలంకారాలపై మక్కువ ఎక్కువగా కన్పిస్తుంది. అవకాశం ఉన్నా, లేకున్నా, సందర్భాలను కల్పించుకొనియైనా వీరు శబ్దాలంకార ప్రయోగం చేస్తారు. వచనల్లో శబ్దాలంకార ప్రయోగం వలన, రంగంమీద ప్రదర్శన జరుగుతున్నప్పుడు ప్రేక్షకుల్లో శ్రవ్య మాధుర్యం చేత ఉత్తేజం కలుగుతుందని వీరు భావించి ఉండవచ్చు. ఇవి పాండిత్యస్ఫోరకాలని కూడా అనుకొని ఉండవచ్చును.

'ఇవ్విధంబున నవ్విహంగ పుంగవతురం గుందు మెరుంగు బోడులు కురంగట గొలువ గొలువైయుండెనట' శ్రీ .కృ.వి. పేజి 4

'ఆ సమయంబున నాయంబుజాక్షుండు కంబుకంఠిని తాంబూల జాంబూన దాంబర కదంబు కంబుల బహూకరించు వేళ నాగోపాలుని పాలికి భోజరాజన్యకన్యకాజజనా వచ్చెనట' శ్రీ.కృ. వి. పేజి. 6.

ఇత్తెరంగున మాయాజీవుల వాగ్వాదంబుల విని సుందర వదనారవింద మందస్మితుం డగుచు నిందుకలాభరణండు జీవరాజునుజేచి' రా.ర.వి.వి. పేజి 33

ఇటువంటి వచనాలు, ఈ యక్షగానాల్లో ఇంకా ఉన్నాయి. మొదటి దశలో వచ్చిన యక్షగానాల్లో ఇటువంటి శబ్దాలంకార - ప్రయోగాలున్నా కాని ఈ దేశి రూపకాల్లో ఇటువంటి ప్రయోగాలు, యక్షగానంలో 1, 2, శతాబ్దుల్లో కలిగిన పరిణామదశనే వ్యక్తంచేస్తున్నాయి.

ఇంక, అర్థాలంకారాలవైనం చూస్తే, పద్యాల్లో కనిపించేవి మనకు వచనాల్లో కనిపించవు. బహుశా ఈ కవులు వచనాలకు అర్థాలంకారాలకు మంచి సంబంధం కుదురదు అని భావించి ఉండవచ్చు.

దృశ్యకావ్యంలోనైనా, పాత్రల్లో కలిగిన సంభాషణలు ఆ ప్రక్రియకు ప్రాణప్రదంగా ఉంటాయి. మొదటి దశలో వచ్చిన యక్షగానాల్లో ఈ శిల్పానికి అంతగా ప్రాచుర్యం రాలేదు. కాని, తరువాతి దశల్లో, కవులు సంభాషణలను ప్రవేశపెట్టి, వాటిని ప్రేక్షక రంజకాలు కావించినారు. మన పరిశీలనలోకి వచ్చిన అన్నియక్షగానాల్లో మంచి సంభాషణలు వచనాల్లో ఉన్నాయి. ఈ సందర్భంలో చూడవలసిందే. రాజరంజన విద్యావిలాస నాటకమునుండి

| | | |
|---|---|---|
| ద్వారపాలకుడు | : | ఎవరోయి నీవు? |
| మోహనయోగి | : | అరుణగిరి యోగి భక్తుడైన మోహన యోగినోయి |
| ద్వా | : | ఇచటికి ఏలవస్తివోయి? |
| మో | : | జీవ మహారాజు మహాకవి కనుక, యతని ముందర నేనేరి విద్యలు జూప వస్తినోయి. జీవ మహారాజుతో నేవచ్చినానని చెప్పవోయి. |
| ద్వా | : | మంచిది. ఇక్కడ ఉండవోయి |
| సూత్రధారుడు | . | ఇత్తెరంగున ద్వార పాలకుడు పోయి జీవరాజునుజూచి పలికే మార్గం |
| ద్వార | : | స్వామీ మనకోటవాకిటను మోహన యోగి యని యొకడు వచ్చియున్నాడు. సకల మంత్ర తంత్ర యంత్ర జ్యోతిశ్శాస్త్రాదులు తనకు వచ్చును. తాను చెప్పే ప్రశ్నలు తప్పవని ప్రతిజ్ఞ చేస్తున్నాడయ్యా. |
| చిత్రశర్మ | : | స్వామీ, మన యోచనకనురూపంగా మోహన యోగి వచ్చినాడని విన్నప్పుడే మన అదృష్టఫలం లెన్న ఉన్నాదయ్యా! |
| సూత్రధారుడు | : | ఇత్తెరంగున చిత్రశర్మమాట వెంబడినే అదృష్టుడు వచ్చే మార్గం. |

వచనాలు సంభాషణలో దృశ్యకావ్యాల్లో ఉండడం వాటి చైతన్యానికి మార్గం ఏర్పరుస్తాయి ముఖ్యంగా జనుల వ్యవహారంలో ఉండే వ్యావహారిక (నాటి) భాషలొని ఈ సంభాషణలు కావ్యానికి జీవం కలిగిస్తాయి. దరువు, పదము, ఇత్యాది గేయ భేదాల్లో ఉండే సంభాషణల కంటే, వచనాల్లోని సంభాషణలు సహజంగా ఉంటాయి కదా? పూర్వ దశలో లేని సంభాషణలు యక్షగాన పరిణామంలో ఒక మంచి దశ అని భావించ వలిసి ఉంటుంది.

తెలుగు సాహిత్య వికాసంలో ప్రబంధాల తరువాత యక్షగానాలు వెనకపడి ఉండడంచేత, ఆ శ్రవ్య కావ్యాల ప్రభావం వాటి మీద ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ప్రబంధాల్లో పద్యాల్లాగే వచనాలు కూడా ప్రౌఢ సమాసాన్వితంగా ఉండడం చూడవచ్చు. యక్షగాన కవులుకూడా అటువంటి వచనాలు కొన్నింటిని గూర్చి ప్రబంధ కవులలాగ తమ పాండిత్యాన్ని ప్రదర్శించుకొన్నారు.

'ఇవ్విధంబున బలికి యా కలికి ప్రళయ సమయ సముజ్జృంభమాణ మహాప్రకృతిరీతి భృకుటి ఘటించి చిటపటాయించి, కోపాటోపంబున మాటలేక వ్యధమాన మానసయై క్రోధాగారంబుజేరి తలపుదాచి, తలుపువైచి చెలువల రోసి, చలువలబాసి, చలపట్టినట్టులున్న సమయంబున నసమశర గురుండు సాత్రాజితీ సఖీ తన దండనుండ కున్నఁజేచి యాళికి

ఝులుకెత్తి మనసుకలంగి చరియించి వెలవెలనై కళకళపడి యామచ్చె కంటియున్నయచ్చోటికి మచ్చువలెవచ్చెనట. ' శ్రీ. వి. పేజి 10, 11

ఇటువంటి ఉత్కలికాప్రాయవచనాలు రంగంమీద ప్రదర్శించే కావ్యాల్లో ఉపయోగకరంగా ఉంటాయా లేదా అనేది వారి ఆలోచన కానట్టున్నది. తమకు పూర్వులైన ప్రబంధ కవుల వలె రచన చేయడమే వారి ఉద్దేశం కాబోలు!

ఈ యక్షగాన కర్తల్లో రంగరాజమ్మకు ప్రజల నిత్య వ్యవహారంలో ఆనాడు ఉండిన భాషను సంభాషణల్లో చేర్చి ఉపయోగించడం చాలా యిష్టం. బహుశా ఆనాటి సాంఘిక వాతావరణాన్ని చెప్పడానికే ఈమె ఇట్లా చేసినట్లనిపిస్తుంది. మన్నారు దాస విలాస నాటకంలో, సందర్భాలు కల్పించుకొని కటిక చేరువ కాంద్రు మాట్లాడిన మాటలు, పురోహితుల సంభాషణలు, గొల్లవారి భాషణలు, ఎరుకత మాటలు, ఆచార్యుల మాటలు మొదలైన చోటుల్లో ఇటువంటి వ్యావహారిక భాషను కూర్చింది. పురోహితులు పరస్పరం మాట్లాడుకొన్న ఈ సందర్భం గమనించ వలసిందే.

కొండుభట్ల మాట : అవునోయి యిల్లు సోమయాదులు నూరు తరాల నుంచి యీ యింటికి తగువైన పురోహితుండ నేనుండగా నీవెవ్వండి కొడకవు? నా స్వాతంత్రం కొంగుముడి తీసుక పోయేటట్టుగా

యిల్లు సోమయాదుల మాట : ఏమోయి కొండుభట్లు; మా తాతకు చవ్వప్పనాయిని వారు పాంకెన(?) సంభావన కట్టడ చేసి ఉండంగా, నీవెవ్వండవు అహంకరించుక పోయేటట్టుగా? మాయన్న కొడకవా?

కోభళభట్ల మాట : అవురా నరసంభటుగా సరిగంటి సహస్రనామ పూజకు సువర్ణ పుష్పాలు గలవే. అవల్లా అపహరించి బదులుగా మొలాము చేసినపూలు తెచ్చి చేస్తివే? ఇది నగరి వారువింటే అట్లాగే సేయించరా! ఇది యెంత లేదని కనిపించు కాక వుంటే నీ వాడనామరి?'

సంస్కృత నాటకాల్లో నీచ పాత్రల చేత వివిధ ప్రాకృత భేదాల్లో మాట్లాడించడము సంప్రదాయంగా ఉన్నది. తెలుగు రూపకాలవంటివైన యక్షగానాల్లో ఇటువంటి సంప్రదాయాన్ని పాటించడానికి కాబోలు, రంగాజమ్మ ఈ వాడుక భాషను సామాన్య పాత్రలతో మాటాడించింది. దీనివలన రెండు ప్రయోజనాలు నెరవేరతాయనుకొంటాను. ఒకటి : సంస్కృత రూపక సంప్రదాయాన్ని తెలుగులో కూడ పాటించడం. రెండు : ప్రేక్షకుల్లో అంతగా విద్యాబుద్ధులు లేని వారికి కొంత హాస్యాన్ని వినోదాన్ని అందించడం, తద్వారా నాటక ప్రదర్శనను ప్రేక్షకులకు ఆసక్తికరంగా చేయడం. ఈ ప్రయోజనాలను తెలుగు వచనం వలన సాధించడం విశేషము.

ఈ విధంగా, దీని రూపక కర్తలు, కొన్ని ముఖ్య ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని, తమ యక్షగానాల్లో వచనాన్ని ప్రయోగించినారని విశదం చేయడమే నేను ఇక్కడ ఉద్దేశించిన పని.



# తెరుక్కూత్తు-వీధి నాటకం- పుట్టుక, వికాసం

-డా॥ కె. ఆనందన్

తెరుక్కూత్తు- వీధినాటకాలకు దగ్గరి పోలికలు ఉన్న జానపద నాటకాలు లేదా ప్రదర్శనకళలు దక్షిణ భారతదేశంలో వివిధ పేర్లతో కన్పిస్తూ ఉంది. వీధి భాగోతం, వీధినాటకం, తూర్పు భాగవతం, యక్షగానం, బయలాట, చిందు భాగవతం, యానాది భాగవతం, బయలాట, దొడ్డాట, చవిట్టునాటకం అని రక రకాలుగా ఉన్నాయి. ఈ జానపద నాటకాలను పరిశీలిస్తే నాటకంలోని కథను బట్టి, ఆడే తీరును బట్టి, ఆడే వ్యక్తులను (కులాలను) బట్టి, పాడేమెట్టు రీత్యా, వేషధారణరీత్యా ఆయా పేర్లు వచ్చినట్లు తెలుస్తూ ఉంది. ఈ వ్యాసంలో తమిళ దేశంలోని తెరుక్కూత్తు, చిత్తూరు జిల్లా, నెల్లూరు జిల్లాలోని వీధినాటకాలను గూర్చిన అధ్యయనం ఉంది. తమిళంలో 'తెరు' అంటే వీధి అని, 'క్కూత్తు' అంటే నాటకం. నటన అనే అర్థాలున్నాయి. కాబట్టి వీధినాటకం అనే పదం తెరుక్కూత్తు పదానికి అనుకరణో, అనువాదమో అయి ఉండాలి.

ప్రతి విషయం, ప్రతికళ, ప్రతీజీవి బ్రహ్మసృష్టే అని మన భారతీయుల విశ్వాసం. అలాగే వీధిలో ఆడేనాటకాన్ని కూడా బ్రహ్మదేవుడే సృష్టించాడన్న ఐతిహ్యం ఒకటుంది. నాట్యశాస్త్ర ప్రారంభంలో ఒక కథ ఉంది. బ్రహ్మ దేవుడు ఇంద్రధ్వజ మహోత్సవ వేళ 'అసుర పరాజయము' అనే నాటకాన్ని రచించాడట. దాన్ని రంగస్థల సహాయం లేకుండా బయలు ప్రదేశంలో ఆడగా తమ ఓటమిని చూచిన రాక్షసులు కోపంతో విజృభించి నాటకాన్ని నిలిపేశారట. ఆ తర్వాత బ్రహ్మ మార్గ నాటకాలను నిర్మించి ఇచ్చాడని ప్రతీతి. ఈ కథలో బయలు ప్రదేశంలో నాటకాన్ని ప్రదర్శించడం సూచించబడటం వల్ల అది ఈనాటి 'వీధినాటకం' (బయలాట) గా చెప్పలేము. ఆ నాటకం జనపదులది కాకదేవాసురులది కావడం వల్ల ఇది దేశిపద్ధతికి చెందినదని ఇదమిత్థంగా చెప్పలేకపోతున్నాము.

వీధినాటకం ప్రాచీనతను తెలియజేసే ప్రాచీన లిఖిత సాక్ష్యాధారాలు తెలుగులో లేదు. కాని ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన శాతవాహనుల కాలంలో శాలివాహనుడు రచించిన గాథాసప్తశతిలో జానపద జీవనానికి, కళలకు సంబంధించిన విశేషాలు ఉన్నాయి. అందులో వీధినాటకాలు అనే స్పష్టరూపం కన్పించదు. దీన్ని గూర్చి ఇంకా పరిశోధించవలసిన అవసరం ఉంది. అలాగే నన్నయ పేర్కొన్న "ఉదాత్తరసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కుసూచితి" (ఆం.భా. ఆది. ప్ర.ఆ. ప. 10.) అని రాజరాజనరేంద్రుని చేత పలికించాడు. నన్నయ చెప్పిన దాన్ని బట్టే ఆంధ్రదేశంలో అప్పటికి వీధినాటకాలు ఉండేవనడానికి తగిన సాక్ష్యాలు కూడా లేదు. ఎందుకంటే రాజరాజనరేంద్రుడు చాళుక్య రాజు. ఈయన భార్య తమిళ దేశం నుండి వచ్చిన కన్య,. అంటే రాజరాజచోళుని కూతురు. అప్పటికే తమిళ దేశంలో బహుళ ప్రచారంలో ఉన్న క్కూత్తును రాజరాజనరేంద్రుడు చూచి ఉండవచ్చు. దాన్నే నన్నయ పేర్కొన్నాడని చెప్పుకోవచ్చు.

తెరచీరలు కట్టి ఆడే సంప్రదాయం వీధినాటకంలో ఉంది. పండితారాధ్యచరిత్రలో

''భారతాదికథలఁజీరమఱుగుల

నారంగ బొమ్మల నాడించువారు'' (పండి.చ. పర్వ.ప్ర.పు455) అనడం వల్ల ఇక్కడి తెరచాటున ఆడేవారు బొమ్మలాట వాళ్లుగాని వీధినాటకం ఆడేవాళ్ళు కారు. అలాగే

''లలితాంగ రస కళాలంకార రేఖ

లలవడ బహురూప మాడెడువారు'' (పండి. చరిత్ర. పర్వ. ప్రక. పు 435)

అనే చోట పగటి వేషగాళ్ళను గూర్చి చెప్పడం జరిగింది.

తెలుగులో క్రీడాభిరామాన్ని మొదటి వీధజనాటకంగా పేర్కొంటున్నారు. కాని ఈ వీధికి అసలు వీధి నాటకానికి సంబంధం లేదు. క్రీడాభారామము దశరూపకాల్లో ఒకటైన వీధి అని గ్రహించాలి. కాని చాల మంది క్రీడాభిరామమే మొదటి వీధినాటకమని అంటున్నారు. అందులో ఈనాటి వీధినాటక లక్షణాలు లేనందు వల్ల దాన్ని 'వీధి నాటకం 'అనడానికి వీలులేదు.

అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరము మొ॥ ప్రాంతాల్ని రెడ్డిరాజులు పరిపాలించారు. రేచర్ల, రాచకొండ, దేవరకొండ ప్రాంతాల్ని పాలించిన వెలమలూ, పద్మనాయకులు దేవాలయనృత్యాల్ని, వీధినాటకాలను, యక్షగానాలను పోషించారని తెలుస్తూ ఉంది.

ఈనాడు మనం కొన్ని చోట్ల వీధినాటకాన్నీ యక్షగానం అంటున్నాం. అయితే ఈయక్షగానాన్ని గూర్చిన ప్రస్తావన కూడా మనకు 12వ శతాబ్దం లోనే మొదట కన్పిస్తుంది. అంతకు పూర్వం ఈ ప్రస్తావన కూడా కన్పించదు. పాల్కురికి సోమన తన పండితారాధ్య చరిత్రలో

''ఆదట గంధర్వయక్షవిద్యాధరులై

పాడెడు నాడెడు వారు'' అన్నాడు. పాల్కురికి సోమన చెప్పిన యక్షగానాలు 17వ శతాబ్దిలో వీధినాటకాల్తో అభేదం చెందిందని .పరిశోధకులు అంటున్నారు. అంటే అంతకు ముందున్న యక్షగానాల్లో వీధి నాటక లక్షణాలు లేవన్న అభిప్రాయం.

1724లో నిజాం నవాబుల పరిపాలన ప్రారంభమయింది. అప్పటి నుండి 1948 సెప్టెంబరు 13 తేది వరకు వారి దమన నీతి నడిచింది. ఆ సందర్భంలో యక్షగానం ఒక అపూర్వం సాంస్కృతిక ప్రసార సాధనంగా తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించింది.

ఈనాడు ఆంధ్రదేశంలో కంగుంది వీధినాటకాలు ఎక్కువ ప్రచారాన్ని పొంది ఉన్నాయి. చిత్తూరు జిల్లా లోని కుప్పం సమీపంలో (8కి.మీ) కంగుంది దుర్గం వెలిసింది. ఈ కంగుంది జమీందారులకు జవ్వాజి కంబి నాయుడు మూలపురుషుడు. వీరి కాలంలో (1897 తర్వాత) వీధినాటకాలకు ఎనలేని ప్రాభవం లభించింది. కంగుంది (కుప్పం) వీధి నాటకాలకు మూల పురుషుడు గాది మునెప్ప. ఈయనే కంగుంది వీధినాటకాలకు శ్రీకారం చుట్టినట్లు చెబుతున్నారు.

ఇంత వరకు పరిశీలించిన అంశాలను బట్టి తెలుగులో వీధి నాటకాల ప్రాచీనతను తెలియజేసే శాసనాలు గాని, లిఖిత ఆధారాలుగాని లేకపోవడం శోచనీయం. ప్రజల్లో విశేష ఆదరణ పొందిన ఈ వీధినాటకాలను ఏ రాజు ఆదరించలేదు. తెలుగు వీధినాటకాల ప్రాచీనతను చాటడానికి విస్తృత పరిశోధనలు చేయవలసిన అవసరం ఉంది.

**తెరుక్కూత్తు**: తమిళదేశంలో ఇప్పటికీ తెరుక్కూత్తు కూత్తుగా ప్రచారంలో ఉన్న ఈ కళకు అక్కడ విశేష ఆదరం ఉన్నట్లు చారిత్రక, సాహిత్య ఆధారాల ద్వారా నిరూపించవచ్చు. సంస్కృత సాహిత్యం లాగ తమిళసాహిత్యానికీ చాల ప్రాచీనమైన చరిత్ర ఉంది. దీనికి ఇంచుమించు 25 శతాబ్దాల చరిత్ర ఉంది. క్రీ॥పూ 500 నుండి క్రీ॥శ 200 వరకున్న ప్రాచీన కవితల సంకలనం చేయబడి ఉంది. ఇది సంగసాహిత్యంగా వెలుగొందింది. ఆయా ప్రదేశాలల్లో ప్రజల వాడుకలో ఉన్న జానపద గీతాల నుండీ స్ఫూర్తి పొంది కవులు రచనలు చేసినట్లు స్పష్ట మవుతూ ఉంది. ఇలా కవులు స్ఫూర్తి పొందడానికి గల కారణాల్ని ము. వరద రాజన్ ఇలా అంటారు. ప్రణయ కవితలకి అర్హమైన స్థలం, కాలం, పక్షి, ప్రాణి, వృక్షం మొ॥ప్రకృతి సంబంధమైన వస్తువులను అమర్చి రాసే సంప్రదాయం సంగకాలానికి పూర్వమే ఉన్నట్లు తెలుస్తూ ఉంది. అప్పటికే "ఊరూర ప్రజల మౌఖిక ప్రచారములోనే అలిఖితముగా పాడబడు చుండిన జానపదగీతములయందే యీసంప్రదాయము సాగివచ్చుచుండినందున కవీశ్వరులును వానినదేవిధమున స్వీకరించి కవిత్వము రచించిరి". (తమిళ వాఙ్మయ చరిత్రము. పు 35. అను. తిమ్మా వజ్ఝల కోదండరామయ్య)

ఈనాడు కూత్తు అనబడే తెరుక్కూత్తు ప్రస్తావన క్రీ॥పూ॥5 శతాబ్దికి చెందిన తొల్ కాప్పియంలో చూడవచ్చు. ఇందులో కూత్తార్, పాణర్ పొరునార్, విరలియర్ అనేవారు జానపద కళారూపాల్ని ప్రదర్శించేవారుగ చెప్పబడి ఉంది. మెయ్పాడు భాగంలో పేర్కొనబడిన 'క్కూత్తార్' కూత్తు (నాటకం) ను ప్రదర్శించే వారని తెలుస్తూ ఉంది. క్కూత్తార్‌ను గూర్చి చెబుతూ టి. రామస్వామిగారు "Kuuttaar, Probably to the actors in a drama. In the absence of any other clue one has to take both the words naatakam and Kuuttu as synomymons and both these involue dancing also".(Tamil Yakshaganas - p. 12) అంటారు. కాబట్టి నాటకం, కూత్తు అనే పదాలు ఆనాడు ఒకే అర్థంలో వాడబడేవని చెప్పవచ్చు. అయితే నాటకాలలో ఎన్నో రకాలు ఉన్నాయి కదా మరి ఇది ఏ వర్గంలో చేరుతుంది. జానపదనాటకాన్ని సూచిస్తుందా అన్న సందేహం రావచ్చు. అక్కడ పేర్కొన్న కూత్తు అచ్చం ఈనాటికిది కూత్తు స్వరూపాన్నే పొంది ఉందనవచ్చు. పాట, మాట, ఆట ఆనాటి కూత్తులో ఉండేదని తొల్కాప్పియం చెబుతూ ఉంది. దీన్నే "ఉరళ్కలి" అంటారు. దీన్ని గూర్చి తొలిక్కాప్పియం వ్యాఖ్యాత శివతంబి ఇలా అంటారు.'"Uralkali reveals that there must have been a florishing dramatic tradtition for literary song to tap from" మరో వ్యాఖ్యాత రంగనాథ్ గారు "They have also contribated patterns in music and dance instruments, costumes and methods of make- up to the Folk drama" అనడంవల్ల క్రీ॥పూ 500 నాటికే జానపద నాటకం బహుళ ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తూ ఉంది.

ఈ కాలంలోనే వెలువడిన మరో గ్రంథ 'అగత్తియం'. ఇదో లాక్షణిక గ్రంథం. ఇందులో ఆనాడు తమిళ దేశంలోని 60రకాల కూత్తును గూర్చిన వివరణ ఉంది. ఇందులో ఆనాడు తమిళ దేశంలోని 60 రకాల కూత్తును గూర్చిన వివరణ ఉంది. ఇందులో పేర్కొనబడిన పాణర్క్కూత్తే ఈనాటి తెరుక్కూత్తు అనవచ్చు.

నక్కీరర్ రచించిన 'తిరుమురుగాట్రు పడై' అనే కావ్యంలో ఐదో భాగంలో మలైనాడు ప్రజలు కురవైక్కూత్తు (చెంచునాటకం) ఆడుతూ మురుగని ఆరాధించే పద్ధతుల్ని చక్కగా వర్ణించారు. కూత్తుకూడా జానపద నాటకం (కూత్తు) గా పేర్కొనబడింది.

క్రీ॥ శ॥ 2వ శతాబ్దికి చెందిన ఇళంగో అడిగళ్ శిలప్పదిగారం రచించాడు. దీన్నే "నాడగ కాప్పియం" అని కూడా అంటారు. ఇందులో వేటగాండ్రు, గొల్లలు, పార్వతేయులు పాడేపాటలు, ఆడే ఆటలు, నాటక ధోరణులు వివరించబడింది. ఇందులో కావ్యనాయిక రకరకాల నాట్యాల్ని ప్రదర్శించినట్లు పేర్కొనబడి ఉంది. అందులో అంతరవాసైక్కూత్తు, పుగల్, వెట్టియల్, పాదువియణ్, వెల్, వారిచండి, ఇయల్బు, దేశి, వినోద, ఆర్యా మొదలైన కూత్తు ధోరణులను ప్రదర్శించినట్లు చెప్పబడి ఉంది. ఇందులో అంతర కూత్తు, పాదువియల్ క్కూత్తు, దేశిక్కూత్తు, వంటివి తెరుక్కూత్తుకు సంబంధించినవి. ఇందులోని అంతరక్కూత్తు పాత్ర ప్రవేశానికి ముందు తెరవెనుక నిలబడి ప్రదర్శించే నటనను సూచిస్తుంది. దీన్ని ప్రదర్శించేటప్పుడు నాట్యకత్తె 11 సార్లు ఆ రంగస్థలంపై గుండ్రంగా తిరుగుతుంది. ఈ సంప్రదాయం ఈ నాటికి తెరుక్కూత్తులో ఉంది. ఇళంగో అడిగళ్ కాలానికే ఈ నాటి తెరుక్కూత్తు సంపూర్ణ రూపం ప్రచారంలో ఉన్నట్లుగ చెప్పవచ్చు.

క్రీ॥శ॥ 10వ శతాబ్దిలో మొదటి రాజేంద్రచోళుడు నిర్మించిన బృహదీశ్వరాలయంలో వళ్లి (పార్వతి) కళ్యాణాన్ని ఆలయ శిల్పంగా మలిపించాడు. ఇందులో ఆ నాటి జానపదకూత్తు సంప్రదాయాలు చోటు చేసుకొని ఉండడం ఈ నాటికీ చూడవచ్చు. ఈ రాజే ఆ నాటి తెరుక్కూత్తు కళాకారులు, ఆలయంలో మార్గళి, వైగాసి నెలలో జరిగే ఉత్సవాలలో ప్రదర్శించే నాటకాలను ప్రోత్సహించడం కోసం కొంతభూమిని దానం చేసినట్లు ఒక శిలా శాసనం (AR. Ep. 1914 No.65) పేర్కొంటూ ఉంది. దాన్నిబట్టి ఆ దేవాలయంలో సక్కైక్కూత్తు ప్రదర్శించేవారట. అలాగే కులోత్తుంగ చోళుడు వైగాసి నెలలో సందిక్కూత్తు ప్రదర్శించినందుకు కళాకారులకు కొంత భూమిని దానం చేసినట్లు ఒక శాసనం (AR. Ep. 1914 No. 254) తెలుపుతుంది.

ఇలా తెరుక్కూత్తుకు సంబంధించిన విశేషాలు తమిళ సాహిత్యంలో క్రీ॥పూ॥ 5వ శతాబ్ది నుండి నేటి వరకు ఎక్కువగా కన్పిస్తుంది.

నేడు చిత్తూరు జిల్లాలో ప్రదర్శింప బడుతున్న వీధి నాటకాల్ని చాల వరకు అనుష్టాన ప్రదర్శన కళ (Ritual performance) గా చెప్పవచ్చు. దీనికి ప్రధానమైన కారణం తమిళ దేశ ప్రభావమే అని చెప్పవచ్చు.

తమిళ దేశంలో వసంత కాలంలో "ద్రౌపది అమ్మన్ తిరువిళా" జరుగుతుంది. ఇవి తమిళనాడు లోని చెంగల్పట్టు, ఉత్తరార్కాటు. దక్షిణ ఆర్కాటు. కోయాంబత్తూరు జిల్లాలలోను, ఆంధ్రదేశంలోని చిత్తూరు జిల్లాలోను, నెల్లూరు జిల్లాలో గూడూరు మొదలైన ప్రదేశాలలో జరుగుతుంది. ఈ ఉత్సవాలు 18 రోజులు జరుగుతాయి. ఈ ఉత్సవాలు ఎప్పటి నుండి ఆరంభమయినాయో చెప్పడానికి తగిన ఆధారాలు కూడ ఉన్నాయి. క్రీ॥శ॥ 1331 నుండి 1383 వరకు దక్షిణ పెన్నానది తీరంలోని తిరుమునైప్పాడి దేశాన్ని పాలించిన "వక్కృ పాగైలిరపధి యాడ్కొండాన్" అనే చోళ సామంత రాజు కాలం నుండి ఆరంభమయినట్లు చరిత్ర చెబుతూ ఉంది. తిరుమునైప్పాడి దేశంలో క్షామం ఏర్పడినపుడు తన పురోహితులు ద్రౌపదికి గుడి కట్టించి 18 రోజులు ద్రౌపది అమ్మన్ తిరువిళా జరిపిస్తే దేశంలో వర్షాలు పడి సుభిక్షమౌతుందని సలహా ఇచ్చారట. వారి సలహాను పాటించి అలాగే ఉత్సవాలు జరిపినట్లు చెప్పబడి ఉంది. కాని ఈ ఉత్సవాలు క్రీ॥ పూ॥ నుండి ఉన్నట్లు మరో ఆధారం ద్వారా చెప్పవచ్చు. మధుర

నేటిన రాజులు క్రీస్తుకు పూర్వమే కన్నగి' అనే ఓ పతివ్రతకు గుడికట్టించి పూజలు చేసినట్లు చెప్పబడి ఉండడం వల్లను, మాత్రారాధన అంశాలు అక్కడ ఉండడం వల్లను ఈ ఉత్సవాలు బహుశా అప్పటి నుండే ఆరంభమయి ఉండవచ్చు.

ఈ ఉత్సవాల ప్రాచీనతను తెలిపే మరో అంశం కూడా గమనించదగింది. తమిళ దేశంలో ఈ "బారద విళా" జరిగే క్షేత్రాలు ఇప్పటికీ ఉన్నాయి. ద్రౌపది దేవీ గుడికి ఎదురుగా మొండెంతో ఉన్న నిలువెత్తు విగ్రహాలు ఉన్నాయి. అవి "కడబలిరాముని విగ్రహాలు" కళం అంటేయుద్ధం. బలి అంటే బలి. కళబలి అంటే యుద్ధబలి అని అర్థం. పాండవులు యుద్ధంలో జయాన్ని పొందడానికి అర్జునుడికి, ఉలూచికి పుట్టిన 'ఇరావంతుని' యుద్ధానికి బలిఇచ్చారట. దాన్ని ఈ ఉత్సవాలలో 16వ రోజు ప్రదర్శిస్తారు. యుద్ధఘట్టాలు ఆరంభించడానికి పూర్వం మట్టితో తయారుచేసిన ఒక విగ్రహాన్ని బలిఇస్తారు. ఈ ఘట్టం వల్ల ప్రాచీనమైన ఆటవిక వ్యవస్థ స్ఫురిస్తుంది. తమ విజయం కోసం శక్తికి నరబలి ఇవ్వడం ఆటవిక వ్యవస్థను సూచించే అంశం. అందువల్ల ఈ ఉత్సవాలు చాల ప్రాచీన కాలంనుండి అమలులో ఉండేవని అప్పటినుండి ఉత్సవాలలో ప్రదర్శించే వీధినాటకాలు ప్రదర్శింపబడేవని చెప్పవచ్చు.

పైన పేర్కొన్న అంశాలను బట్టి తమిళంలోని తెరుక్కూత్తు చాల ప్రాచీన కాలంనుండి ఉండేదని, వాటి ప్రభావంతోనే ఆంధ్రులు వీధి నాటకాలను ప్రదర్శించడం నేర్చుకొన్నారని. తంజావూరు మధుర నాయకులు కూడ తమిళ దేశంలోని వీధినాటకాల ప్రభావానికి గురి అయి యక్షగానాల్ని వీధి నాటకాలతో అభేదం పొందేలా రచించి ప్రదర్శింపజేశారని చెప్పవచ్చు. అనుష్ఠాల నిర్వహణ నుండే జానపదకళలు పుట్టాయని పరిశోధకులు చెబుతూ ఉండటం వల్ల ప్రాచీన కాలం నుండి ఇప్పటి వరకు తెరుక్కూత్తు అనుష్ఠాన సంబంధిత కళారూపం కావడం వల్ల మన వీధి నాటకాలు తమిళ తెరుక్కూత్తు ప్రభావంతో వచ్చాయేమో నన్న సందేహం కలగక మానదు.

**ఉపయుక్త గ్రంథాలు :**


1. *తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీనలము*.- వి.యస్. రాఘవన్.
2. *తమిళగత్తిల్ తెరుక్కూత్తు* - ఎ.ఎన్. పెరుమాళ్
3. *దాక్షిణాత్య జానపద దృశ్య కళారూపాలు*- జి నాగయ్య, నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి
4. *తమిళ వాఙ్మయ చరిత్ర* - ము. వరదరాజన్. అనువాదం - తిమ్మావజ్ఝల కోదండ రామయ్య, సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, 1982
5. *Tamil Yaksha ganas*- T. Ramaswamy,
   International Institute of Tamil Studies, Madras, 1987
6. *Ancient Indian and Indo Greek Theatre*. - M.L. Varada pande
   Abhinay Publications, New Delhi, 1981




# అభిరామ దేశి కవితా క్రీడ

- ఆచార్య తుమ్మపూడి కోటీశ్వర రావు

శా. "చందన గంధు లిందుమణి సౌధము నందున గొండ్లి సల్ప" (వసు చరిత్ర)

వడకు పన్నగరాజు పడగల మీద స
ర్వంసహాకాంత పేరణము సూప
ఉఝ్ఝాతలూగెడు. ఉదయాస్త గిరులతో
ఆకాశలక్ష్మి కోలాట మాడ
తెరలెత్తి సప్తసాగరములు పొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప
కమల సంభవుడు ప్రేంఖణ మొనర్ప (ఉ. హరి వంశము)

మ. ద్రుతతాళంబున వీరగుంభి తనధుంధుంధుంకిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా
యతి గూడం ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడె నొ
క్కత ప్రత్యక్షరముంగుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్

సీ. గర్జించి యరసి జంఘా కాండ యుగళంబు
వీరసంబెటకోల వ్రేయునొకఁడు
ఆ లీఢ పాద విన్యాస మొప్పఁగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
బిగువుఁగన్నుల నుబ్బు బెదురుఁజూపుల తోడ
ఫీట్కార మొనరించుఁబెలుచ నొకఁడు
పటుభుజావష్టంభ పరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు
ఉద్ది ప్రకటింప నొక్కరుండోల వాఁడు
బయలు గుఱ్ఱంబు భంజళ్లఁ బఱపునొకఁడు
కొడుము దాటింపుచును బెద్ద కొలువులోనఁ
బడతి పల్నాటి వీరులఁబాడునపుడు (క్రీడాభిరామము)

ఈ పద్యాలలో విన్యస్తమైన వస్తు విశేష సంపద పేరే దేశి.

క్రీడాభిరామంలో వర్ణింపబడ్డ ఓరుగల్లు పురవైభవమంతా జనజీవన సరళి సర్వస్వమూ దేశికవితా వస్తువే. మాచల్దేవి, ఆమె చిత్రశాల. పూటకూటిండ్లు, సంపెంగ నూనెలమ్మే కరణకాంత, నూనెనాడే గానుగకన్య, నగరానికి క్రొత్తగావచ్చే కాపుకన్యలు, విటులు, విటకత్తియలు, వారి

సరాగాలు, న్యాయస్థానాలు, వినోద ప్రదర్శకులు, కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు పాడుచువచ్చు జక్కుల పురంధ్రీ.

ఏడుగు రక్కలు, మైలారభటులు, శ్రీకాకుళం తిరునాళ్లు అక్కడ జరిగే గుప్త క్రీడలు, పాములవాడి నాగస్వరం పాట, గొబ్బిళ్ళు పెట్టే పామరస్త్రీలు - అంతా దేశీయమైన వస్తు సంభారమే. నాటి వృత్తులు - దానికి తగిన వేష వర్ణన అంతా ఒక చిత్రలేఖనమన్నట్లు గీయడం చేత నాటి మన తాత ముత్తాతల వేషభాషాదులు స్పష్టంగా నేటికీ మన కళ్ళ ముందు నిలుస్తున్నవి.

పొలపములు లేవు కరవంక బొమల యందు

చిన్ని నగవులు లేవు లే చెక్కులందు

కలికి తనములు లేవు క్రాల్గన్నులందు

కాపుటిల్లాంధ్ర కిట్టి మౌగ్ధ్యముల యొప్ప (క్రీడా. 84)

ఇది పామరభామ వర్ణన. కాళిదాసు కూడా ఇలాగే అన్నాడు.

త్వయ్యాయత్తం కృసిఫలమిది భ్రూవికారా నభిజ్ఞై :

ప్రీతిస్నిగ్ధైర్జన పద వధూలోచనైః పీయమానః

మేఘుడు రాగానే వ్యవసాయ ఫలం నీవేనంటూ భ్రూభేదాలు తెలియని ప్రేమ నేత్రాలతో నిన్ను త్రాగుతుండగా - ఇత్యాది మార్గకవితాభ్రూవికారాలు నేర్వని శృంగారిణి. ఈమె సహజ సుందరి.

దీనికి విరుద్ధంగా మనకు ప్రబంధాలలో స్త్రీ సౌందర్య వర్ణన కనిపిస్తుంది. ఈ విషయం ఆముక్త మాల్యదలో స్పష్టంగా చెప్పబడిన పద్ధతి వేరే వ్రాయబడింది.

వీరు మైలారదేవర వీరభటులు.

గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు

ఆడుచున్నది చూడు మూర్ధాభినయము

తాను నెట్టిక సీలంత కాని లేదు.

ఈ విధంగా నాటి దేశిక్రీడలను అభిరామంగా చిత్రిస్తున్నది. ఆ చిత్రణ మనకు తాదాత్మ్య హేతువై ప్రాచీన దేశీయ వైభవాన్ని వారసత్వంగా మన కందిస్తున్నది. ఈ సంపద మన జీవన విధానానికి స్ఫూర్తిదాయకమౌతున్నది. దేశీయ వీరగాథ వృత్తాలన్నీ నిజమైనా కాకున్నా మనకు సంబంధించదు. అవి మన ప్రస్తుత జీవితానికి స్ఫూర్తిదాయకం కావటమే ప్రధానాంశము.

ముందు పద్యాలలో ఉదాహరించిన గొండిలి, పేరణం, ప్రేంఖణం, కోలాటం వంటివి దేశ్యయ నృత్త విశేషాలట. అలనాడు జాయపసేనాని నృత్తరత్నావళిలోను అంతకు ముందు కళ్యాణి ప్రభువు సోమేశ్వరుడు మానసోల్లాసంలోను ఈ దేశ నృత్త భేదాలను చూచి అనుభవించి వాటిని శాస్త్రం మూసలో పోశారు. ఈ దేశి కళలకు ఆ మహానుభావులు ఈ శాస్త్ర కల్పన చేయకపోయి ఉంటే పాపం మన ప్రాచీన కవులు నోరారా వర్ణించిన ఆయా నృత్త విశేషాలన్నీ

మన కర్థం కాక తిట్టుకొని ఉండేవాళ్ళం కదా (నాచన సోమన్న చేసిన అనేక ప్రయోగాలను మనవాళ్ళు చాలా మంది తిట్టినట్లు సాక్ష్యం ఉంది కదా!)

నృత్త రత్నావళి 7వ అధ్యాయంలో పేరణి, రాసకం, చర్చరి, చిందు, కందుక నర్తనం, ఖాండిక నృత్తం, బహురూపం, కోలాటం, గొండలి వంటివి శాస్త్రీయంగా నిర్వచింపబడ్డాయి. భరతుడెలా శాస్త్ర కల్పన చేశాడో, దేశీయ నృత్య, నృత్తాలకు వీరదే పని చేశారు. సోమేశ్వరుడట - ఒకసారి ఒక ఉత్సవంలో భిల్లీ వేషంల్లో ఒక నర్తకి చేసిన నృత్త భేదాన్ని చూచి ఆనందించి దాన్ని 'చిత్రగొండలి' నృత్యవిశేషంగా నిరూపించాడు. ఈ భిల్లీ శబ్దం మహారాష్ట్రలో గొండలి అయినదట. అలాగే పేరణం, ప్రేరిణం వంటి వాటిని జాయపసేనాని దేశీయ లాస్య విశేషాలుగా నిరూపించాడు (గోండు - గొండలి సంబంధం చూచుకోవాలి).

కాబట్టి ఆదికాలం నుండి గ్రామీణ సంపదగా కృత్రిమ నాగరికత సోకని దేశికళావిశేషాలే శాస్త్రకారులచే శాస్త్రీయంగా నిర్వచింపబడి దేశీయశైలీ విశాషాలుగా స్థిరపడ్డాయి.

సంస్కృతాలంకారికులు చర్చించిన వైదర్భీ, గౌడీ, పాంచాలి రీతులు కూడా ప్రాథమికావస్థలో దేశీయ కవితాశైలీ విశేషాలే. తర్వాత క్రమక్రమంగా వాటికి ప్రాచుర్యం సంభవించింది. ఏ విధంగా ఈనాడు తెలంగాణా, రాయలసీమ మాండలికాల కంటే కోస్తా జిల్లాల మాండలికమే ప్రామాణిక భాషగా వ్యాప్తి పొందిందో అలాగే ఇది కూడా. ప్రపంచంలో సర్వేసర్వత్రా దేశాల పేర్లే శైలీవిశేషాలుగా వచ్చాయని *The meaning of Art* అనే గ్రంథంలో కూడా రీడ్-పండితుడు చెప్పాడు.

వక్రోక్తి జీవితకారుడు ఈ శైలులు దేశీ విశేషాలుగా కాకుండా మనస్తత్వ విభిన్నతే కళాశైలికి మూల కారణమని ప్రాచీన పాంచాలాది రీతులనే సుకుమార, విచిత్ర, మిశ్రశైలులుగా పేర్కొన్నాడు. ఏమైనా మార్గకళకు దేశికళలే మూలాలు.

ఈ దేశీయ కళాశైలులు (Local Styles) అనేకం రాగా వాటిలో నుండి విశ్వజనీన కళా సూత్రాలు ఏరి కూర్చుకొన్న శైలీ విశేషం మార్గం. (Universal Style) మృగం నడిస్తే ఏర్పడ్డ గిట్టల గుర్తుల వెంట పదిమంది నడిస్తే దారి డొంక-రోడ్డు ఏర్పడినట్లుగా క్రమ పరిణామంలో వచ్చేది మార్గశైలి - ఈ రెండూ కలిసే ఉంటాయి. (మృగ - మార్గ)

వైష్ణవాది మతాలు కూడా ఆయాభక్తులు, యోగులు అనుభవించి చెప్పిన విషయాల నాధారంగా చేసికొని మతాచార్యులు వాటికి శాస్త్ర కల్పన చేసి తత్త్వ దర్శనాలుగా ప్రకాశింపజేయడం మనకు తెలిసిందే. ఆళ్వారులు, నాయన్మార్లు, భక్తులు. వారి అనుభవాలే తర్వాత వైష్ణవశైవ దర్శనాలుగా వ్యాప్తి చేయబడ్డాయి. కనుక ఒక్కొక్క దేశంలో పుట్టిన మౌలిక మౌఖిక కళారీతులే మార్గకళకు ప్రాచీన రూపాలు.

కోలాటం, ఖాందిక నృత్యం, కందుక క్రీడాదులు గోదాదేవి తన రచనలో పేర్కొన్నది కనుక తమిళ దేశంలోనూ ఇవి ప్రచురములైనట్లుగా కనిపిస్తున్నది. అలాగే క్రీడాభిరామంలో ఒక జక్కుల పురంధ్రి ఉరుము అన్న పద్యవిశేషాన్ని వాయించిన విధానాన్ని అద్భుతంగా వర్ణిస్తాడు.

తే. రాగమున నుండి లంఘించు రాగమునకు

నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్ల

కామవల్లీ మహాలక్ష్మి కైటభారి

వలపు వాడుచు వచ్చె జక్కుల పురంధ్రి

సరిగా ఈ పద్యభావాన్ని కోణార్క దేవాలయంలో ఒక శిల్ప సుందరిగా మలిచాడు శిల్పి. 'ఉరుమ ఉరుద్వయముపై నొత్తగిల్ల' బొమ్మలో కూడా ఇలాగే వాయిస్తున్నట్లు నడుము దగ్గర కొంచెం వంగబడి ఒక తొడపై ఈ వాద్యాన్ని పెట్టుకొని వాయిస్తూ ఉంటుంది. అదొక జగన్మోహన శిల్పం. కాబట్టి ఒరిస్సాలోనూ ఈ దేశినృత్త విశేషమున్నది. ఇందుచేత ఈ దేశీయ కళాసంపదకు నేటి రాష్ట్రాల సరిహద్దు గీతలు గీయటం కష్టం. లేక ఇలాంటివి ద్రావిడీ రీతులుగా నిరూపించుకోవచ్చునేమో పరిశీలించాలి. ఎందుచేతనంటే అనేక గ్రామ దేవతలు సంస్కృత పురాణాలలోకి ప్రవహించి పోయారు.

దేశీయనృత్త విశేషాలే తర్వాత మార్గశైలిగా రూపొందిన వనటానికి మరొక ఉదాహరణ. మాళవికాగ్ని మిత్రములో మాళవిక నాట్యాన్ని వర్ణిస్తూ కాళిదాసంటాడు. "దేవానం ఇదం అమనంతిమునయః కాంతం క్రతుం చాక్షుషం" - అని. ఇందులో నాట్యం దేవతా ప్రీతికరమని, నేత్రం క్రతువని చెప్పడంలో రహస్యమేమిటంటే భరతుడన్నాడు. తన నాట్యానికి మూలం వేదమని

జగ్రాహ్య పాఠ్యం ఋగ్వేదాత్।

సామభ్యో గీతామేవచ।

యజుర్వేదా దభినయాన్।

రసానధర్వణా దపి।

ఋగ్వేదం నుండి పాఠ్యం అంటే వాచికం సామవేదం నుండి గానం, యజుర్వేదం నుండి అభినయం, అధర్వణ వేదం నుండి రసం గ్రహించి ఈ నాట్యాన్ని నిర్మించినట్టు భరతుడే చెబుతున్నాడు. అతి ప్రాచీన కాలంలో బహుశా ఉపనిషత్తులు పుట్టక పూర్వం ఆరణ్యకములు, బ్రాహ్మణములు మాత్రమే ఉన్న రోజుల్లో యజ్ఞం చేస్తున్నప్పుడు పురోహితాదులు చేసే క్రతునాట్యం ఒకటి ఉంది. దాని నుండి భరతుడు ఈ మార్గశైలిని నిర్మించాడు. ఈ క్రతుకర్తనం వల్ల ప్రయోజనమేమిటి? అంటే దేశికళ ప్రయోజనమేమిటి?

శ్రీ అరవిందులన్నారు. వేదకాలంనాటి మనిషికి మతమంటే నిత్యజీవితోపయోగి Pragmatic. నాటికి తత్త్వశాస్త్రం లేదు కనుక ప్రతి వస్తువులోనూ, కర్మలోనూ దైవాన్ని చూడటమే వాని పని. ఆనాటి జీవిత వస్తువే - దేశీయ కళా వస్తువు. అంటే గ్రామీణ జీవన వాతావరణం నుండి ఈ కళలేర్పడుతున్నాయి.

ఇందుకే జాయపసేనాని

"అంగవిక్షేపణం నృత్తం భవేత్

అభినయోజ్జితం నాట్యేహి అభినయే

ఛిద్రప్రచ్ఛాదనం హితత్ ఏతత్ దేశి ఇతి

విఖ్యాతం తత్తత్ దేశ జనేచ్ఛయా" - అని నిర్వచించాడు. అభినయం లేనిదీ, కేవలం అంగచాలనం మాత్రం కలది నృత్తం. ఇది దేశీయ నాట్య విశేషం. నేటి మనస్తత్వ శాస్త్ర వేత్తలు ప్రాచీన నర్తన ప్రయోజనమంతా బాహ్యచైతన్యస్మృతిని కోల్పోవడం ద్వారా అంతశ్చైతన్య ఆవిష్కృతి కల్గించడమేనంటున్నారు. ఇది అంగ విక్షేపాదుల వల్ల సాధ్యం. అంతశ్చైతన్యావిష్కృతియే నాటి మతం. ఇక్కడ జాయపసేనాని కేవలం అంగవిక్షేపమే నృత్త మనటంలో ఈ ప్రయోజనాన్ని అతడు చెప్పకోయినా మనం ఊహించుకోవచ్చు. గర్జీఫ్ అన్న మహాయోగి ఈ ప్రాచీన క్రతు నర్తనాదులన్నీ యోగ సాధనాలని పాశ్చాత్య దేశాలలో ప్రచారం చేశాడు. కనుక దేశీయ కళాప్రయోజనం నిత్య జీవితానికి ఉపయోగపడే అభౌతిక అనుభూతులను కల్పించటం అని స్పష్టపడుతున్నది.

కొన్ని భౌతిక ప్రయోజనాల కోసం - భౌతిక కర్మలను ప్రేరేపించే కొన్ని భావోద్రేకాలను రెచ్చగొట్టే కళలు MAGICAL. ఆ కళ సౌందర్య శాస్త్ర దృష్ట్యా మంచా? - చెడా? అన్నది ప్రశ్న కాదు.

**కోలింగ్ వుడ్ సిద్ధాంతం**

"A magical art is art which is representative and therefore evocative of emotion, and evokes of set purpose some emotions rather than other - in order to discharge them into the affairs of practical life. Such an art may be good or bad when judged by aesthetic standards, but that kind of goodness or badness has little, if any connection with tits efficacy in its own proper work." [p.69]

"Magic is a representation where the emotion evoked is an emotion valued on ocount of its function in practical life, evoked in order that it may discharge that function, and fed by the generative or focusing magical activity into the practical life that needs it. *Magical activity is a kind of dynamic supplying* the mechanism of practical life with the emotional current that drives it. hence magic is a necessity for every sort and condition of man, and is actually found in every healthy society. A society which thinks, as our own thinks out lived the need of magic is either mistaken in that opinion, or else it is a dying society, persuing for lack of interest in its own maintenance". (*The Principles of Art* p. 68-69)

ఇది దేశికళాస్వరూపంగా కోలింగ్‌వుడ్ తన కళాసూత్రాలను గ్రంథంలో చర్చించాడు. దేశికళలు (Peseant Arts లని అతని మాట) వినోద కళలు కావు, రసవత్కళలూ కావు - అవి కేవలం magical అంటాడు. నిత్యజీవితానికి ఉపయోగించే కొన్ని భావాలను మాత్రమే మనలో అది రేపుతుంది.

నలభై యాభై ఏళ్ళక్రితం మా గ్రామాలలో సంక్రాంతి దినాలలో తోలుబొమ్మలాటల వాళ్ళు, పిచ్చుక గుంట్లు, జంగాల వాళ్ళు కళాప్రదర్శనకు వచ్చేవారు. ఆ కథలు వింటూ, చూస్తూ గ్రామం గ్రామమంతా పగటి పూట శ్రమనంతా మరచిపోయి తెల్లవారి మరలా ఉత్సాహంగా శ్రమించడానికి కావలసిన శక్తిని పొందేవారు. ఇది మనకు తెలియకుండా మనలో జరిగే ఒక విధానం. ఈ పిచ్చుక గుంట్లు కథలలో సంగీత సాహిత్య నృత్త కళా సమన్వయముండేది. వారు పల్నాటి వీరచరిత్ర చెబుతుంటే నేను నా చిన్నతనంలో విన్నాను. వీరావేశం కలిగేది. ఈ వీరం రసావేశం కాదు. ఒక్క కథ ఉన్నది. ఒక్కపల్నాటి చరిత్ర చెప్పే కథకుడు శ్రోతలతో అన్నాడట. బాబుల్లారా ఇళ్ళలో ఉన్న కత్తులు, కఠారులు, పలుగులు, పారలు అన్నీ ఒక ఇంట్లో పెట్టి తాళం వేసి ఆ చెవి నాకివ్వండి అని అలాగే చేసి, కథ చెబుతుంటే శ్రోతలలో వీరావేశం పెరిగి తాళం చెవికోసం వెదికారట. ఈ కథ వేయి పడగలలో ఉదహరింపబడినది. ఈ కథా తాత్పర్యం వీరం తప్ప వీర రసం కాదు. రసానుభవం ఈ విధమైన భౌతిక క్రియకు దోహదం చేయదు. దీని చర్చ వేరే. క్రీడాభిరామంలో ఈ పద్యం చూసే సరిగ్గా కోలింగ్‌వుడ్ చెప్పినది ఇదేనేమో అనిపిస్తున్నది.

"ద్రుత తాళంబున. . . . . . . . . . . . ."

"గర్జించి అరసి. . . . . . . . . . . . . . ."

ఈ పద్యాలు ముందే ఉదాహరించబడ్డాయి. ఒకతె ద్విపదలో వీరగాథలు పాడుతుంటే శ్రోతలలో కలిగిన ఆవేశాన్ని సీస పద్యంలో కవి వర్ణించడం చాలా ఆశ్చర్యంగా ఉంది.

టాల్‌స్టాయ్ కావ్య ప్రయోజనంగా Infectious theory ని ప్రతిపాదించాడు. అది సరిగ్గా ఇదే. కానీ రీడ్ తన 'The Meaning of Art' అన్న గ్రంథంలో దాన్ని విమర్శిస్తూ ఇలా అన్నాడు. ఒక పులిని వీరుడు చంపిన వస్తువును ఇతివృత్తంగా చేసుకొని వచ్చిన కవితను చదివితే వెంటనే బల్లెం తీసుకొని పులిని వేటాడటం కావ్య ప్రయోజనంగా టాల్‌స్టాయ్ చెబుతున్నాడు. ఇది తప్పు అని అన్నాడు. బహుశా టాల్‌స్టాయ్ ఈ దేశికళను భావిస్తున్నాడేమో.

నిజానికి తోలుబొమ్మలాట వంటి వాటిలో మనం రసభావం నిరూపించలేము. ఆ ప్రేక్షకుడు నాగరికుడు కాడు -- నాటక ప్రేక్షకుడైనట్లు. నేటి మనిషికి రాజకీయాలెలాగో దేశికళాశ్రోతకు బహుశా దైవం ధర్మం తత్స్వరూపమైన తన జీవితం ముఖ్యం తప్ప రసాదులు కావు. వాడు వట్టి గ్రామీణుడు. కనుక తోలుబొమ్మలాటలో ఆడించేవాడు సూత్రధారుడు సూత్రంతో వెనక ఒకడు ఆడిస్తుంటే తెరమీద మరొకటి. కదులుతున్నది. కదిలేది మనిషి = తాను. కదిలించేవాడు సూత్రధారుడైన భగవంతుడు. ఈ తెర జీవితం. ఈ రంగస్థలం మీద తాను నటిస్తున్నాడు. నటింపచేసేవాడు వేరే అన్న ఒకానొక తాత్త్విక భావన వీనియందున్నదని ఆనందకుమారస్వామి గారు భావించారు. ఈ తాత్త్విక భావన భౌతిక జీవనోపయోగి తప్ప జీవిత పరిత్యాగి హేతువుకాదు. ఈ నిజాన్ని చాలి జాగ్రత్తగా గమనించాలి. నేటికీ పిల్లలకు గుప్తంగా ఉన్న ఒక తాత్త్విక రహస్యాన్ని మేల్కొలుపుతున్నది కాబోలు ఇందుచేత దేశి కళాప్రయోజనం భౌతిక జీవనోపయోగి అయిన ఉత్సాహం కలిగించటం. అది ఆలంకారికం కాదు. ఆధ్యాత్మికం కాదు. కాని వాటి స్పర్శ లేకపోలేదు.

**కథా నిర్మాణంలో నాగరిక - దేశీయ మనస్తత్త్వాలు :**

మార్గకళ నాగరికం. దేశికళ గ్రామీణం. ఈ మనస్తత్త్వాలు నిరూపించుకొంటే దాని శ్రోత వేరు, దీని శ్రోత వేరూనని తెలుస్తుంది.

ఒక చోట కుంతకుడన్నాడు 'తమ్ముడుండగా అన్న లేడికోసం పోవటమేమిటీ?" అని రామాయణ కథాంశాన్ని వివరిస్తూ అన్నాడు - దీని కర్థమేమంటే - నాగరక జనజీవన విధానంలో చిన్నవాడు పనిచేయటం - పెద్దవాడు పెత్తనం చేయటమున్నది కదా. గ్రామీణ స్థితి కిది విరుద్ధం. నాగరకత ఔచితీమహితమని కుంతలుని తీర్పు.

విశ్వనాథవారా ఘట్టాన్ని తీర్చిన విధానం అద్భుత రమణీయకం.

----ఈ తరళాక్షి నిక్కముగ నేదియుఁగోరదు మున్నుకోర్కి ప్ర
స్ఫీతము సందియంబు కనిపించిన చోటునగల్గె చిత్తమై

పుట్టిల్లును నత్తిల్లును
నట్టడవిగ జేసినాను నాతికి నటవీ
పట్టాభిషేక మారిచి
పుట్టిన యొక కోర్కి చేయబోనో పతినై

నిజముగ లేడియైన ధరణీ సుతకోసము తెచ్చి పెట్టెదన్
రజని చరుండె యైనను శరప్రహతిన్ వధియించి వచ్చెదన్

ఈ విధంగా కుంతకుడు చెప్పిన అనౌచిత్యాన్ని పరిహరించాడు విశ్వనాథ.

ఈ ఔచిత్యానౌచిత్య చర్చ మార్గశైలి. భర్త పోయి తెస్తే భార్య కానందం. మరిది పోయి తెస్తే మర్యాద - దర్జా కావచ్చు. ఈ భేదం కవిలోనూ శ్రోతలోనూ ఉంటుంది.



# తెలుగు కన్నడాలలో దేశికవితా ధోరణులు

- డా॥ ఆర్వీయస్. సుందరం

'దేశి' అంటే ఆయా దేశాలకు సంబంధించిన సంప్రదాయం. సంగీత నాట్యశాస్త్రాలలో మార్గ-దేశి విభజన ఉంది. ధనంజయుడు నృత్యం భావాశ్రయమై పదార్థాభినయమై మార్గమవుతుంది, నృత్తం తాళలయాశ్రితమై దేశి అవుతుందని వచించాడు. రాగ చింతామణి అనే తెలుగు గ్రంథంలో లక్షణప్రధానమైంది మార్గమని, లక్ష్య ప్రధానమైంది దేశి అని చెప్పబడింది. సంగీతంలో, నాట్యంలో ఉండే మార్గ-దేశి విభాగాన్ని సాహిత్యానికి అన్వయించి చూస్తే సంస్కృత భాషా సాహిత్యాలు మార్గమని, ఆంధ్ర కర్ణాటాది భాషాసాహిత్యాలు దేశి అని స్థూలంగా చెప్పవచ్చు.

సంస్కృతం పురాతనమైంది. విపులమైన లక్షణశాస్త్రం విస్తృతమైన కావ్యశాస్త్రం, సుదీర్ఘమైన సాహిత్య సంప్రదాయం దానికున్నాయి. దేశభాషలకు నియమాలు లేకపోలేదు. కాని జావద్భాషలకుండే నియమాలు స్థిరమైనవి కావు. ఒక్కొక్క ప్రదేశానికి, జన సముదాయానికి విశిష్టమైన భాష, సంప్రదాయం, ఆచారాలు, కళలు, కథలు, అన్నిటికంటే ముఖ్యంగా లయాభివ్యక్తి ఉన్నాయి. ఈ లయాభివ్యక్తే సంగీతంగా, నాట్యంగా, ఛందోరీతులుగా రూపుదాలుస్తుంది. ఈ విశిష్ట లయను గుర్తించిన వారే దానికి 'దేశి' అని పేరు పెట్టారు. సంగీత శాస్త్రకారులు, నాట్యశాస్త్ర ప్రవీణులు ఈ దేశి ధోరణిని గుర్తించారు. సాహిత్యశాస్త్రకారులు గుర్తించలేదు. గుర్తించినా చూచీ చూడనట్లు ఊరుకున్నారు. అయితే దేశి ప్రభావాన్ని మాత్రం ఎవరూ తప్పించుకోలేదు. రామాయణాన్ని కూడా కుశలవులు మొదట దేశి పద్ధతిలో గానం చేస్తే రాముడు మార్గ పద్ధతిలో కూడా పాడమని అడిగాడు, నాట్యశాస్త్రం దేశభాషల్ని, దేశి భంగిమల్ని గుర్తించింది. శిష్టులైన కూచిపూడి వారు జానపద యక్షగానాలనే భామాకలాపానికి మూలంగా తీసుకున్నారు. శుద్ధ దేశి రాగాలను వాగ్గేయకారులు వాడుకున్నారు.

సామాన్యార్థంలో 'మార్గ' అంటే సంస్కృతం, 'దేశి' అంటే ఆయాదేశాలకు చెందిందనే చెప్తున్నా ఒక్కొక్క భాషలోనూ మార్గ ధోరణులు, దేశి ధోరణులు మొదటినుంచి కనిపిస్తూనే ఉన్నాయి. పురాతనమైన సంస్కృత సంప్రదాయాన్నే పూర్తిగా అనుసరించే సాహిత్య ధోరణి ఏదీ లేదు. అలాగే ఆ పురాతన సంప్రదాయాన్ని పూర్తిగా విసర్జించిన సాహిత్య ధోరణీ లేదు. శుద్ధదేశిగా భావించదగిన జానపద సాహిత్యంకూడా రామాయణ మహాభారతాది వస్తువుల్ని గ్రహించింది. భాష, భావం, అలంకారం మొదలైన వాటిని కూడా 'శ్రుత పాండిత్యం' ద్వారా గ్రహించింది. ఇక సాహిత్య శిఖరాగ్రాన ఉన్న నన్నయాదులు 'నానారుచిరార్థసూక్తి నిధులే'. దేశిచ్ఛందస్సుల్ని, భాషను, నుడికారాలను నన్నయాది కవులందరూ వాడుకున్నారు. ప్రాఙ్నన్నయ యుగంనుంచి నేటి వరకు కవులమీద దేశిధోరణుల ప్రభావం కొద్దిగానో గొప్పగానో పడుతూనే ఉంది. అయితే ఈ ప్రభావానికి ఎక్కువగా లోనైన వారిని మనం దేశి కవులుగా పేర్కొంటున్నాం. భావం, భాష, ఛందస్సు విషయంలో ఎక్కువ దేశీయంగా రచితమైన వాటిని దేశి ప్రక్రియలుగా పేర్కొంటున్నాం. ఇలాంటి దేశి ధోరణులు ఇరుగుపొరుగు భాషల్లో సమానంగా ఉండడం సహజమే. తెలుగు కన్నడ భాషల్లో దేశి కవితా ధోరణుల్ని పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

శిష్ట సాహిత్యంలో అట్టడుగున ఉన్నట్లు మనం భావిస్తున్న జానపద సాహిత్యం దేశి సాహిత్యలో అగ్రస్థానంలో నిలుస్తుంది. దేశి ధోరణుల్ని ఎక్కువ శాతం ప్రతిబింబించేది జానపద సాహిత్యమే. గాథా సప్తశతిలో ఉల్లిఖితాలైన పెళ్ళి పాటలు, పొలం పాటలు తెలుగువో కన్నడానివో అయి ఉంటాయిగాని సంస్కృత ప్రాకృతాలకు సంబంధించినవి కావు. నన్నయకు ముందునుంచి రోకటి పాటల వంటివి ఉండేవనడానికి అద్దంకిశాసనంలోని తరువోజ సాక్ష్యమిస్తుంది. తరువోజను రోకటిపాటల్లో వాడుతారని విన్నకోట పెద్దన చెప్పాడు. కన్నడంలో కూడా తొమ్మిదవ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో రోకటి పాటను గూర్చిన ప్రస్తావన ఉంది. ఎనిమిదవ శతాబ్దికి చెందిన బాదామి శాసనంలో కన్నడ జానపద గాయత్రి అని పేరు పొందిన త్రిపది పద్యాలున్నాయి. ఇవన్నీ చూస్తే క్రీస్తు శకారంభంనుంచి ఈ రెండు భాషల్లో జానపద సాహిత్యం ఉండేదని ఊహించవచ్చు.

జానపద సాహిత్యంతో సహా అన్ని దేశి సాహిత్య ప్రభేదాలలో అన్నిటికంటే ముఖ్యమైంది లయ. దేశి తాళ ప్రధానమైందని చెప్పడానికి, ఎక్కువ స్వేచ్ఛ కలదని చెప్పడానికి, గాన యోగ్యమైందని చెప్పడానికి లయే కారణం, అందువల్ల జానపద సాహిత్యం నుంచి శిష్ట సాహిత్యం వరకు అన్ని ప్రక్రియల్ని పోల్చి చెప్పడానికి ముందు తెలుగు కన్నడాలలో సమానంగా ఉండే ఛందోప్రభేదాలను తెలుసుకోవలసి ఉంది.

తెలుగు వారు, కన్నడిగులు ప్రారంభకాలం నుంచి సంస్కృత ఛ్ఛందో రీతుల్ని విస్తృతంగా వాడుకున్నారు. అయితే శాసన కాలం నుంచి ఈ రెండు భాషల్లో దేశీయ పద్ధతులు కనిపిస్తూనే ఉన్నాయి. కన్నడంలో ప్రాసలేని పద్యమే లేదు. తెలుగులో ఉపజాతులలో, మంజరిలో తప్ప అన్ని పద్యాలలో ప్రాస ఉంటుంది. యతి తప్పకుండా అన్ని పద్యాలలో ఉంటుంది. ఈ విషయంలో కన్నడం, తెలుగు వెయ్యేళ్ళకు పైగా తమ సొంత ధోరణుల్ని కాపాడుకుంటూ వస్తున్నాయి.

కన్నడంలో జాతులు వేరుగా ఉన్నాయనే విషయాన్ని పదవ శతాబ్దిలోనే నాగవర్మ గుర్తించి ఛందోంబుధిలో వాటికి స్పష్టమైన నిర్వచనం ఇచ్చాడు. కన్నడంలోగాని తెలుగులోగాని దేశి ఛ్ఛందస్సు దేశీయ గణాలతో ఏర్పడుతుంది. తెలుగువారు ఈ గణాలను కూడా సంస్కృత పద్ధతిలోనే వివరించడానికి పూనుకున్నారు. కంద పద్యంలో నాలుగు మాత్రల గణాలను కూడా 'నల నగ సల భరత 'లని సంస్కృత గణాలతో నిర్వచించడానికి పూనుకున్నాం మనం. దీనివల్ల దేశిచ్ఛందస్సులోని ప్రత్యేక గుణానికి గుర్తింపు లభించలేదు. దీన్ని విస్తరించకుండా ఛందస్సు లక్షణాన్ని స్థూలంగా చెప్పాలంటే సంస్కృత ఛ్ఛందం అక్షరబద్ధమైంది. ప్రాకృత మూలంగా వచ్చిన మాత్రాచ్ఛందం అక్షరచ్ఛందస్సుకంటె ఎక్కువ స్వేచ్ఛ కలది. దేశీయ ఛ్ఛందస్సులో గణాలలో స్వాతంత్ర్యం ఎక్కువ. మాత్రాచ్ఛందస్సు, దేశిచ్ఛందస్సు గేయగుణం కలవి, లయ ప్రధానమైనవి. ఈ విషయంలో తెలుగు కన్నడాలకు దగ్గరి సంబంధం ఉంది.

తెలుగు కన్నడాలకున్న దేశి సంబంధాలు జానపద సాహిత్యంలో స్పష్టమవుతాయి. గేయం, కథాగేయం, సామెత, పొడుపుకథ మొదలైన సాహిత్య ప్రభేదాలలో తెలుగు కన్నడ భాషలలో లయాభివ్యక్తి చాలా సందర్భాలలో సమానంగా ఉంటుంది. లాలి, జోల, ఉయ్యాల పాట, పిల్లల పాటలు మొదలైనవన్నీ ఇందుకు ఉదాహరణంగా చెప్పుకోవచ్చు. సారంగధర, బాలనాగమ్మ,

కుమార రాముని కథ మొదలైన కథాగేయాలు రెండు భాషల్లోనూ ఉన్నాయి. కాటమరాజుకథ. పల్నాటివీర చరిత్ర, బొబ్బిలి యుద్ధం వంటివి తెలుగువారి ప్రాదేశిక వీర గాథలు, మలెయ మాదేశ్వర, మంటేస్వామి కావ్య, కిత్తూరు రాణి చెన్నమ్మ వంటివి కన్నడిగుల కావ్యాలు, ఇలా జానపద సాహిత్యంలో ఒకవైపు సమానాంశాలను కలిగి ఉంటూనే మరోవైపు ఈ రెండు భాషలు తమకే సొంతమైన సాహిత్యాన్ని నిర్మించుకుంటూ వచ్చాయి.

**దేశికవితా వికాసం :**

తెలుగులో నన్నయ కంటె ముందు, కన్నడంలో కవిరాజ మార్గం (9వ శతాబ్ది) కంటె ముందు మౌఖిక సాహిత్యం ఉందనడంలో సందేహంలేదు. అయితే అది మౌఖిక సాహిత్యం కావడం వల్ల ప్రత్యక్షమైన ఆధారాలను చూపడానికి వీలులేదు. కన్నడంలో లభ్యమైన రచనల్లో మొట్టమొదటిదైన కవిరాజ మార్గంలో దేశిని గూర్చిన వివరణ ఉంది. శిష్ట భాషకంటె వేరయిన మాండలికంగా ధేశిని కవిరాజమార్గకారుడు సూచించాడు. సంస్కృత పద బహుళమైన కావ్య భాషకంటె వేరయిన 'దేశి' ఉన్నట్లు స్థిరపరిచాడు. చత్తాణ, బెదండె అనేరెండు దేశీ ప్రక్రియల్ని గురించి కూడా చెప్పాడు. కంద పద్యాలు ఎక్కువగా వాడుతూ అక్కర, చౌపది, గీతికె, తివది మొదలైన వాటిని చేర్చి రచించింది చత్తాణ, ఇది దృశ్య ప్రక్రియ కావచ్చునని కొందరు పండితులు ఊహించారు. కందం తర్వాత ఒక వృత్తం, తర్వాత కొన్ని జాతులు కలిపి వ్రాసింది బెదండె. ఇది మన ఉదాహరణ కావ్యం వంటిదనిపిస్తుంది. కవిరాజ మార్గం నాటికే దేశిలో ఎంతో వైవిధ్యం ఉంది. అందుకే కవిరాజ మార్గ కారుడు వైవిధ్యం కలిగిన దేశికి లక్షణం చెప్పడం కష్టం అన్నాడు.

కవి రాజు మార్గంలోనూ, అందులో పేర్కొనబడిన చత్తాణ, బెదండె అనే ప్రక్రియల్లోను కందపద్యం ముఖ్యంగా కనిపిస్తుంది. కందం చెప్పిన వాడే కవి అంటున్నాం. కందం ప్రాకృత మూలం నుంచి వచ్చిందని ఊహించడానికి వీలున్నా 9వ శతాబ్ది నాటికే తెలుగులోనూ కన్నడంలోనూ స్థిరపడింది. కన్నడంలో ప్రాస, తెలుగులో యతి ప్రాసలు చేరి కందం అప్పటికే ప్రాచుర్యం పొందింది. తెలుగు కంద పద్యాలు కనిపిస్తున్న మొదటి శాసనాన్ని వేయించింది పంప తమ్ముడైన జినవల్లభుడు, నన్నయకు ముందే తెలుగులో దేశి పద్యాలైన అక్కర, సీసం, తరువోజ మొదలైనవి శాసనాలకెక్కాయి. కన్నడంలోను అక్కర, త్రిపది మొదలైనవి అప్పటికే శాసనాలలో, కావ్యాలలో వాడబడ్డాయి. 'కర్ణాటక విషయ జాతి' అనే పేరుతో దేశి పద్యాలను వివరించాడు నాగవర్మ (ఛందోంబుధి), ఇదంతా పదవ శతాబ్దినాటికే జరిగింది.

పంపకు ముందే అసగకవి అని ఉండేవాడు. అతను 'కర్ణాట కుమార సంభవం' వ్రాశాడు. నయసేన కవి ధర్మామృతంలో 'అసగన దేసి' అని 'ఉపమా కాళిదాసస్య' లాగా అసగకవి 'దేసి'కి పేరు పొందాడన్నాడు. అయితే అసగ కవి కావ్యం మనకు దొరక లేదు. నన్నెచోడుడు దేశిని గురించి పదేపదే చెప్పడం చూస్తే అతను కర్ణాటకుమార సంభవం చూచాడేమో అనిపిస్తుంది.

అసగ, పంప, పొన్న, రన్న మొదలైన మహాకవులు కావ్య రచన చేసిన యుగం క్షాత్ర యుగం. ఆనాడు చంపూ కావ్యాలు రాజ్యమేలాయి. మార్గ సంప్రదాయానికే ప్రాముఖ్యం

లభించింది. మార్గ-దేశి సమన్వయం సాధించాలని, రెండిటినీ మేళవించి ఉత్తమ కావ్యం రచించాలని పంప అభిప్రాయంగాతోస్తుంది. ఇదే అభిప్రాయాన్నే తెలుగులో నన్నె చోడుడు ఆమోదించి కొనసాగించాడు. 'దేశి మార్గములు దేశీయములుగా' ఉండాలన్నాడు. 'మార్గ కుమార్గము దేశి అమార్గము అంటూ ఏ మార్గమూ పట్టుకోలేని మార్గవులను' నిరసించాడు. కన్నడంలో పంపాదులు, తెలుగులో నన్నయ, నన్నెచోడుడు మొదలైన వారంతా మార్గ సంప్రదాయాన్నే అనుసరించారు. దేశికి సందర్భోచితమైన స్థానాన్ని వారికి తోచినట్లు కల్పించారు. పండిత జనామోద యోగ్యమైన మహాకావ్యరచన చేశారు.

తెలుగు కన్నడ సాహిత్యాలలో దేశి కవితావతరణానికి నడుం కట్టిన వారు శివకవులు. జానపద కవితా రూపంలో ఉన్న దేశి కవితను శిష్ట సమాజానికి దగ్గరగా తీసుకు వచ్చిన వారు శివకవులే. అప్పటివరకు చంపూ కావ్యం వ్రాయడమన్నది పాండిత్యానికి సంకేతంగా ఉంది. మాత్రా ఛందస్సులలో ప్రాచుర్యాన్ని సంపాదించిన రగడను విస్తృతంగా వాడిన హరిహరుడనే కన్నడ మహాకవి చంపూ కావ్యాన్ని వ్రాస్తే కాని తనకు గౌరవం లేదనుకున్నాడేమో! అందుకే గిరిజా కల్యాణాన్ని చంపూ కావ్యంగా వ్రాశాడు. అయితే బసవేశ్వరాదులు కవిత్వాన్ని సమాజంలోని అన్ని వర్గాలకు అన్ని జాతులకు అందించాలనుకున్నారు. వచనమనే ప్రక్రియ అవతరించింది. ఇది లయాత్మక వచనం. భక్తి సాహిత్య మాధ్యమంగా ఇది చాలా శక్తివంతమైదని భావించారు బసవేశ్వరాదులు. 12వ శతాబ్దిలో సుమారు మూడు వందల మంది వచన కారులు రచనలు చేశారు. వీరిలో నలభైమంది స్త్రీలు కూడా ఉండడం విశేసం. ఇది ప్రపంచ సాహిత్య చరిత్రలోనే అపూర్వం. స్త్రీలతో సహా అన్ని కులాలకు చెందిన వారు, అన్ని వర్ణాల వారు దేశి సాహిత్య సృష్టిలో పాలుపంచుకున్నారు.

దేశి సాహిత్య ధోరణుల్ని వైవిధ్యమయం చేసిన మరో మహాకవి హరిహరుడు. ఇతను వందకు పైగా రగడ కావ్యాలు వ్రాశాడు. శివ భక్తుల జీవిత చరిత్రల్ని అక్షర బద్ధం చేశాడు. కన్నడంలో మూడు రగడలున్నాయి. తెలుగులో అవి తొమ్మిదయ్యాయి. హరిహరుడు రగడలో కథాకావ్యాలు వ్రాశాడు. అతనిలా రగడలో వస్తు వైవిధ్యం, శైలీవైవిధ్యం చూపినవారు కన్నడంలో మరెవ్వరూ లేరు. రగడను తెలుగులో అనేక విధాలుగా వాడిన కవి పాల్కురికి సోమనాథుడు. బసవరగడ, సద్గురు రగళె, గంగోత్పత్తి రగళె మొదలైనవి వ్రాయడమే కాకుండా గద్యలనే పేరుతో వ్రాసినవి కూడా రగడలే. అయితే ఈ రగడలు కన్నడంలో ప్రాచుర్యంలో ఉన్న మూడు రగడల్లోనే ఇమిడిపోతాయి. అవి తప్ప మిగిలిన తెలుగు రగడలను సోమన తన గద్యాలలో ఉపయోగించలేదు. సోమన ద్విపదను వాడడానికి హరిహరుని రగడల ప్రేరణ ఉండే ఉంటుంది. అయితే రగడనే కథాకావ్యానికి ఉపయోగించవచ్చుకదా అనవచ్చు. కాని ద్విపద అచ్చమైన దేశి ఛందస్సు. రగడకంటె ఎక్కువగా జానపద సాహిత్యం ద్వారా తెలుగు వారికి పరిచితమైన ఛందస్సు. అందుకే సోమన దానిని ఎన్నుకున్నాడు. దేశీయమైన వస్తువులను తీసుకున్నాడు. దేశీయ సంస్కృతిని పాల్కురికి సోమనాథుడిలా కావ్యంలో ప్రదర్శించిన కవులు తెలుగులో చాలా అరుదుగా కనిపిస్తారు. ద్విపద ఒక మాధ్యమంగా తెలుగులో కొనసాగడానికి సోమన స్ఫూర్తినిచ్చాడు. రంగనాథ రామాయణం జానపదులలోకి కూడా చొచ్చుకుపోయింది. తోలు బొమ్మలాట వంటి శుద్ధ జానపద కళల్లో కూడా రంగనాథ రామాయణం వాడబడుతోంది.

పాల్కురికి సోమనాథుడు రచించి ప్రచారం చేసిన విశిష్ట ప్రక్రియ ఉదాహరణం. తెలుగులోనే కాక సంస్కృతంలోను ఈ ప్రక్రియను రచించి దేశీయమైన నడకలను సంస్కృత పాఠకులకు రుచి చూపించినవాడు సోమన. ఉదాహరణ ప్రక్రియకు ఏది మూలమో తెలియదు. కన్నడ కవిరాజ మార్గంలో కంద పద్యంతో ఇతర దేశీయ వృత్తాలను కలిపి చెప్పే చత్తాణ, బెదండె ప్రస్తావన ఉంది, అవి ఎలాంటివో తెలుసుకోడానికి అవకాశం లేదు. కావ్యావలోకనంలో 'దేసిగబ్బ' (దేశి కావ్యం) గురించి ఉంది. అందులోను కందం, జాతులు కలిసి ఉంటాయి. ఇలాంటి దేశీయ ప్రక్రియలు సోమనాథునికి ప్రేరణ కలిగించి ఉండవచ్చు.

కన్నడంలో హరిహరుడు రగడ ఛందస్సును వ్యాప్తిలోకి తీసుకొని వచ్చిన తర్వాత, అతనైతే చంపూకావ్యం వ్రాశాడు కాని, తర్వాతి వారంతా దేశీయ ఛ్ఛందస్సులనే వాడసాగారు. హరిహరుని మేనల్లుడు రాఘవాంకుడు. ఈ కవి షట్పదిని స్వీకరించాడు. రగడ నాతిదీర్ఘమైన కావ్యానికి పనికి వస్తుంది కాని మహాకావ్య సదృశమైన రచనకు పాదనియతిగల ఛందస్సే సమంజసమని రాఘవాంకుడు భావించాడు. షట్పది ఆరు పాదాల దేశీయ ఛ్ఛందోబంధం. రాఘవాంకుని తర్వాత భీమకవి (బసవ పురాణం) కుమారవ్యాసుడు (మహా భారతం), లక్ష్మీశుడు (జైమిని భారతం) మొదలైన కవులు కన్నడంలో గొప్ప కావ్యాలు వ్రాశారు.

ఇదే కాలంలోనే తెలుగులో తిక్కన ఎఱ్ఱన మొదలైన వారు మహాకావ్య సంప్రదాయాన్ని కొనసాగించారు. అయితే సమాంతరంగా వచనాలు, ద్విపదులు, ఉదాహరణాలు, కీర్తనలు మొదలైన దేశి సాహిత్య ధోరణులు కూడా కొనసాగుతూనే ఉన్నాయి. మరోవైపు జానపద సాహిత్య సంప్రదాయం అవిచ్ఛిన్నంగా సాగుతూనే ఉంది. కాటమరాజు కథలు, పల్నాటి వీర చరిత్ర వంటి గొప్ప జానపద కావ్యాలు వెలువడుతూనే ఉన్నాయి.

తెలుగు కన్నడాలలో పద సాహిత్యానికి 15వ శతాబ్దిలో ఎక్కువ ప్రాచుర్యం లభించింది. అన్నమాచార్యులు పద కవితాపితామహుడు. తెలుగు సాహిత్యంలోనే అపురూపమైన కవి, వాగ్గేయ కారుడు అన్నమయ్య. జానపద సాహిత్యంలోని నడకల్ని, భాషను, భావాలను అన్నమయ్యలాగా అత్యంత సామర్థ్యంతో వాడుకున్న కవులు అరుదుగా కనిపిస్తారు. ఇలాంటి పనినే కన్నడంలో పురందరదాసు, కనక దాసు నిర్వర్తించారు. కన్నడంలో వీరశైవం వచన ప్రక్రియను, భాగవత సంప్రదాయం కీర్తన ప్రక్రియను ఇచ్చాయి. ఈ కీర్తన సాహిత్యాన్ని తెలుగు కన్నడ భాషల్లో ఇటీవలి వరకు కొనసాగిస్తూనే ఉన్నారు. తెలుగులో క్షేత్రయ్య, త్యాగయ్య, సారంగపాణి మొదలైన వారంతా ఎన్నో ప్రయోగాలు చేశారు. కన్నడంలో వైష్ణవులు, మాధ్వులు సుసంపన్నం చేసిన కీర్తన ప్రక్రియను శైవులైన నిజగుణ శివయోగి, షడక్షరి లాంటి వారు, శిశునాళ షరీఫ్ (1900) లాంటి తాత్త్వికులు కూడా అందుకున్నారు.

ఒకవైపు కీర్తన సాహిత్యం వికాసం చెందుతున్న కాలంలోనే త్రిపది, సాంగత్యం అనే దేశి ఛ్ఛందస్సులు కూడా కన్నడంలో కావ్య రచనకు మాధ్యమాలయ్యాయి. త్రిపదిని విస్తృతంగా వాడి ప్రజల్లో ప్రచారం చేసిన ప్రఖ్యాత కవి సర్వజ్ఞుడు. వేమనకు ఆటవెలదిలాగా త్రిపది సర్వజ్ఞుడి ప్రయోగాలకు మూలమయింది. త్రిపదిలోనే దీర్ఘకావ్యాలు కూడా వెలువడ్డాయి. త్రిపదిని వాడిన వారిలో దాదాపు అందరూ వీరశైవులే కావడం విశేషం. సాంగత్యమనే దేశిఛ్ఛందస్సులో కూడా రత్నాకర వర్ణి వంటి మహాకవులు 'భరతేశవైభవ' లాంటి కావ్యాలను రచించారు.

సుమారు 16వ శతాబ్దినుంచి తెలుగు కన్నడాలలో ప్రాచుర్యం పొందిన ప్రక్రియల్లో యక్షగానం ఒకటి. కన్నడంలో రంగ భూమి 8వ శతాబ్దిలోనే ఉందనడానికి శాసనాధారాలున్నాయి. 'నాళ్ పగరణం' (దేశీయ ప్రకరణం) అనే ప్రక్రియ కవిరాజ మార్గ కాలంనుంచి ఉంది 'ఎక్కలగాణ' (యక్షగానం) 12వ శతాబ్దిలోనే ఉంది. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న కేళిక ఒక రూపకమే. అది ఈ నాటికీ కోలారు జిల్లాలో సజీవంగా ఉంది సోమనాథుడి కాలంలో త్రిపుర విజయం, దక్షాధ్వర ధ్వంసం, సిరియాళ చరిత్ర వంటి దేశీయ నాటకాలను ప్రదర్శించేవారు. ఆనాటికే తోలుబొమ్మలాట ఉంది. ఇవన్నీ తెలుగు కన్నడాలలో యక్షగానమనే విశిష్ట ప్రక్రియ ఆవిర్భావానికి దోహదం చేశాయి. యక్షగానాలలోని దేశి రచనలు చాలా వరకు తెలుగు కన్నడాలలో సమానంగానే ఉన్నాయి. లాలి, జోల, కీర్తన, మేలు కొలుపులు మొదలైన దేశి రచనలు ఈ రెండు భాషల యక్షగానాలలోను ఉన్నాయి.

మొత్తం మీద తెలుగు కన్నడ దేశి సాహిత్యాలను పరిశీలిస్తే కొన్ని పోలికలు, కొన్ని భేదాలు కనిపిస్తాయి. అక్కడి మహాకవులు కూడా దేశి ఛ్ఛందస్సులలోని చెలువును ఆదరించడం గమనించాల్సిన విషయం. అందువల్లనే కుమారవ్యాస భారతాన్ని ఈ నాటికీ గమక కళతో 'గేయ కావ్యం'గా పాడడం కనిపిస్తుంది. దేశిచ్ఛందస్సులతోబాటు దేశీయమైన భాష, ఆచార సంప్రదాయాలు, భావాలు కూడా చేరుతాయనడంలో సందేహం లేదు. కన్నడంలో ఛంపూ కావ్యాలు 129 వెలుబడితే షట్పది కావ్యాలు 582 వెలువడ్డాయి. రగడలు 212, సాంగత్యాలు 232 వెలువడ్డాయి. 346 మంది వచనకారులు, 300 మంది హరిదాస కీర్తన కారులున్నారు. దీనిని బట్టి దేశీయ ధోరణులకు ఎంత ప్రాధాన్యం ఇస్తూ వచ్చారో తెలుస్తుంది.

షట్పది, సాంగత్యం, కీర్తన, త్రిపది మొదలైన వాటిని కొన్ని మార్పులతో ఆధునికులు కూడా గ్రహించారు. కన్నడంలో ఇలాంటి దేశిచ్ఛందస్సులలో ఆధునిక కాలంలో కూడా ఎన్నో ప్రయోగాలు జరిగాయి. తెలుగులో గురజాడ, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు మొదలైన వారు గేయాలలో ఎన్నో ప్రయోగాలు చేశారు. ఆధునిక సాహిత్యంలో సుబ్బారావు పాణిగ్రాహి, చెరబండ రాజు, గద్దర్ వంటి విప్లవకవులు చేసిన ప్రయోగాలు కూడా గమనించ దగ్గవి.

అయితే శుద్ధ దేశి అనేది చాలావరకు జానపద సాహిత్యంలోనే ఉంటుందన్నది గమనించాలి. స్థాయీ భేదాలను బట్టి తుమ్మెద పదములు, వెన్నెల పదములు దగ్గరనుంచి శతకాల వరకు అన్ని ప్రక్రియల లోను దేశీయత చోటు చేసుకుంది. అందువల్ల ఈ సాహిత్యాధ్యయనాన్ని అట్టడుగు నుంచే ప్రారంభించాలి. ఈ సందర్భంలో కవిరాజ మార్గకారుడు చెప్పినది ఋచిరార్థసూక్తి. సామాన్యులలో కూడా మాన్యులు ఉంటారు. వారు "కురితోదదెయుం కావ్య ప్రయోగ పరిణత మతిగళ్"- అంటూ పెద్దగా చదువుకొకున్నా కావ్య ప్రయోగ పరిణత మతులే అని గుర్తిస్తే చాలు.



# పాణినీయంలో ఇత్సంజ్ఞలు

– డా॥ పి. ఎస్. సుబ్రహ్మణ్యం

## 0. అవతారిక

0.1 . పాణినీయ వ్యాకరణంలో సర్వసాధారణంగా ప్రత్యయాలూ, ఆగమాలూ, ధాతువులూ వ్యవహారంలో వాటిలో భాగంకాని అధిక ధ్వని/ధ్వనులతో ఇవ్వబడ్డాయి. (ఇటువంటి అధికధ్వని కొన్ని ప్రాతిపదికలకి కూడా చేర్చబడింది). ఆయా ప్రత్యయాద్యంశాల వ్యాకరణలక్షణాలని సూచించడానికి వైయాకరణుడు ఈ అధిక ధ్వనులని వాటికి చేర్చాడన్న మాట (వివరాలకి చూ. 4.3). ఇలా అధికంగా చేర్చబడ్డ ధ్వనికి పాణినిపెట్టిన సంజ్ఞ 'ఇత్' (సంజ్ఞ 47; ఇది ఇ-'పోవు' అనే ధాతువునుంచి వచ్చినది కాబట్టి దీని అసలు అర్థం "(భాషా వ్యవహారంలో) పోయేది" అని)[1]. పాణిని ముందు కాలంలో ఇటువంటి ధ్వనిని 'అనుబంధం' అనేవారు. పాణినీయ వ్యాఖ్యాతలు పై రెండు పదాలనీ కూడా యథేచ్ఛగా వాడేరు ( ఇంగ్లీషులో దీనికి ఉన్న సమానార్థకాలు: indicatory letter/ sound, indicator, silent letter, exponent, determinative, mute, marker). ప్రత్యాహార సూత్రాలలో ఒక్కొక్కదాని చివర ఉన్న హల్లు కూడా ఇటువంటి ఇత్సంజ్ఞే (చూ. §§ 3.0, 4.3, iii) ఇత్సంజ్ఞ వ్యాకరణంలో (ఉపదేశంలో) వ్యాకరణ కార్యాలని సూచించడానికి మాత్రమే ఉపయుక్తమవుతుంది; అది అసలు భాషలో (వ్యాకరణమర్యాదప్రకారం) తస్యలోపః 1.3.9 (§ 4.2) అనే సూత్రం వల్ల లోపిస్తుంది. దీని తాత్కాలికతని సూచించడానికి పతంజలి దీన్ని కాకితో పోల్చారు; ఒక ఇంటి మీద కొంతసేపే వాలి ఉండే కాకి ఆ ఇంటిని పక్కఇళ్ల నించి వేరు చేసి చూపెట్టడానికి ఉపయోగిస్తుంది. లుప్తే ऽను బంధే నష్టః ప్రత్యయోభవతి... తద్ యథా. ఇతరత్రాపి కతరద్ దేవదత్తస్య గృహం? అదో యత్రాసౌకాక ఇతి. ఉత్పతితే కాకే యద్యపి నష్టం తద్ గృహం భవత్యంతత స్తముద్దేశం జానాతి "ఇత్సంజ్ఞలోపించినప్పుడు ప్రత్యయం (గుర్తు) పోతుంది... అది ఈ కింది విధంగా. ఇతర సందర్భాలలో కూడా "ఈ రెండిటిలో దేవదత్తుని గృహం ఏది?" "అదిగో కాకి ఉన్నది" అని. కాకి ఎగిరిపోతే గృహం (గుర్తు) పోయినా (అడిగినవాడు) ఆ గృహాన్ని గుర్తిస్తాడు" - క్తక్తవతూ నిష్ఠా 1.1.26 కింద మహాభాష్యం). దేవస్థలి 1967 ఇత్సంజ్ఞలపై సమగ్ర పరిశోధనగ్రంథం

## 1. ఇత్సంజ్ఞల గుర్తింపు

1.1. ఇత్సంజ్ఞలుగా వాడబడిన ధ్వనులేవో మనం తెలుసుకోడానికి వీలుగా పాణిని కొన్ని సూత్రాలు ఇచ్చారు. అవి ఈ కిందివి (ఒకే అంశానికి ఒకటికన్న ఎక్కువ ఇత్సంజ్ఞలు కూడా ఉండవచ్చునని గమనించాలి).

(i) ఉపదేశే ऽజనునాసిక ఇత్ 1.3.2. "వ్యాకరణంలో ఇచ్చిన ధాతుప్రత్యయాది రూపాలలో అనునాసికంగా ఉచ్చరించబడిన అచ్చు ఇత్సంజ్ఞ"[2]. ఉదాహరణకి - మతుప్( = -మత్) ప్రత్యయంలో ఉకారం, 5 ఏ.వ. -ఇ+సి (=-అస్)లో ఇకారం ఏధ-(=ఏధ్-) 'వృద్ధిపొందు' అనే ధాతువులో అకారం, భవతు - (=భవత్-) 'తమరు' అనే సర్వనామ ప్రాతిపదికలో ఉకారం ఈ సూత్రం వల్ల ఇత్సంజ్ఞలుగా పరిగణించబడతాయి.

ఈ వ్యాసం నా "పాణినీయ వ్యాకరణం - శాస్త్రీయతా లక్షణాలు" అనే ప్రచురితం కావలసిన గ్రంథంలో 4వ అధ్యాయం. ఇందులో ఇచ్చిన రిఫరెన్సులు ఆ గ్రంథంలో ఇతర అధ్యాయాలకి సంబంధించినవి.

(ii) హలంత్యం 1.3.3. '(ఒక అంశానికి) చివరనున్న హల్లు ఇత్సంజ్ఞ". దీనివల్ల ఇత్సంజ్ఞలయ్యే వాటికి ఉదాహరణలు : ప్రత్యాహారసూత్రాలకి చివరుండే హల్లు, - మతుప్ (=మత్)లో పకారం, 2 ద్వి.వ. -ఔట్ (=-ఔ)లో టకారం. 7 బ.వ. -సుప్ (=-సు)లో పకారం, దీని తరవాత సూత్రం దీనికి అపవాదం.

(iii) న విభక్తౌతుస్మాః 1.3.4. "విభక్తిప్రత్యయం, సమాపక క్రియాప్రత్యయం చివర ఉండే తవర్గ (=త,థ,ద,ధ,న) సకార మకారాలు ఇత్సంజ్ఞలు కావు". దీనివల్ల ఇత్సంజ్ఞలుగా పరిగణింపబడని వాటికి ఉదాహరణ. 5 ఏ.వ. - ఆత్ (పట్టిక 9.1.)లో తకారం, , లిఙ్ ఆత్మనే పద ప్రథమపురుష బ.వ. -రన్‌లొ నకారం (ఝస్య రన్ 3.4. 105, ξ 10.8.4). 1. బవ. -జస్ (=-అస్) 2బ.వ. -శస్ (=-అస్). పరస్మైపద ప్రథమపురుష బ.వ. -తస్ (పట్టిక 10.1)లలో సకారం, 3,4,5, ద్వి.వ. -భ్యాం, 6 బ.వ. -ఆం. ఆత్మనే పద ప్రథమపురుష ద్వి.వ. - ఆతాం (పట్టిక 10.2)లలో మకారం.

(iv) ఆదిర్ ఞిటుడవః1.3.5 "(ధాతువు) మొదట ఉండే ఞి, టు, డు లు ఇత్సంజ్ఞలు". ఉదా. (ఞి) ధృషా -(=ధృష్-) 'ఎదుర్కొను', (టు) వేపృ' - (=వేప్-) 'వణుకు', (డు) పచష్- (=పచ్-) 'వండు'.

(v) షః ప్రత్యయస్య 1.3.6. "ప్రతయం ముందు ఉన్న షకారం ఇత్సంజ్ఞ". ఉదా. -ష్వున్ (=వు=అక) అనే తద్ధిత ప్రత్యయంలొని షకారం (శిల్పిని ష్వున్ 3.1.145).

(vi) చుటూ 1.3.7 "ప్రత్యయంముందు ఉన్న చవర్గ (=చ,ఛ,జ,ఝ,ఞ), ట వర్గ (=ట,ఠ,డ,ఢ,ణ) హల్లు ఇత్సంజ్ఞ" ఉదా. చ్ఫఞ్ (=ఫ=-ఆయన) ప్రత్యయంలో చకారం (చూ.గోత్రే... 4.1.98), 1 బ.వ. -జస్ (=-అస్)లో జకారం, -ఞ్య (=-య, చూ, శండికాదిభ్యో ఞ్యః 4.3.92)లో ఞకారం, -ట(=-అ, చూ. చరేష్టః 3.2.16)లో టకారం. -డ (=-అ,చూ. సప్తమ్యాం జనేర్డః 3.2.97)లో డకారం, -ణ (=అ, చూ. అన్నా ణ్ణః 4.4..85)లో ణకారం.[3]

(vii) లశక్వతద్ధితే 1.3.8 "తద్ధిత ప్రత్యయం కాని ప్రతయ్యం ముందున్న లకార శకార కవర్గాక్షరాలు (= క,ఖ,గ,ఘ,ఙ) ఇత్సంజ్ఞలు" ఉదా. ల్యుట్ (=యు=అన, చూ. ల్యుట్ చ 3.3.115)లో లకారం, 2 బ.వ. -శస్( = అస్)లో శకారం, - క్త (=-త), - క్తవతు (= - తవత్) ప్రత్యయాలలో కకారం (చూ. నిష్ఠా 3.2.102), -ఖచ్ (= - అ, చూ. ప్రియవశే... 3.2.38) లో ఖకారం, - ఘురచ్ (=-ఉర, చూ. భంజభాన... 3.2.161)లో ఘకారం, 4 ఏ.వ. -ఙే (=-ఏ)లో ఙకారం. 'అతద్ధితే' అనే అపవాదం వల్ల తద్ధిత ప్రత్యయాలైన -లచ్ (=ల, చూ. ప్రాణిస్థాత్... 5.2.96), -శ (=-శ, చూ. లోమాది ...5.2.100), -కన్ (=-క, చూ. కర్ణలలాటాత్... 4.3.65)లలోని లకార శకార కకారాలు ఇత్సంజ్ఞలు కావు. వరరుచి (ఇర ఉపసంఖ్యానం, 1.3.7 కింద వార్తికం) చెప్పినట్లు ధాతుపాఠంలో ధాతువుల చివర ఉండే ఇర్ (ξ. 4.4.3.)ని ఇత్సంజ్ఞగా గుర్తించడానికి (ఉదా. రుధిర్ - (=రుధ్- 'ఆపు') సూత్రాలలో స్పష్టమైన ఉక్తిలేదు. కాని పాణిని ఇరితో వా 3.1.57 అనే సూత్రంలో ఇర్ ఇత్సంజ్ఞ అనే విషయాన్ని సూచించారు. పైన చెప్పినవి కాక ధాతువులలో ఉదాత్తానుదాత్త స్వరితాలు అనే మూడు స్వరాలూ కూడా ఇత్సంజ్ఞలుగా వాడబడ్డాయని గుర్తించాలి (చూ. ξ . 4.3.(x)).

## 2. ఇత్సంజ్ఞల స్వభావం

2.1. ఒక శబ్దాన్ని సూత్రాల ద్వారా నిష్పత్తి చేసే ప్రక్రియలో ఇత్సంజ్ఞలు వాటి పనిని నిర్వహించిన తరవాత తస్యలోపః 1.3.9 అనే సూత్రం వల్లలోపిస్తాయి. ఇత్సంజ్ఞలకీ అవి చేర్చబడిన అంశాలకీ మధ్య అవినాభావ సంబంధం ఏమీ లేదు. ఈ విషయాన్ని ఈ కింది మూడు వ్యాకరణ ప్రక్రియల విషయంలో జ్ఞాపకం పెట్టుకోవాలి. (i) ఒక ప్రత్యయం ఒక ధ్వని కలదా? లేక అంతకన్నా ఎక్కువ

ధ్వనులు కలదా? అని నిర్ణయించేటప్పుడు ఇత్సంజ్ఞని లెక్కలోకి తీసుకోకూడదు (నానుబంధకృత మనే కాల్యం 'ఇత్సంజ్ఞ వల్ల ఒకటికన్న ఎక్కువ ధ్వనులు కలిగి ఉండడం జరగదు', పరిభాష 6, పరిభాషేందుశేఖరం, చూ.§ 6.12). (ii) రెండు ప్రత్యయాలు రూపంలో ఒకటా కాదా అనే విషయాన్ని నిర్ణయించడంలో ఇత్సంజ్ఞలని లెక్కలోకి తీసుకోకూడదు; ఉదాహరణకి, -క (-=అ), -అణ్ (=-అ) అనే రెండు ప్రత్యయాలూ ఇత్సంజ్ఞలు వేరైనా ఒకే రూపం కలవిగా పరిగణించబడతాయి (నానుబంధకృత మసారూప్యం, పరిభాష 8, పరిభాషేందు శేఖరం, చూ.§ 6.36). (iii) దైప్ -(=దై-) 'కోయు' అనే ధాతువు ఇత్సంజ్ఞ అయిన పకారాన్ని లెక్కలోకి తీసుకోకుండా ఐ కారాంతమే అని నిర్ణయించాలి. అదేచ ఉపదేశే 2 శితి 6.1.45 అనేసూత్రం వల్ల ధాతువు చివర ఉన్న ఐకారానికి ఆకారం ఆదేశంగా కొన్ని సందర్భాలలో వస్తుంది.; పై ధాతువులో ఐకారం చివర ఉన్నట్లు పరిగణిస్తేనే ఈ సూత్రం దానిపై ప్రవర్తిస్తుంది (నానుబంధకృత మనే జంతత్వం, పరిభాష 7; పరిభాషేందు శేఖరం)

## 3. ఇత్సంజ్ఞల పనులు

3.1. వ్యాకరణంలో ఇత్సంజ్ఞలు నిర్వహించే పనులు పది విధాలుగా ఉంటాయని సంగ్రహించి చెప్పవచ్చు. అవి ఈ కిందివి (ఒకే ఇత్సంజ్ఞ అది చేరిన అంశానికి అనుగుణంగా వేరు వేరు కార్యాలు నిర్వహించవచ్చు, ఉదాహరణలకి, చూ. § 4.4.5, § 4.4.7, 4.4.20).

(i) ఇత్సంజ్ఞలలో అధిక సంఖ్యాకమైనవి చేసేపని అవి ఉన్న ప్రత్యయం ప్రకృతికి చేరినప్పుడు ప్రకృతిలోని ధ్వనులలోనూ స్వరంలోనూ వచ్చే సంధి మార్పులని సూచించడం (వివరాలకి చూ.§ 4.4.)

(ii) ధాతువులకి చేరిన ఇత్సంజ్ఞల వంటి కొన్ని ఇత్సంజ్ఞలు అవి ఉన్న ప్రకృతి ఏ ప్రత్యయాన్ని కాని ఏ ప్రత్యయ సముదాయాన్ని కాని తీసుకొంటుందో సూచిస్తాయి; టు (§4.4.21), ష్ (§4.4.32).

(iii) కొన్ని ఇత్సంజ్ఞలు కృత్రిమమైన పారిభాషిక పదాలని సృష్టించడానికి ఉపయోగిస్తాయి. ప్రత్యాహారసూత్రాల చివరి హల్లుల ప్రయోజనం ఇదే (చూ. అధ్యాయం 3). 7 బ.వ. - సుప్ (=-సు)లో పకారం ఉపయోగం కూడా ఇదే. 1 ఏ.వ. -సు (=-స్) దీనితో కలిసి సుప్ (సంజ్ఞ 241) అనే పారిభాషిక పదం ఏర్పడింది; ఇది విభక్తి ప్రత్యయాలన్నిటికీ సంజ్ఞ. 1. ఏ.వ. -సు (=-స్), 2 ద్వి.వ. -ఔట్ (-ఔ)లోని ట్‌తో కలియడం వల్ల ఏర్పడిన సుట్ (సంజ్ఞ 240) మొదటి ఐదు విభక్తి ప్రత్యయాలకే పేరు. పరస్మైపద ప్రథమపురుష ఏ.వ. -తిప్ (=-తి)లోని తి ఆత్మనేపద ఉత్మపురుష బ.వ. -మహిఙ్ (-=మహి)లోని ఙ్‌తో కలిసి ఏర్పడిన తిఙ్ (సంజ్ఞ 113) సమాపక క్రియా ప్రత్యయాలన్నిటికీ సంజ్ఞ; ఈ విధంగానే ఏర్పడిన తఙ్ (సంజ్ఞ 108) ఆత్మనేపద సమాపక క్రియాప్రత్యయాలకి పేరు. కు,చు,టు,తు,పు అనే సంజ్ఞలలో ఉకారం ప్రయోజనం కూడా ఇటువంటిదే; ఉదాహరణకి కు కవర్గాక్షరాలైన క,ఖ,గ,ఘ,ఙలకి సంజ్ఞ.

(iv) ప్రత్యయాలకు చేరు ఇత్సంజ్ఞలలో కొన్ని నిష్పన్నమైన పదంలో ఏ అచ్చు ఉదాత్తమో (లేక అరుదుగా స్వరితమో) సూచిస్తాయి. ఇలా స్వరాన్ని సూచించే ఇత్సంజ్ఞలు ఏడు త్,న్,శ్,చ్,క్,ర్,వ్,ప్ అది ఉన్న ప్రత్యయం అనుదాత్తమని చెప్తుంది. (వివరాలకి చూ. § .4.4). కాని పై వాటిలో కొన్నిటికి ఇది ఒక్కటి మాత్రమే ప్రయోజనం కాదు.

(v) కొన్ని ఇత్సంజ్ఞలు భాషలో ఒకేరూపంలో ఉన్న రెండు ప్రత్యయాలని వేరుచేసి సందేహానికి తావులేకుండా అంచులో ఒక దాన్ని నిర్దేశించడానికి ఉపయోగిస్తాయి. ఉదా. 1. బ.వ. -జస్ (= అస్) లో జకారమూ, 2 బ.వ. -శస్ (=-అస్)లోని శకారమూ ఈ రెండు ప్రత్యయాలనీ విడిగా నిర్దేశించడానికి వీలు కల్పిస్తాయి. 5 ఏ.వ. -ఙసి (=-అస్)లోని ఇకారం దీన్ని 6 ఏ.వ. ఙస్ (=-అస్) నించి వేరుచేస్తుంది (చూ. పట్టిక 5.2.)

(vi) సమానార్థకాలైన కొన్ని ప్రత్యయాలని కలిపి నిర్దేశించేటప్పుడు సందిగ్ధతని నివారించడానికి కొన్ని ఇత్సంజ్ఞలు ఉపయోగిస్తాయి. ఉదాహరణకి -టాప్, -డాప్, -చాప్ అనే మూడు స్త్రీ ప్రత్యయాలనీ కలిపి - ఆప్ అని పాణిని వ్యవహరించారు (చూ. హల్ ఙ్యా బ్భ్యో... 6.1.68; చూ. క్రి. 7.5). వీటిలో చివరిరెండింటిలో డకార చకారాలకి ప్రత్యేక ప్రయోజనాలు ఉన్నాయి కాని మొదటి దాంట్లో టకారానికి మాత్రం ప్రత్యేక వ్యాకరణ ప్రయోజనం ఏమీలేదు. అదిలేక పోతే దానిరూపం -ఆప్ గానే ఉండి దానికీ సముదాయ సంజ్ఞ అయిన - ఆప్ కీ తేడా లేకపోవడం వల్ల సముదాయ సంజ్ఞ చెయ్యడం అసంభవం అయి ఉండేది. (పైమూడు ప్రత్యయాల అసలురూపం – ఆ మాత్రమే)

(vii) కొన్ని ఇత్సంజ్ఞలు అవి ఉన్న అంశం (ముఖ్యంగా ఆగమం ఏ స్థానంలో చేరుతుందో సూచిస్తాయి. ఆగమాలకి చేరే కకార టకారాలూ, ఆగమాలకి కాని ప్రత్యయాలకి కాని చేరే మకారమూ, ఆదేశాలకు చేరే ఙకారమూ ఈ పనిని నిర్వహిస్తాయి.

(viii) ఇత్సంజ్ఞలుగా వాడబడిన అచ్చులలో కొన్ని ఉచ్చారణ సౌలభ్యం కోసం వాడబడినవి; మరికొన్ని వ్యాకరణ ప్రయోజనాల కోసం వాడబడినవి. మొదటిరకం వాటికి ఉదాహరణలు . ప్రత్యాహార సూత్రాలలో హల్లులకు చేర్చిన అకారం, 1.ఏ.వ. -సు (=-స్)లో ఉకారం, సూత్రాలలో ధాతువుని నిర్దేశించినప్పుడు దానికి చేర్చిన ఇకారమూ (ఉదా: గమ్ - అనే ధాతువుని గమి అని నిర్దేశించడం, గమే రిట్ పరస్మైపదేషు 7.2.58) [4] కొన్ని సందర్భాలలో ఒక ప్రత్యయం చివరి హల్లు ఇత్సంజ్ఞ కాకుండా ఉండడానికి (చూ.క్రి4.1.1. (ii)) దాని చివర ఒక అచ్చు చేర్చబడింది. – విని (=-విన్) ప్రత్యయం చివరి ఇకారమూ (చూ అస్ మాయా ....5.2.121), -థము(ప -థమ్) ప్రత్యయం చివరి ఉకారమూ (చూ. ఇదమస్థముః 5.3.24) ఇటువంటివి; ఇవి లేకపోతే ఈ ప్రత్యయాల చివరి నకారమకారాలు ఇత్సంజ్ఞలై భాషలో లోపించవలసి వచ్చేది. ఇకరెండోరకమైన వ్యాకరణప్రయోజనం కల ఇత్సంజ్ఞలకి ఉదాహరణలు : ధాతుపాఠంలో ధాతువులకు చేర్చబడిన అచ్చులూ (చూ క్రి క్రి 4.4.1., 4.4.2, మొ), -మతుప్ (=-మత్ ప్రత్యయంలోని ఉకారమూ ఉచ్చారణ సౌలభ్యం కోసమే వాడబడిన అచ్చులు ఇత్సంజ్ఞలుగా పరిగణించవచ్చునా లేదా అనే విషయంలో వ్యాఖ్యాతలకు భిన్నాభిప్రాయాలున్నాయి. కాశికాగ్రంథకర్తల మతంలో అవి ఇత్సంజ్ఞలు కావు. కాని నాగేశభట్టు (తస్యలోపః 1.3.9 కింద ఉద్యోతం) అవి కూడా ఇత్సంజ్ఞలే అని పతంజలి స్పష్టంగా చెప్పేరనీ అవి ఇత్సంజ్ఞలు కాకపోతే ఎలా లోపిస్తాయి అనీ అన్నారు ఉచ్చారితస్య నివృత్తిః కథం స్యాదితి భావః.. ఉచ్చారణార్థానా అపి ఇత్త్వంచ 'ప్లేసిచ్ వేర్ అపృక్తస్య' ఇత్యాదౌభాష్యే స్పష్టం ఉక్తం[5].

(ix) చాలా కొద్ది సందర్భాలలో ఇత్సంజ్ఞలుగా ఉపయుక్తమైన హల్లుకి ప్రయోజనమేమీ కనిపించదు. 3 ఏ.వ. -టా (=ఆ)లో టకారం దీనికి మంచి ఉదాహరణ, కాశికకి న్యాసం అనే వ్యాఖ్యానం రచించిన జినేంద్రబుద్ధి (చూ.క్రి. 1.4.2.) ఇది ఈ ప్రత్యయాన్ని వైదికభాషలో 1,2, విభక్తుల ద్వి. వ, ప్రత్యయమైన -ఆ (చూ. సుపాం సులుక్... 7.1.39,క్రి 9.13.1. (iv) ) నించి వేరు చెయ్యడానికి

ఉపయోగిస్తుందని అన్నారు (స్వౌజసమౌట్... 4.1.2. కింద). కాని ఈ రెండిటి మధ్యా సందిగ్ధత రావడానికి అవకాశం లేనందువల్ల (రెండో ప్రత్యయం 7.1.39 సూత్రంలో తప్ప వేరెక్కడా ప్రసక్తమవలేదు) ఈ వివరణ 'స్థితస్యగతిశ్చింతనీయా' అనే ఉద్దేశంతో ఇవ్వబడిందని అనుకోవాలి.

(x) పాణిని ఉదాత్తానుదాత్త స్వరితాలనే మూడు స్వరాలనీ కూడా ధాతుపాఠంలో ఇత్సంజ్ఞలుగా వాడేరు. కాని దురదృష్టవశాత్తూ తరవాత కాలంలో వీటి ఉచ్చారణ లోపించిపోయింది. తన కాలంతరువాత భాషలో స్వరభేదం పోవడం వల్ల తాను ఇత్సంజ్ఞలుగా వాడిన స్వరాలు కూడా పోతాయని పాణిని ఊహించలేదు; ఇత్సంజ్ఞలైన అచ్చుల అనునాసికత కూడా అలాగే లోపించింది (చూ. శ్ర. 4.1.1.(1), అథస్సూచిక 2). అందువల్ల పతంజలి మొదలైన వ్యాఖ్యాతలు అనుదాత్తేత్తులైన ధాతువులని ఒకచోట సంగ్రహించి చెప్పేరు (ఏకాచ... 7.2.10 కింద). ధాతుపాఠంలో స్వరాలు రెండు విధాలుగా ఉపయుక్తమయ్యాయి. ధాతువుకి ఇత్సంజ్ఞగా వాడబడిన అచ్చుని మూడు స్వరాలలో ఒక దానితో ఉచ్చరించడం ఒక విధం. ధాతువులో ఉన్న (మొదటి) అచ్చుని ఉదాత్తంగా గాని అనుదాత్తంగా గాని ఉచ్చరించడం రెండోవిధం. మొదటి రకం కిందకి వచ్చే ధాతువుని అనుదాత్తేత్ 'అనుదాత్తాచ్చు ఇత్సంజ్ఞగా కలది, స్వరితేత్, ఉదాత్తేత్ అంటారు. రెండోరకం కిందకి వచ్చే ధాతువుని అనుదాత్త (ధాతుః), ఉదాత్త (ధాతుః) అంటారు. ఇలా రెండు రకాలుగా ఉపయుక్తమైన స్వరభేదాల ప్రయోజనాలు వేరు వేరు. అనుదాత్తేత్ అయిన ధాతువు ఎప్పుడూ ఆత్మనే పదప్రత్యయాలనే తీసుకొంటుంది; స్వరితేత్ క్రియాఫలం కర్తకు చెందేటప్పుడే ఆత్మనే పదప్రత్యయాలని తీసుకొంటుంది (చూ శ్ర.10.0.5). ధాతుపాఠంలో అనుదాత్తంగా ఉచ్చరించబడిన ధాతువు ఒక అచ్చు మాత్రమే ఉన్నది అయితే (i) దాని తరువాత వచ్చే ఆర్ధధాతుకప్రత్యయానికి సాధారణంగా ఇడాగమంరాదు (చూ.ఏ కాచుపదేశే ఽను దాత్తాత్ 7.2.10), (ii) దానిలోని అనునాసికం కొన్ని ప్రత్యయాల ముందు లోపిస్తుంది. (చూ అనుదాత్తోపదేశ... 6.4.37). ధాతుపాఠంలోని ఈ స్వరాలు ధాతువులతో నిత్య సంబంధం కలవి కావనీ వ్యవహారంలో అవి మిగిలిన ఇత్సంజ్ఞల లాగే లోపిస్తాయనీ గమనించాలి.

## 4. ఇత్సంజ్ఞలూ – వాటి ప్రయోజనాలూ (అకారాది క్రమంలో)

4.0. కింద ఇత్సంజ్ఞలు అకారాది క్రమంలో ఇవ్వబడ్డాయి. ఒక్కొక్క ఇత్సంజ్ఞ ప్రయోజనం, ముఖ్యంగా దానివల్ల ప్రకృతిలో వచ్చే ధ్వని మార్పులు సూచితమయ్యాయి. స్వరాలూ, ఉచ్చారణార్థకాచ్చులూ, ప్రత్యాహారసూత్రాల చివరి హల్లులూ ఇందులో చేర్చబడలేదు.

4.1. **ఆ**. (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం)(i) ఇది ఉన్న ధాతువు తరువాత వచ్చే -క్త (=-త), -క్తవతు (=-తవత్) ప్రత్యయాల ముందు ఇట్ (=ఇ) ఆగమం రాదు (ఆదితశ్చ 7.2.16) ఉదా. ఞిమిదా (=మిద్-'లావుగా ఉండు') అనే ధాతువుకి -క్త చేరి మిద్-త > మిన్న 'లావు అయిన' (రదాభ్యాం... 8.2.42); ఇదే విధంగా -క్తవతుతో మిద్-తవత్ > మిన్నవత్ 'లావెక్కిన'.(ii) ఇటువంటి ధాతువు తరువాత వచ్చే -క్త ప్రత్యయం భావాన్ని గాని క్రియాప్రారంభాన్నిగాని సూచించేటప్పుడు దానికి ఇట్ (=ఇ) ఆగమం వైకల్పికం (విభాషా భావాదికర్మణోః 7.2.1. ఉదా. మిన్న /మేదిత (పుగంతలఘూపధస్యచ 7.3.86 (అనుబంధం I. 20 )వల్ల ఇ > ఎ)

4.2. **ఇ**. ఇది ధాతుపాఠంలో ధాతువుకి చివర దీని తరువాత హల్లు లేకుండా ఉపయుక్తమైనప్పుడే ధాతువులో మార్పు సూచిస్తుంది. అటువంటి సందర్భాలలో ఇది అన్ని ప్రత్యయాల ముందూ ధాతువు నుం(=న్) అనే ఆగమాన్ని తీసుకొంటుందని చెప్తుంది (ఇది తోనుంధాతోః 7.1.58) ఉదా. కుడి -=(కుడ్-) 'కాలు (క్రియ)' అనే ధాతువు నించి కుడ్ -ఇతుం > కున్డ్ - ఇతుం > కుండితుం

`కాలడానికి`(ష్టునాష్టుః 8.4.4.1 వల్ల న > ణ) (మకారం ఇత్సంజ్ఞగా గల ఆగమం చివరి హల్లు తరువాత వస్తుంది; చూ. ౕ . 4.4.28).

4.3. **ఇర్.** (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం). ఇది ఉన్న (పరస్మైపద) ధాతువుకి లుఙ్ ప్రత్యయం ( ౕ. 10.9.2) ముందు చేరే చ్లి ప్రత్యయానికి అఙ్ (=అ) వైభాషికంగా ఆదేశమవుతుంది. (ఇరితో వా 3.1.57), ఉదా. భిదిర్ – (భిద్-) `విరుచు` అనే ధాతువు లుఙ్ పరస్మైపద ప్రథమపురుష ఏ.వ. రూపాలు అభిదత్ (ఇందులో చ్లి > అ) అభైత్సీత్ (ఇందులో చ్లి > సిచ్ (=-సీ) `విరిచాడు/విరిచింది.

4.4. **ఈ** (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం.) ఇది ఉన్న ధాతువు తరువాత వచ్చే -క్త (=త), -క్తవతు (=తవత్) ప్రత్యయాలకి ఇట్ (=ఇ) ఆగమంరాదు (శ్వీదితో నిష్ఠాయాం 7.2.14), ఉదా. ఓలజీ – (=లజ్-) `తగులు` ధాతువుకి -క్త చేరి లజ్ -త > లజ్ -న (ఓదితశ్చ 8.2.45 వల్ల త > న, . 4.4.10)> లగ్-న 'తగిలిన' (చోఃకుః 8.2.30 వల్ల జ > గ); అదేవిధంగా లగ్-నవత్ 'తగిలినర్ది

4.5 **ఉ** (i) ధాతువుతో ఉపయుక్తమైనప్పుడు ఇది ఆ ధాతువు తరువాత వచ్చే -క్త్వా (=త్వా) ప్రత్యయం వైభాషికంగా ఇట్ (=ఇ) ఆగమాన్ని చేర్చుకొంటుందని చెప్తుంది (ఉదితో వా 7.2.56), ఉదా శము- (=శమ్-) `శాంతించు` ధాతువుకి పై ప్రత్యయం చేరగా శమ్-త్వా > శమిత్వా / శాన్ -త్వా `శాంతించి` (అనునాసికస్య... 6.4.15 వల్ల అ > ఆ)(ii)ఒక ప్రత్యయం (ఉదా -మతుప్ (=-మత్))తో ఉపయుక్తమైనపుడు ఇది ఆప్రత్యయంతో అంతమయ్యే ప్రాతిపదిక సర్వనామస్థానప్రత్యయాల (సంజ్ఞ 237) ముందు నుమ్ (=న్) ఆగమాన్ని చేర్చుకొంటుందని సూచిస్తుంది (ఉగిదచం సర్వనామస్థానే ౽ ధాతోః7.2.70) ఉదా. గో-మత్-సు > గో-మాత్-స్ (అత్వసంతస్యచాధాతోః 6.4.14 వల్ల అ > ఆ ) > గో – మాన్త్-స్ (7.1.70 వల్ల నుమాగం > గో - మాన్త్ (హల్ఙ్యా బ్భ్యో... 6.1.68, . 9.1.2.)> గో – మాన్ 'గోవులు కలవాడు' (సంయోగాంతస్య లోపః 8.2.23 వల్ల తో > Ø). (iii) ఉ,ఋ లేక ఇత్సంజ్ఞగాగల (ఉగిత్) ప్రత్యయంచివరగల ప్రాతిపదికకి స్త్రీలింగంలో -ఙీప్ (=-ఈ) ప్రత్యయం చేరుతుంది (ఉగితశ్చ 4.1.6), ఉదా. పచ్ - శతృ-ఙీ పచంతీ 'వంటచేసే స్త్రీ (ఇందులో -శతృ -(=-అత్-) ఋ ఇత్సంజ్ఞగా గలది). ఇటువంటి ప్రాతిపదికల చివర స్త్రీలింగ ప్రత్యయమైన ఈకారం – తర (ప్), -తమ(ప్) ప్రత్యయాల ముందు వైభాషికంగా హ్రస్వమవుతుంది, (ఉగిత శ్చ 6.3.45), ఉదా. విదుషీ-తరా/విదుషి-తరా 'ఇద్దరిలో మంచి పండితురాలు' (ఇందులో విద్ - 'తెలుసుకొను' అనే ధాతువు తరువాత - వసు - (= – వస్.) అనే ప్రత్యయం ఉకారం ఇత్సంజ్ఞగా గలది).

4.6 **ఊ**. (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం) ఇది అను బంధంగా ఉన్న ధాతువు తరువాత వచ్చే ఆర్ధధాతుక ప్రత్యయం యకారేతరహల్లుతో మొదలయ్యేది అయితే దాని ముందు ఇ(ట్) ఆగమం వికల్పంగా చేరుతుంది (స్వరతి సూతి సూయతి ధూ ఞూదితో వా 7.2.44); ఉదా. గుపూ ధాతువు లో ఊకారం అనుబంధం, దీనికి – తుమున్ (=-తుమ్) అనే ఆర్ధధాతుక ప్రత్యయం చేరిస్తే గుప్ - తుమ్ > గోప్తుం / గోపితం `రక్షించడానికి' (పుగంత... 7.3.86 అనుబంధం.I. సూ. 20).

4.7.**ఋ.** (i) ఒక ధాతువుతో ఉపయుక్తమైనప్పుడు ఇది ఆ ధాతువు ప్రేరణప్రత్యయం - ణి(=ఇ)+లుఙ్ లకారానికి చెందిన-చఙ్ (=అ) అనే ప్రత్యయ సముదాయం ముందు తన ఉపధాచ్చుని హ్రస్వంగా మార్చుకోదు అని చెప్తుంది; ఉదా. బాధృ (బాధ్) 'బాధించు' ధాతువు నించి వచ్చిన అబబాధత్ 'బాధించాడు / బాధించింది', (ii) ఒక ప్రత్యయం (ఉదా. – శతృ) (=అత్)తో

ఉపయుక్తమైనప్పుడు ఇది అ్రప్రత్యంతో అంతమయ్యే ప్రాతిపదిక సర్వనామస్థాన ప్రత్యయాల ముందు నుమ్ (=న్) ఆగమాన్ని చేర్చుకొంటుందని సూచిస్తుంది. (ఉగిదచాం.. 7.1.70); ఉదా. పచ్-శప్-శతృ - సు > పచ్-అ-అన్త్-స్ (7.1.70 వల్ల నుమ్) > పచన్ 'వండేవాడు' (చూ. 64.4.5 (iii) శతృప్రత్యయం విషయంలో దీనికి కొన్ని అపవాదాలున్నాయి (దేవస్థలి 1967 : 60-61).

48. ౯ (ధాతువులలో మాత్రమే ఉపయుక్తం), ఇది చేరిన ధాతువు తరవాత పరస్మైపద ప్రత్యయాల ముందు లుఙ్ లకారానికి సంబంధించిన - చ్లి ప్రత్యయానికి - అ(ఙ్) ఆదేశమవుతుంది. (పుషాదిద్యుతద్య్ దితః పరస్మైపదేషు 3.1.55); ఉదా. గమ్ - (గమ్-) ధాతువు నించి వచ్చిన లుఙ్ రూపం అగమత్ 'వెళ్లేడు/ వెళ్లింది'; ఇందులో మూడో అకారం చ్లికి ఆదేశంగా వచ్చినది.

4.9. ఏ. (ధాతువులలో మాత్రమే ఉపయుక్తం), ఇది పరస్మైపద లుఙ్ రూపంలో ధాత్వచ్చుకి వృద్ధిరాదని సూచిస్తుంది (హ్మ్యంత క్షణశ్వసజాగృణి శ్వేదితాం 7.2.5); ఉదా. రగే (=రగ్) ధాతువు లుఙ్ రూపం అరగీత్ నందేహపడ్డాడు/పడింది.

4.10.ఓ (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం), ఇది ఉన్న ధాతువు తరవాత -క్త (=త), -క్తవతు (=తవత్ ప్రత్యయాల త కారం నకారంగా మారుతుంది (ఓదితశ్చ 8.2.45); ఉదా. ఓవిజీ (=విజ్) ధాతువుకి -క్త చేరగా విజ్-త > విజ్ - న (8.2.45) > విగ్ - న 'భయపడిన'.

4.11 క్ (i) ఇది ధాతువులకి చేరే ప్రత్యయంతో వచ్చినప్పుడు దాని ముందు ధాత్వచ్చుకి గుణవృద్ధులు రావని సూచిస్తుంది (క్జితి చ 1.1.5) ఉదా. స్తు-క్త > స్తు-త 'పొగడబడిన' (ii) తద్ధిత ప్రత్యయంలో వచ్చినప్పుడు ఇది ప్రాతిపదిక మొదటి అచ్చుకి వృద్ధివస్తుందనీ (కితి చ 7.2.118), నిష్పన్నమైన పదం చివరి అచ్చు ఉదాత్తమవుతుందనీ (కితః 6.1.165) చెప్తుంది; ఉదా. నడ శబ్దానికి క్ ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడిన నాడాయన 'నడుని సంతతి వాడు' అనే శబ్దంలో ఆద్యచ్చుకి వృద్ధివచ్చింది (అ>ఆ); చివరి అచ్చు ఉదాత్తమయింది. (iii) ఆగమంతో వచ్చినప్పుడు ఇది ఆ ఆగమం అది చేరే అంశానికి చివర వస్తుందని సూచిస్తుంది (ఆద్యంతౌటకితౌ 1.1.46,66.3) ఉదా: దేవాసః 'దేవతలు' అనే వైదిక రూపంలో ప్రథమా బ.వ. జస్ (=అస్)కి అసుక్ (=అస్) ఆగమం ఆజ్జసేరసుక్ 7.1.50 వల్ల చేరింది; ఇది కిత్తుకాబట్టి - జస్‌కి చివర చేరింది, (iv) యజ్ - యాగంచేయు'తో మొదలయ్యే గణంలోని ధాతువులోనూ వచ్-'చెప్పు', స్వప్ - నిద్రించు'లలోనూ 6.1.16లో ఇచ్చిన గ్రహ్ - 'పట్టుకొను' మొదలైన ధాతువులలోనూ ఉన్న య,వ,ర లు కిత్ప్రత్యయం ముందు సంప్రసారణం పొందుతాయి. (య>ఇ, వ>ఉ, ర>ఋ, సంజ్ఞ 232; వచిస్వపియజాదీనాం కితి 6.1.15, గ్రహిజ్యా ...6.1.16); ఉదా. వచ్-క్త > ఉచ్-త (వ్>ఉ 6.1.15 వల్ల, ఉ అ > ఉ సంప్రసారణాచ్చ 6.1.108 వల్ల)> ఉక్త 'చెప్పబడిన'' (చోఃకుః 8.2.30 వల్ల చ>క). (v) కొన్ని సందర్భాలల్లో కిత్ప్రత్యయం'' (వికల్పంగా) కిత్తు కానట్టుగానూ, కిత్తుకాని ప్రత్యయం కిత్తుగానూ పరిగణించబడుతుంది (వివరణకి చూ. దేవస్థలి 1967 : 64-69).

4.12.ఖ్. ఇది కృత్ప్రత్యయాలతో మాత్రమే ఉపయుక్తం (తద్ధిత ప్రత్యయమైన ఖలోని ఖకారం ఇత్సంజ్ఞ కాదు; దాని స్థానంలోఆయన్ ఆదేశమవుతుంది; ఆయనేయీనీయియః ...7.1.2) ఇది ఉన్న ప్రత్యయం గల పదం సమాసంలో రెండోదిగా ఉన్నప్పుడు ఆ = సమాసంలో మొదటి పదం (అది అవ్యయం కాకపోతే) పొందే మూడు రకాల మార్పులని సూచించడమే దీని పని. అటువంటి సమాసంలో మొదటి పదం చివరి అచ్చు హ్రస్వం అవుతుంది. (ఖి త్యనవ్యయస్య 6.3.66); అది అరుష్-'గాయం', ద్విషత్ - 'శత్రువు' ఈ పదాలు కాని అచ్చుతో అంతమయ్యే పదంకాని అయితే

దానికి ముం(=మ్) ఆగమ్మం చేరుతుంది (అరుర్ ద్విషదజంతస్య ముమ్ (6.3.67); అది . ఏకాచ్కమూ అకారం తప్ప మిగిలిన అచ్చులలో ఒక దానితో అంత మయ్యేదయితే దానికి అ (0) అగమం చేరుతుంది (ఇచ ఏకాచో ౽మ్ ప్రత్యయవచ్చ 6.3.68) ఉదా. కాలిం-మన్యా 'తానే కాళికాదేవిని అనుకొనే స్త్రీ' (ఈ > ఇ, ముమాగమం), గాం-మన్యః 'తానే గోవును అనుకొనేవాడు' (వీటిలో 'మన్య' అనే రెండోపదంలో ఖశ్ (=అ) ప్రత్యయం ఉంది. ఆత్మమానే ఖశ్ చ 3.2.83).

4.13. గ్. ఇది ఎక్కడా అనుబంధంగా ఉపయుక్తమవ లేదు. కాని వ్యాఖ్యాతలు ఒక చిన్న సమస్యని తొలగించిడానికి -క్స్నుఅనే కృత్ప్రత్యయంలో అనుబంధం కకారం కాదనీ అది గకారమనీ అన్నారు. గ్లాజి స్థశ్చక్స్నుః 3.2.139 అనే సూత్రంలో గ్లా -'అలిసిపోవు', జి -'జయించు', స్థా - 'ఉండు', భూ - అవు' అనే ధాతువులకి ఈ ప్రత్యం వస్తుంది అని చెప్పబడింది. కాని స్థా-స్ను ' ఉండేవాడు' అనే రూపంలో ఘుమాస్థా..6.4.66 వల్ల కిత్ప్రత్యయమైన - క్స్ను ముందు ఆ ఈ గా మారాలి. దీన్ని నివారించడానికే వ్యాఖ్యాతలు ఇందులో గకారమే ఇత్సంజ్ఞ అని అది సంధిలో కకారంగా మారిందనీ అన్నారు. కాని ఈ ప్రత్యయం కిత్తుకాదంటే జి-ష్ణు 'జయించేవాడు' అనే చోట కొత్త సమస్య వస్తుంది. ఆ సమస్య ఏమిటంటే ఇందులో జి-జే - గా మారి అనిష్టరూపం వచ్చే ప్రమాదమే. దీన్ని పరిహరించడానికి వ్యాఖ్యాతలు గుణవృద్ధులని నిషేధించే సూత్రమైన క్జితి చ 1.1.5 లో మొదట గకారం కూడా ఇంకొక కకారం రూపంలో ఉందని అన్నారు. ఈప్రత్యయం ముందు స్థా-లోని ఆకారం ఈ గా మారదని చెప్పక పోవడమనే పాణిని చేసిన చిన్న పొరపాటు వల్ల వ్యాఖ్యాతలు ఇన్ని అడ్డదారులు తొక్కవలసి వచ్చింది.

4.14. ఘ్. ఇది - ఘఞ్ (=అ), -ఘినుణ్ (=ఇన్), - ఘురచ్ (=ఉర) అనే మూడు కృత్ప్రత్యయాలతో మాత్రమే ఉపయుక్తం (తద్ధిత ప్రత్యయమైన - ఘలోని ఘకారం ఇత్సంజ్ఞ కాదు; దాని స్థానంలో ఇయ్ ఆదేశమవుతుంది; ఆయనే యీనీయియః.. 7.1.2). ఇది ఉన్న ప్రత్యయం ముందు చ>క, జ>గ (చజోః కు ఘిణ్యతోః 7.3.52) ఉదా. పచ్-ఘఞ్>పక్-అ(7.3.52 వల్ల చ>క)>పాక - 'వంట' (అత ఉపధాయాః 7.2.116 వల్ల అ>ఆ).

4.15. ఙ్ (i) ధాతువుకి చేరినప్పుడు ఇది ఆ ధాతువు ఆత్మనే పదప్రత్యయాలనే తీసుకొంటుందనీ (అనుదాత్తఙిత...1.3.12, -§10.0.5), దానితరవాత లకారానికి ఆదేశమైన సార్వధాతుక ప్రత్యయం అనుదాత్తం అనీ (తాస్యనుదాత్తేత్ ..6.1.186) సూచిస్తుంది. (ii) ధాతువుకి చేరేప్రత్యయంతో ఉన్నప్పుడు ఇది అటువంటి ప్రత్యయం ముందు ధాత్వచ్చుకి గుణవృద్ధుల్ని నిషేధిస్తుంది (క్ఙితి చ. 1.1.5); ఙిత్తు, కిత్తు ప్రత్యయాల ముందు గ్రహిజ్యా ..6.1.16 సూత్రంలో ఇచ్చిన ధాతువులలోని య,వ,ర లు సంప్రసారణం పొందుతాయి. (iii) ఙ కారం ఇత్సంజ్ఞగా గల ఆదేశం దాంట్లో ఒకటికన్న ఎక్కువ ధ్వనులున్నాసరే అది మౌలికాంశం చివరిధ్వని స్థానంలోనే వస్తుంది (ఙిచ్చ 1.1.53, - 6.10) (iv) ఒక లకారంతో (సంజ్ఞ 176) ఉన్నప్పుడు ఇది ఈ కింది మార్పులని సూచిస్తుంది. (లఙ్, -§10.7, లిఙ్,-.§10.8, లుఙ్,-§10.9, లృఙ్, -§10.10; కింది ఉదాహరణలు లఙ్‌కి సంబంధించినవి) (i) ఉ.పు. ద్వి.వ, బ.వ.కి చెందిన )స్ > ø (నిత్యం ఙితః 3.4.99,§- 10.6.2 ఉదా. అపచావ 'మేం ఇద్దరం వండేం', అపచామ 'మేం వండేం' (2), ఇ>ø (ఇతశ్చ 3,4,100, -§10. 7.2. ఉదా. అపచత్ 'వండేడు / (వండింది' ), (3) ప్ర.పు.ద్వి.వ -తస్ >-తాం, మ.పు.ద్వి.వ. -థస్ >-తం, మ.పు.బ.వ. -థ >-త, ఉ.పు.ఏ.వ. -మి (ప్) >అం (తస్ థస్ థ మిపాం ...3.4. 101; §10.6.2 ఉదా. అపచాతాం 'వాళ్లు ఇద్దరూ వండేరు, మొ). (v) ఙిత్తులు కాని కొన్ని ప్రత్యయాలు కొన్ని సందర్భాలలో ఙిత్తులుగా

పరిగణించబడతాయి. ఉదాహరణకి, ప కారం ఇత్సంజ్ఞగా లేని సార్వధాతుక ప్రత్యం జిత్తు వంటి దవుతుంది. (సార్వధాతుక మపిత్ 1.2.4), దీనిపై వివరణకీ, మరికొన్ని ప్రత్యేకమైన మార్పులకీ చూ. దేవస్థలి 1967:82-88.

4.16. చ్. (ప్రత్యయాలతో మాత్రమే ఉపయుక్తం) ఇటువంటి ప్రత్యయం ఉన్న ప్రాతిపదిక చివరి అచ్చు ఉదాత్తంగా ఉంటుందని ఇది సూచిస్తుంది (చితః6.1.163, తద్ధితస్య 6.1.164) ఉదా. వేప్ - అథు(చ్)> వేపథు 'వణుకు' (ట్వితో ఽథుచ్ 3.3.89).

4.17. జ్. ఇది ఈ కింది రెండు ప్రత్యయాలలో మాత్రమే ఉపయుక్తం: ప్ర.వి.బ.వ. -జస్ (=అస్), పరస్మైపద ప్ర.పు.బ.వ. -ఝికి కొన్ని సందర్భాలలో ఆదేశమయ్యే -జుస్ (=ఉస్) (ఝేర్ జుస్ 3.4.108). ఈ ప్రత్యయాలని అదే రూపంకల ఇతర ప్రత్యయాలనించి వేరుచేయడమే దీని ప్రయోజనం (చూ. § . 4.3.1. (i)) అంతే కాని ఇది ఏ సంధి మార్పులనీ సూచించదు.

4.18. ఞ్ (i) ఇది ధాతువుకి చేరినప్పుడు ఆ ధాతువు సూచించే క్రియవల్ల కలిగే ప్రయోజనం కర్తకి మాత్రమే చెందేటప్పుడు దానికి ఆత్మనేపద ప్రత్యయాలు చేరతాయని చెప్తుంది. (స్వరిత ఞితః ...1.3.72; §10.0.5) (ii) ఇది ప్రత్యయంతో ఉన్నప్పుడు ఆప్రత్యయం గల రూపం మొదటి అచ్చు ఉదాత్తం అవుతుందని చెప్తుంది (ఞ్నిత్యాది ర్నిత్యం 6.1.197) ; ఉదా. గర్గ - య(ఞ్)> గార్గ్య 'గర్గుడి సంతతి వాడు' (గర్గాదిభ్యోయఞ్ 4.1.105; తద్ధితే ష్వచా మాదేః 7.2.117, అనుబంధం - I, సూ. 17 వల్ల అ>ఆ, దీనికి కొన్ని అపవాదాలు కర్త్వాత్వతో ...6.1.159 మొదలైన సూత్రాలలో చెప్పబడ్డాయి). (iii) ఇది తద్ధితేతర ప్రత్యయంతో ఉన్నప్పుడు ప్రాతిపదిక/ధాతువు చివరి అచ్చులేక ఉపధాచ్చు (సంజ్ఞ 55)కి ఆప్రత్యయం ముందు వృద్ధి ఆదేశమవుతుందని సూచిస్తుంది (అచో ఞ్ణితి 7.2.115, అనుబంధం -I, సూ. 16; ఉపధాయః 7.2.116); ఉదా. కృ - ఘఞ్ > కార 'చేసేవాడు', పచ్- ఘఞ్>పాక 'వంట' (చ>క చజోః కు ఘిణ్యతోః! 7.3.52 వల్ల; ఘఞ్ (=అ)), (iv) తద్ధితప్రత్యయంతో ఉన్నప్పుడు దాని ముందున్న ప్రాతిపదిక మొదటి అచ్చుకి వృద్ధి వస్తుందని చెప్తుంది (తద్ధితే ష్వచా మాదేః 7.2.117, చూ.పైన (ii) ). మరికొన్ని ప్రత్యేకమైన మార్పులకి చూ. దేవస్థలి 1967 : 105-6.

4.19. ఞి (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం). ఇది ధాతువుకి వర్తమానార్థంలో-క్త(=త) ప్రత్యయం చేరుతుందని చెప్తుంది. (సాధారణంగా ఈ ప్రత్యయం భూతకాలంలో కర్మణ్యర్థాన్ని సూచిస్తుంది). ఞీతః క్తః 3.2.187, ఉదా. ఞి ధృషా - (=ధృష్-) - క్త> ధృష్ట 'ధైర్యవంతుడు' (ష్టునా ష్టుః 8.4.41 వల్ల త>ట)

4.20. ట్ (i) ఆగమంతో చేరినప్పుడు ఇది ఆ ఆగమం దేనికి విధించబడిందో దానికి ముందు చేరుతుందని సూచిస్తుంది (ఆద్యంతౌ టకితౌ 1.1.46; § 6.3.); ఉదా. పచ్ - 'వండు' ధాతువు నించి వచ్చిన లఙ్ రూపమైన అపచత్ 'వండేడు / వండింది' లో ధాతువుకి విధించబడిన అ(ట్) ఆగమం పచ్- ధాతువుకి ముందు వచ్చి చేరింది (లుఙ్ లఙ్ లృఙ్ క్ష్వడుదాత్తః 6.4.71; § 10.7.2) (ii) టిత్ప్రత్యయమున్న ప్రాతిపదికకి స్త్రీ ప్రత్యయంగా -ఙీ(ప్) (=ఈ) చేరుతుంది. (టి డ్ఢాణఞ్ .. 4.1.15, - § 7.5); ఉదా. కురు-చర (ట్) - ఙీప్ > కురుచరీ 'కురుదేశంలో చరించే స్త్రీ' (iii) ఇది లకారానికి అనుబంధంగా ఉన్నప్పుడు అటువంటి లకారానికి ఆదేశాలయిన ఆత్మనే పద ప్రత్యయాల చివరి అచ్చు (+హల్లు)కి ఏకారమాదేశమవుతుందనీ, మ.పు.ఏ.వ, - థాస్ > -సే అనీ సూచిస్తుంది (టిత... 3.4.79 థాసః సే 3.4.80,§ 10.1.3)

4.21. **టు.** (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం). ఇది ఉన్నధాతువుకి -అథు(చ్) అనే కృత్ప్రత్యయం చేరుతుంది (ట్వితో 2 థుచ్ 3.3.89). ఉదా. (టు)వేప్పృ - అథు (చ్)> వేపథు 'వణుకు' (వేప్పృలో ఋ కూడా ఇత్సంజ్ఞే)

4.22. **డ్.** ఇది ఉన్న ప్రత్యయం ముందు ప్రాతిపదిక చివరి అచ్చు (+హల్లు) లోపిస్తుంది (టేః 6.4.143); ఉదా. కిం- డతి (కిమః సంఖ్యాపరిమాణేడతి చ 5.2.41; -డతి (=అతి) కతి 'ఎన్ని' (ఇం>ø). వింశతి 'ఇరవై'లో తి డిత్తుముందు లోపిస్తుంది (తి వింశతే ర్డితి 6.4.142). ఉదా. వింశతి - డ్వున్ (వింశతి ... 5.1.24: - డ్వున్ (=అక)) > వింశక 'ఇరవైతో కొన్నది'.

4.23. **డు.** (ధాతువులతో మాత్రమే ఉపయుక్తం). ఇది ధాతువుకి -క్త్రి (=త్రి) ప్రత్యయం భావార్థంలోనూ కర్తృభిన్న కారాకార్థంలోనూ చేరుతుందని చెప్తుంది (డ్వితః క్త్రిః 3.4.88); ఉదా. (డు)పచష్ - క్త్రి-మ > ప్రక్త్రియ 'వంటవల్ల సాధించినది' (ధాతువు పచ్ -; చ>క చోఃకుః 8.3.30 వల్ల).

4.24 **ణ్.** (i) ఇది తద్ధిత ప్రత్యయంతో వచ్చినప్పుడు దానిముందు ప్రాతిపదిక మొదటి అచ్చుకి వృద్ధివస్తుందని చెప్తుంది (తద్ధితేష్వచా మాదేః 7.2.117, § 7.3.3), (ii) ముఖ్యంగా ధాతువుకి చేరే ప్రత్యయాలలో (కాని చూ. (iii) కింద) ఇది అటువంటి ప్రత్యయం ముందు ధాతువు చివరిఅచ్చులేక ఉపధగా ఉన్న అకారం స్థానంలో వృద్ధివస్తుందని సూచిస్తుంది (అచో ఞ్ణితి 7.2.115, అత ఉపధాయః 7.2.116); ఉదా : కృ - ణముల్ > కారంకారం 'చేసి' (-ణముల్ (=అం)) పచ్- ణ్వుల్ > పాచక 'వంటవాడు' (-ణ్వుల్ (=అక); యువోరనాకౌ 7.1.1.)(iii) గో - 'ఆవు', సఖి- 'స్నేహితుడు' అనే ప్రాతిపదికల తరువాత వచ్చే సర్వనామస్థాన ప్రత్యయాలు (సంజ్ఞ 237)ణిత్తులు కాకపోయినా ణిత్తులుగా పరిగణించబడతాయి (అందువల్ల ప్రాతిపదిక చివరి అచ్చుకి వీటిముందు వృద్ధివస్తుంది; సఖి శబ్దం తరవాత సంబుద్ధిలో మాత్రం ఈ మార్పు రాదు; గోతో ణిత్ 7.1.90; సఖ్యు రసంబుద్ధౌ 7.1.92; ఉదా. గో-సు>గౌః 'ఆవు', సఖి-ఔ>సఖై-ఔ>సఖాయౌ 'ఇద్దరు స్నేహితులు' (ఐ>ఆయ్ ఏచో 2 యవాయావః 6,1,78, అనుబంధం-I, సూ. 5. వల్ల). మరికొన్ని ప్రత్యేకమైన మార్పులకి చూ, దేవస్థలి 1967: 124-5.

4.25, **త్.** (i) ఇది ఒక అచ్చుకి చేరినప్పుడు ఆ అచ్చు అదే మాత్ర (కాలం) గల అచ్చుకి సూచకం; , ఉదా. అత్ అంటే హ్రస్వఅకారం మాత్రమే, ఆత్ అంటే దీర్ఘ ఆకారం మాత్రమే (తపరస్తత్కాలస్య 1.1.70; §. 6.23), (ii), ఇది ప్రత్యయానికి చేరినప్పుడు దానిలో అచ్చు స్వరితమని సూచిస్తుంది (ఇది చేరే ప్రత్యయాలన్నీ - య రూపంలో ఉంటాయి; తిత్ స్వరితం 6.1.185); ఉదా. నౌ-యత్ (నౌవయోధర్మ...4.4.91 వల్ల - యత్ ప్రత్యయం వచ్చింది) > నావ్య' 'నావతో దాటదగినది'. దీనికి అపవాదాలకి చూ. దేవస్థలి 1967:129

4.26 **న్.** (ప్రత్యయాలతో మాత్రమే ఉపయుక్తం; ఒకస్త్రీ ప్రత్యయం, కృత్తద్ధితలు, -శ్యన్ (=య) అనే వికరణం (సంజ్ఞ 199)) ఇది ఆప్రత్యయాం ఉన్న పూర్తి రూపానికి మొదటి అచ్చు ఉదాత్తం అని సూచిస్తుంది. (ఞ్నిత్యాది ర్నిత్యం 6.1.197); ఉదా. కృ-క్తిన్ (స్త్రియాం క్తిన్ 3.3.94 వల్ల -క్తిన్ (=తి)> కృతి 'పని'. ఈ అనుబంధంతో సంబంధం ఉన్న మరొక సూత్రం: తాదౌ చ నితి కృ త్యతౌ 6.2.50 "తకారాది, నిత్తుఅయిన కృత్ప్రత్యయం (తున్‌తప్ప) ఉన్న పదంతో సమసించిన గతిపదం (సంజ్ఞ 85) దానికి సహజమైన ఉదాత్తాచ్చును నిలుపుకొంటుంది", ఉదా. ప్రకృతి.

4.27 ప్. ఇది చేరిన ప్రత్యయం అనుదాత్తం అని సూచిస్తుంది (అనుదాత్తౌ సుప్పితౌ 3.1.4, § 6.35), పిత్ప్రత్యయం ముందు ధాతువులో కొన్ని ప్రత్యేక పరిణామాలకి చూ. దేవస్థలి 1967: 137-9; చూ. § 4.4.15.

4.28. మ్. (ఆగమాలతోనూ - శ్నమ్ - వికరణం (సంజ్ఞ 199)తోనూ మాత్రమే ఉపయుక్తం; ఇంతేకాక ధాతుపాఠంలో భూవాదులలో సుమారు 70 ధాతువులు (వీటికి ఘటాది 'ఘట్-తో మొదలయ్యేవి' అని పేరు) అవి మిత్తులు కాకపోయినా మిత్తులుగా పరిగణించబడ్డాయి). (i) ఆగమంతో కాని వికరణంతో కాని ఇది వచ్చినప్పుడు అది ప్రాతిపదిక/ధాతువు చివరి అచ్చుకీ దాని తరవాత వచ్చే హల్లు(ల)కీ మధ్య చేరుతుందని సూచిస్తుంది (మి దచో ౽ంత్యా త్పరః 1.1.47; § 6.4); ఉదా. చతుర్-జస్ > చతు ఆ(0)ర్ - అస్ (చతురనడుహో రా ముదాత్తః 7.1.98 వల్ల అం ఆగమం)చత్వారః 'నలుగురు (పుం)', (ఉ>వ ఇకో యణచి 6.1.77 వల్ల), (ii) మిత్తుగా పరిగణించబడిన ధాతువు ఉపధాచ్చు ప్రేరణ ప్రత్యయమైన -ణి (=ఇ) ముందు హ్రస్వమవుతుంది (మితాం హ్రస్వం 6.4.92); ఉదా. ఘటయతి 'సాధిస్తున్నాడు / సాధిస్తోంది'.

4.29. ర్. (రెండు కృత్తులు, రెండు తద్ధితలు - మొత్తం నాలుగు ప్రత్యయాలతో మాత్రమే ఉపయుక్తం) ఇది ఉన్న ప్రత్యయంలో చివరి నించి రెండో అచ్చు ఉదాత్తమని ఇది సూచిస్తుంది. (ఉపోత్తమం రితి 6.1.217) ఉదా. కృ-ధాతువుకి -అనీయ(ర్) ప్రత్యయం, (తవ్యత్తవ్యానీయరః 3.1.96) చేర్చగా ఏర్పడిన కరణీయ 'చేయదగినది'లోని ఈకారం ఉదాత్తం (సార్వధాతుకార్ధధాతుకయోః 7.3.84, అనుబంధం - I, సూ. 19 వల్ల ఋ>అర్)

4.30. ల్. (ప్రత్యయాలతో మాత్రమే ఉపయుక్తం: ధాతువుకి చేరే ప్రత్యయాలూ, తద్ధిత ప్రత్యయాలూ, వైదిక భాషలో - ఆ(ల్) అనే విభక్తి ప్రత్యయం, § 9.13.1), ఇది ఉన్న ప్రత్యయం ముందు ఉన్న అచ్చు ఉదాత్తమవుతుందని ఇది సూచిస్తుంది (లితి 6.1.193); ఉదా; సం-గత్-య్ 'కలిసి' (ఇందులో ప్రత్యయం - ల్యప్ (=య) లిత్తు కాబట్టి దీనిముందు అచ్చు ఉదాత్తమయింది). లట్‌మొదలైన లకారాల (సంజ్ఞ 176) లోనూ, లుఙ్‌కి సంబంధించిన -చ్లి-లోనూ, జుహో త్యాదులకు వచ్చే-శ్లు- వికరణంలోనూ ఉన్న లకారం ఇత్సంజ్ఞ కాదని గమనించాలి.

4.31. శ్. (ఇది ప్రాతిపదికలకీ ధాతువులకీ వచ్చే ఆదేశాలకీ ధాతువుకి చేరే ప్రత్యయాలకీ ముఖ్యంగా చేరుతుంది, విభక్తి ప్రత్యయాలలో ద్వితీయా బ.వ. -శస్ (=అస్)లో మాత్రమే ఇది ఉంది; ఇందులో కూడా ఈ ప్రత్యయానికీ ప్రథమా బ.వ. -జస్ (=అస్)కీ తేడా కల్పించడానికే తప్ప దీనికి వేరు ప్రయోజనం లేదు; తద్ధితప్రత్యయాలలో వాటి మొదటవచ్చే శకారం ఇత్సంజ్ఞకాదు) (i) ఒక అచ్చు తప్ప వేరేమీ లేని ఆదేశంతో వచ్చినప్పుడు ఇది ఆ ఆదేశం మొత్తం స్థాని అంతటికీ ఆదేశంగా వస్తుందని చెప్తుంది. (అనేకాల్ శిత్ సర్వస్య 1.1.55; § 6.12). (ii) ధాతువుకి చేరే ప్రత్యయాలతో (6వికరణాలూ, కొన్ని కృత్తులూ) వచ్చినప్పుడు ఇది ఆ ప్రత్యయం సార్వధాతుకం (సంజ్ఞ 239) అని సూచిస్తుంది. శిత్ ప్రత్యయం ముందు ధాతువులలో కొన్ని ప్రత్యేక పరిణామాలకి చూం.దేవస్థలి 1967: 155.

4.32. ష్. (ధాతువులతోనూ, -షాకన్ (=అక), -ష్ట్రన్ (=త్ర), -ష్వున్ (=అక) అనే మూడు కృత్తులతోనూ, చాలా తద్ధితలతోనూ (సమాసాంతాలతో సహా), - జీష్ (=ఈ) అనే స్త్రీ ప్రత్యయంతోనూ ఉపయుక్తం; చివరిదాంట్లో ఇది ఈ ప్రత్యయాన్ని - జీప్, -జీన్‌ల నించి వేరు చెయ్యడానికి మాత్రమే ఉపయుక్తం, - 7.5) (i) ధాతువుకి చేరినప్పుడు ఇది ఆ ధాతువు భావార్థక నామాన్ని ఏర్పరచడంలో

– అ(జ్), -టాప్ (=ఆ) ప్రత్యయాలని (రెండోది స్త్రీ ప్రత్యయం) చేర్చుకొంటుందని చెప్తుంది (షిద్భిదాదిభ్యో 2_ జ్ 3,3,104; ఉదా, త్రపా; 'సిగ్గు' అనే నామం త్రపూష్ (=త్రప్-) ధాతువునించి పై విధంగా ఏర్పడింది)( ఘట్-'కుదురు' మొదలైన సుమారు పన్నెండు ధాతువులు షిత్తులుకాకపోయినా షిత్తులుగా పరిగణించబడతాయి). (ii) ఇది ప్రత్యయానికి చేరినప్పుడు ఆ ప్రత్యయం చివర ఉన్న ప్రాతిపదికకి –జీష్ అనే స్త్రీ ప్రత్యయం చేరుతుందని సూచిస్తుంది (షి ద్గౌరాదిభ్యశ్చ 4.1.41; ఉదా. నృత్ -ష్వున్–జీష్ > నర్తకీ 'నర్తకి'; ఇందులో -ష్వున్ శిల్పిని ష్వున్ 3.1.145 వల్ల చేరింది).

4.33 న్. (ఇది –ఘు(న్), - ఛ(న్), -య(న్), -యు(న్) అనే నాలుగు తద్ధితలతో మాత్రమే ఉపయుక్తం) ఈ ప్రత్యయాలముందు ఉన్న ప్రాతిపదిక పదసంజ్ఞ (సంజ్ఞ 135) కిందకి వస్తుంది కాని భసంజ్ఞ (సంజ్ఞ 161) కిందకి కాదు అని ఇది సూచిస్తుంది (సితి చ 1.4.16). ఈ సంజ్ఞల మధ్య భేదం వల్ల సంధిమార్పులలో బేధం వస్తుంది. ఉదాహరణకి, భవత ష్ఠక్ఛసౌ 4.2.115 సూత్రం వల్ల భవత్ – అనే ప్రాతిపదికకి – ఛ(న్) ప్రత్యయం (=ఈయ) చేరి భవత్ – ఈయ>భవదీయ 'మీ' అనే రూపం ఏర్పడింది (ఛ > ఈయ ఆయనేయా ...7.1.2, అనుబంధం – I, సూ, 14 వల్ల), ఇందులో త>ద ఝలాం జశో 2_ంతే 8.2.39 "ఝల్ (సంజ్ఞ 103) > జశ్ (సంజ్ఞ98) అనే మార్పు పదసంజ్ఞ ఉన్న ప్రాతిపదిక చివర వస్తుంది" అనే సూత్రం వల్ల వచ్చింది; ఛ(న్) ప్రత్యయం సిత్తు కాబట్టి భవత్ పదం అయి త>దగా మారింది; ఇది భ సంజ్ఞ అయితే ఈ మార్పు వచ్చి ఉండేది కాదు.

**సూచికలు :**

1. ఈ వ్యుత్పత్తి చాంద్రవ్యాకరణం 1.1.5 సూత్రం వ్యాఖ్యలో ఇవ్వబడింది(చూ. దేవస్థలి 1967:2).

2. వ్యాకరణశాస్త్రంలో "ఉపదేశః" (సంజ్ఞ 54) అనే పదానికి అర్థం పాణిని ఉపదేశించిన సూత్రపాఠం, ధాతుపాఠం గణపాఠం (వీటికి కాత్యాయనుడు చేర్చిన వార్తిక పాఠం) అని అర్థం. ఈ సూత్రంలో చెప్పినట్లు పాణిని ఇత్సంజ్ఞలైన అచ్చులని అనునాసికాలుగానే ఉచ్చరించి ఉంటాడు. కాని దురదృష్టవశాత్తూ ఈ అనునాసికోచ్చారణ తరవాత కాలంలో భ్రష్టమైపోయింది. ఈ మార్పు 7వ శతాబ్దికి చెందిన కాశిక (చూ.§1.4.2) కాలానికే జరిగి ఉంటుందని అందులో ఉన్న "ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః' '(1.3.2.కింద) అనే వాక్యం వల్ల తెలుస్తుంది. దీన్ని న్యాసవ్యాఖ్యానకర్త ఇలా వివరించారు : "పాణినీయులు అనునాసిక్యం ఎక్కడ ఉండాలని అంటారో అక్కడే అది పఠించబడకపోయినా ఉంటుంది; మిగిలిన చోట్ల ఉండదు" (యత్రైవానునాసిక్యం పాణినీయాః ప్రతిజానతే, తత్రైవ త దపత్యమాన మపి భవతి, నాన్యత్ర). కాని పాణినీయులెవరూ ఏవి అనునాసికాచ్చులో ఏవికావో చెప్పలేదు కాబట్టి పఠిత తన భాషాజ్ఞానం ఆధారంగా భాషారూపానికి చెందని అచ్చులు మొదట్లో అనునాసికాలుగా ఉచ్చరించబడి ఉంటాయని తెలుసుకోవాలి.

3. ఈ సూత్రానికి కొన్ని అపవాదాలున్నాయని వ్యాఖ్యాతలు గుర్తించారు. - చుంచు(ప్), – చణ(ప్) అనే ప్రత్యయాలలోని మొదటి చకారం ఇత్సంజ్ఞకాదు (తేనవిత్తశ్చుంచుప్చణపౌ 5.2.26) అలాగే -టీట(చ్) (నతే నాసికాయాః... 5.2.31)లో మొదటి టకారం కూడా ఇత్సంజ్ఞకాదు. ఇవి

తద్ధితప్రత్యయాలుకాబట్టి ఈసూత్రాల క్రమాన్ని లశక్వతద్ధితే 1.3.7, చుటూ 1.3.8 అనిమారిస్తే ఈ సమస్యతొలగిపోతుంది; ఇలా చెయ్యడం వల్ల అతద్ధితే అనేపదం చుటూ సూత్రంలోకి అనువర్తించి తద్ధితేతర ప్రత్యయాల మొదట ఉన్న చవర్గటవర్గాక్షరాలు ఇత్సంజ్ఞలు అనే అర్థంవస్తుంది. మొదట్లో పాణిని ఈ సూత్రాలనిపైన చెప్పిన వరసలో ఇచ్చి ఉండవచ్చుననీ తరవాత కాలంలో ఈ వరస అనాలోచితంగా మారిఉండవచ్చుననీ ఊహించవచ్చు.

4. ధాతుపాఠంలో ఒక ధాతువుకి ఇకారం ఇత్సంజ్ఞగా లేకపోయినా సూత్రపాఠంలో అటువంటి ధాతువుకి ఇకారం చేరిన సంగర్భాలు ఉన్నాయి ఉదాహరణకి, ఈ సూత్రంలో గమ్-'వెళ్లు' ధాతువుకి ఇ చేరింది; ధాతుపాఠంలో ఈ ధాతువు గమ - అని ఉంటుంది. ఇ సూత్రపాఠంలో చేరినందుకు ఇతరోదాహరణలు: గుపేశ్ఛందసి 3.1.50 (గుపి), లిపిసిచి హ్వాశ్చ 3.1.53 మొ॥)

5. కాశికాకారుడు ఉచ్చారణార్థం మాత్రమే చేరిన అచ్చులు (పాణిని ప్రకారం కూడా) అనునాసికాలు కావనీ అందువల్ల అవి ఇత్సంజ్ఞలు కావనీ చాలా చోట్ల చెప్పేడు. చూ. తాసిసిచో రిదిత్కార్యం నాస్తీత్యుచ్చారణార్థో నిరనుకాసిక ఇకారఃపఠ్యతే "-తాసి, -సిచ్ అనే ప్రత్యయాలలోని ఇకారానికి ఇత్సంజ్ఞాప్రయోజనం లేదు కాబట్టి ఉచ్చారణార్థకమైన ఇది నిరనునాసికంగా పఠించబడుతోంది" (ఇడితోనుమ్ ధాతోః 7.1.58 కింద), వేరొక చోట (చూ. సూచిక 2) అనునాసికాచ్చులేవో పాణినీయులకే తెలుసు అని ఆయనే అనడం వల్ల పై విషయం కేవలం ఆయన ఊహమాత్రమే అని అనుకోవాలి.



# తెలుగులో సంఖ్యావాచక రూప నిర్మాణం

-డా॥ గాలి రాధాకృష్ణ

1.0. భాషలో సంఖ్య (అంకె) లను తెలిపే రూపాలను సంఖ్యావాచక రూపాలు (Numerals) అంటారు. సంఖ్యావాచకరూపాలు నిర్మాణ క్రమంలో విశేష్యాలవంటివి. సంఖ్యావాచకరూపాలకు లింగ, వచన, విభక్తి ప్రత్యయాలు చేరతాయి. తెలుగులో సంఖ్యావాచకరూపాల నిర్మాణం ఈ క్రింది విధంగా ఉంది.

1.1 ప్రాథమిక సంఖ్యావాచక రూపాలు (Primary Numerals or Cardinals) : ఒకటి, ఒక్కటి, ఒకొటి, ఒక్కొటి, ఒకఁడు, ఒక్కఁడు, ఒకొఁడు, ఒండు, ఓటి, ఎక్కటి (1); రెండు, రొండు (2): మూడు, మూఁడు(3); నాలుగు, నాల్గు (4), అయిదు/ఐదు, ఏను (5); ఆరు/ఆఱు (6); ఏడు (7); ఎనిమిది, ఎనిమిది, ఎన్మిది(8); తొమ్మిది(9), పది (10); నూరు, నూఱు (1000); వెయ్యి, వేయి (1000) సాంస్కృతిక రూపాలు: వంద (100); లక్ష (1,00,000), కోటి (1,00,00,000).

1.2 సంయుక్త సంఖ్యావాచక రూపాలు (Compound Numerals) : రెండు గాని అంతకంటె ఎక్కువగాని సంఖ్యావాచక రూపాలు సమసించడంవల్ల సంయుక్త సంఖ్యావాచక రూపాలు ఏర్పడతాయి. సంయుక్త సంఖ్యావాచక రూపాలను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

1. సంకలన సంఖ్యావాచక రూపాలు లేదా కూడివేత సంఖ్యావాచక రూపాలు (Addition),
2. గుణకార సంఖ్యావాచక రూపాలు లేదా ఎచ్చువేత సంఖ్యావాచక రూపాలు (Multiplication)

1.21 సంకలన సంఖ్యావాచక రూపాలు : సంకలన సంఖ్యావాచక రూప నిర్మాణం ఈ క్రింది విధంగా ఉంది.

1.211 సంకలన సంఖ్యావాచకరూపంలోని పూర్వ రూపం పెద్ద సంఖ్యావాచకంగాను, పరరూపం చిన్న సంఖ్యావాచకంగాను ఉండడం.

i) సంకలన సంఖ్యావాచకరూపంలోని పూర్వ, పర సంఖ్యావాచక రూపాల నడుమ ఎలాంటి సముచ్చయార్థక రూపం (Conjunctive particle)చేరకపోవడం.

ఎ) అభేద పరివర్తన : పూర్వ, పర సంఖ్యావాచక రూపాల్లో ఎలాంటి మార్పులేకపోవడం.
ఇర్వది + రెండు ⟶ ఇర్వది రెండు (20+2 ⟶ 22)
తొంబది + తొమ్మిది ⟶ తొంబది తొమ్మిది (90+9 ⟶ 99)

బి) పర్యాదేశం: పూర్వ సంఖ్యావాచక రూప అంత్య స్వరానికి పర సంఖ్యా వాచక రూప ఆద్యస్వరం ఆదేశం చెందడం.

1) ఇ + అ ⟶ అ
పది + ఆరు/ ఆఱు ⟶ పదారు/ పదాఱు (10+6 ⟶ 16)
పది +నాలుగు/ నాల్గు ⟶ పద్నాలుగు/ పద్నాల్గు (10+4 ⟶ 14)

2) ఇ+ఊ ⟶ ఊ
పది + మూడు ⟶ పద్మూడు (10+3 ⟶ 13)

3) ఇ+ఏ → ఏ

పది +ఏడు → పదేడు (10+7 → 17)

పది + ఏను → పదేను (10+5 → 15)

తొంబది +ఏను → తొంబదేను (90+5 → 95)

4) ఇ+ఐ → ఐ

పది+ఐదు →పదైదు (10+5 → 15)

ముప్పది+ ఐదు →ముప్పదైదు (30+5 →35)

సి) ఆగమాత్మకం: పూర్వ, పర సంఖ్యా వాచక రూపాల నడుమ వ్యంజన రూపం చేరడం.

1) 'య్' ఆగమం.

పది+ ఆరు/ ఆఱు →పదియారు/ పదియాఱు (10+6 →16)

పది+ ఏడు → పదియేడు (10+7 → 17)

పది+ఏను → పదియేను (10+5 → 15)

తొంబది + ఆరు తొంబదియాఱు (90+6 → 96)

2) 'హ్' ఆగమం.

పది+ఏడు → పదిహేడు (10+7 → 17)

పది+ఏను → పదిహేను (10+5 → 15)

డి) స్వరపరివర్తన : పూర్వ సంఖ్యావాచకరూప అంత్యస్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం.

1) ఇ → అ

పది+నాలుగు/ నాల్గు → పదనాలుగు/ పదనాల్గు (10+4 → 14)

పది + మూడు → పదమూడు (10+3 → 13)

2) ఇ → ఉ

పది+నాలుగు/ నాల్గు → పదునాలుగు/ పదునాల్గు (10+4 → 14)

పది+ మూడు → పదుమూడు (10+3 → 13)

ఇ) సహపరివర్తనలు: రెండు లేదా మూడు లేదా నాలుగు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం.

1) స్వరాదేశం, ఆదేశాత్మకం (పూర్వ సంఖ్యావాచక రూప అంత్యవ్యంజనం మరోవ్యంజనంగా ఆదేశం చెందడం)

1. ఇ + ఒ → ఒ, ద్ → న్

పది + తొమ్మిది → పంతొమ్మిది (10 + 9 → 19)

2. ఉ + ఒ → ఒ, ర్ → ట్

నూఱు + ఒకటి → నూటొకటి (100+1 → 101)

2) స్వరాదేశం, ద్విరుక్తీకరణం (పూర్వసంఖ్యావాచక రూప అంత్య అద్విరుక్త వ్యంజనం ద్విరుక్తం కావడం)

1. ఇ+ఎ ⟶ ఎ, ద్⟶ ద్ద్

పది+ ఎనిమిది ⟶ పద్దెనిమిది (10+8 18)

3) స్వరాదేశం, మహాప్రాణీకరణం (aspiration) (పూర్వసంఖ్యావాచకరూప ఆద్య అల్ప ప్రాణవ్యంజనం మహాప్రాణం చెందడం)

1. ఇ+ ఆ ⟶ ఆ, ద్ ⟶ ధ్

పది +నాలుగు ⟶ పధ్నాలుగు (10+4⟶ 14)

4) స్వరపరివర్తన, ఆదేశాత్మకం

1. ఉ⟶ అ, ర్ ⟶ ట్

నూరు +మూడు ⟶ నూటమూడు (100+3 ⟶ 103)

నూరు + తొమ్మిది ⟶ నూట తొమ్మిది (100+9⟶ 109)

5) స్వరపరివర్తిన, ఆగమాత్మకం

1. ఇ ⟶ అ, 'క్'ఆగమం.

పది+ ఒండు⟶ పదకొండు (10+1 ⟶11)

2. ఇ ⟶ అ, 'హ్' ఆగమం.

పది +ఆరు/ ఆఱు ⟶ పదహారు/ పదహాఱు (10+ 6 ⟶16)

పది +ఐదు ⟶ పదహైదు (10+5 ⟶ 15)

6) స్వరాదేశం,, ఆదేశాత్మకం, ఆగమాత్మకం

1. ఇ+ఎ ⟶ ఎ, ర్ ⟶ 'ణ్', 'డ్' ఆగమం.

పది+రెండు ⟶ పండ్రెండు (10+2 ⟶ 12)

7) స్వరాదేశం, ఆదేశాత్మాకం, ద్విరుక్తీకరణం

1. ఇ+ ఎ ⟶ ఎ, ద్ ⟶ జ్జ్

పది+ ఎనిమిది⟶ పజ్జెనిమిది (10+8 ⟶18)

8)స్వరాదేశం, ఆదేశాత్మకం, నాదీకరణం (పరసంఖ్యావాచక రూప ఆద్యశ్వాసవ్యంజనం నాదం కావడం)

1. ఇ+ఒ⟶ ఒ, ద్⟶ న్, త్ ⟶ద్

పది+తొమ్మిది⟶ పందొమ్మిది (10+9 ⟶ 19)

9) స్వరాదేశం, ద్విరుక్తీకరణం, మహాప్రాణీకరణం (ద్విరుక్తమైన వ్యంజనంలోని అల్పప్రాణ పరరూపం మహాప్రాణంకావడం)

1. ఇ+ఎ → ఎ, ద్ → ద్ధ్
పది+ ఎనిమిది → పద్ధెనిమిది (10+8 → 18)

10) స్వరపరివర్తన, ఆదేశాత్మకం, ఆగమాత్మకం

1. ఉ →అ, ర్ → ట్, 'య్' ఆగమం.
నూరు+ఒకటి → నూటయొక్కటి (100+1 → 101)
నూరు+ ఎనిమిది → నూటయెనిమిది (100+8 → 108)
నూరు+ ఏడు → నూటయేడు (100+7 → 107)

11) స్వరాదేశం, ఆదేశాత్మకం, ద్విరుక్తీకరణం, వ్యంజన లోపం (పర సంఖ్యా వాచకరూప ఆద్యవ్యంజనం లోపం చెందడం)

1. ఇ+ఎ → ఎ, ద్ → న్న్, ర్ → Ø
పది+రెండు → పన్నెండు (10+2 → 12)

ii) సంకలన సంఖ్యావాచకరూపంలోని పూర్వ, పర సంఖ్యావాచక రూపాలనడుమ 'ఉన్/ ఉను/న్/ను/న్న్/న్ను' అనే సముచ్చయార్థక రూపం చేరడం.

ఎ) పూర్వ సంఖ్యావాచక రూపానికి సముచ్చయార్థక రూపం చేరడం.

1) అభేదపరిరవ్తన: పూర్వ సంఖ్యావాచకరూపం, సముచ్చయార్థక రూపం రెండింటిలోనూ ఎలాంటి మార్పులేకపోవడం.
ఆఱు+ న్న్ ఆఱున్న్ (6&)
తొంబది నూఱు+ ను → తొంబది నూఱును (900&)
వెయ్యి/ వేయి+న్ని → వెయ్యిన్ని/ వేయిన్ని (1000&)

2) స్వరాదేశం: పూర్వసంఖ్యావాచక అంత్యస్వరానికి సముచ్చయార్థక రూపం ఆద్యస్వరం ఆదేశం చెందడం.

1. ఇ+ఉ → ఉ
పది+ఉన్ → పదున్ (10&)
వేయి+ఉను → వేయును (1000&)

3) ఆగమాత్మకం : పూర్వ సంఖ్యా వాచక రూపం, సముచ్చయార్థక రూపం నడుమ వ్యంజనం చేరడం.

1. 'య్' ఆగమం
పది+ఉన్ → పదియున్ (10&)

బి) సముచ్చయార్థక రూపం చేరిన పూర్వసంఖ్యావాచక రూపానికి పరసంఖ్యావాచక రూపం చేరడం.

1) అభేద పరివర్తన: సముచ్చయార్థక రూపం చేరిన పూర్వ సంఖ్యావాచక రూపం, పర సంఖ్యావాచకరూపం రెండింటిలోనూ, ఎలాంటి మార్పులేకపోవడం.

ఆఱున్ + ఒకటి ⟶ ఆఱునొకటి (6&1⟶ 7)

పదున్+ ఒకండు/ ఒకొండు/ ఒక్కఁడు/ ఒండు ⟶ పదునొకండు/ పదునొకొండు/ పదునొక్కండు/ పదునొండు (10&1 ⟶ 11)

పదున్+ ఆరు/ ఆఱు ⟶ పదునారు/ పదునాఱు (10&6⟶ 16)

పదున్ +ఎనిమిది ⟶ పదునెనిమిది (10&8⟶18)

పదున్ +ఏను ⟶ పదునేను (10&5 ⟶ 15)

పదున్ + ఐదు ⟶ పదునైదు (10 & 5 ⟶ 15)

పదియున్+ఆఱు ⟶ పదియునాఱు (10&6⟶16)

పదియున్+ఎనిమిది ⟶పదియునెనిమిది (10&8⟶18)

తొంబదినూఱును+తొంబది ⟶ తొంబది నూఱును తొంబది తొమ్మిది (900 & 99⟶ 999)

వెయ్యిన్ని+ మూడు ⟶ వెయ్యిన్నిమూడు (1000&3⟶1003)

వేయును+ఆఱు ⟶ వేయును ఆఱు (1000&6 ⟶ 1006)

2) స్వరాదేశం: సముచ్చయార్థక రూపం చేరిన పూర్వ సంఖ్యావాచక రూపం అంత్య స్వరానికి పరసంఖ్యావాచక రూపం ఆద్యస్వరం ఆదేశం చెందడం.

1. ఇ+ఆ ⟶ ఆ

వెయ్యిన్ని/ వేయిన్ని+ ఆఱు వెయ్యిన్నాఱు/ వేయిన్నాఱు (1000&6 ⟶ 1006)

వెయ్యిన్ని+ఏడు ⟶ వెయ్యిన్నేడు (1000&7 ⟶ 1007)

వెయ్యిన్ని+నూఱు ⟶ వెయిన్నినూఱు (100&100 ⟶ 1100)

3) ద్విరుక్తీకరణం : పర సంఖ్యావాచక రూప ఆద్య అద్విరుక్త వ్యంజనం ద్విరుక్తం కావడం.

వెయ్యిన్ని+ నూఱు ⟶ వెయ్యిన్ని న్నూఱు (1000&100 ⟶ 1100)

4) ఆగమాత్మకం: సముచ్చయార్థక రూపం చేరిన పూర్వసంఖ్యావాచకరూపం, పరసంఖ్యా వాచక రూపం నడుమ వ్యంజనం చేరడం.

1. 'య్' ఆగమం.

వెయ్యిన్ని+ ఎనిమిది ⟶ వెయ్యిన్ని యెనిమిది (1000&8⟶ 1008)

వెయ్యిన్ని+ఏడు ⟶ వెయ్యిన్ని యేడు (1000&7⟶ 1007)

వెయ్యిన్ని+ఇన్నూఱు ⟶ వెయ్యిన్ని యిన్నూఱు (1000&200⟶ 1200)

1.212. రెండు లేదా అంతకంటె ఎక్కువ సంఖ్యావాచక రూపాలు కూడా చేరి సంకలన సంఖ్యా వాచక రూపాలుగా ఏర్పడవచ్చు.

రెండు రెండు (2+2 ⟶4)

రెండు నాలుగు(2+4⟶ 6)

ఎనిమిది పది నాలుగు (8+10+4⟶ 22)

మూడు నాలుగు తొమ్మిది రెండు (3+4+9+2 ⟶ 18)

ఇన్నూఱు మున్నూఱు (200+300 ⟶500)

1.22 గుణకార సంఖ్యావాచక రూపాలు: గుణకార సంఖ్యావాచక రూపనిర్మాణం ఈ క్రింది విధంగా ఉంది.

1.221 సంఖ్యావాచక నామవిశేషణ రూపాన్ని పూర్వరూపంగాను, సంఖ్యావాచక నామ రూపాన్ని పరరూపంగాను బంధించినపుడు గుణకార సంఖ్యావాచక రూపాలు ఏర్పడతాయి. ఇందులో పూర్వ రూపం చిన్న సంఖ్యావాచకంగాను, పరరూపం పెద్ద సంఖ్యావాచకం గాను ఉండడం చూడవచ్చు.

i అభేద పరివర్తన : పూర్వ, పర సంఖ్యావాచక రూపాల్లో ఎలాంటి మార్పులేకపోవడం.

ఏ+ నూఱు ఏనూఱు (5X100⟶ 500)

ii ఆదేశాత్మకం: పరరూప ఆద్యవ్యంజనం మరోవ్యంజనంగా ఆదేశం చెందడం.

1) ప్ ⟶ వ్

ఆరు/ అఱు + పది ⟶అరువది/ అఱువది (6X10 ⟶ 60)

ఇరు/ ఇఱు+పది ⟶ ఇరువది /ఇఱువది 2X10⟶ 20)

నలు +పది ⟶ నలువది (4X10 ⟶40)

iii సహపరివర్తనలు: రెండు లేదా మూడు లేదా నాలుగు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగవచ్చు.

ఎ) స్వరాదేశం. ఆదేశాత్మకం (పూర్వరూప అంత్యవ్యంజనం మరోవ్యంజనంగా ఆదేశం చెందడం)

1) ఉ+ అ⟶ అ, ప్ ⟶వ్

అరు+ పది ⟶అర్వది (610 ⟶60)

ఇరు+పది ⟶ఇర్వది (2×10 ⟶20)

2) ఉ+ఊ ⟶ఊ, ర్⟶ న్

ఇరు+నూఱు ⟶ఇన్నూఱు (2×100 ⟶200)

3) ఉ+ఊ⟶ ఊ, ల్ ⟶న్

నలు+ నూఱు ⟶నన్నూఱు (4×100 ⟶400)

బి) స్వరాదేశం, నాదీకరణం

1) ఉ+అ ⟶అ, ప్ ⟶ బ్

ఎను+పది ⟶ఎన్బది (8X10 ⟶ 80)

నలు+పది ⟶నల్బది (4 X10 ⟶ 40)

సి) స్వరాదేశం, స్వరదీర్ఘీకరణం (పూర్వరూప ఆద్యహ్రస్వ స్వరం దీర్ఘం కావడం)

1) ఉ+ ఆ →ఆ, ఇ → ఈ

ఇరు+ ఆఱు→ఈరాఱు (2X6 → 12)

2) ఉ+ఏ →ఏ, ఇ → ఈ

ఇరు+ఏడు →ఈరేడు (2X7 → 14)

ఇరు +ఏను →ఈరేను(2X5 → 10)

డి) స్వరపరివర్తన (పూర్వరూప అంత్య స్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం), వ్యంజనాదేశం

1) ఉ →అ,ప్ → వ్

అరు+పది →అరువది(6X10 → 60)

ఇరు/ ఇఱు+పది →ఇరువది/ ఇఱవది (2X10 → 20)

ఇ) స్వరపరివర్తన, నాదీకరణం

1) ఉ →అ,ప్ → బ్

ఎను+పది →ఎనబది (8X10 → 80)

నలు+పది→నలబది (4X10 → 40)

ఎఫ్) స్వరహ్రస్వీకరణం (పూర్వరూపహ్రస్వస్వరం దీర్ఘంకావడం) ఆగమాత్మకం.

1) ఊ →ఉ, 'య్య్' ఆగమనం

మూ+ఆఱు →ముయ్యాఱు (3X6→ 18)

మూ+ఏడు →ముయ్యేడు (3X7 → 21)

జి) స్వరహ్రస్వీకరణం, ద్విరుక్తీకరణం (పరరూప ఆద్యఅద్విరుక్త వ్యంజనం ద్విరుక్తం కావడం)

1) ఊ →ఉ, న్→ న్న్

మూ+నూఱు→ మున్నూఱు(3×100 = 300)

2) ఊ →ఉ, ప్→ ప్ప్

మూ+పది → ముప్పది (3×10 = 30)

హెచ్) నాదీకరణం, ద్విరుక్తీకరణం

1) ప్ →బ్బ్

డె+పది →డెబ్బది (7X10 → 70)

ఐ) అక్షర లోపం (పరరూప అంత్యాక్షరం లోపం చెందడం), స్వరపరివర్తన (పరరూప ఆద్యస్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం), వ్యంజానదేశం.

1) ది → ϕ,అ → ఐ/ అయ్, ప్ → వ్

అరు+ పది → అరువై/ అరువయ్ (6X10 =60)

ఇరు+పది →ఇరువై/ ఇరువయ్ (2X20=60)

జె) అక్షర లోపం, స్వరపరివర్తన, నాదీకరణం, ద్విరుక్తీకరణం

1) ది → ϕ, అ → ఐ/ అయ్, ప్ → చ్ప్

డె+పది → డెబ్బై/ డెబ్బయ్ (7 X10=70)

కె) స్వరహ్రస్వీకరణం, అక్షరలోపం, స్వరపరివర్తన, ద్విరుక్తీకరణం

1) ఊ → ఉ, ది → ϕ అ → ఐ/య్, ప్ → ప్ప్

మూ+ పది → ముప్పై, ముప్పయ్ (3X10 =30)

ఎల్) స్వరపరివర్తన (పూర్వరూప అంత్యస్వరం మరో స్వరంగా పరివర్తన చెందడం), అక్షరలోపం, స్వర పరివర్తన (పర రూప ఆద్యస్వరం మరో స్వరంగా పరివర్తన చెందడం), ఆగమాత్మకం

1) ఊ → అ, ది → ϕ అ → ఐ/అయ్, ప్ → వ్

అరు+పది → అరవై/ అరవయ్ (6X10 =60)

ఇరు+పది → ఇరవై/ ఇరవయ్(2X10 =20)

ఎమ్) స్వరపరివర్తన, అక్షరలోపం, స్వర పరివర్తన, నాదీకరణం, మహాప్రాణీకరణం.

1) ఊ → అ, ది → ϕ, అ → ఐ/అయ్, ప్ → భ్

అరు+పది → అరభై/ అరభయ్ (6X10 =60)

ఇరు+పది → ఇరభై/ ఇరభయ్(2X10 =20)

ఎను+పది → ఎనభై/ ఎనభయ్(8X10 =80)

నలు+పది → నలభై/ నలభయ్(4X10 =40)

ఎన్) స్వరహ్రస్వీకరణం, అక్షర లోపం, స్వరపరివర్తన, ద్విరుక్తీకరణం, మహాప్రాణీకరణం (ద్విరుక్తంలోని అల్పప్రాణ పరరూపం మహాప్రాణం కావడం)

1) ఊ → అ, ది → ϕ అ → ఐ/అయ్, ప్ → ప్ఫ్

మూ+పది → ముప్ఫై (3X10 =30)

ఒ) అక్షరలోపం, స్వరపరివర్తన, నాదీకరణం, ద్విరుక్తీకరణం, మహాప్రాణీకరణం.

1) ది → ϕ, అ → ఐ/అయ్, ప్ → బ్భ్

డె+పది → డెబ్భై/ డెబ్భయ్ (7X10 =70)

1.222 సంఖ్యావాచక నామరూపం సంఖ్యావాచక నామ విశేషణంగా పూర్వరూపంగాను, సంఖ్యావాచక నామరూపాన్ని పరంలో బంధించినపుడు గుణకార సంఖ్యావాచకరూపాలు ఏర్పడతాయి. ఈ గుణకారిక సంఖ్యావాచక రూపాలు చివర బహువచన ప్రత్యయాన్ని (-లు) కలిగి ఉండవచ్చు లేదా లేకపోవడం.

i ) ఎలాంటి బహువచన ప్రత్యయం చేరకుండా ఉండే రూపాలు:

ఎ) అభేద పరివర్తన: పూర్వ పరరూపాల్లో ఎలాంటి మార్పులేకపోవడం.

ఆఱు+నూఱు → ఆఱునూఱు(6X100 =600)

ఏడు+ నూఱు → ఎడునూఱు (7X100 =700)

బి) స్వరాదేశం: పూర్వరూపం అంత్యస్వరానికి పరరూప ఆద్యస్వరం ఆదేశం చెందడం

1) ఉ+ఊ → ఊ

ఆరు+ నూఱు → ఆర్నూఱు (6X100 =600)

ఏడు+నూఱు → ఏడ్నూఱు(7X100 =700)

ii) బహువచన ప్రత్యయం చేరిన రూపాలు

ఎ) అభేద పరివర్తన: పూర్వ, పరరూపాల్లో ఎలాంటిమార్పు లేకపోవడం.

1) ఆరు +రెండు → ఆరు రెండ్లు (6X2=12)

ఐదు+ పదులు → ఐదుపదులు(5X10 =50)

ఎనిమిది+నూర్లు → ఎనిమిదినూర్లు (8X100 =800)

నాలుగు + ఒకట్లు→నాలుగు ఒకట్లు (4X1 =4)

మూడు+పదులు → మూడుపదులు (3X10 =30)

రెండు+రెండ్లు→రెండు రెండ్లు (2X2 =4)

బి) స్వరాదేశం: పూర్వ రూప అంత్య స్వరానికి పరరూప ఆద్యస్వరం ఆదేశం చెందడం.

1) ఇ+ఇ → ఇ

ఎనిమిది+ ఎనిమిదులు→ఎనిమిదెనిమిదులు (8X8=64)

2) ఉ+అ → అ

మూడు+అర్లు→మూడార్లు(3X6=18)

3) ఉ+ఎ → ఎ

రెండు + ఎనిమిదులు→రెండెనిమిదులు(2X8 =16)

4) ఉ+ఐ → ఐ

రెండు+ఐదులు → రెండైదులు (2X5 =10)

1.3 బహువచన ప్రత్యయాత్మక సంఖ్యా వాచక రూపాలు: సంఖ్యావాచక నామధాతు రూపానికి బహువచన ప్రత్యయం చేరినపుడు ఈ రూపాలు ఏర్పడతాయి.

i ) అభేదపరివర్తన : ఆధారధాతువు, బహువచన ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పులేకపోవడం.

ఐదు + లు → ఐదులు

నాలుగు + లు → నాలుగులు

నాలుగు + ఒకట్లు→నాలుగు ఒకట్లు (4X1 =4)

ii) స్వరలోపం : ఆధారధాతు గతస్వరం లోపం చెందడం.

1. -ఇ ⟶ ф

1. -లు: - ఒకటిఒకట్లు

2. -ఉ ⟶ ф

1. -లు: ఆరు ఆర్లు

నూరు నూర్లు

రెండు రెండ్లు

iii ) అక్షరలోపం: ఆధారధాతుగతాక్షరం లోపం చెండడం.

1. -యి ⟶ ф

1. లు: వేయి వేలు

iv) స్వరపరివర్తన : ఆధారధాతుగత స్వరం మరో స్వరంగా పరివర్తన చెందడం.

1. ఇ ⟶ ఉ

| | | |
|---|---|---|
| 1.-లు:- | ఎనిమిది | ఎనిమిదులు |
| | తొమ్మిది | తొమ్మిదులు |
| | పది | పదులు |

1.4 విభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచక రూపాలు: ఈ రూపాలను 1. ఔపవిభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచక రూపాలు 2. కేవల విభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచక రూపాలుగా చెప్పవచ్చు.

1.41 ఔపవిభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచక రూపాలు: సంక్యావాచక నామరూపం తర్వాత కేవల విభక్తి ప్రత్యయానికి పూర్వం వచ్చే ప్రత్యయాన్ని సంఖ్యావాచక ఔపవిభక్తిక ప్రత్యయం అంటారు.ఈ ప్రత్యయం చేరిన సంఖ్యావాచకరూపాన్ని ఔప విభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచక రూపం అనవచ్చు.

i) స్వరలోపం : ఆధారధాతుగతస్వరం లోపం చెందడం.

1. -ఇ ⟶ ф

1. -అ: - ఒక్కటి ఒక్కట

ii) ఆగమాత్మకం: ఆధారధాతువు, ప్రత్యయం నడుమ వ్యంజనరూపం ఆగమంగా చేరడం

1) -'ట్' ఆగమం.

1. -ఇ :- వేయి వేయిటి

iii) సహపరివర్తనలు : రెండు లేదా మూడు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం.

ఎ) స్వరలోపం, అదేశాత్మకం (ఆధారధాతుగత వ్యంజనం మరో వ్యంజనంగా ఆదేశం చెందడం).

1) ఉ ⟶ ф, ర్ ⟶ ట్

1. - ఇ :- నూరు నూటి

బి) స్వరలోపం, ఆగమాత్మకం

1) ఉ → $\phi$, 'ంట్' ఆగమం

1. - ఇ:- ఆరు ఆరింటి

ఏడు ఏడింటి

రెండు రెండింటి

సి) స్వరలోపం, శ్వాసీకరణం (ఆధారధాతుగత నాదవ్యంజనం శ్వాసం కావడం).

1) ఉ → $\phi$ ,ద్ → ట్

1. - అ:- రెండు రెంట

2. - ఇ:- ఒందు ఒంటి

మూడు మూటి

రెండు రెంటి

డి) స్వర పరివర్తన (ఆధారధాతుగత స్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం), ఆగమాత్మకం.

1) ఉ → ఇ, 'ట్/ంట్' ఆగమం

1. - అ:- నాలుగు/ నాల్గు నాలుగింట/నాల్గింట

2. - ఇ :- నాలుగు/ నాల్గు నాలుగింటి/ నాల్గింటి

ఇ) స్వర పరివర్తనలు(ఆధారధాతుగత స్వరం మరో స్వరంగాను, ఆధారధాతు మధ్య స్వరం మరోస్వరంగాను పరివర్తన చెందడం) ఆగమాత్మకం.

1) ఉ → ఇ, ఉ→ ఇ, 'ట్' ఆగమం.

1. - అ :- నాలుగు నాలిగిట

2. - ఇ :- నాలుగు నాలిగిటి

1.42. కేవల విభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచకరూపాలు ఈ రూపాలు

1. కేవల సంఖ్యావాచక నామధాతు మూలకం 2. ఔపవిభక్తిక ప్రత్యయాత్మక సంఖ్యావాచక నామధాతు మూలకం.

1421 కేవల సంఖ్యావాచక నామధాతు మూలకం. కేవల సంఖ్యావాచక నామధాతు ప్రాతిపదికకు కేవల విభక్తి ప్రత్యయం చేరడం.

i) అభేద పరివర్తన : ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం.

1. -కి:- ఒకటి ఒకటికి
2. -కు:- రెండు రెండుకు
3. - కొరకు/ కోసం:- ఏడు ఏడుకొరకు/ ఏడుకోసం
4. చే(త):- నూరు నూరుచే(త)
5. -తో:- పది పదితో
6. -ను:- మూడు మూడును
7. - వలన: రెండు రెండువలన

1.422 ఔప విభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచక నామధాతుమూలకం. ఔపవిభక్తి ప్రత్యయాత్మక సంఖ్యావాచక నామధాతు ప్రాతిపదికకు కేవల విభక్తి ప్రత్యయం చేరడం.

ఎ) అభేదపరివర్తన : ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పులేకపోవటం.

| | | |
|---|---|---|
| 1. -కి(న్) :- | నూటి | నూటికి (న్) |
| | రెంటి | రెంటికి |
| | వేయిటి | వేయిటికి(న్) |
| 2. - చే(త):- | మూడింటి | మూడింటిచే(త) |
| 3. - న్/ను:- | రెంట | రెంటన్/రెంటను |
| 4. -న్/ని:- | ఏడింటి | ఏడింటిని |
| | నాల్గింటి | నాల్గింటిన్ |
| | మూటి | మూటిని |
| 5. -లో:- | రెంటి | రెంటిలో |
| | వేయింటి | వేయింటిలో |
| 6. -వలన/వల్ల:- | మూడింటి | మూడింటివలన/ మూడింటివల్ల |
| | రెండింటి | రెండింటివలన/ రెండింటివల్ల |

1.5 సంఖ్యావాచక సార్వనామిక రూపాలు (Numeral pronouns) : ఈ రూపాలను 1. సంఖ్యావాచక నామ విశేషణ 2. సంఖ్యావాచక సార్వనామిక 3. సంఖ్యావాచక నామ ధాతుమూలకాలుగా చెప్పవచ్చు.

1.51 సంఖ్యావాచక నామవిశేషణ ధాతుమూలకం: సంఖ్యావాచక నామవిశేషణ ధాతు ప్రాతిపదికకు పుంలింగ లేదా స్త్రీ లింగ లేదా స్త్రీ, పురుషోభయసామాన్య లింగ బోధక ప్రత్యయం చేరి సంఖ్యావాచక సార్వనామిక రూపం ఏర్పడుతుంది.

1.511 పుంలింగ బోధక సంఖ్యావాచక సార్వనామిక రూపం: సంఖ్యావాచక నామవిశేషణ ధాతు ప్రాతిపదికకు పుంలింగ బోధక ప్రత్యయం చేరినపుడు సంఖ్యావాచక సార్వనామిక రూపం ఏర్పడడం

i) అభేద పరివర్తన: ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పులేకపోవడం.

| | | |
|---|---|---|
| 1. డు/ండు:- | ఒక/ ఒక్క | ఒకఁడు/ ఒకండు/ ఒక్కఁడు/ ఒక్కండు. |
| | ఒకొ/ ఒక్క | ఒకొడు/ ఒకొండు/ఒక్కొఁడు/ ఒక్కొండు |
| | ఒరు | ఒరుఁడు/ ఒరుండు |

ii) సహపరివర్తనలు: రెండు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం.

ఎ) స్వరలోపం (ఆధారధాతు గత స్వరం లోపం చెందడం), వ్యంజనా దేశం (ఆధారధాతుగత వ్యంజనం మరో వ్యంజనంగా ఆదేశం చెందడం).

1) ఉ → ϕ ర్ → ద్

1. డు:- ఇరు ఇద్దు

2) ఉ → ϕ ర్ → ణ్

1. -డు:- ఒరు ఒండు

1.512. స్త్రీ లింగ బోధక సంఖ్యావాచక సార్వనామిక రూపం: సంఖ్యావాచక నామ విశేషణ ధాతు ప్రాతిపదికకు స్త్రీ లింగ బోధక ప్రత్యయం చేరినపుడు సంఖ్యావాచక సార్వనామిక రూపం ఏర్పడుతుంది.

i) అభేద పరివర్తన: ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం.

| | | |
|---|---|---|
| 1. -త/తి/తె:- | ఒక/ఒక్క/ | ఒకత/ ఒకతి/ ఒకతె/ ఒక్కత/ ఒక్కతి/ ఒక్కతె/ |
| | ఒకొ/ ఒక్కొ | ఒకొత/ ఒకొతి/ ఒకొతె/ ఒక్కొత/ ఒక్కొతి/ ఒక్కొతె |

ii) సహపరివర్తనలు: రెండు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం.

ఎ. సర్వలోపం (ఆధారధాతుగత స్వరం లోపం చెందడం). స్వరదీర్ఘకరణం (ఆధారధాతు ఆద్య హ్రస్వ స్వరం దీర్ఘం చెందడం)

1. ఉ $\longrightarrow$ $\phi$, ఒ $\longrightarrow$ ఓ

1.-త/తి/తె :- ఒరు ఓర్త/ ఓర్తి/ ఓర్తు/ ఓర్తె

1.513 స్త్రీ, పురుషోభయ సామాన్య లింగబోధక సంఖ్యావాచక సార్వనామిక రూపం: సంఖ్యావాచక నామ విశేషణ ధాతు ప్రాతిపదికకు స్త్రీ పురుషోభయ సామాన్య లింగబోధక ప్రత్యయం చేరినపుడు సంఖ్యావాచక సార్వనామిక రూపం ఏర్పడుతుంది.

i) అభేద పరివర్తన: ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవటం.

| | | |
|---|---|---|
| 1. · రు(వు) :- | ఒక/ ఒక్క/ | ఒకరు/ ఒక్కరు(వు)/ |
| | ఒకొ/ ఒక్కొ | ఒకొరు(వు)/ ఒక్కొరు (వు) |

1.52. సంఖ్యావాచక సార్వనామిక ధాతు మూలకం: స్త్రీ, పురుషోభయ సామాన్యలింగ సంఖ్యా వాచక సార్వనామిక ధాతు ప్రాతిపదికకు పుంలింగ లేదా స్త్రీ లింగ ప్రత్యయం చేరి మరో సంఖ్యావాచక సార్వనామిక రూపం ఏర్పడుతుంది.

1.521 పుంలింగ బోధక సంఖ్యావాచక సార్వనామిక రూపం: సంఖ్యావాచక సార్వనామిక ధాతు ప్రాతిపదికకు పుంలింగంబోధక ప్రత్యయం చేరినపుడు సంఖ్యావాచక సార్వనామిక రూపం ఏర్పడుతుంది.

i) అభేద పరివర్తన. ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం.

| | | |
|---|---|---|
| 1. ‹డు/ండు:- | ఒకరు/ | ఒకరు‹డు/ ఒకరుండు/ |
| | ఒక్కరు(వు)/ | ఒక్కరు(వు)‹డు/ ఒక్కరు (వు)ండు/ |
| | ఒకొరు(వు)/ | ఒకొరు(వు)‹డు ఒకొరు(వు)ండు/ |
| | ఒక్కొరు(వు) | ఒక్కొరు(వు)‹డు/ఒక్కొరు(వు)ండు |

1.522 స్త్రీ లింగ బోధక సంఖ్యావాచక సార్వనామిక రూపం: సంఖ్యావాచక సార్వనామిక ధాతు ప్రాతిపదికకు స్త్రీ లింగ బోధక ప్రత్యయం చేరిపుడు సంఖ్యావాచక సార్వనామిక రూపం ఏర్పడుతుంది.

i) అభేద పరివర్తన: ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం.

1. -క:- ఓర్తు  ఓర్తుక

ii) స్వరలోపం : ఆధారధాతుగతస్వరం లోపం చెందడం.

1. ఉ → Φ

1. -ఇత/ఇతి/ ఇతె/ త/తి/ తు/తె:-

ఒకరు/ ఒకరిత/ ఒకరితి/ ఒకరితె/ఒకర్త/ ఒకర్తి/ ఒకర్తు/ ఒకర్తె/

ఒక్కరు/ ఒక్కరిత/ ఒక్కరితి/ ఒక్కరితె/ ఒక్కర్త/ ఒక్కర్తి/ ఒక్కర్తు/ ఒక్కర్తె/

ఒకొరు/ ఒకొరిత/ ఒకొరితి/ ఒకొరితె/ ఒకొర్త/ ఒకొర్తి/ ఒకొర్తు/ ఒకొర్తె/

ఒక్కొరు ఒక్కొరిత/ ఒక్కొరితి/ ఒక్కొరితె/ ఒక్కొర్త/ఒక్కొర్తిత/ ఒక్కొర్తు/ ఒక్కొర్తె

1.53 సంఖ్యావాచక నామధాతు మూలకం: సంఖ్యావాచక నామధాతు ప్రాతిపదిక ఎలాంటి లింగబోధక ప్రత్యయం చేరకుండా సంఖ్యావాచక సార్వనామిక రూపంగా ఏర్పడవచ్చు.

i) అభేద పరివర్తన: ఆధారధాతువే ఎలాంటి మార్పులేకుండా సంఖ్యావాచక సార్వనామిక రూపంగా ఏర్పడడం

ఉదాహారణాలు: రెండు, పది. నూరు, వెయ్యి; పదమూడు, పదహారు, ఇరవై. ముప్పది, ముప్పదియారు. ఎబదిరెండు, మొదలైన రూపాలు.

1.6 వచనంతో కూడాన అనుబంధ సంఖ్యావాచక నామరూపాలు (Appallative nouns of Number ): సంఖ్యావాచక నామవిశేషణ లేదా సంఖ్యావాచక నామ రూపాలకు- గురు/ వురు/ రు/ఱు ప్రత్యయం చేరడంవల్ల వచనంతో కూడిన అనుబంధ సంఖ్యావాచక నామరూపాలు ఏర్పడతాయి.*

1.61. సంఖ్యావాచక నామవిశేషణ ధాతు మూలకం: సంఖ్యావాచక నామ విశేషణ ధాతుప్రాతిపదికకు - గురు/ వురు/ రు/ఱు ప్రత్యయం చేరడం.

i ) అభేద పరివర్తన: ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పు లేకపోవడం.

1. -గురు/వురు:- ఇరు  ఇరువురు

ఏ  ఏగురు/ ఏవురు

నలు  నలుగురు/ నలువురు

ii) స్వరహ్రస్వీకరణం · ఆధారధాతు దీర్ఘ స్వరం హ్రస్వం కావడం

1 ఊ → ఉ

1. గురు/ వురు:-మూ  ముగురు/ మువురు

iv) సహపరివర్తనలు: రెండు లేదా మూడు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం.

ఎ). స్వరహ్రస్వీకరణం, ద్విరుక్తీకరణం (ప్రత్యయ ఆద్య అద్విరుక్త వ్యంజనం ద్విరుక్తం కావడం).

1) ఊ → ఉ, గ్ → గ్గ/వ → వ్వ

1 గురు/వురు:- మూ  ముగ్గురు/ మువ్వురు

బి) స్వరంలోపం, ఆదేశాత్మకం (ఆధారధాతుగత వ్యంజనం మరో వ్యంజనంగా ఆదేశం చెందడం), ద్విరుక్తీకరణం (ఆధారధాతుగత అద్విరుక్త వ్యంజనం ద్విరుక్తం కావడం)

1) ఊ → ϕ, ర్ → ద్ద్

1.- రు/ళు - ఇరు ఇద్దరు/ ఇద్దఱు

1.62. సంఖ్యావాచకనామధాతు మూలకం సంఖ్యావాచక నామధాతు ప్రాతిపదికకు -గురు/ వురు/రు ప్రత్యయం చేరడం.

i) అభేద పరివర్తన: ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పులేకపోవడం.

1. -గురు/వురు:- అయిదు అయిదుగురు/ అయిదువురు
ఆరు ఆరుగురు/ ఆరువురు
ఏడు ఏడుగురు/ ఏడువురు
తొమ్మిది తొమ్మిదిగురు/
పది పదిగురు

ii) స్వరలోపం: ఆధారధాతుగత స్వరంలోపం చెందడం

1) ఊ → ϕ

1. గుర్రు/వురు:- ఆరు ఆర్గురు/ ఆర్వురు
ఏడు ఏడ్గురు/ ఏడ్వురు

iii) అక్షర లోపం: ఆధారధాతు గతాక్షరంలోపం చెందడం.

1) -యి → ϕ

1. గురు/ వురు:- వేయి వేగురు/ వేవురు

iv) స్వరపరివర్తన: ఆధారధాతుగత స్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం.

1. -(గు)రు/(వు)రు :- పది పదు(గు)రు/ పదు(వు)రు

v) సహపరివర్తనలు : రెండు లేదా మూడు లేదా నాలుగు సహపరివర్తన ప్రక్రియలు కూడా జరగడం.

ఎ). అక్షర లోపం, ఆగమాత్మకం (ఆధారధాతువు, ప్రత్యయం నడుమ వ్యంజన రూపం చేరడం)

1) ది → ϕ, 'ండ్' ఆగమం.

1. -రు:- ఇరువది ఇరువండ్రు
తొంబది తొంబండ్రు
నలువది నలువండ్రు
ముప్పది ముప్పండ్రు

బి) స్వరపరివర్తన, ఆగమాత్మకం

1) ఇ → ఉ, 'ండ్' ఆగమం.

1. -రు:- పది పదుండ్రు

సి) అక్షరలోపం, స్వరపరివర్తన (ఆధారధాతు మధ్యస్వరం మరోస్వరంగా పరివర్తన చెందడం), ఆగమాత్మకం.

1) ది→ φ , ఇ→అ, 'ంద్' ఆగమం.

1.-రు:- తొమ్మిది తొమ్మండ్రు

డి) అక్షరలోపం, స్వరపరివర్తనలు(ఆధారధాతు మధ్యస్వరం మరో స్వరంగాను మరియు అంత్యస్వరం మరో స్వరంగాను పరివర్తన చెందడం), ఆగమాత్మకం.

1) ది → φ , ఇ→అ, ఇ → అ, 'ంద్' ఆగమం.

1. -రు:- ఎనిమిది ఎనమండ్రు

సంఖ్యా వాచక నామధాతుప్రాతిపదికకు- మంది రూపం చేరడంవల్ల వచనంతో కూడిన అనుబంధ సంఖ్యావాచక రూపం ఏర్పడవచ్చు

ఉదా: నూరు- నూరుమంది; పది -పదిమంది.

వచనంతో కూడిన అనుబంధ సంఖ్యావాచక నామరూపం పై -రు ప్రత్యయం చేరి వచనంతో కూడిన అనుబంధ సంఖ్యావాచక రూపం ఏర్పడవచ్చు.

ఎ) అక్షరలోపం, ఆగమాత్మకం.

1) -రు →φ , 'ంద్' ఆగమం.

1. -రు:- పదుగురు, పదుగుండ్రు

1.7 సంఖ్యావాచక నామ విశేషణ రూపాలు(Numeral Adjectives) సంఖ్యావాచక నామవిశేషణ రూపాలను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. కేవల సంఖ్యావాచక నామ విశేషణ రూపాలు/ కురుచ రూపం గల సంఖ్యావాచక రూపాలు 2. నిష్పన్న సంఖ్యావాచక నామ విశేషణ రూపాలు.

1.71. కేవల సంఖ్యావాచక నామవిశేషణ రూపాలు: ఈ క్రింది రూపాలను కేవల సంఖ్యావాచక నామ విశేషణాలుగా పేర్కొనవచ్చు.

| | | |
|---|---|---|
| ఒక/ఒక్క/ఓ | (1) | 'ఒకచోటు/ ఒక్కచోటు/ ఓ చోటు' |
| ఇరు/ఇను | (2) | 'ఇరు వంకలు, ఇరువది, ఇనువింతల, ఇనుమడించు' |
| మూ | (3) | 'ముక్కంటి, ముప్పది' |
| నలు | (4) | 'నలు దెసలు, నలుబది' |
| ఏ | (5) | 'ఏబది' |
| అరు | (6) | 'అరువది' |
| డె | (7) | 'డెబ్బది' |
| ఎను | (8) | 'ఎనుబది' |
| తొమ్ | (9) | 'తొంబది' |
| వే | (1000) | 'వే గన్నులు' |

1.72. నిష్పన్న సంఖ్యావాచక నామవిశేషణ రూపాలు: ఈ రూపాలను రెండు రకాలుగా చెప్పవచ్చు.

i) కేవల సంఖ్యావాచక నామరూపాలు ఎలాంటి మార్పు లేకుండా సంఖ్యావాచక

నామవిశేషణ రూపాలుగా నిష్పన్నం కావడం చూడవచ్చు. స్వభాషా రూపాలు

రెండు → రెండు, 'రెండు పనులు'

మూడు → మూడు 'మూడు రోజులు'

నాలుగు/ నాల్గు → నాలుగు/ నాల్గు, 'నాలుగు దారులు/ నాల్గు దారులు'

ఏను/ అయిదు/ ఐదు → ఏను, అయిదు/ ఐదు 'ఏనేండ్లు/ అయిదేండ్లు/ ఐదేండ్లు'

ఆరు/ ఆఱు → ఆరు/ ఆఱు 'ఆరేండ్లు/ ఆఱేండ్లు'

ఏడు → ఏడు 'ఏడు లోకములు'

ఎనిమిది → ఎనిమిది 'ఎనిమిది పల్లెలు'

తొమ్మిది → తొమ్మిది 'తొమ్మిది గ్రహములు'

పదమూడు → పదమూడు 'పదమూడు దినములు'

ఏభై → ఏభై 'ఏభై రోజులు'

నూరు → నూరు 'నూరు రోజులు'

వెయ్యి → వెయ్యి 'వెయ్యి పనులు'

సాంస్కృతిక రూపాలు.

వంద → వంద 'వంద రూపాయలు'

లక్ష → లక్ష 'లక్ష రూపాయలు'

కోటి → కోటి 'కోటి సంఖ్యలు''

ii) వచనంతో కూడిన అనుబంధ సంఖ్యావాచక రూపాలు ఎలాంటి మార్పు లేకుండా సంఖ్యావాచక నామవిశేషణ రూపాలుగా నిష్పన్నం కావచ్చు.

| | | |
|---|---|---|
| ఏడుగురు → | ఏడుగురు | 'ఏడుగురు పిల్లలు' |
| పదుగురు → | పదుగురు | 'పదుగురు వ్యక్తులు |
| నూర్గురు → | నూర్గురు | 'నూర్గురు కొడుకులు |

1.8 సంఖ్యావాచక సార్వనామిక విశేషణ రూపాలు (Ordinals): సంఖ్యావాచక నామరూపానికి సంఖ్యా వాచక సార్వనామిక విశేషణ ప్రత్యయం అగు/ అవు/ ఔ లేదా- అవు ప్రత్యయం చివరి ఉకారం లోపించిన- అవ చేరినపుడు సంఖ్యావాచక సార్వనామిక విశేషణ రూపాలు ఏర్పడతాయి.

i) స్వరలోపం: ఆధారధాతుగత స్వరంలోపం చెందడం

1) -ఇ → $\phi$

| | | |
|---|---|---|
| 1.-అవ:- | ఎనిమిది | ఎనిమిదవ |
| | తొమ్మిది | తొమ్మిదవ |
| | పది | పదవ |
| | వేయి | వేయవ |

2) - ఉ → ϕ

| | | |
|---|---|---|
| 1.-అవ :- | రెండు | రెండవ |
| | ఆరు | ఆరవ |
| | ఏడు | ఏడవ |
| | నూరు | నూరవ |

ii)అక్షర లోపం: ఆధారధాతుగతాక్షరం లోపం చెందడం.

1) -ఉగు → ϕ

| | | |
|---|---|---|
| 1.-అవ :- | నాలుగు | నాలవ |

iii) ఆగమాత్మకం : ఆధారధాతువు, ప్రత్యయం రెండింటి నడుమ వ్యంజన రూపం ఆగమంగా రావడం.

1) 'య్' ఆగమం.

1. -అగు/ అవు/ఔ :- ఎనిమిది ఎనిమిదియగు/ ఎనిమిదియవు/ ఎనిమిదియౌ.

1.9 విభాజిక సంఖ్యావాచక రూపాలు (Distinctive Numerals) : ఈ రూపాలు సంఖ్యావాచక నామ, వచనంతో కూడిన అనుబంధ సంఖ్యావాచక నామ ధాతు మూలకాలు.

1.91 సంఖ్యావాచక నామధాతు మూలకం: సంఖ్యావాచక నామధాతు ప్రాతిపదికకు- ఏసి/ చేసి అనే విభాజిక సంఖ్యా వాచక ప్రత్యయం చేరినపుడు విభాజక సంఖ్యావాచక రూపం ఏర్పడుతుంది.

i) అభేద పరివర్తన: ఆధారధాతువు, ప్రత్యయం రెండింటిలోనూ ఎలాంటి మార్పులేకపోవడం

1. – చేసి :- రెండు రెండుచేసి

ii) స్వరలోపం: ఆధారధాతుగత స్వరం లోపం చెందడం

1) -ఇ → ϕ

| | | |
|---|---|---|
| 1.-ఏసి :- | ఎనిమిది | ఎనిమిదేసి |
| | పది | పదేసి |

2) - ఉ → ϕ

| | | |
|---|---|---|
| 1.ఏసి :- | రెండు | రెండేసి |
| | ఆరు | ఆరేసి |
| | నూరు/నూఱు | నూరేసి/ నూఱేసి |

iii)ఊష్మీకరణం : ప్రత్యయ ఆద్య దంత్య / దంతమూలీయవ్యంజనం ఊష్మం కావడం.

1) చ్ → స్

1. - చేసి :- నూఱు నూఱుసేసి

1.92. వచనంతో కూడివ అనుబంధ సంఖ్యావాచకనామ ధాతు మూలకం: వచనంతో కూడిన అనుబంధ సంఖ్యావాచక నామధాతువు ప్రాతిపదికకు విభాజిక సంఖ్యావాచక ప్రత్యయం -ఏసి చేరినపుడు విభాజిక సంఖ్యావాచక రూపం ఏర్పడుతుంది.

i) స్వరలోపం: ఆధారధాతుగత స్వరంలోపం చెందడం

1) -ఉ → ϕ

| | | |
|---|---|---|
| 1.-ఏసి:- | పదుగురు | పదుగురేసి |
| | పదుముప్పురు | పదుముప్పురేసి |

1.10.0 ఇతరం:

i) అనిరార్ధరక సంఖ్యావాచకరూపాలు: నాలుగేన్ (4లేక 5), ఆతేడు (6 లేక7), ఏడెనిమిది (7 లేక 8).

ii) 'అనేకం/ చాలా' అనే అర్థంలో సంఖ్యావాచక రూపాలు: వేనవేలు, వేవేలు

iii)ద్విరుక్త సంఖ్యావాచక రూపాలు:

ఎ) ఒక +ఒక → ఒకానొక
ఒక+ఒక్క → ఒక్కొక్క

బి) ఒకటి+ఒకటి → ఒకటొకటి
రెండు+రెండు → రెండు రెండు

iv)పదార్థబోధక సంఖ్యావాచక రూపాలు: అంత, ఇంత, ఎంత, అన్ని, ఇన్ని, ఎన్ని.

v) కొలత వాచక సంఖ్యావాచక రూపాలు:

ఎ). అళాకు, ఇరస, తవ్వ, పుట్టి, బల్ల మానిక, ముంత, శేరు, సోల, అడ్డెడు, కడవెడు, కుంచెడు, గిద్దెడు, గిన్నెడు, చెంబుడు, తవ్వడు, తూమెడు, పుట్టెడు, బల్లడు, శేరెడు, సోలెడు,

బి) చేరడు, జానడు, బారెడు, చిత్తెడు, మూరెడు, వేలెడు మొదలైన రూపాలు. ఉదాహరణకు శేరు అంటే 8 సొలిగలని అర్థం. మానిక 10 సంఖ్యను, అడ్డెడు 20 సంఖ్యను, కుంచెడు 40 సంఖ్యను, ఇరస 80 సంఖ్యను, తూమెడు 180 సంఖ్యను తెలిపే రూపాలుగా కూడా మనం గమనించవచ్చు.

vi ) కాలబోధక సంఖ్యావాచక రూపాలు: కాలు/పావు.
ఒకటి +జ్+కాలు → ఒకటింగాలు
ఒకటి+ మ్ + పావు → ఒకటింపావు

vii)నాణేలబోధక సంఖ్యా వాచక రూపాలు: అణా, (నయా)పైసా, పావలా, రూపాయి

viii) ఇతరం: మీటరు అంటే 100 సెంటీమీటర్లు (100సెం.మీ) అనే సంఖ్యావాచకాన్ని తెలుపుతుంది.
కె.జి. (కిలోగ్రాము) అంటే 1000 గ్రాములు అనే సంఖ్యావాచకాన్ని తెలుపుతుంది.
అందరు, ఇందరు, ఎందరు, కొందరు రూపాలను సంఖ్యావాచక సార్వనామిక రూపాలుగా చెప్పవచ్చు.

## ఉపయుక్త రచనలు:

1. అనంతరామశాస్త్రి నేతి - *శ్రీనాథ భాషాపరిశీలన*
2. ఆదెప్ప, వై - *పోతన భాగవతము - భాషాతత్త్వ సమాలోచనము*
3. కృష్ణమూర్తి, భద్రిరాజు (సం) - *తెలుగు భాషాచరిత్ర*
4. చిన్నయసూరి, పరవస్తు - *బాలవ్యాకరణము*
5. బ్రౌన్, చార్లెస్ ఫిలిప్ - *నిఘంటువు తెలుగు- ఇంగ్లీష్*
6. శివరామమూర్తి, ఎన్ - *ఆధునిక తెలుగు వ్యాకరణం*
7. శ్రీరాములురెడ్డి, పూతలపట్టు - *ఆంధ్రభాషాలక్షణ శిక్షణము*
8. సుబ్రహ్మణ్యం, పి.యస్.- *ద్రావిడ భాషలు*
9. సూర్యనారాయణ శాస్త్రి, మల్లాది- *ఆంధ్రభాషాను శాసనము, ప్రథమ భాగము.*



# పాత - కొత్త మాటలు

-ఆచార్య జాస్తి సూర్యనారాయణ

జీవికి ఆత్మలాంటిది కావ్యానికి వ్యంగ్యం. ప్రాణంలాంటిది రసం. రసానికి ఉపస్కారకాలు శ్లేషాదిగుణాలు. గుణాలు కావ్యానికి ఉత్కర్షావహాలు. తదపకర్షకాలు దోషాలు. దోషాల నంధకారమనుకుంటే వాటిని (చీకటిని) చవి చూశాక వెలుగును మరింతగా మనం ఆస్వాదించగలం. అందువల్ల మనవాళ్ళు దోష నిరూపణాంతరం గుణాలను వివరించే ప్రకరణాన్ని జతపరిచారు.

## I కు- సుకవుల నిందాస్తుతులు

తెలుగు వాళ్ళ సంప్రదాయంలో అనాదిగ కుకవినింద, సుకవిస్తుతి అనే రెండూ ఉన్నాయి. దీనికి కన్నడాది కావ్యమర్యాదలు మూలంగా కొందరు తలుస్తారు. మూలం ఏమయినా ఈ నిందాస్తుతులు కావ్యానికి అపకర్ష ఉత్కర్షలకు హేతుభూతాలయిన దోషగుణాలుగా గుర్తింపవచ్చును. కావ్యనిర్మాణంలో సుకవి గుర్తించిన లేదా తన రచనలో పాటించిన లక్షణాలు గుణాలు. తాను స్తుతించిచన కవుల రచనల్లో గల ఉత్కర్షావహాలు గుణాలు. వీటి వివరణను కొందరు కొంత వివరించారు. మరి కొందరు ఈయంశంలో సూత్రప్రాయంగా చెప్పారు. మరి కొందరు పేర్లను మాత్రం చెప్పారే గాని వారి కవితా వైశిష్ట్యాన్ని అసలు చెప్పలేదు. తనకు ముందుండి తనమన్ననకు పాత్రమైన కవితాగుణాలను తాముగా వివరించటంలో విముఖులనే తలంచాలి. కాని కృతి భర్త మాటున దాగి మనవారు తమ ధీమత్తను వివరించారనుకోవటంలో సామంజస్యం ఉంది. హరిహరుడు స్వయంగా తిక్కన కవిత్వ విశిష్టతను ప్రశంసించాడనే చెప్పాలి. అయితే ఇది స్వప్న వృత్తాంతం. ఇందులో కవిబ్రహ్మ సంయమనం ప్రశంసా విముఖత సూచితమవుతోంది. ఇంతగా ఆత్మస్తుతికి విముఖతమైన పరతత్వాన్నలవర్చుకోక మునుపే ఈ మహాకవి ఆత్మస్తుతికి తలనొగ్గాడనటానికి 'కవితా విలాస విస్తర మహనీయుడుగా, తన్ను తాను చెప్పికొని యుండటం తెలియజేస్తుంది.

## II కుకవిత - దోషాత్మకత

కుకవులు నిర్మించే కావ్యాలు దోషదూషితాలు. ఇవన్నీ కావ్యానికి అపకర్షకాలు. తజ్జీవితమైన రసానికి భంజకాలు. ధోషాకరమైన జీవి ఆత్మగూడ అపరిపుష్టంగా ఉంటుంది. అంటే కుకవి కవిత కావ్యత్మగా మనవారు గుర్తించిన వ్యంగ్యానికి అసమగ్రతాది దోషాపాదకం కుకవులు తమకు గల పరిమితమైన పరిజ్ఞానంతో మహాకవుల గ్రంథాలను పరిష్కరింప బూనుకుంటారు. ఆ పరిష్కారం వారి అజ్ఞానానికి నమూనా. ఈ పరిష్కారంవల్ల కవి ఉద్దేశించిన సాధు పాఠం మరుగవటం, అసాధుపాఠాలు ప్రచార బహుళం కావటం జరుగవచ్చును. ఈ యంశాన్ని పింగళి సూరన రాఘవ పాండవీయమనే ద్వ్యర్థికావ్యంలోని కు కవి నిరాసంలో విస్పష్టంగావించి యున్నాడు.

ఈ విధి నభీష్ట సిద్ధికి
దైవత కవి నుతి యొనర్చి తప్పొప్పుమదిన్
భావించి దిద్దకుండగ
దేవానాం ప్రియుల మ్రొక్కి తెలతు కుకవులన్

సూరన కాలానికి కుకవులే గాక సుకవి కావ్యాన్ని సరిగా అర్థం చేసుకోలేక తమకున్న మిడి మిడి పరిజ్ఞానంతో దిద్దుబాట్లు కావించే పండితమన్యులు వేరొక వర్గంగా పొడసూపినట్లు తెలుస్తుంది. ఇలాంటి వారినే అప్పకవి పాఠకాధములుగా చెప్పియున్నాడు. వీరి మూలంగా నన్నయాది కవుల కావ్యాల్లో అపపాఠాలకు ఆస్కారం గలిగినట్లు కంఠోక్తి గావించాడు.

కుకవితా లక్షణాలను తిక్కన తన నిర్వచనోత్తర రామాయణంలో వివరించాడు. పలుకుల పొందులేక, రసభంగము సేయుచు, ప్రాతవడ్డ మాటల ఇత్యాది కుకవితా లక్షణాలను వివరించి వారు దుర్విటులు అని చెప్పాడు. విటులలో సంస్కార రహితులు కుకవులు. ఇక్కడ ప్రాతవడ్డ మాటలను ప్రయోగించటం కుకవి లక్షణంగా తిక్కన చెప్పాడు. కుకవి కవితాలక్షణాలు దోషాలు. వాటిని తిక్కనాది సుకవులు పరిహరిస్తారనేది వాస్తవం. అయితే ఈ మాటలకు పాతదనం ఏమిటి? పాతను గుర్తించనంతనే కొత్తదనం ప్రసక్తమవుతుంది.

## III ప్రాత వడ్డ మాటలు

మాటనే సంస్కృతంలో పదమంటారు. పదం సుబంతంగానీ తిజంతంగానీ అయి ఉండాలి. ఇలాంటివేవీ కాని అవ్యయాలను గూడ పదాలంటారు. పదం అనే పేరును పొందిన అర్థవంతాలే ప్రయోగ యోగ్యాలు. అర్థవంతాలయిన మగాది ప్రాతిపదికలు చేయు మొదలయిన ధాతువులు తన, ట, కొఱకు మొదలయిన ప్రత్యయాలు వాక్యనిర్మాణంలో ప్రయోగ యోగ్యాలు కావు.

గీతలో గల 'జీర్ణానివాసాంసి' అనే దానికి తెలుగులో పాత గుడ్డలనటం గద్దు. పై తిక్కన ప్రయోగంలో పదాలకు జీర్ణతనూహింపవచ్చునా. జీర్ణమనేది మానవ శరీర నిర్మాణంలో గల ఒక కోశానికి వాచకం - జీర్ణకోశం. జీర్ణం గావటమంటే మానవుడు ఆకలిని నివారించుకోవటం కోసం తిన్న అన్నం వివిధ శాకపాకాలు, పండ్లు మొదలైన తిండ్లు తమ (వయస్సును) నిజరూపాన్ని కోల్పోవటం అసలివి వండటం వల్ల, వండటానికి పూర్వం ముక్కలుగా కోయటం రుబ్బి పేస్టుగా చేయటం వల్ల తమరూపాన్ని కోల్పోతాయి. తరువాత అవి విలక్షణమైన రక్తాదులుగా మారి తమ రూపాన్ని పూర్తిగా కోల్పోవటం జీర్ణం అని పేర్కొనవచ్చు. జీర్ణ అనేది 'జౄ' అనే ధాతువుకు 'క్త' అనే ప్రత్యయం చేరినందున ఏర్పడే రూపం. జౄ - జీర్ గ మారుతుంది. (పరంగా ఉన్న 'క్త' అనే ప్రత్యయం చేరినందున ఏర్పడేరూపం) పరంగా ఉన్న 'క' అనే ప్రత్యయంలోని ఆద్యక్షరం 'క'లోపింపగా మిగిలిన 'త' 'న' గా మారి తరువాత 'ణ' అయినందున (జీర్+ణ) ఏర్పడుతుంది. జీర్ణకు బదులుగా వాడే ప్రాతకు ఇంతగా రూపవైవిధ్యం చెప్పలేం. కాని కాలం తీరిపోయిన, కవి ప్రచారం నుంచి తొలగిపోయిన అనవచ్చు. ఇలాంటి అర్థంలో ప్రాతను మనం

గ్రహిస్తే సంస్కృతంలో గల అప్రయుక్తమనే కావ్యదోషాన్ని మనం ఈ సందర్భంలో అనుసంధిపంవచ్చును. నిఘంటువుల్లో నమోదయి ఉండి కవి ప్రయోగం లోనికి దూరంగా ఉండే పదాన్ని అప్రయుక్తం అని సంస్కృత ఆలంకారికి పరిభాష. పుంలింగ బహువచన మయిన దైవతాః అనేది అప్రయుక్తానికి ఉదాహరణ. 'దుశ్చవన' అనేది ఇంద్రపర్యాయ పదాలైన ముప్పయ్యదింట్లో ఒకటి. చవన మహర్షి పై కోపించిన ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని ఆ మహర్షిపై ప్రయోగించాలనే తలంపుతో చేతిని పైకెత్తబోవగా ఆమహర్షి ప్రభావం వల్ల ఆహస్తం కదలలేదు. తపశ్శక్తికి ఇంద్రుని శక్తి లొంగిపోయింది. ఈ సన్నివేశం ఇంద్రునకు అపకర్ష కలిగిస్తుంది. ఆయన పౌరుషంపై, వజ్రాయుధంపై గౌరవభావం గలవారైనందున మనకవులు (సంస్కృత) ఈ ప్రయోగాన్ని వాడుక (చేసి) ఉండకపోవచ్చు. దీన్నే తెలుగువారు పాటించినా పాటింపవచ్చుగాని ఇది ప్రావర్ణ మాటగా గుర్తింపదగదు. ఈ సందర్భంలో అధర్వణాచార్యుని సిద్ధాంతం ప్రతిపాదింప వలసి ఉంది. మనం తెలుగులో అన్ని శబ్దాలను ప్రయోగింపవచ్చును. సంస్కృతంవారు పాటించే అప్రయుక్తమనే దాన్ని తెలుగులో పాటింపనవసరం లేదు.

సర్వేశబ్దా ప్రయోక్తవ్యాయది వాదోషవర్జితా

అప్రయుక్తత్వదోషస్తున విరుద్ధోహరేర్మతే!- అని హరియనే పండితమతాన్ని పాటించి యప్రయుక్త తను తెలుగులో పరిహరించాడు. వికృత వివేకమనే నామాంతరంగల అధర్వణకారికావళిలో తత్కర్త అయిన అధర్వణాచార్యుడు. నన్నయ కాలంలో అవధారణార్థంలో అకారాన్ని వాడుక చేసేవారు. ఇది జన బాహుళ్యంలో ప్రచారదూరమయినందున ఆంధ్రావళి మోదంకోసం కవిత్వం వ్రాయబూనిన తిక్కనకు ప్రాతవడ్డ మాటగా అనిపించవచ్చు. అయితే ఈ ప్రయోగం జేసినందున నన్నయ కుకవి అయిపోయే ప్రమాదం ఉంది.

తన కాలంనాడు కుకవులుగా నమోదయినవారి రచనల్లో ప్రయోగాలు వ్యవహారంలో ఉన్నా ప్రయోగ రూఢాలుగానందున ప్రాతపడిపోయినవని తలంపనగును. వ్యాకరణ సమ్మతము శిష్టకవి ప్రయోగరూఢ అయిన ప్రయోగములు సుశబ్దాలు అని అనుకుంటే వానిని ఉచ్చరించటంలో శక్తి వైకల్య, ప్రమాద, అలసతాదుల వల్ల అపశబ్దాలేర్పడుతాయని పతంజలి. ఇంతేగాక సుశబ్దాలు ప్రతిదేశ ప్రతిగృహ ప్రతివ్యక్తి నిష్ఠమై భిన్నములు అనవస్థితములైనందున ఇవి సుశబ్దములకన్న ఎన్నో రెట్లధికంగా ఉంటాయని పతంజలి. గ్రంథరూపంగాని తెలుగులో అపశబ్దాలు అనంతంగా ఉండి ఉంటాయనీ అందులో కొన్నింటిని తిక్కన ప్రాతవడ్డ మాటలని చెప్పి ఉండవచ్చును. ఈ యంశంలో ఇంతకన్న వివరాలను చెప్పటం సాధ్యంగాని విషయం. మిగిలిన ద్రావిడ భాషల నీదృష్టితో పరిశీలిస్తే మనం ఈ సందర్భంలో మరికొన్ని వివరాలను చెప్పగలమని నాకనిపిస్తుంది.

మూల ద్రావిడభాష అనే concept ఈనాటిదైనా మన తెలుగుకు తక్కిన ద్రావిడ భాషలకు సంబంధం ఉన్నదనేది సత్యం. తెలుగు సంస్కృత జన్యమని మనం నమ్మవచ్చు.

కాని ద్రావిడ భాషాకుటుంబం అనేది ఆంగ్లేయులతో మనకు కలిగిన సంపర్కం వల్ల వెలుగులోనికి వచ్చింది. ఈ సిద్ధాంతానికి ఆధార భూతాలైన అంశాలు అనాదిగా ఈ భాషల్లో ఉన్నాయి. చిలుకకు మూలరూపం. 'కిళకళ్' అనే బహువచనరూపం. ఇది తమిళం అనే అంశాన్ని మనం కనుగొన్నా ఈ పదాల సంబంధం అనాదిగ ఉన్నదే. ఇలాంటి వెన్నయినా మనం నేడు వివరింపగలం. వెనుకటి కాలంలో ఇవి వికృతాలు గాదు. 'ఞమల్' అనేది తమిళంలో మయూర పర్యాయం. ఇది తెలుగులో నెమలిగా రూపుదిద్దుకుంది. ఈ తమిళ, ఆంధ్ర పదాలకు నడుమ 'నమలి' అనే పదం వ్యవహారంలో ఉంది. అన్నమయ్య దీన్ని వాడుక చేశాడు. శుకసప్తతిలోగల 'సడ్డ' (2-86) శుద్ధకు బదులుగా ఏర్పడిన రూపం. ఇది గూడ ప్రాతబడ్డ మాటయే. ఇలాంటి వాటిని తిక్కన ప్రాత పడ్డమాటలని చెప్పియుండవచ్చును. క్వార్థకమయిన 'ఇ'కారం'నమలు' అనేధాతువుపై చేరగా 'నమలి' ఏర్పడుతుంది. 'ఞమల్' అనే తమిళ రూపానికి నెమలి అనే తెలుగు రూపానికి నడిమిదశలో వ్యవహృతమయిన రూపం నమలి. పై రెండు పదాలు ద్రావిడ భాషారూపాలు. రూప సామ్యం ఉండి అర్థభేదం ఉంది. నెమలికి పర్యాయంగా 'నమలి' వాడుక మరుగు పడిపోయింది. నెమలి ఏర్పడినంతనే 'నమలి' వ్యవహార భ్రష్టమైంది. అంతేగాక (నమలు+ఇ) అనేది నమలి ప్రసిద్ధమైంది. ఇన్ని కారణాలున్నందున ప్రాతబడిన నమలి' (నెమలి పర్యాయం) ఞమల్ > నమలి > నెమలి అనే వాటిని ఎవరు నిర్మించారు? అసలు పదనిర్మాతలెవరు? అనే ప్రశ్నవస్తే భాషావ్యవహర్త లందరూ ఇందులో భాగస్వాములే. అంతేగాని కుండలను మనం కోరిన సైజులో కుమ్మరి వాడు నిర్మించి మనకందించినట్లు భాషా ప్రయోక్తకు పదాలను నిర్మించి శబ్ద శాస్త్రజ్ఞులు చేసి అందిస్తారని ఎవరైనా తలుస్తుంటే అది కేవలం భ్రమ, అర్థరహితమైన భావన అని మహాభాష్యంలో స్పష్టం గావించబడింది. పదనిర్మాత వ్యవహర్త. అలానిర్మితాలైన ప్రయోగ రూఢతగాంచిన పదాలను ప్రకృతి ప్రత్యయాత్మకంగా నిరూపించేవాడు శబ్ద శాస్త్రజ్ఞుడు. ప్రత్యయాలు ఈ విధంగా తమ తమ వ్యక్తిత్వాన్ని పొందుతాయి. ఏయే పదాలపై ఈ ప్రత్యయాలు చేరుతాయో పరిశీలించి అలా చేరే ప్రకృతులను నిరూపిస్తాడు వ్యాకర్త. ఇంతటితో ఈ ప్రత్యయ ప్రయోగం ఆగదు. ఇంకా కొత్త ప్రకృతులపై ఈ ప్రత్యయాలు చేరుతాయి. దీనికి వ్యాకరణం అనుమతించింది. అందువల్లనే తారకాదులకు ఇతచ్ అనే చోట ఆదిని ప్రయోగించారు. దీనివల్ల పదనిర్మాణం పెరిగిపోయింది. సమాసాల అర్థాన్ని గ్రహించి అందలి పూర్వ లేదా, పర పదాలకు పర్యాయంగా క్రొత్త పదాలను వాడుక చేసినందున కొత్త సమాసలేర్పడతాయి. శివ పర్యాయాలయిన సమాసాలు మూడు వందలకు పైగా ఉండటానికి కారణం ఇదే. ఈ యంశంలోని మరిన్ని విశేషాలకు ముద్రచితమైన 'తెలుగు కవుల సంస్కృత ప్రయోగాలు'- తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణను చూడదగును. ఎవరికి వారు ప్రాతవడ్డ మాటలను పరిత్యజించి నూతన పదాలను సృష్టించుకోవాలి. సృష్టి సంస్కృతంలో సులువు. అందలి ధాతువులు, ప్రత్యయాలు (తద్ధిత- కృత) అసంఖ్యాకంగా ఉన్నాయి. అందువల్లనే మనవారందరు సంస్కృత పదాజాలాన్ని నిర్మించుకుని ప్రయోగించారు. సంస్కృత పదాలను వదలి రచన చేసినా అది ప్రశస్తి గాంచలేదు.

## IV తిక్కన తెలుగుదనం

సంస్కృత పదాలనాదరిస్తూగూడ తెలుగును సుసంపన్నంగావించాలనే సత్సంకల్పంగలవాడు తిక్కన. ఆశ్రమవాస పర్వం ద్వితీయాశ్వాసంలో గాంధారీ- ధృతరాష్ట్రుడు కుంతీదేవితో సహ అరణ్యవాసానికి బయలుదేరినపుడు ఆ నగరంలో గల అసూర్యంపశ్యలగు రాజకాంతలు గూడ ఇంటినుండి వెలుపలికి వచ్చి ఆ విషాదాత్మక సంఘటనను చూశారని చెప్పే సందర్భంలో వ్యాసమహర్షి ఈ క్రింది శ్లోకాన్ని వాడాడు.

యానాపశ్యచ్చంద్రమానైవ సూర్యో
రామాః కాశ్చిత్తాస్తు తస్మినరేంద్రే
మహావనం గచ్ఛతి కౌరవేంద్రే

శోకనార్తా రాజమార్గ వివేశుః - ఇతః పూర్వం సూర్య చంద్రులను చూచియెరుగని క్షత్రియ కాంతలు నగర వీధులకు వచ్చారు శోకం రూపుదాల్చినట్లు ఆ విషాదసన్నివేశం తిలకింపదలంచి. ఇందు చంద్ర- సూర్య అనే పదాలున్నాయి. చంద్రునకు పర్యాయ పదాలు ఇరవై ఉన్నాయి. సూర్యునకు పర్యాయపదాలు దాదాపు నలభై ఉన్నాయి. ఈ పదజాలమంతా అమరకోశంలో ఉన్నందున తిక్కనాది మహాకవులకందుబాటులో ఉంటాయని వేరుగ చెప్పనవసరంలేదు. తిక్కన ఆంధ్ర మహాభారతంలో 'వచ్చి రెండకన్ను వాన కన్ను నెరుంగని పురంధ్రులెల్ల' అని సూర్యపర్యాయంగా ఎండకన్నును చంద్రపర్యాయంగా వానకన్నును తెనిగించాడు. వాడుక సంస్కృత పదాలను స్వీకరించలేదు. తెలుగులో విరివిగా ఉన్న జంట పదాలలో ఎండ- వాన అనేవి ప్రసిద్ధాలు. ఇవి పరస్పరం విరుద్ధార్థాలనిస్తాయి. వీటికి పరంగా కన్నును చేర్చి 'ఎండకన్ను- వానకన్ను' అని కవిబ్రహ్మవాడాడు. వీటిని తాను కల్పించాడా లేక వ్యవహారంలో ఉన్న ఈ జంటలను గ్రంథస్థ గౌరవాన్ని కల్పించాడా అంటే ఇదమిత్థంగా చెప్పటం అంత సులువైన విషయం కాదు. ఈ పదాలకు నమూనాగా గుర్తింపదగిన పద ప్రయోగం చేసిన ఘనత తాళ్ళపాక అన్నమాచార్యులకు దక్కింది. ఈ సందర్భంలో ఎండ-నీడ అనే జంట పదాలను గ్రహించి నందున ఎండకన్ను- నీడకన్ను అనే సూర్యచంద్ర పర్యాయపదాలను కల్పించి వాడుకొన్నాడు. ఇంతేగాక వేడి చద్ది అనే జంట నుంచి వేడి కన్నును సూర్యపర్యాయం గాను. చంద్రపర్యాయంగా నీడకన్నును వాడియున్నాడు ఏతావతా వానకన్ను అనే చంద్రపర్యాయాన్ని అన్నమయ్య పరిగ్రహించి యుండలేదు. తిక్కన చంద్ర- సూర్య పర్యాయాలుగా పై తెలుగు జంటలను వాడాడు. ఇవి ఆయన గల్పించిన నూత్నపదాలు. వాటిని అన్నమయ్య గ్రహించి ఆప్రయోగాన్ని ద్విగుణీకరించాడు. అనంతరకాలంలో ఈ పదప్రయోగం మరుగుపడినట్లు పరిశీలన వల్ల తెలుస్తుంది. తిక్కన మహాకవి ఇంకా ఎన్నో కొత్త కొత్త తెలుగు పదాలను ప్రయోగించాడు. తన కల్పితమైన సృష్టికి ఈ పదాలు ప్రతీకలా లేక వ్యవహారంలో గలవానికి గ్రంథ ప్రయోగ గౌరవాన్నాయన చేశాడా? మనం చెప్పలేం.

కొత్త నీరొచ్చి పాతనీరును...అనేదో సూక్తి. 'కొత్తపాతల మేలు కలయిక' అనే పదబంధాన్ని, గురజాడ కవి ప్రయోగించాడు. మాటలు పాతబడతాయని తిక్కన చెప్పటం మనకు తెలుసు అన్నమయ్య ప్రయోగించిన 'ఆతుమ' (ఆత్మ) వెంగేలు మొదలయినవి తద్భవాలు. వ్యక్త శక్తి వెకల్యాదులచే ఇవి ఏర్పడినాయి. సుశబ్దాలకంటే ఎన్నో రెట్లు మిన్నగా ఉన్న అపశబ్దాల జాబితాలో ఇవి చేరుతాయి. వీటిని మహాకవులాచరించనందున వ్యవహారంలో పరిమిత ప్రదేశాలకు సంబంధించినందున పాతపడినవిగా తలంపవచ్చును.

## V కొత్త మాటలు

అభిమన్యువధాఘట్టంలో తిక్కన 'ఎఱనింగి' అని వాడాడు. ఈ పదబంధం కొత్తది. దీన్ని అనుసరించి ప్రయోగించిందే నడునింగి (శుకసప్తతి 1-275) అని అనిపిస్తుంది. ఈ రీతిన కొన్ని కొత్త పదబంధాలను వాడుక సేయటం ఆ పద్ధతిని తరువాతివారు ఆదరించుటగద్దు. ఈ కింది పదాలు పదబంధాలు తిక్కనలో గననయ్యే కొత్తపదాలు. చిఓర్తుమగని అనుజీ V 105. ఈ మార్గంలో ప్రయుక్తమైనదే. 'ఒకతె మగనికి నాసించుటొప్పదు' అనే పింగళి సూరన కళాపూర్ణదయంలో గావించిన ప్రయోగం. 'పొత్త మావిపుర్వు' ఆను V 230. ఒక వినూత్నమైన పదబంధం. పట్టుపురుగు అనేదానికి బదులుగా కవి బ్రహ్మ ప్రయోగించాడు.

'గొడుగు జెప్పలు' ఆను III 263. అనేది ఓ ద్వంద్వ సమానము. 'ఆతపత్రంబును పానద్వయంబు' ఆను III 264. అనే పదబంధాన్నీ సందర్భంలో పై తెలుగు ద్వంద్వసమాసానికి బదులుగా ప్రయోగించి తెలుగు సమాసార్థాన్ని వివరింప ఈకవి ప్రయత్నించాడు. లేకుంటే ఈ తెలుగు పదబంధం ఉద్దిష్టార్థాన్నీయటంలో శక్తిమంతంగాదనిపిస్తుంది. 'పణ్యవృద్ధ' (శుకసప్తతి III 78) అనేది సంస్కృతపద ఘటిత పద బంధమిది. దీన్నర్థం చేసుకోటంలోగలిగే క్లేశన్ని తొలగించటానికై ఈ పద బంధానికి పర్యాయంగా 'భోగము ముసలాపె(శుకసప్తతి III 45)అనే పదబంధాన్ని వాడుక చేసి యున్నాడు. 'భోగము'' అనేది తెలుగుపదం కాదు. కాని 'పణ్య' అనే సంస్కృతపదాని కన్న ఈ సంస్కృత పదం తెలుగునాట నాడూ నేడూ గూడ ప్రచార ప్రాబల్యాన్ని గలిగి ఉన్నదని నిష్కర్షగ చెప్పవచ్చు.

తద్భవ ప్రక్రియలో గ్రంథస్థం కానివాటిని తమ తమ అభిప్రాయ ప్రకటన కోసం జానపదులు కల్పించి తద్వాఙ్మయం రూపాన ప్రాణ ప్రతిష్ఠ గావించిన పదాలను గ్రంథస్థం గావించటం నూత్న పదాల ప్రయోగంగా చెప్పవచ్చును. ఆంధ్రావళిమోదం కోనం రచనకుద్యమించిన తిక్కన ఈ విధంగా నూత్నపదాలకు ప్రాణప్రతిష్ఠగావింపగా, ఆతని మార్గాన్ననుసరించిన కదిరీపతి కథా వాఙ్మయాన్ని చేపట్టినందున ఈ వాఙ్మయం జానపదుల వ్యవహారంలో రూఢిగాంచి యున్నందున వారి పదాలను తద్భావ ప్రకటనలో వాడుక చేశాడని తలపనగును.

ప్రాతవడ్డ మాటలను బహిష్కరించినందున పదాల సంఖ్య తగ్గిపోతుంది. కొత్తమాటలను చేర్చి భాషను నునంపన్నం చేయాలి. ఈయంశంలో తిక్కన తరువాత కదిరీపతి పేర్కొనదగినవాడు.

## VI శుక సప్తతి- నూత్న పదాలు

వేశ్యకు బదులుగా కదిరీపతి వెలయింతి (శుకసప్తతి I 525)వెల వెలది (శుకసప్తతి II 52) వెల ముద్దియ (శుకసప్తతి III 45) అనే పదబంధాలను ప్రయోగించాడు. ఈ పద్ధతినను సరించి తిరుపతి వేకంటకవులీరీతి పదబంధాలనసంఖ్యాకంగా వాడుక చేసియున్నారు. తిక్కన తరువాత ఎండకన్నును అన్నమయ్య నడునింగిని కదిరీపతి (తిక్కన ఎఱనింగి) వాడుక చేసి కవిబ్రహ్మ భాషా నిర్మాణ చాతురికి ప్రాణం పోసినట్లు కదిరీపతిప్రతిష్ఠగాంచిన పై వేశ్యా పర్యాయాలకు తిరుపతి కవులు ప్రోద్బలాన్నిచ్చారని తెలుస్తుంది. వీరి ప్రయోగాలన్నీ సంస్కృత పద ఘటితాలు. ఇతఃపూర్వం ఇట్టివి సంస్కృతాంధ్రలందెందును కనరానందున వీటికి కర్తలు తిరుపతి కవులే. ధనాంగన, విత్తకాంత, ధనస్త్రీ, ధననారీమణి, రోసుందరి, రోవనిత, వెలమానిని, ధనకామిని మొదలయినివి. ఈ ప్రయోగాలన్నియు తిరుపతి వేంకటకవులు రచించిన శ్రవణానందం అనేకావ్యంలో వాడుక చేసియున్నారు. ఈ విధంగా వేశ్యాపర్యాయాలు పెరిగి భాష పదముల విషయంలో సుసంపన్నమయ్యిందనటం వాస్తవం.

శయనాగారము మొదలయిన సంస్కృత సమస్త పదానికి బదులుగా కదిరీపతి 'పడుకయిల్లు' (శుకసప్తతి III 168, 216, 477) 'పడుకయిలు' (శుక III 79,197) 'పడుకటిల్లు' (శుక III 496) అనే ప్రయోగాలను వాడాడు. పడుకిల్లు అనే సంధి సహిత సమాసం గనరాదు. తరువాత కాలంలో సంధి వచ్చిన రూపం ప్రచురమయ్యింది. -క-లోని అకార ప్రభావానికి 'డు'లోని ఉకారంలో నైనందున పడక అనేది ప్రజల యాదరాన్ని పొందింది. పడక+ఇల్లు, 'పడకిల్లు' అనే ప్రయోగం పింగళి- కాటూరి వారి కావ్యమైన సౌందరనందంలో 'మేల్పడకింటన్' అని గలదు.

కాలబోధకాలను ఏర్పాటు చేయటంలో మనవారనాదిగ చిక్కులు నెదుర్కొనట్లు తెలుస్తుంది. 'గోషదుహ్యామానానుగతః' అనే విధంగా కాలాన్ని తెలుపప్రయత్నాలు జరిగాయి. దీన్ననుసరించి తెలుగువారు దోగోహనాకాలమని చెప్పటం ప్రారంభించారు. కదిరీపతి ఈ విషయంలో ఈ క్రింద సమస్త పదాలను వాడుక చేసియున్నాడు.

'వాలుప్రొద్దుతో తలవాకిట జేరు' వాలుపొద్దు సూర్యాస్తమయాన్ని సూచిస్తుంది. ఈ ప్రయోగం శుకసప్తతిలోని రెండో ఆశ్వాసంలో మూడవందల అరవై మూడోపద్యంలో ఉంది. ఆయాశ్వాసంలోని నూటముప్పై ఎనిమిదోపద్యంలో 'తొలకోడికూత ప్రొద్దున' అనే ప్రయోగం గద్దు. ఇది ప్రాతఃకాలాన్ని పై సమాసం సాయంకాలాన్ని తెలియజేస్తున్నాయి. 'సంధ్య' అనే సంస్కృత పద జన్యమయిన 'సంజజనించె'ననే ప్రయోగం (శుక I 272)గూడ కాల బోధకమే. ఈ సందర్భంలో జనించు అనే ప్రయోగం అపూర్వం. పొద్దుపుట్టుటను మన వారూహించి కావ్యములందు వాడుక చేసి యుండుట ఈ సందర్భంలో గుర్తింపదగును.

మన భాషలో లింగబోధక ప్రత్యయాలు లేవు. 'ఆలు' మొదలయిన స్వతంత్ర పదాలనే(గుణవంతురాలు, పేదరాలు) వాడుక చేస్తుంటారు. ఇందులో 'ఆలు' స్త్రీ పర్యాయం.

శుకమంగన (శుక సప్తతి III 58) అనేది స్త్రీ పర్యాయమైన పదం. శుక అనేది సంస్కృత పదం. కుక్క అనే తెలుగు పదంకు స్త్రీ లింగరూపం కల్పించాలంటే వరంగా స్త్రీ పర్యాయాన్నిచేర్చితే ఏర్పడదు. తెలుగులో-పెట్ట పుంజు అనే జంట పదాలు కుక్కుట జాతిలోని స్త్రీ, పుంబోధకాలు. గిరిజనుల వ్యవహారంలో ఈ పదద్వయం స్త్రీ పురుషబోధకాలు. 'పెట్టకుక్క' (శుకII 33) అనే ప్రయోగం లో 'పెట్ట' స్త్రీ లింగబోధకం కాగా ఈ సమస్తపదానికి ఆడకుక్క అని అర్థం. దీనికి సంస్కృత పదాలతో శునక+ అంగన= శునకాంగన అనివాడవచ్చు: కాని తెలుగలో తన భావ ప్రకటన కనువైన పదనిర్మాణ ప్రయత్నంలో ఈ పదమొక అంశంగా గుర్తింపనగు.

'చేనిపాటు' (శుక II 335) 'కృషికార్యధురంధరుడు' (శుక II 328) అనే రెండు పదాల్లో 'చేనిపాటు' తెలుగుమాట. దాని యర్థం తెలుసుకోవటంలో పాఠకులకు ఎలాంటి సందేహం కలుగకుండటానికై 'కృషికార్య' మనే సంస్కృత పదబంధాన్ని వాడుక చేశాడు. సంస్కృతం దిక్కునుండి మనం తెలుగు పదాల వివరణను పొంది ఆ మార్గంలో మనం తెలుగు పదాలను వాడటం కొత్త తెలుగు పదాలను కల్పించి ప్రయోగించటం కదిరీపతియభీష్టం. 'అరకడు' (శుక II 348)' హలాంకుడు' (శుక II 442) అనే ఆంధ్రసంస్కృత పదాలు తుల్యార్థకాలు. హలాంకమనే పదం మూలాన అరకడనే తెలుగు పదం విశదం అవుతుందని కవియుద్దేశం.

పొరుగూరు అనే పదంతో తుల్యార్థకం పొన్నూరు అని క్రింది ప్రయోగాలు స్పష్టం చేస్తున్నాయి.

ఆరెలు గావలెనని పొరుగూరికి (శుక II 338)
తాము పొరుగూరికి జనరే (శుక III 183)
పొన్నూళ్ళకెడ చేరుట (శుక III 438)

నేటి తెలుగులో 'పొన్నూరు' అనేది కొన్ని ప్రాంతాల్లో పై యుర్థంలో వ్యవహరించటం గలదు. విశాఖ, విజయనగరం ప్రాంతం వారి వ్యవహారంలో పొన్నూరు ఈ యర్థంలో జీవించియున్నట్లు పరిశీలనవల్ల తెలుస్తుంది.

'గృహిణి' అనే సంస్కృత పదానికి తుల్యార్థంలో గేస్తురాలనేది (శుక II 100) ప్రయుక్తమైంది. ఇది తెలుగు పదఘటితము. ఈ విధంగా సంస్కృత పదాలకు పర్యాయంగా తెలుగు పదాలను వాడుక చేసి ఈ భాషను సుసంపన్నంగావింప ప్రయత్నించిన కొద్దిమంది తెలుగుకవులలో గణనీయయుడు కదిరీపతి.'యజమాని' అనే మాటకు తెనుగు సేత 'మాయింటియతడు' (శుక II 111) అనే పదం. ఇది ద్విపద ఘటితమయినందున సమానంగా గుర్తింపదగు.

కూటిబీద (శుక III 352) చేయప్పులు (శుక II 368) మొదలయిన తెలుగు భాషాపద ఘటితాలైన సమాసాలను ప్రయోగించిన ఈకవి తెలుగుభాషకు జీవం పోయి ప్రయత్నించాడు. ఈ విషయంలో ఈతడు తిక్కన తరువాత పరిగణీయుడని తెలుస్తుంది. నల్లగరలపండుగ చీర

(శుక II 487) అనేది బహుపద ఘటితమైన తెలుగు సమాసం. 'చౌదరితనము' అనే ప్రయోగానికి గల అర్థాన్ని వివరించటంలో ఈ కవి ప్రత్యేక శ్రద్ధను చూపాడు. వ్యక్తుల నామానికి అనుబంధంగా ఉంటే 'చౌదరి' అనే పదం 'చతుర్థహారి' అనగా వచ్చే ఆదాయంలో నాల్గోవంతు పన్నురూపంగా వసూలు చేసి ఆ ఆదాయంతో ప్రజలకు సౌకర్యాలు కల్పించేవాడని చెప్పటం గలదు. ఇట్టి విధి నిర్వహణగావించే ఈ 'చౌదరి' పదవాచ్యులు క్షత్రియులని చెప్పటంగలదు. 'చౌధరి' అనే వంగదేశీయుల వ్యక్తినామబంధం తెలుగులో ఈ రూపాన్ని (చౌదరి) దాల్చి ప్రయుక్తమవుతుందని మరి కొందరి తలంపు. కదిరీపతి ఈ పదానికి తండ్రితాతల చౌదరితనాన్ని బవనీలు ప్రశంసించారని (శుక II 415) చెప్పి తండ్రి తాతలు తమ తమ జీవిత కాలంలో ఎన్నదగిన సత్కార్యాలను దానధర్మాదులను గూర్చి వివరించినట్లుగలదు. వ్యక్తి నామనుబంధమైన ఈ పదానికీయర్థం గమనార్హం. ఆనాడు కవి నిర్దేశించిన ఈయర్థం పరిగ్రాహ్యం అని అనిపిస్తుంది.

భుజంగ ఏవజానీతే భుజంగ చరణం సఖే' అనే సంస్కృత సూక్తిని 'పాముజాడ పామునకుంగాని'....తెలియదు, (శుక III 236) ఇత్యాదిగ తెనిగించి తెలుగులో భావ ప్రకటనా సామర్థ్యమును ఈకవి ధృవీకరించియున్నాడు. 'ఇంద్రనీలమణి'కి పర్యాయంగా బలభిన్మణి (శుక I6) పౌరందరమణి అని (శుక II 6) సంస్కృత పద బంధాలను నిర్మించి తనకు సంస్కృత పద నిర్మాణంలోగల శక్తిని వివరించియున్నాడు.

'తురాషాడశ్మ' మొదలయిన సమాసాలను 'ఇంద్రనీలమణి'కి బదులుగా వాడుక చేసియున్న విశ్వనాథ సత్యనారాయణ మొదలయిన వారిమార్గానికి అనంతర కాలంలో జవాన్ని,జీవాన్ని కల్పించారనటం అవాస్తవంకాదు.

పాతమాటంటే ఏమి? పాత మాటలయినందున అవి వ్యవహారదూరం అవుతాయి. అలా అయినపుడు భాషలోని పదజాలం తగ్గిపోతుంది. అలాంటప్పుడు కొత్త పదాలను సృష్టించి ముఖ్యంగా జానపదుల వ్యవహారంలో రూఢములయిన పదాలను కవులు ఆదరించి భాషను మరల సుసంపన్నం జేస్తున్నారు.

చాలామంది కవులవలే గాక నూత్నపదాల నిర్మాణానికి సంస్కృతపదాలను గాక దేశీయమైన పదాలను ఆదరించిన ప్రత్యేకత కలవాడు కదిరీపతి. ఈ గ్రంథరచనకు ప్రోత్సహిస్తూ విద్వజ్జనులు కదిరీపతిని కోరిన సందర్భంలో వారీకవి యొక్క, పాండితీప్రకర్షను ప్రతిభను కొనియాడుతూ 'నైఘంటిక పదాను నయనిరూఢి' అని వాక్రుచ్చినట్లు గలదు. తన కాలం నాటికున్న సంస్కృతాంధ్ర నిఘంటువులను తరచి చూచి యందలి మర్మములను విశేషార్థకాలైన పదాలను గ్రహించిన వాడీతడని మనకవగతమవుతుంది.



# భాషా సంస్కరణ- వ్యాకరణం

- డా॥ డి. కృష్ణకుమారి.

పరస్పరం భావ ప్రకటనకుపకరించేది భాష. ఇది 'భాష్ - వ్యక్తాయాం వాచి' అనే ధాతువునుంచి పుట్టింది. భాష్యత ఇతి భాషా'- అని దీని వ్యుత్పత్తి. జనంనోట పలికే పదసముదాయం అని అర్థం. తాననుకున్న భావాన్ని నిర్దుష్టంగా స్పష్టంగా ఎదటివాళ్లకు తెలివిడి చేయాలి అంటే దానికి తగ్గ వర్ణ, పద, వాక్యాత్మక భాషాజ్ఞానం అవసరం. ఈ భాషాజ్ఞాన సిద్ధికి లోకమే కుదురు. 'సిద్ధిర్లోకాద్దృశ్యాః సిద్ధేశబ్దార్థ సంబంధే'- అనే వాక్యాలు ప్రమాణాలు. ఇక్కడలోకం అంటే శిష్టలోకం అని అర్థం. శిష్టులు అంటే 'వేద ప్రమాణ వాన్ శిష్టః' 'శాస్త్రజ్ఞాఃశిష్టాః' అనే కాకుండా జనంలో వాడుకపడ్డ శబ్దాల్లోని మార్పులూ, వాటి ఔచిత్య అనౌచిత్యాలు తెలిసినవాళ్లూ తెలియచేసేవాళ్లూ అయిన భాషా సంప్రదాయ వేత్తల్ని శిష్టులుగా పెద్దలు పరిగణించారు. అనన్యాదృశమూ/ ఏక రూపము/ నిత్యమూ అయిన ఈ శిష్టభాషే ప్రామాణికం. శిష్టేతర భాష అప్రామాణికం. ఈ భాష, అదే పనిగా చదువుకోవడం వల్ల అబ్బేదికాదు. ఇది 'వృద్ధవ్యవహారాదేవశబ్దార్థ సంబంధావగమః - అవిచ్ఛిన్న వృద్ధ పారంపర్యోపదేశాత్' - అంటే పెద్దల వాడుకవల్లా, ఆ వాడుకపదాలు నిరంతరం ఒకళ్లనుండి మరొకళ్లకు పరంపరగా కొనసాగుతూ ఉపదేశించడం వల్లా అలవడుతుందని అర్థం. ఇలా 'ప్రవాహిని' అయిన భాష, పరిణామహేతువుల్ని తిరుపతి వేంకట కవులు.

'కాలమును బట్టి దేశమును గాంచి
ప్రభుత్వమునెంచి దేశభాషాలలితాంగి
మాఱుటిది సత్కవి .సమ్మతము.....'

అంటూ ప్రస్తావించారు. అంతేకాకుండా జీవద్భాష మాండలిక భేదాలవల్లా, 'పండితపామరుల' ప్రమాద అలసతలవల్లా, అనుకరణంవల్లా, ఉచ్చారణవల్లా 'స్పష్టప్రతిపాదనేచ్ఛ'వల్లా క్రమక్రమంగా మారిపోతూంటుంది. కొత్త పదాల్ని కలుపుకుంటూ పెరుగుతుంది. ఇలా తత్తత్కాలానుగుణంగా కల్గే మార్పును నివారించి తత్సం ప్రదాయానుగుణంగా నిలకడ కల్గించేది వ్యాకరణం, 'వ్యాక్రియంతే శబ్దాః అనేనీ ఇతి వ్యాకారణమ్'- అని దీని వ్యుత్పత్తి.

భాషా జ్ఞానంలో సంపూర్ణ భావబోధకాలు వాక్యాలే అయినా ఆ వాక్యాలూ వాటిలోని పదాలూ అనంతాలవడంవల్ల సౌలభ్యం కోసం వాక్యాన్ని పదాలుగా విడగొట్టి, ఆ పదాల్లోని ప్రకృతి ప్రత్యయాల్ని విడివిడిగా చూపడమే వ్యాకరణ ప్రధాన ధర్మం. కనక ఇది శబ్దాశ్రితం. దీన్నే మహాభాష్యకారులు"లోకతో 2 ర్థప్రయుక్తే శబ్ద ప్రయోగే శాస్త్రేణ ధర్మ నియమః క్రియతే' '-లోకం వల్ల శబ్ద ప్రయోగం సిద్ధిస్తున్నా ఆ శబ్దాల్ని ప్రకృతి ప్రత్యయ విభాగం చేసి సుశబ్దాలుగా రూపించి ప్రయోగించడం వ్యాకరణ ధర్మంగా వివరించారు. వాక్య పదీయకారులు'తాత్త్వ బోధః శబ్దజ్ఞానం నాస్తి వ్యాకరణాదృతే'- శబ్ద స్వరూప జ్ఞానం వ్యాకరణం వల్ల తప్ప మరిదేనివల్లా కల్గదన్నారు. ఇంకా ఈ శాస్త్రాన్ని బాల్యం నుంచీ నేర్చుకో దగ్గదిగా పేర్కొంటూ 'ఉపాయాః

శిక్ష్యమాణానామ్ బాలానాముపలాలితాః- విద్యార్థుల్లో చదవాలనే అభిలాషను పెంపొందింపచేసి దాని మీది జడుపును పోగొట్టే ఉపలాలనీయంగానూ, 'వాఙ్మలినాం చికిత్సత్సం'గా నూ అభివర్ణించారు.

భాష -వ్యాకరణాలు అవినాభావ సంబంధం కలవి. శిష్టలోక వ్యవహారాన్నిబట్టి వ్యాకరణం నడక సాగుతుంది. లోక సిద్ధం అయిన లక్ష్యంలో ఇమిడి ఉన్న నియమాన్ని వ్యాకరణం వ్యాకరించి చూపుతుంది. అంటే లోకప్రయోగాన్ని బట్టి లక్షణం రూపితమవుతుంది. శిష్టలోకభాషే సంస్కారార్థం అని భావం. కనకనే వ్యాకరణాన్ని 'లక్షణం' అనీ అంటారు. 'లక్ష్యతేజ్ఞాయతే అనేన ఇతి లక్షణమ్' - అని నిర్వచనం.

వ్యాకరణం మూల లక్ష్యం సదా భాషాసంస్కరణే కాని భాషను శాసించడం కాదు. 'సమ్' పూర్వక కృధాతువుకు 'ల్యుట్' ప్రత్యయం చేరి 'సంస్కరణ' అనే పదం ఏర్పడింది. భాషాధర్మాన్ని వ్యాకరణం చక్కబరుస్తుంది- బాగు చేస్తుంది అనే అర్థంలో ఇది సార్థకం అవుతుంది- 'నియమోలక్షణమ్- నియమార్థమ్ వ్యాకరణమ్ సంస్కారార్థో నియమః - అనే సూత్రాల నేపథ్యం ఇదే- సద్వ్యవహారగతమైన భాషను నియమించేది వ్యాకరణం. ఆ నియమప్రయోజనం శబ్ద సంస్కారమే అని వీటి అర్థం కనక 'సంస్కారం' అంటే 'శబ్ద శుద్ధి' అని నిశ్చితార్థం.

ఈ సంస్కరణ 'వర్ణలోప వర్ణాగమ వర్ణ వ్యత్యయ ప్రకృతి భావలక్షణస్సంస్కారః - వాడుకలో వర్ణలోప వర్ణాగమ వర్ణ వ్యత్యయ వర్ణ సమీకరణాదులచే కల్గేమార్పు స్వభావంగా కల్గి ఉంటుంది. ఈ ప్రాతిశాఖ్య వచనానుసారంగానే గిడుగువారు 'సంస్కరించడమనగా ప్రకృతి ప్రత్యయములు విడదీసి శబ్దాలలో కల్గిన లోపాలూ, ఆగమాలూ, ఆదేశాలూ మొదలైనవి తెలియచెప్పడం'- అని నిర్వచించారు' కవులు కూడా 'శబ్ద సంస్కారమెచ్చటను జారగనీకనే 'కావ్యాలల్లారు'. ఉక్తలక్షణవంతమైయుండునట్టి కావ్యము సంస్కారము' అని అప్పకవీయనిర్వచనం.

వైయాకరణులు పేర్కొన్న ఈ సంస్కరణల పూర్వాపర వివేచనలో శబ్దోచ్చారణ రూప సంస్కరణావశ్యకాన్ని ముందుగా ప్రస్తావించుకోవాల్సి ఉంది.

దుష్టః శబ్ద : స్వరతో వర్ణతోవా
మిథ్యాప్రయుక్తోన తదర్థమాహ-

దీర్ఘం తీసో తీయకో ఉదాత్తంగానో అనుదాత్తంగానో పల్కిన స్వరాలవల్లగాని, ఒక అక్షరానికి బదులు మరొక అక్షరాన్ని పల్కినాగాని శబ్దస్వరూపం మారిపోయి సరైన అర్థం తెలియదు. దానివల్ల భావప్రకటనం తేటపడదు. తద్వారా భాషా ప్రయోజనానికే ముప్పువస్తుంది. కనక ఏది చదువుకున్నా చదువుకోకపోయినా వ్యాకరణాన్ని మాత్రం తప్పనిసరిగా చదువుకోవాలి. లేకపోతే 'తనవాళ్లు' అనే అర్థం ఇచ్చే 'స్వజనం', కుక్కల గుంపు అనే అర్థం కల్గించే 'శ్వజనం' అనీ- సమస్తార్థకమైన 'సకల' శబ్దం 'ముక్క' అనే అర్థం ఇచ్చే శకలం అవుతుంది.

యద్యపిబహునాధీషే తథాపి పఠపుత్ర వ్యాకరణమ్
స్వజనం శ్వజనో మాభూత్ సకలం శకలం సకృత్ శకృత్ -

కనక పరిణామశీలమైన భాషా ప్రవాహంలో అప్పటి శబ్దమూలరూపం చెడిపోకుండా భాషాశుద్ధిని రక్షిస్తూంటుంది వ్యాకరణం. అందుకే 'రక్షణమ్ నియమమ్' అన్నారు పెద్దలు. సామాన్యులనోట ద్వోర్లే ఉచ్చారణాత్మక- ధ్వన్యాత్మకాది దోషాల్నుంచి కాపాడడం కోసం భాషను వ్యాకరణం సంస్కరిస్తుంది.

శబ్దోచ్చారణరూప సంస్కరణగల భాషా వ్యవహర్త వైశిష్ట్యాన్ని మహాభాష్యం ఇలా వివరిస్తుంది.

'యస్తు ప్రయుంక్తే కుశలో విశేషే శబ్దాన్ యథావద్వ్యవహారకాలే
సోఽన్న మాప్నోతి జయం పరత్ర వాగ్యోగవిద్దుష్యతి చాపశబ్దైః -

పదం అర్థం చక్కగా తెలిసి పల్కేవాణ్ణి చతురుడుగా, పద ప్రయోగ దక్షుడుగా ప్రశంసిస్తూ అలాపల్కని వాణ్ణి దూషితుడుగా భయపెట్టూ శబ్ద శుద్ధివైపుకు వ్యవహర్త దృష్టిని సారింపచేసేలా వ్యాకరణం ప్రేరేపిస్తుంది. అంతేకాదు.

"ఏకఃశబ్దః సమ్యగ్జ్ఞాతః సుష్ఠుప్రయుక్తః
స్వర్గేలోకే కామదుగ్భవతి"-

చివరకు బాగా తెలిసి ప్రయోగించిన ఒక్కశబ్దమైనా సరే స్వర్గలోకానికి తోవ ఏర్పరుస్తుందనే ఎర చూపి ఉత్సాహపరుస్తుంది.

ఈ ప్రయోగించిన శబ్దాలు సాధువులా అసాధువులా అనే వివేకం కల్గించడం మరో సంస్కరణ. 'అనుశిష్యంతే అసాధు శబ్దేభ్యః వివిచ్య జ్ఞాప్యంతే అనేన ఇతి అనుశాసనమ్' అన్నశబ్ద నిష్పత్తే ఈ సంస్కరణకు నిర్వచనం అవుతుంది. వ్యాకరణాన్ని శబ్దానుశాసనం అనీ అంటారు. 'నాగరకభాషలోని సాధుశబ్దాల్ని అసాధుశబ్దాల్నుంచి వేరుచేసి చూపి సాధుశబ్దాల్ని సాధించడమే- ఈ సంస్కరణ. అయితే ఇది కేవలం సాధువులైన లోక సిద్ధాలైన మార్పుల్ని మాత్రమే సాధిస్తుంది కాని సాధువులు అసాధువులు అయిన మార్పులన్నింటినీ స్వీకరించదు అంటారు వజ్ఝలవారు. వడ్లమూడి గోపాల కృష్ణయ్యగారు సంస్కరణ అనేది ఒకే పద్ధతిలో సర్వతోముఖంగా జరగలేదు కాబట్టి 'మార్పు' అనే శబ్దాన్ని సంస్కరణకు పర్యాయపదంగా వ్యవహరించుకున్నారు.

ఇది ఒప్పు ఇది తప్పు అనే పరిజ్ఞానాన్ని వ్యాకరణం ఎంతో వివరంగా అందిస్తుంది.

యథాశాస్త్రం యథాశక్తి యథా శ్రోత్రానురంజనమ్
యథాప్రసిద్ధి స్సర్వత్ర శబ్దానాం కల్పనామతా

శాస్త్రానికి లొంగినవీ- స్వపరకేతితార్థబోధకమైనవీ- చెవికింపుగా ఉండేవీ - సార్వజనీనమైనవీ అయిన పదాల్లు సాధువులు.

'సాధుత్వజ్ఞాన విషయా
శాస్త్రం ప్రమాణం కార్యాకార్యావ్యవస్థితే-'
'తద్విభాగా విభాగాభ్యాంక్రియామాణమవస్థితమ్'-
''శిష్టేభ్య ఆగమాత్సిద్ధాః సాధకోధర్మసాధవః
అర్థప్రత్యయానభేదే విపరీతాస్త్వ సాధవః''-
'సన్మూలవత్త్వాత్ రూఢత్వాత్ గృహీతత్వాచ్చ సాధుభిః-

వీటిని బట్టి పదార్థ స్వభావజ్ఞులైన వ్యాకరణవేత్తలు ప్రకృతి ప్రత్యయాలుగా వేరు చేసి చూపినవీ, సూత్రాల్లో లోపాగ మాదేశాదులుగా స్పష్టపరిచినవీ లక్ష్యలక్షణాలకు మూల ప్రాయమైనవీ, రూఢికెక్కినవీ, అర్థబోధలో ఎలాంటి తేడా లేకుండా శిష్టులవాడకంలో ఉన్నవీ, పదవ్యుత్పత్తులకనుకూలమైనవీ, మహాకవి ప్రయుక్తాలైనవీ, పండితలోకం ప్రశంసలందుకునేవీ అయిన శబ్దాలన్నీ సాధువులు. ఇవి ధర్మప్రతిపాదకాలు, ప్రయోగ యోగ్యాలు, సర్వలోకవిదాతాలు, దేశ్యాలు. ఇవి క్రమ బద్ధంగా నియమపూర్వకంగా కావ్యభాషలో చేరి ప్రామాణికాలవుతాయి. ఇవి సాధుశబ్దరూప సంస్కరణలు.

ఈ రీతి శబ్ద శుద్ధిగల సాధు పద ప్రయోక్తల్తోనే ప్రసంగిస్తూంటే ఈ సాధు పదజ్ఞానం తరిగిపోదు. మెల్లమెల్లగా భాషాభివృద్ధి కల్గుతుంది అనే విషయం వ్యాకర్తల దృష్టిని తప్పిపోలేదు.

'తది హసాధూన్ ప్రజ్ఞాపయతః
ఆచార్యసాధు భిరేవ భాషితవ్యమ్
న అసాధు భిరిత్యభిమతం లక్ష్యతే'

అయితే 'యోహి శబ్దాన్ జానాత్యప్యశబ్దాన్యప్యసౌజానాతి'- అనే పస్పశాహ్నిక వాక్యాన్ని బట్టి సాధు శబ్దాల్నుంచే అసాధువులూ తెలుస్తాయనేది స్పష్టమవుతుంది. ఈ అసాధు శబ్దాల్నే వైయాకరణులు గ్రామ్యాలు- అపభ్రంశాలు- అపశబ్దాలు అని వ్యవహరించారు. ఆ సూత్రాలుఇవి, 'అని యమాద్గ్రామ్యం హియత్స్వ పభ్రంశః'

'పామరాది ప్రయుక్తం యత్తద్గ్రామ్యమభిధీయతే'
'లోక మాత్ర ప్రయుక్తమ్ గ్రామ్యమ్'
లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు'

కేవల పామరప్రయుక్తాలై సంస్కరించని వాడుక పదాలూ, వ్యాకరణ నిషిద్ధపదాలూ ఈ కోవలోకి చేర్తాయి'.

అపశబ్దాహిప్రతిదేశం ప్రతిగృహం ప్రతిపురుషమ్
ప్రత్యవస్థం భిన్నాశ్చానవస్థితాః.........

ఇవి ప్రతి మండలంలోనూ ప్రతి ఇంటా ప్రతినోటా ప్రతి పలుకుబడి లోనూ ప్రతి సందర్భంలోనూ అయా వ్యవహర్తల సంస్కారాన్ని బట్టి ఎన్నెన్నో భేదాలు పొందుతుంటాయి. 'ఏకైకస్య హిశబ్దస్య బహవోప్ పభ్రంశాః'- ఇవి అర్థ బోధకాలు కావు.' సంస్కారేణ యథాహీనం

వాచం అర్థాంతరం గతః'- సంస్కరించని పదం మరొక అర్థాన్ని తెల్పడంవల్ల అసలు అర్థం తెలుసుకోవడం చాలా కష్టం' అయితే సాధు శబ్దస్మరణద్వారా వీటిలో కొన్నింటి అర్థం బోధపడకపోదు. ఇలా లెక్కకు మిక్కిలిగా ఉండే అసాదుశబ్దోపదేశం కన్నా సుశబ్దోపదేశాన్ని వ్యాకర్తలు సులువైందిగా భావించారు. అందుకేనేమో వీళ్లు 'సుశబ్దప్రయోక్త'ను స్తుతి పాత్రుడుగానూ, స్వర్గలోక ప్రాప్తికలవాణ్ణిగానూ, అపశబ్ద ప్రయోక్తను రౌరవాదినరకంలో పడేవాణ్ణిగానూ నిందాపాత్రుడుగానూ, (అపశబ్దం ప్రయుంజానో రౌరవాదినరకం ప్రజేత్) చిత్రించి సుశబ్దాపశబ్దాల తారతమ్యాన్ని చెప్పక చెప్పారు.

వ్యాకరణంలోని సుశబ్దాపశబ్దభేదాలు భాషాపరిణామంవల్ల వచ్చిన రూపభేదాలెన్నింటికో సూచకాలు అంటారు తాతా సుబ్బరాయశాస్త్రిగారు. ఒకపుడు సాధువలైనవి కాలంతరంలో సాధువులు కాకపోవచ్చు. అసాధువులు సాధువులు కావచ్చు. అందువల్ల జీవద్భాషాసంస్కరణలో సమగ్రత్వం కుదరనిపని. అయినప్పటికిన్నీ

'గుణదోషావశాస్త్రజ్ఞః కథం విభజతేనరః
కిమన్ధస్యాధికారోస్తి రూప భేదోపలబ్ధిషు-

గుడ్డివాడికి రూపభేదజ్ఞానం లేనట్టే శాస్త్రం తెలియనివాడికి తప్పొప్పులు పట్టి చూపే తెలివి ఉండదు. కనక సుశబ్దాపశబ్ద జ్ఞానానికి తప్పనిసరిగా వ్యాకరణం కావాలి అని దండిభావన.

పై అంశాల్ని బట్టి భాషా తత్త్వాన్ని ఆమూలాగ్రంగా ఆకళించుకున్న శాస్త్రజ్ఞులూ, కావ్య ప్రయోగజ్ఞులూ, లోకజ్ఞులూ, సంప్రదాయజ్ఞులూ మాత్రమే భాషను సంస్కరించడానికి అర్హులని తెల్లం అవుతుంది.

భాషను నియమవంతంగా ఎంత అదుపులో పెట్టినా అపశబ్దాల సాధుత్వ కల్పనం ఎంతో ఆయిష్టమే అయినా ప్రాచీన సాహిత్యంలో శిష్టలోక వ్యవహారం విరుద్ధపదాలు, మహాకవి ప్రయోగ విరుద్ధపదాలు, కొన్ని లక్షణ విరుద్ధ పదాలూ చేరకపోలేదు. ఇదే అభిప్రాయాన్ని గిడుగు వెంకట సీతాపతిగారు

"తమకున్ పూర్వకవి ప్రయోగములయాధారంబు లేకుండినా
తమ పూర్వుల్ రచియించు లక్షణము వద్దంచున్ నిరోధించినా
సమకాలవ్యవహార శబ్దములతో సత్కావ్యముల్ సత్కవుల్
సుమనోహృద్యముగ రచించిరి.........అంటూ

భారతీశతకంలో వెలిబుచ్చారు. ఇవన్నీ పూర్వనియమాల ప్రకారం అపశబ్దాలుకావాలి. కాని ఇక్కడ పూర్వనియమాల్ని కాదనిపోతే భాషాగౌరవం దెబ్బ తింటుంది. అలాగని పూర్వ నియమాల్తో సరిపెట్టుకుంటే భాషా వికసనానికి అడ్డుగోడ అవుతుంది. ఈ సందిగ్ధస్థితి నుంచి భాషను తప్పించడానికి వైయాకరణులు సడలించుకున్న నియమాలు మరొకరమైన సంస్కరణలు. వాడుకలో మారిపోతున్న భాషావిశేషాల్ని సంస్కరించుకున్న తీరులు ఇవి.

1. అనుకరణం విశిష్టస్యసాధుర్భవతి- విశేషం తుజ్ఞేయమ్ శిష్ట ప్రయోగతః' ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు'- అనే సూత్ర ప్రాయమైన వచనాల ద్వారా శిష్ట వ్యావహారికాన్నే సమగ్ర లక్షణంగా భావించి సంస్కరించడం-

ఇలా శిష్ట ప్రయోగానుకూలంగా శాసించని వ్యాకర్త శిక్షర్హుడవుతాడు. 'శిష్టానాముక్తౌ సూత్రాణామభావేం అనుశాసన కారిణ ఏవదండనీయాః - అని ఆర్యోక్తి'

2. సలక్షణం, దోషరహితం, వృద్ధానుజ్ఞాతం, శాస్త్రీయం, కాని ప్రయోగాలు కవినిరంకుశత్వం వల్ల చోటు చేసుకున్నప్పుడు వాటికి 'మహాకవి ప్రయోగత్వాత్ సాధుః- ప్రయోగశరణమ్ వ్యాకరణమ్ కవీనాం నిరంకుశత్వాత్ సాధుః- అంటూగతి కల్పించడం.

ఈ రూపభేదాల్ని ప్రాచామ్- అన్యే-కేచిత్ వంటి పదాల్తోనూ కవిభల్లటుడు-హరి శ్రీకలి మొదలైన వ్యక్తుల పేర్లతోనూ సూచించి సంస్కరించడం-

3. భాషలో చేరే కొత్తపదాల్ని, మారిన పదాల్ని, ప్రయోగాల్ని దృష్టిలో పెట్టుకుని వాటిని ఆకృతిగణాల్లోనూ, పదసార్థక్యాల్లోనూ నిపాత రూపాల్లోనూ ఇమిడింపజేసి ప్రయోగయోగ్యతను పొందించడం-

4. భాషలో సహజంగా వచ్చే మార్పులు చాలని నిబంధనలవల్ల తర్వాతి లాక్షణికుల దృష్టిలో అలాక్షణికాలవుతాయి. ఈ అపభ్రంశాన్ని జ్ఞాపకాల్లో వార్తికాల్లో వివరణ వాక్యాల్లో వివరిస్తూ సుశబ్దంగా సాధువుచేయడం- ఈ శాస్త్ర నిషిద్ధ రూపాలు సంకేతిత సుప్రసిద్ధరూపాలైతే సాధు ప్రయోగాలుగా అంగీకరించడం

5. ఎప్పటికప్పటి భాషా విశేషాల్ని కాలనుసరణంగా వ్యాకరణం సంస్కరించు కుంటున్నప్పట్వుకీ "అన్యభాషానుసరణ పదబాహుళ్యాన్ని వ్యాకరణాంతర. భాషాంతర నిబంధనల్ని అనువర్తింపచేసి సాధురూపసం నిర్దేశించడం. ఆ సూత్రాలు ఇవి.

`అనుక్తమన్యశబ్దానుశాసనవత్`
`తదనుక్తవక్తా భవతి పాణినిః`
`అన్నేషాంచ ప్రయోగమహితానామ్`
`ఆద్యామహర్షాసామూలం సర్వస్యేతినిగద్యతే`
`అనుక్తం సకృతవత్శేషం ప్రాకృతవత్` - ఇత్యాదులు

శాస్త్రప్రయోగాల్లో ఏది ప్రామాణికం అని నిర్ధారించుకోవాల్సి వస్తేమాత్రం కొంతమంది శాస్త్రానికే పట్టం కట్టారు. మరికొంతమంది కేవలం శాస్త్రం ఆశ్రిత్యకర్తవ్యోన నిర్ణయః యుక్తిహీన విచారేతు ధర్మహానిః ప్రజాయతే-అన్నారు. ఎంత శాస్త్రం ఒప్పుకున్నా ఆ ప్రయోగం జనం వాడుకకు దూరమైతే సాధువు కాదు అంటారు కుమారిల భట్టు,

`లోకేతు సర్వభాషాభిరర్థ వ్యాకరణాదృతే
సిద్ధంతు వ్యవహారేణ
నచలక్షణ మస్తీతి ప్రయోక్తవ్యమ్ అలౌకికమ్-

'కాళిదాసమయూరాదులకైన కలవు తప్పులనంగా నన్యులకు లేవే'- అని అప్పకవి అన్నట్లుగా మహాకవులు గ్రహపాటుగా ప్రయోగించిన అపశబ్దాలు ప్రయోగయోగ్యాలే అవుతాయి. ఇలాంటి వాటిని ప్రమాదోధీమతామపి- అంటూ సరిపుచ్చారు'

ఇంకా 'సద్గ్రామ్యమ్ సజ్జన గ్రాహ్యమ్' అని సర్ది చెప్పుకున్నప్పటికీ అనాదర భావంతో సంస్కరణకు నోచుకోని అపశబ్దాలే ఎక్కువ ఆ సంస్కరణ నిషిద్ధనియమాలు ఇవి 'శాస్త్రస్యయ ద్విరుద్ధంస్యాత్ తత్ త్యాజ్యంన్నాత్రసంశయః'- అ శాస్త్రీయ ప్రయోగమ గ్రాహ్యమ్- కవితోపాశ్రితం దోషం నైవకించిత్యహామహే'-

ఒకవేళ పొరపాటున అపశబ్దాన్ని ఉచ్చరించినా, అనుకోకుండా చెవినిపడినా ఆ దోషనివారణకు వ్యాకర్తల్ని స్మరించుకునే తారక మంత్రాన్ని వైయాకరణులు ఉపదేశించారు.

శ్లో॥ శ్రేత 2 పశబ్దే చోక్తే ప్రమాదాత్పాణినింస్మరేత్
అథవా ఫణినామీశమ్ చింతాయేద్బహునా ధీశో బుధాః

ఇలా ఎన్నో తీరుల్లో విధి నిషేధ రూపంగా ఎప్పటికపుడు వ్యాకరణం భాషను సంస్కరిస్తూనే వచ్చింది. అందువల్ల ఈ సంస్కరణలన్నీ ఒక్క మారుగా జరిగినవి కావు. ఏనాటికానాటి భాషా వేగానికి పగ్గం వేస్తూ పుట్టుకొచ్చిన వ్యాకరణాలే కనక ఇవి సర్వసమగ్రాలు కావు. పూర్వపూర్వ వ్యాకరణాల అసమగ్రతలే ఉత్తరోత్తర వ్యాకరణాలకు నాందీవాచకాలు. ఒక విధంగా ఆలోచిస్తే 'తత్తత్కాల భాషాసంస్కరణే వ్యాకరణం పని' వ్యాకరణ వికసనమే భాషా సంస్కరణ' అని తేల్చి చెప్పుకోవాల్సి ఉంటుంది.

ఏతావాతా 'శిష్ట ప్రయోగ నిరూపణమే సంపూర్ణ లక్షణం అని తేలినా ఉచ్చారణ దోషాల్ని దిద్దుకోవడం కోసం- సాధ్వసాధువివేకం కోసం- శబ్ద పరిజ్ఞానం తేలిగ్గా కల్గడం కోసం గ్రామ్యతానివారణకోసం- వీటిద్వారా భాషా జ్ఞానాన్ని ఎరుక పరిచేందుకు ఎప్పటికపుడు వ్యాకర్తలు భాషా సంస్కరణకు పూనుకుంటారనేది స్పష్టం'

'లఘ్వర్థం చాధ్యేయం వ్యాకరణమ్'- దుష్టాన్ శబ్దాన్ మా ప్రయుక్ష్మహీత్యధ్యేయం వ్యాకరణమ్' 'మ్లేచ్ఛామే భూమేత్యధ్యేయం వ్యాకరణమ్'- అనే మహాభాష్య నిర్వచనాలు వీటికి ఉపబలకాలు.

సంస్కృత వ్యాకర్తలు 'లౌకిక వైదిక భాషను వ్యాకరిస్తే ఆంధ్ర వ్యాకర్తలు లౌకిక కావ్య భాషను' వ్యాకరించారు, సజీవ భాషలో జీవనదీ ప్రవాహంలా మరే భాషా పరిణామాల్ని సమకాలీనశిష్ట వ్యావహారికంలో బాగా నలుగుడువడినాకనే సంస్కరించడం లాక్షణిక సంప్రదాయం. కవులు నిరంకుశులు కనక సంస్కరించేదాక ఆగక అనుకోకుండానో, కావాలనో ఆ ప్రయోగాల్ని వెంటనే స్వీకరిస్తారు. అందువల్ల వాడుకభాష ఆయా వ్యక్తుల సంస్కారాన్ని బట్టి నిరంకుశంగా మార్పుచెందుతుంది. వాడుక భాష మారినంత తొందరగా కావ్యభాష మారదు. లక్షణానికి కట్టుబడి వ్యవస్థితమై ఉంటుంది. వాడుక భాషా పరిణామ తీవ్రతకు తగ్గట్టుగా భాషను సంస్కరించకపోవడం వల్ల కావ్యభాషకూ వాడుక భాషకూ రానురాను అంతరువు ఏర్పడ్తుంది.

ఈ నేపథ్యంలో తెలుగు వ్యాకరణ పరంగా భాషాసంస్కరణ ముఖ్యంగా గ్రాంథిక భాషకు-

ష్టవ్యావహారిక భాషకూ మాత్రమే జరిగినట్లుగా చెప్పవచ్చు. శిష్టేతర భాషాపరమైన సంస్కరణ ాలా తక్కువనే చెప్పుకోవాలి. రాను రాను ఇది ఎన్నో ఈసడింపుల పాలై చివరకు ఒక ఉద్యమ ాపం దాల్చింది 'ప్రామాణికమైన ఇప్పటి గ్రాంథిక భాష ఒకప్పటి నియమరహిత వ్యావహారిక ాషే- అని సమర్థించబడి పామరభాషా సంస్కరణార్హతను పొందింది- నియమితం కాని ాషకు నిలకడ తక్కువ కనక వాడుక భాషను సంస్కరించి ప్రామాణికత్వం ఆపాదించాల్సిన వసారాన్ని చాలమంది నొక్కి వక్కాణించారు. అందులో వజ్జల వారి వాక్కు ఇది.

" వ్యవహారస్థమునే గ్రహించి విబుధుల్ వాక్సి పుణం బొప్పస్<br>
సవరింపంగద గ్రాంథికంబు వెలసెన్‌దానన్యమెయద్దితన్<br>
వ్యవహారాన ఝరోపమ త్వరను మార్పందంగ బోకుండగా<br>
చు విశ్వాలోజ్జ్వల వాఙ్మయ గ్రథితతచ్ఛుద్ధం చెగ్రాహ్యంబగున్"

ఏ తత్ఫలితమే నవీనాంధ్ర, 'వ్యావహారిక భాష, 'ఆధునిక ప్రామాణికాంధ్ర భాషా ్యకరణాల ఆవిర్భావం.

ఈ తీరున భాషాసంస్కరణంలో తద్వారా భాషా రక్షణలో వ్యాకరణం ఇంతగా ముడివడి ండడం వల్లనే వ్యాకరణం అన్ని శాస్త్రాలకూ నేత్రప్రాయమైంది. వైయాకరణుడు విద్వాంసుల్లో ్వ ప్రథముడయ్యాడు.

'సర్వస్యనేత్రమ్ వ్యాకరణమ్'

'ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః'

## eferences :


పతంజలి- వ్యాకరణ మహాభాష్యమ్ - పస్పశాహ్నికమ్, గవర్నమెంట్ సెంట్రల్ బుక్ డిపో, బొంబాయి 1880

భర్తృహరి- వాక్యపదీయం, ప్రథమ సంపుటం, తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1974.

సత్యనారాయణ చౌదరి, కొత్త, సాహితి, భాష- వ్యాకరణం, భాషా పోషక గ్రంథమండలి, నిడుబ్రోలు. 1968.

సుబ్బరాయశాస్త్రి, తాతా. ఆంధ్రభాషాసంస్కరణ, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటం 2 సంచిక 3

సూర్యనారాయణశాస్త్రి, వెంపరాల, తెలుగువ్యాకరణము, తెలుగురచయితల మహాసభలు కొన్ని ప్రసంగాలు, సికింద్రాబాదు - 1971.




# తెలుగులో నిఘంటు నిర్మాణం - వ్యష్టి సమష్టి కృషి

- డా॥ జమ్మలమడక కామేశ్వరరావు

తెలుగు భాషలో ఇంతవరకు వెలువడిన రకరకాల నిఘంటువుల్లో ఏవో కొన్ని లోపాలు ఉంటూనే ఉన్నాయి. ఒక్కొక్క రకం నిఘంటువుకు ఒక్కొక్క విధమైన లోపం ఉంటూనే ఉంది. ఈ లోపాలు ఏర్పడటానికి నిఘంటు నిర్మాణానికి ఎదురైన సమస్యలు నిఘంటువుల పీఠికల్లో, నిఘంటు కర్తలు వ్యక్తం చేసిన వాక్యాల వల్ల తెలుస్తోంది.

జాతిని అంటి పెట్టుకుని భాష ఉంటుంది. భాషను పోషించే భాధ్యత పరిపాలకులు పరిపాలితులపై సమానంగానే ఉంటుంది.

పద్య నిఘంటుకర్తలు అచ్చ తెలుగు భాషా పోషణను దృష్టిలో ఉంచుకొని నిఘంటువులు కూర్చారు. ఇవి వ్యష్టి పరంగా నిర్మాణం జరిగిన నిఘంటువులు ఆంధ్ర భాషార్ణవం పీఠికలోని ఈ కింది పద్యం ద్వారా ఈ కాలంలో రాజాదరణ పూర్తిగా ఉన్నట్లు తెలుస్తోంది. ఉదా :

తే. ఆంధ్ర గీర్వాణ కవనంబులందు నీకు, గలుగుజ్ఞానంబ దేరికి గలుగనేర్చు
నాశ్రితుడవంచు నుతియించునట్లుగాదు, గాని యవి యిపుడేల వేంకన కవీంద్ర

(ఆం. భా. 9 ప.)

తే. దేవతల భాష గావున దెలుగుకన్న, సంస్కృతము మిన్న యా యుక్తి సరియో తెలిసి
రసికుడగువాడు తనదుజాఋ సికలోన, దులసినే యిడుకొన నౌజాదులనెయిడునొ

(ఆం. భా. 10 ప.)

తెలుగులో నిఘంటువులు వెలువడిన కాలంలో అచ్చు యంత్రాలు లేవు. కాగితాలు లేవు కేవలం తాటాకులపైనే రాసేవారు. విద్యుత్ సౌకర్యాలు లేవు. అయినా పద్య నిఘంటు కర్తలు ఒక్క చేతి మీద నిఘంటు నిర్మాణం చేసి తమదంటూ ఒక వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్నారు.

ఆధునిక కాలంలో నిఘంటు నిర్మాణం అకారాది క్రమంలో తెలుగుభాషలో ప్రారంభమైన నాటినుండి రకరకాల నిఘంటువులు వెలువడ్డాయి. కానీ ఏ ఒక్క నిఘంటువు కూడా సమగ్రంగా కూర్చటం జరగలేదనే చెప్పాలి. దీనికి అనేక కారణాలు ఉన్నాయి. దీనికి పండితుల లోపమా? పండితుల్లో విజ్ఞాన లోపమా? ప్రభుత్వం చూపే చిన్న చూపా? నిఘంటు నిర్మాణ శాస్త్రం తెలుగులో ఇంకా శాస్త్ర బద్ధంగా తయారు కాలేదా? అనే ప్రశ్నలు వేసుకుని మన తెలుగు భాషలో జరిగిన నిఘంటు నిర్మాణం కృషి వ్యష్టి పరంగా, సమిష్టి పరంగా ఎలా జరిగిందో పరిశీలించటమైంది.

### వ్యష్టి నిర్మాణం - సమిష్టి నిర్మాణం :

నిఘంటు నిర్మాణ ప్రక్రియ శాస్త్ర పద్ధతికి చేరటానికి పూర్వం వ్యష్టి పరంగానే జరిగింది. నిఘంటు నిర్మాణం చరిత్రకు అందిన ఆధారాలను బట్టి పరిశీలించిన మీదట ఈ ప్రక్రియకు

మూల బీజాలు సంస్కృత భాషలోనే ఏర్పడ్డాయి. పేరు తెలియని వ్యక్తి నిర్మించిన వైదిక భాషా నిఘంటువు మొదట చెప్ప తగినది. ఈ నిఘంటువుకు సూత్ర రూపంలో యాస్కుడు కూర్చిన నిరుక్తం సంస్కృత భాషలో మొట్ట మొదట నిఘంటు ప్రక్రియ ఏర్పడిందని రుజువు చేస్తోంది.

సంస్కృతంలోనే 'గ్లాజరీస్' రూపంలో కొన్ని పట్టికలు నిఘంటువుల స్వభావాన్ని కలిగి ఉన్నాయి. ఇవి కూడా ఆయా విషయాలకు సంబంధించిన పదపట్టికలు. సాధ్యమయినంత సమగ్రతను కలిగి ఉన్నాయి. ఇవి ఆనాటి అవసరాలకు తగిన విధంగా వ్యక్తులే పండిత ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని నిర్మించి ఉండవచ్చు.

ద్రావిడ భాషలైన తెలుగు, కన్నడం, మలయాళం, తమిళం, భాషలకు మరియు ఇతర భారతీయ భాషలైన హిందీ, మరాఠీ, సింధీ, ఒరియా, గుజరాతీ మొదలైన భాషల్లో నిఘంటు నిర్మాణం ఇంత వరకు అందిన ఆధారాలను బట్టి చూస్తే వ్యష్టి పరమైన నిర్మాణంగానే మొదలైనట్లు తెలుస్తోంది.

తెలుగు భాషలో వెలువడిన తొలి నిఘంటువు చౌడప్ప సీసపద్య నిఘంటువు అని తెలుస్తోంది. ఆ తర్వాత తెలుగులో ఆంధ్ర నామ సంగ్రహం అనే పేరుతో పైడిపాటి లక్ష్మణ కవి దేవ వర్గు, మానవ వర్గు, స్థావర వర్గు, తిర్యగ్వర్గు, నానార్థ వర్గు లనే వర్గ విభజనతో ఉన్న నిఘంటువు కూడా వ్యష్టి పరంగా వెలువడిందే. ఆంధ్రనామ సంగ్రహంలోని వర్గ విభజనను అనుసరించి గణప వరపు వేంకటకవి 'వేంకటేశాంధ్రం' అనే పేరుతో పద్య రూప నిఘంటువును కూర్చాడు. కస్తూరి రంగకవి 'సాంబ నిఘంటువు' అనే పేరుతో పద్య రూప నిఘంటువును ఇదే వర్గ విభజన పద్ధతిలో కూర్చాడు. ఈ రెండు నిఘంటువులు కూడా వ్యష్టి పరంగానే నిర్మాణం జరిగాయి. వ్యష్టి పరంగా నిఘంటు నిర్మాణం జరిగిన పద్య నిఘంటువుల్లో నిఘంటు కర్తల వ్యక్తిత్వం కనపడుతోంది. వేంకటేశాంధ్రంలోనూ, సాంబ నిఘంటువులోనూ తత్సమ పదాలకు కల్పించిన దీర్ఘ సమాసాల్లో వీరి వ్యక్తిత్వం ఎక్కువగా కనపడుతోంది. (చూ.అనుబంధం1)

సంస్కృత భాషకు అమర సింహుడు 'అమరకోశాన్ని' కూర్చాడు. ఆ తర్వాత కొంత కాలానికి పురుషోత్తమ దేవుడు మరికొన్ని పదాలు చేర్చి త్రికాండ శేషాన్ని కూర్చాడు. తెలుగు భాషలో కూడా అదే సంప్రదాయ పద్ధతిని పాటించి 'అడిదం సూరకవి' 'ఆంధ్రనామ శేషం' అనే పేరుతో డబ్బై ఎనిమిది (78) పద్యాలు కలిగిన చిన్న నిఘంటువులో పైడిపాటి లక్ష్మణ కవి కూర్చిన ఆంధ్ర నామ సంగ్రహంలో చేరని పర్యాయ పదాలకు, నానార్థాలకు పూరణగా కూర్చాడు. వ్యష్టి పరంగా నిఘంటు నిర్మాణం జరిగిన తెలుగు పద్య నిఘంటువుల్లో ఆంధ్రనామ శేషం ఒక ప్రత్యేకత కలిగి ఉంది.

ఆంధ్రనామ సంగ్రహం, వేంకటేశాంధ్రంలో ఆంధ్ర నామశేషంలో కూడా పాదపూరణ నిమిత్తం గణాలను సరిపెట్టడానికి కొన్ని అతుకు పదాలు నిఘంటువుల్లో చోటు చేసుకున్నాయి.

ఉదా : కం. కయియన గై నా కేలన

చెయి యనజై నాగ చెయ్యి చేనా హస్తా

హ్వాయములగు ।నన్న పూర్ణా

ప్రియ వల్లభ కాశికా పురీవరనిలయా। - (ఆ. నా. స. మాన. 21 ప)

పై పద్యంలో మూడో పాదంలో కొంత భాగం నాలుగో పాదం అంత శివుని పరంగా ఉన్న పాద పూరణ. ఇలాంటి వ్యస్త పదాలు లేకుండా నిఘంటు నిర్మాణం చేస్తానని సాంబ నిఘంటు కర్త ప్రతిజ్ఞ చేసి తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుని 'సాంబ' అనే ఒక్క పదాన్నే పద్యం చివరలో ఉపయోగించాడు.

ఉదా: - సీ. అడుగుకైదువు పుల్గు పడగదునీ దారి

- - - - - - - - - - - - - - - - - - - -

- - - - - - - - - - - - - - - - - - - -

తే. గట్లయేలిక మనుమడు కప్పుతెఱవ

మేటికొమరుడు వేలుపు బేటి సవతి

కొడుకు ముద్దయ్య కందుడు కొమరసామి

యనగ గుహనామధేయంబు లమరు సాంబ - (సాంబ. దే. 7ప)

పై పద్యంలో చివరి పాదంలో సాంబ అనే పదం తప్ప మిగిలిన పదాలన్నీ నిఘంటువుకు సంబంధించినవిగానే ఉన్నాయి. సాంబ నిఘంటు కర్త ఈ కింది పద్యంలో తన ప్రతిజ్ఞను ఇలా తెలియచేశాడు.

సీ శ్రీ వెలయంగ దేశీయముల్ దెనుగులు

దద్భవంబులు గూర్చి దైవవర్గ

వనరు మానవ వర్గ స్థావర వర్గ తి

ర్యగ్వర్గ ననునాలుగల వరించి

జిల్లు లుంపక వ్యర్థ శబ్దముల్ రానేక

కుంటి నడతగాక కొదుకులేక

యుర్వీజనంబులకు పకార సరణిగా

నాంధ్ర నామ నిఘంటు వనెడు కృతిని

తే. గవుల దయచేత నీకటాక్షంబు వలన

సీన శతకంబు జెప్పెద జిత్తగింపు.... (సాంబ. అవతారిక. 1 ప)

సాంబ నిఘంటుకర్త వ్యష్టి పరమైన స్వేచ్ఛతో ఆంధ్రనామ సంగ్రహాదుల్లో లేని పదాల్ని వర్గల్లో చేర్చాడు. నిఘంటువు అంటే వ్యవహారంలో ఉన్న పదాల్ని కూడా చేర్చవలసి ఉంటుంది. ఈ పదం మంచిది. ఈ పదం చెడ్డది. అనే విచక్షణా ఉండదు. ఈ సూత్రం ప్రకారం సాంబ నిఘంటువులో మానవ శరీర అవయవాలకు సంబంధించిన అశ్లీల పదాలు కొన్ని చేర్చాడు.

ఉదా:- సీ. - - - - - - - - - - - - - - - - - - -

- - - - - - - - - - - - - - - - - - -

పాపలఁగనుతావు పత్తబుయ్య

మరునిల్లు దుబ్బన మదన మందిరమొప్పఁ

బిల్లలఁ గలిగించువేరు చుల్లి

బుల్ల బెల్ల మనంగ మొసగు శేఫము... - (సాంబ. మా 19 ప)

ఇలాంటి పదాలు చేర్చటం ద్వారా కస్తూరి రంగకవి అచ్చతెలుగు పదాల్ని నిఘంటువులో చేర్చటమే తన ప్రధాన ధ్యేయంగా భావించి ఇచ్చిన ఆరోపాలు అని మనం ఊహించవచ్చు.

అమరకోశాన్ని అనుసరిస్తూ వచ్చిన నిఘంటువుల్లో కూడా గుర్తింప దగిన కొన్ని వ్యష్టి పరమైన ప్రత్యేకతలు ఉన్నాయి. ఆంధ్ర భాషార్ణవంలో ఉన్న వర్గ విభజనను బట్టి నిఘంటు నిర్మాణంలో నిఘంటుకర్త తన వ్యష్టి పరమైన స్వేచ్ఛను ప్రదర్శించి నిఘంటు నిర్మాణం చేసినట్లు తెలుస్తోంది

ఆంధ్ర భాషార్ణవం తర్వాత సర్వాంధ్ర సార సంగ్రహం అనే పద్య రూప నిఘంటువు వెలువడింది. దీని కర్త అమలాపూరపు సన్యాసి కవి. ఈ నిఘంటువు కూడా వ్యష్టి పరంగానే వెలువడటం వల్ల అమలాపూరపు సన్యాసి తనకు నచ్చిన విధంగా పూర్వ పద్య నిఘంటువుల్ని అనుకరిస్తూ సంగ్రహంగా ఆంధ్ర పదాల్ని నిఘంటువుగా కూర్చి తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించాడు.

ఆంధ్ర పద నిధానం అనే మరో పద్య రూప పర్యాయ పద నిఘంటువు కూడా వ్యష్టి పరంగా వెలువడిందే. దీన్ని తూము రామదాసుకవి కూర్చాడు. ఈ పద్య నిఘంటువు తెలుగు భాషలో అకారాది నిఘంటువులు వెలువడుతున్న కాలంలో వెలువడింది. తూము రామదాసు గారికి సంప్రదాయ పద్ధతి పై మ్కువ ఎక్కువగా ఉండటం వల్లనే వ్యష్టి పరమైన స్వేచ్ఛతో పద్య రూపంలో నిఘంటువును కూరుస్తున్నట్లు ఈ కింది పద్యం వల్ల తెలుస్తోంది.

సీ. ఆంధ్ర భాషా పటిమాభ్యాస మొనరించు. బాలుర కతి సులభంబుగాగ

అఖిలాంధ్ర విశత వాక్య స్వరూపంబగు శబ్దరత్నాకర సఖ్యమునను

ప్రతి శబ్దమును గూర్చి పదములు రాసుల నమరించి నామలింగాను శాస

నముగతి వర్గాళి నామాళి సమకూర్చి తనరార తెలుగు వృత్తముల గూర్చి

- - - - - - - - - - - - - - - - - - - - (ఆంధ్ర పద. 6 ప)

పై పద్యంలో దాసుగారు బాలురు కంఠస్థం చేయటానికి అనుకూలంగా అమరకోశం పద్ధతిలో నిఘంటు నిర్మాణం చేస్తున్నట్లు తెలియ చేశారు.

తెలుగు భాషలో వెలువడిన పద్య రూప నిఘంటువులన్ని వ్యష్టి పరంగానే వెలువడ్డాయి. ఈ నిఘంటువుల నిర్మాణంలో నిఘంటుకర్తలు సంపూర్ణ స్వేచ్ఛను ప్రదర్శించి తమదంటూ ఒక వ్యక్తిత్వాన్ని నిఘంటు నిర్మాణంలో నిలబెట్టుకున్నారు.

ఇక తెలుగు భాషలో వెలువడిన అకారాది క్రమ నిఘంటువులు గురించి దిఙ్మాత్రంగా తెలుసుకుందాం. అకారాది క్రమ నిఘంటువులు వ్యష్టిపరంగాను, సమిష్టి పరంగాను తెలుగుభాసలో వెలువడ్డాయి.

వ్యష్టి పరంగా వెలువడిన అకారాది నిఘంటువుల్లో ఒక ప్రత్యేకత కలిగి ఉంది. నిఘంటుకర్తలు ఆశించిన మేరకు సఫలీకృతులయ్యారని చెప్పవచ్చు. తెలుగు భాషలో కావ్య భాషకు బహుజనపల్లి సీతారామాచార్యులు 'శబ్దరత్నాకరం' అనే నిఘంటువును కూర్చారు. ఇది పండితులకు ఉద్దేశించిన నిఘంటువు ఈ నిఘంటు నిర్మాణానికి నిఘంటు కర్త తత్సమ చంద్రిక మొదలైన చిన్న, చిన్న పద పట్టికలను తయారు చేసుకుని ఒక నిర్ణయానికి వచ్చి; ఒక చేతి మీదుగా దీన్ని పూర్తి చేశారు. అకారాది క్రమంలో వెలువడిన బృహన్నిఘంటువుల్లో శబ్దరత్నాకరం ప్రసిద్ధమైంది. వ్యష్టిపరంగా వెలువడిన అకారాది నిఘంటు నిర్మాణంలో అభిప్రాయ భేదాలకు తావులేదు. ఆర్థిక ఇబ్బందులు మాత్రం ఉన్నప్పటికి భాషా సేవాదృష్టితో నిఘంటువును నిఘంటుకర్తలు అనుకున్న పద్ధతిలో పూర్తి చేసి ఎట్టకేలకు అచ్చు వేయించేవారు.

కానీ సమిష్టి పరంగా ఏర్పడిన నిఘంటువుల విషయంలో పండితులలో ఏకాభిప్రాయం లోపించి ఎన్నో విమర్శలకు గురికావలసి వచ్చింది. ఉదాహరణకు శ్రీ సూర్యరాయంధ్ర నిఘంటువుపై ఎన్నో విమర్శలు భారతి మాస పత్రికలో పండితుల భాషా శాస్త్రజ్ఞులు చూసినవే కదా!

ఏది ఏమైనప్పటికి తెలుగు నిఘంటు నిర్మాణంలో శాస్త్ర దృష్టి కొరవడిందని తెలుస్తోంది. విద్యా సంస్థల ఆదరణ ఎంత ఉన్నా పండితులు తమ పాండిత్య దృష్టిని ప్రదర్శించి భాషా శాస్త్ర దృష్టిని విడనాడినట్లుగా కనపడుతోంది. ఉదాహరణకు సమష్టి పరంగా కూర్చిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అనే బృహన్నిఘంటువుపై వచ్చిన విమర్శక వ్యాసాలే తీసుకుందాం. (చూ. అనుబంధం 2) ఈ నిఘంటువులో తెలుగు పదాలన్నీ చేరలేదనీ ఆరోపాల అమరికలో ఒక క్రమంలేదనీ మొదలైన విమర్శలు సమష్టి పరంగా వెలువడిన నిఘంటువులపై ఉన్నాయి.

దీని కంతకూ కారణం సంపాదక వర్గంలో ఏకాభిప్రాయం లోపించటమా? పండితుల అహంభావమా? పాఠకలోకం గుర్తించాలి.

ఇతర భాషల్లో సమష్టి పరంగా ఏర్పడిన నిఘంటువుల్లో ఒక శాస్త్ర దృష్టి, నిర్దిష్టమైన నిఘంటు నిర్మాణ ప్రణాళిక, పండితులు భాషా శాస్త్రజ్ఞుల్లో ఏకాభిప్రాయం. నిఘంటు నిర్మాణంపై ఉండే పట్టుదల మొదలైన కారణాలు ఆ నిఘంటువుల యొక్క సమగ్రతకు నిదర్శనాలుగా ఉన్నాయని చెప్పటానికి ఆంగ్ల భాషా నిఘంటువులు దీనికి నిదర్శనం. (ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీష్ డిక్షనరీ) ఈ నిఘంటువును కొన్ని పదుల సంవత్సరాలుగా పండితుల అవిరళ కృషి చేసి సమగ్ర ఆంగ్ల భాషా నిఘంటువును కొన్ని సంపుటాలుగా ప్రచురించారు.

ఈ నిఘంటువులో ఆంగ్ల భాషలో కొత్తగా చేరిన పదాలను ఎప్పటికప్పుడు చేరుస్తూ వస్తున్నారు. దీని వల్ల ఆంగ్ల భాషా నిఘంటువులో నూతన పదాలకు అర్థాలు ఇవ్వటం జరుగుతోంది. ఇలాంటి కృషి తెలుగు భాషా నిఘంటు నిర్మాణంలో విశ్వ విద్యాలయాలు గాని, తెలుగు అకాడమీ లాంటి అటానమస్ బాడీస్ గానీ ఇంతవరకు చేపట్టక పోవటం ఆంధ్రుల దురదృష్టమే అని భావించవలసి ఉంది.

అనుబంధం - 1

## వ్యష్టి పరంగా కూర్చిన పద్య రూప నిఘంటువుల్లోని పర్యాయ పదాలు

| క్ర.సం. | నిఘంటువు పేరు | అచ్చ తెలుగు పదాలు | అచ్చ తెలుగు సమాసాలు | |
|---|---|---|---|---|
| | | | రెండు పదాలతో | మూడు పదాలకు మించి |
| 1. | ఆంధ్రనామ సంగ్రహం | సత్తి | జగముతల్లి | గల్లరాయని పట్టి; ఏనుగుల గొంత తత్తడి నెక్కుదంట; సామిసామేనిఁజేకొన్న చాన |
| 2. | సాంబనిఘంటువు | చండి | వెనకయ్యతల్లి | గట్టురాకొమరిత; కప్పుముత్తెదువ, మగని అదనపు మేనదగినమగువ కరకంతురాణి, సింగపుతేజిగలచాన |
| 3. | ఆంధ్రభాషార్ణవం | అమ్మిక | సామితల్లి | గట్లరేనిబిడ్డ; కరకంతునిల్లాలు, కొదమసింగ మొక్కుకొన్న జంత. |
| 4. | వేంకటేశాంధ్రం | .. | | పుడమితాలుపులరాబిడ్డ; జిగిబొబ్బమెకము జక్కిగల కొమ్మ; పెనిమిటి సామేనఁ బెనకొన్నగేస్తురాలు. |
| 5. | ఆంధ్రపదాకరం | దుగ్గ | కతిచేడియ | పలిమకూతురు; అగ్గి కనువాసివెలంతుక; సింగమునెక్కుదంట కల్వలదొరదారి; సామి మెయి పాల్గొను ముద్దియ; బూచులదొరసాని |
| 6. | ఆంధ్రపదనిధానం | .. | మలయమ్మ; సామితల్లి గట్టుచూలి | గట్రాచూలి (గట్టు+రాజు); గట్టరేని పట్టి, సింగమొక్కుడజంత. |

ఆధార వ్యాసాలు .


1 సూర్యరాయాంధ్ర నిఘంటువు; వెంకట వీరరాఘవాచార్యులు - ఈయణ్ణి-1923-24 ఆంధ్రపత్రిక ఉగాది సంచిక రుధిరో .123.

2. ——————— 1939. బహు. 30

3. ,, . వెంకట వీరరాఘవాచార్యులు- ఈయణ్ణి 1927, భారతి ఏప్రిల్ 4(4) ప్రభవ చైత్ర. 116.

4. ,, . రామయ్యపంతులు, జయంతి - 1928 భారతి. మా. 5(3) ప్రభవ ఫాల్గుణ. 368

5. ,, . నారాయణరావు- చిలుకూరి. 1928. భారతి మే 5(5) విభవ వైశాఖ 797.

6. ,, ; సోమన్న - గరిమెళ్ళ; 1928. భారతి,ఆగష్టు 5 (8) విభవ శ్రావణ 317.

7. ,, ; రామయ్య-జయంతి. 1932, భారతి నవంబరు9 (11) అంగి. కార్తీక. 787.

8. ,, . రామయ్య జయంతి; 1932 భారతి డిసెంబర్ 9 (12)అంగి. మార్గ. 973.

9. : రామయ్య పంతులు - జయంతి 1936. ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక మార్చి ఏప్రిల్ 25. ధాతృ.చైత్ర. వైశాఖ 169.

10 ,, సుబ్రమణ్యంశాస్త్రి- పీశుపాటి; 1937. ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక చైత్ర, వైశాఖ 169.

11 ,, : వెంకట రమణయ్య -బులుసు 1937. భారతి. వే.14(5) ఈశ్వర, వైశాఖ 643.

12. ,, ; వెంకట రామమూర్తి -గిడుగు; 1939 ప్రతిభ 4.

13. ,, : రామయ్య-జయంతి; 1938 ఆం.సాహిత్య పరిషత్ పత్రిక బహుధా. 27 (2) 89.

14. ,, : విశ్వేశ్వరశాస్త్రి- పీశుపాటి 1939. ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక ప్రమాది. 28 (3) 185.

15. ,, ; విశ్వేశ్వరశాస్త్రి పీశుపాటి; 1939; ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక; 28(5,6) 329.

16. ,, ; విశ్వేశ్వరశాస్త్రి- పీశుపాటి; 1939 భారతి. సెప్టెంబరు 16(9) ప్రమాది, భాద్ర 297.

17. ,, : వెంకటరత్నం వర్లమూడి. 1939-40 ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, ప్రమాది 42.

18. ,, ; 1940, భారతి జనవరి17(1) ప్రమాది, పుష్య 114.

19. ,, ; 1940. భారతి ఫిబ్రవరి 17(2) ప్రమాది, మాఘ 239.

20. ,, ; 1940. భారతి ఏప్రిల్ 17(4) విక్రమ, చైత్ర 513.

21. .. విశ్వేశ్వరశాస్త్రి-పిశుపాటి 1940 భార జులై17(7)
విక్రమ, ఆషాఢ 123.

22. ,, ; వెంకటరత్నం- పఠ్లమూడి 1940; భారతి, సెప్టెంబరు 17(9)
విక్రమ, భాద్ర 361.

## References


1. ఆంధ్రనిఘంటుత్రయము- లక్ష్మణకవి, పైడిపాటి,ప్రచు. వెంకట్రామా అండ్‌కో ఏలూరు, 1932.
2. ఆంధ్ర పదనిధానము-రామదాసకవి, తూము, సంపా. శ్రీ శేషాద్రి రమణకవులు శ్రీ కాకతీయ గ్రంథమాల, భవానీ ముద్రణాలయం, బెజవాడ 1930.
3. ఆంధ్ర పదాకరము- వీరపరాజు పూసపాటి, ముద్రణ వేంకట నరసింహాచార్యులు తెన్నేరం, వసురత్నాకరముద్రాక్షరశాల, చెన్నపురి, 1897.
4. ఆంధ్రభాషారత్నాకరం - పైడిపాటి లక్ష్మణకవి, అముద్రితం, వేంకటేశ్వర విశ్వవిద్యాలం, ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయం, తిరుపతి.
5. ఆంధ్ర భాషార్ణవం -వేంకనార్యుడు. కోటి: మద్రాసు, వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, 1931.
6. కవి చౌడప్ప సీసపద్య నిఘంటువు - కవి చౌడప్ప, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక బాండాగారం పత్రిక, 1950. సంపుటి, సంచిక 2-55-70.,
7. తెలుగులో పద్య నిఘంటువుల నిర్మాణ పద్ధతులు - డా॥జమ్మలమడక కామేశ్వరరావు, పర్యవేక్షణ, ఆచార్య నాయని కృష్ణకుమారి, పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం. 1993. అముద్రితం.
8. దేశ్యనామార్థకోశం - కృష్ణయామాత్య, రామయణము: విశాఖపట్నం, సకల విద్యావర్ధని, 1897.
9. వేంకటేశాంధ్రం - వేంకటకవి, గణపవరపు, కాకినాడ, సుజన రంజనీ ముద్రాక్షరశాల, 1898.
10. సర్వాంధ్రసార సంగ్రహం - అమలాపురపు సన్యాసకవి.
11. సాంబనిఘంటువు - రంగకవి- కస్తూరి, వావిళరామస్వామి అండ్‌సన్స్, మద్రాసు, 1913.
12. సూర్యరాయాంధ్ర నిఘంటువు విమర్శనము. వెంకటరామమూర్తి పంతులు- గిడుగు విశాలాంధ్ర పబ్లిషర్స్, 1980.
13. *An Introduction to lexicography*, Singh, R.A., C11L, Mysore, 1982.
14. *Lexicography-Katreya* Dr. S.N.M.R, Annamalai University, 1965.




# తెలుగులో ఉన్నత విద్యాబోధన - విజ్ఞాన శాస్త్రాలు

- కీ.శే. శ్రీ వసంతరావు వెంకటరావు

ఈ విషయం చర్చించేముందు మన విద్యా విధాన సమీక్ష లాభదాయకం. ప్రస్తుత విద్యా విధానం భారతీయులకు ఉపయోగకరంగా లేదని పెద్దలు పదే పదే సూచిస్తూవచ్చేరు. మన దేశ పరిస్థితుల కనువై, పౌరజీవనం సుఖవంతంచేయగల విధానం అత్యంతావశ్యకం. అయితే కమీషన్ల నేర్పరచి. ఇతర దేశాలలోని విద్యావిధానాలను అధ్యయనం చేసివచ్చిన సభ్యులు సమర్పించిన విధానాన్ని పూర్తిగా అమలు చేయలేక, రాజీపడి, ఏదో విధంగా మార్పులు చేయడం జరుగుతూంది. మన సంస్కృతికి, మన పౌరుల స్థాయికి, మన అవసరాలకు సరిపడే విద్యావిధానం ఇంతవరకు రూపొందలేదు.

వివేకాన్ని ఇచ్చేది విద్య. జ్ఞానంతో బాటు వినయం సమకూర్చేది విద్య. నేటి విద్యావిధానం పై రెండింటిని సాధించలేకపోతూంది. విద్యాసౌధాని కి ప్రాథమిక స్థాయి పునాది వంటిది. అట్టి పునాదినే ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తూనే ఉంది. ప్రాథమిక పాఠశాలలు అధ్వాన్నస్థితిలో ఉన్నాయి. అందున. గ్రామాలలోని పాఠశాలల నిర్వహణ సరిగాలేదు. మొదటి 5 తరగతులకు ఒకే ఉపాధ్యాయుని ఏర్పాటుచేసి, ఏకోపాధ్యాయపు బడులు ఎట్లాపని చేస్తాయో యోచించినట్లు కూడ కనబడదు. 5 క్లాసుల పిల్లలకు ఒక్క ఉపాధ్యాయుడే విధంగా పాఠాలు చెప్పగలడు? కాని ఆ తతంగం జరుగుతూనే ఉంది. నిజానికిదొక అత్యంత విచారకరమైన విషయం. చదువంటే ఆసక్తి పెంచుకొని ఉత్సాహంతో జ్ఞానార్జన చేయవలసిన విద్యార్థులకు సముచిత సారథ్యం లేకపోవడం మూలంగా పిల్లలు వెనకబడి నిజస్థానం చేరుకోలేకపోతున్నారు.

ఇక సెకండీరీ స్కూళ్లలో విజ్ఞానం నేర్పడానికి అవసరమైన పరికరాలు లేవు. భౌతిక రసాయన శాస్త్రాలకు, జీవశాస్త్రానికి సంబంధించిన పరికరాలకు ఒక బీరువా ఉండడమే కష్టం. ఇంటర్మీడియట్ స్థాయిలో ప్రాక్టికల్ పరీక్షలున్నాయి. ప్రతి విద్యార్థి ప్రతి ప్రాక్టికల్‌ను చేస్తాడా? పరీక్షలో ఉత్తీర్ణుడు కావడం కష్టం. కాని అట్టివసతి గల కాలేజీలు స్వల్పంగా ఉన్నాయి. డిగ్రీ కాలేజీలలోనైనా పరికరాల కొరత తీరిందని చెప్పడానికి వీలులేదు.

ఈ నేపథ్యంలో నేటి విషయాన్ని పరిశీలించాలి. ఉన్నత విద్యాబోధనకు తెలుగు మాధ్యమంగా వినియోగించడం వల్ల కలిగే పరిణామాలెటువంటివో యోచించాలి. ఉన్నతస్థాయి అంటే పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయిలో విజ్ఞానం అభ్యసించే వారు ఎదుర్కోవలసిన పరిస్థితులను గుర్తించడం ప్రథమ కర్తవ్యం. డిగ్రీ స్థాయివరకు, ప్రస్తుతం, తెలుగు మాధ్యమం వాడుకలో నుంది. ఉన్నత స్థాయికి పోయే కొద్దీ విజ్ఞాన ప్రపంచంలో జరుగుతూన్న మార్పులకు, ఉత్పన్నమౌతూన్న క్రొత్త భావాలను, పరికల్పనలను, సిద్ధాంతాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటే కాని ప్రయోజనం లేదు. క్రొత్త విషయాలు వైజ్ఞానిక పత్రికలలో ప్రచురణ మవుతూ ఉంటాయి. మనకు ఎక్కువగా తోడ్పడేవి ఇంగ్లీషు పత్రికలు. కాగా, వాటిలో అంశాలను తెలుగులోకి అనువదిస్తే కాని తెలుగువారికి పురోగమనం సాధ్యపడదు. అట్టి అనువాదం చాలా కష్టంతో కూడిన పని.

ఇంగ్లీషు, ఫ్రెంచ్, జర్మన్, జపానీస్ వంటి ఇతర భాషలలో వైజ్ఞానిక పత్రికలను ఆయా భాషలలోనికి అనువదించే సంస్థలున్నాయి. పెరుగుతూన్న విజ్ఞానం తక్షణం వారికి అందుబాటులో ఉంటుంది. తెలుగు విషయం యోచిస్తే అట్టి సౌకర్యం ఏ మత్రమూ లేదు. తెలుగులో చెప్పుకోతగిన వైజ్ఞానిక పత్రికలే లేవు. "విజ్ఞాన ప్రగతి", విజ్ఞాన వాహిని" వంటి వైజ్ఞానిక పత్రికలను "తెలుగు భాషా సమితి" "ఆంధ్రప్రదేశ్ అకాడమి ఆఫ్ సయన్సెస్" కొంతకాలం ప్రచురించి ధనాభావంచేత తిలోదకాలిచ్చేయి. అవైనా పురోగమిస్తూన్న విజ్ఞానాన్ని వివరించి ఉన్నత స్థాయి విద్యార్థులకు ఉపయోగ పడేవి కావు, పరిశోధకులకు ఉపకరించేవి కావు. ఇట్టి పరిస్థితులలో ఉన్నత స్థాయి విజ్ఞాన బోధనకు తెలుగు మాధ్యమంగా వినియోగించడం వల్ల కలిగే నష్టాలను, ముఖ్యంగా, గుర్తించి, వాటిని నివారించగల ఆర్థిక స్తోమత, వైజ్ఞానిక పుష్టి ఉందా అని విచారించాలి.

మహాత్మాగాంధిజీ చెప్పినట్లు విషయాలను మాతృభాషలోనే బోధించడం వల్ల విషయగ్రహణం ఎంతో సుకరమవతుంది. మూడు నాలుగేళ్ళ పాపాయిని పరిశీలించినా కొన్ని సత్యాలు స్పష్టమవుతాయి. ఆ వయసులో పాప తనకుగా తను నేర్చుకొంటుంది. వ్యాకరణం ఎవరూ చెప్పకపోయినప్పటికి సముచితంగా మాట్లాడుతుంది. జీవులలో కొన్ని శక్తులు అంతర్భూతములై ఉన్నాయి. వాటిలో అంతస్ఫూర్తి (intution) ఒకటి, గాలి వాన రేగుతూన్న సమయంలో ఒక తండ్రి తన మూడేళ్ల పాపని ఎత్తుకొని "అమ్మా ఇది గాలి వాన"అన్నాడు వెంటనే ఆ పాప "గాలిబొబ్బ"అంది. ఈ ఉదాహరణకు అవసరం ఎందుకు వచ్చిందంటే మనం చెప్పేది జనానికి బోధ పడే భాషలో ఉండాలి.

ఈనాడు వినియోగంలో నున్న పరిభాష గ్రామీణులకు కష్టం కలిగిస్తూంది. ఆ సత్యం ఇటీవల బయట పడుతూంది. మన దేశంలో 80 శాతం గ్రామాలలో నివసిస్తూ సరైన ప్రాథమిక విద్యకైనా నోచుకొని దురవస్థలోనున్నారు. అట్టి వారే విద్యార్థులుగా పాఠశాలలోను కళాశాలలోను ప్రవేశిస్తున్నారు. వారిని ఉద్ధరించగల విధానాలను రూపొందిచడంలో,. ఈనాటి విద్యావేత్తలు ఔపయోగిక దృష్టితో వ్యవహరించాలి.

ఇంకొక ముఖ్యవిషయం పారిభాషిక పదావళి, వైజ్ఞానిక గ్రంథాలు తెలుగులో ధారళంగా వెలువడక పోవడానికి ముఖ్యకారణముంది. అదే నిర్దిష్టమైన పరిభాష రచయితలకు సులభంగా అందకపోవడం హైస్కూళ్లలోగాని కాలేజీలలోగాని విషయబోధనకు ఇంగ్లీషునే మాధ్యమంగా వాడేవారు. అయితే, 1940 ప్రాంతంలో హైస్కూలు స్థాయి వరకు విషయ బోధనకు తెలుగు మాధ్యమంగా ఉపయోగించాలని మన ప్రభుత్వం నిర్ణయించడంతో, విజ్ఞాన గ్రంథాలు తెలుగులో వ్రాయవలసిన అవసరమేర్పడింది. వైజ్ఞానిక గ్రంథాలనగానే నికరమైన పరిభాష నిర్ణయించవలసి ఉంటుంది. ప్రభుత్వం ఒక సంఘం నియమించి పద నిర్ణయం చేసే లోపల , పాఠాలు చెప్పడానికి కొందరు ఉపాధ్యాయులు స్వయంగా ఆ పథకం చేపట్టేరు.

ఆనాటి భావాలు స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరిచేవిగా ఉండేవి. ఇంగ్లీషు పదాలను సుతరాము వాడరాదనే వారు. అయితే, ఇంగ్లీషు బాణీని అనుసరించి పద బంధం చేయ

బూనేవారు. ఉదాహరణకు ఇంగ్లీషులోని sulphur, sulphate, sulphite, sulphide అనే పదాలను గంధకం మూలపదంగా గ్రహించి 'గంధకతము' 'గంధకీయము', 'గంధకదము' అనే పదాలను నిర్ణయించేవారు. మరి పదేళ్ళకు, తెలుగువారి సౌకర్యం కోసం "విజ్ఞాన సర్వస్వము"ప్రచురించడానికి మద్రాసులో తెలుగు భాసా సమితి పూనుకొంది. అప్పటికి ప్రచారంలోనున్న పరిభాష గమనిస్తూ, సమితి పారిభాషికపదావళి తయారు చేసి ప్రతి సంపుటంలోను దానికవసరమైన పదాలను సంపుటాంతంలో చేర్చింది.

సుమారు మరో పదేళ్ళకు కేంద్రప్రభుత్వమే ఈ విషయం చేపట్టగా, "Standing Commission for Scientific and Technical Terminology" ని విద్యా మంత్రిత్వ శాఖ ఏర్పరిచింది. అన్ని శాస్త్రశాఖలలోను పాఠ్యగ్రంథ రచన కనువైన పరిభాషకు నిర్ణయించే బాధ్యత ఆ కమీషన్‌కు అప్పగించింది. ఆ కమీషన్ కొన్ని వర్క్‌షాపులను ఏర్పాటుచేసి, ప్రతిభాష నుండి ఒకరిద్దరిని ఆహ్వానించి, కొన్ని వారాల పాటు చర్చింపజేసి, 14భాషలకు వీలైనంత వరకు సరిపడే పదాలను ఎంపిక చేసి ప్రచురించింది. ఇవన్నీ హిందీపదాలు.

సుమారు మరో పదేళ్ళ తరువాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు మాధ్యమంగా, ఇంటర్మీడియట్, డిగ్రీ స్థాయిలవరకు పాఠ్యగ్రంథాలు తయారు చేయడానికి హైదరాబాదులో తెలుగు అకాడమిని ఏర్పరచగా, అవసరమైన గ్రంథాల ప్రచురణ సుమారు ఏడేండ్లకు అకాడమి పూర్తి చేసింది. అప్పుడు కూడా పరిభాషా విషయం మరోసారి పరిశీలించవలసి వచ్చింది. కేంద్రప్రభుత్వ ఆదేశానుసారం వారు ప్రచురించిన పారిభాషిక పదాలలో ఎక్కువ భాగం స్వీకరించవలసి వచ్చింది. 1975 నాటికి ఆంధ్రప్రదేశ్‌లోని విద్యాలయాలు, డిగ్రీ స్థాయి వరకు, తెలుగు మాధ్యమాన్ని అమలు పరిచేయి.

ఇంతటితో పరిభాషా సమస్య పరిష్కారం కాలేదు. ఏమంటే, తెలుగుకు మరో ప్రతి బంధకం ఏర్పడింది. అది తెలుగు సంస్కృతం పదాల కలయిక. చాలా పదాలు సంస్కృతం నుండే సేకరించినివే. సమాసం చేసేటప్పుడు సంస్కృత పదం తెలుగు పదం కలిపితే దుష్ట సమాసమవుతుంది. అదినిషేధం దాని మూలంగా క్లిష్ట పద సముదాయం అమలులో ఉంది. ఉదాహరణకు wave length లో wave, length పదాలున్నాయి. అవి సులభంగా అర్థమవుతాయి. దానికి పరిభాష "తరంగదైర్ఘ్యం". దానికి బదులు "అలపొడవు" అంటే సరళంగా ఉంది. అట్లే, frequency "పౌనఃపున్యం" వాడుతున్నాం. He came frequently అంటే "వస్తాడు తరచుగా వస్తాడు" అంటాంకాని, "వాడు పునః పునః వస్తాడు"అనం. ఆపదం వాడుకలో లేదు. కాబట్టి frequency కి తరచుదనం అనడం మంచిది. దుష్ట సమాసాల విషయం చర్చిస్తూ ఒకసారి గాడిచెర్ల హరిసర్వోత్తమరావు అన్నారు: "ఆడపిల్లకు పెళ్లికాగానే ఇంటిపేరు మారుతుంది, గోత్రం మారుతుంది, అభిమాన సరళి మారుతుంది. ఆమె అత్తింటికోడలవుతుంది. అట్లాగే సంస్కృత పదాన్ని తెలుగువారు స్వీకరించగానే అది తెలుగు క్రిందే జమ అవుతుంది. సాహిత్యేతరక్షేత్రాలలో "మార్జాలం బుర్ర"వంటి పదాలకు స్థానమీయవలసిన అవసరం ఎంతైనా ఉంది"

ఈ దృష్టి ఇప్పుడు పెరుగుతూంది. ఈనాటి విద్యార్థుల స్థాయిని దృష్టిలో పెట్టుకొని వారికి సులభంగా అర్థమయ్యే పరిభాషను కల్పించడం శ్రేయస్కరమన్న భావం బలపడుతూంది. సాహిత్యేతరక్షేత్రాలలో భావం వ్యక్తీకరించడానికి భాష ఒక మాధ్యమంగానే ఉండాలి అనేది నేటి అభిప్రాయం. గ్రీక్,లాటిన్ పదాలను ఇంగ్లీషు స్వీకరించగా భాషనుసంపన్నమయింది. అదే విధంగా తెలుగు కూడా వాడుకలో నున్న పరభాషా పదాలను యథేచ్ఛగా స్వీకరించి సత్వరజ్ఞాన ప్రచారానికి కంకణం కట్టుకోవలసిన అవసరాన్ని గుర్తించడం విజ్ఞత. వందల ఏళ్ళుగా అమలులోనున్న ఇతర భాషలలో పరిభాష సుస్థిరస్థానాన్ని అందుకొంది తెలుగు పరిభాషప్రాయం అర్థశతాబ్దాన్ని మించలేదు. అనుభవంనుండి నేర్చుకొనే పాఠాలను గుర్తుంచుకొని. తదనుగుణంగా పరిభాషలో మార్పులు చేయడం అవసరం. అంటే, తెలుగులో పరిభాష స్థిరం కాలేదు. ఇంకా పరిణామదశలో ఉంది.

విజ్ఞానం అనగానే మనకు స్ఫురించేది సాంకేతిక శాస్త్రం (Technology). విశుద్ధ విజ్ఞానం కంటె సాంకేతిక శాస్త్రమే భవిష్యత్తులో పెరుగుతుందని విజ్ఞుల అభిప్రాయం. మానవజీవన విధానాన్ని సాంకేతిక శాస్త్రంగా ఎంతగా మార్చివేస్తుందో అనుభవవైకవేద్యమే. అయితే ఒక దేశంలో సాంకేతిక శాస్త్ర ప్రగతి ఆదేశంలో అవసరాలను బట్టి ఉంటుంది. పాశ్చాత్య దేశాలలో వారికనువైన తీరున శాస్త్రం పెంపొందించుకొంటున్నారు. మన దేశ పరిస్థితులువేరు. గ్రామాలలో జీవిస్తూన్న అసంఖ్యాక పౌరులకు సాంకేతిక శాస్త్ర ఫలితాలను అందించగల విధానం రూపొందించవలసిన బాధ్యత మన విజ్ఞానులపైన ఉంది. అది జరగడం లేదు. పద్నాలుగుగేండ్ల క్రితం ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో జరిగిన ఇండియన్ సయన్స్ కాంగ్రెస్‌లో నాటి ప్రధాని స్వర్గీయ శ్రీమతి ఇందిరాగాంధీ ఈ విషయాన్నే విజ్ఞానుల దృష్టికి తెచ్చి, సముచిత సాంకేతిక శాస్త్రం(oppropriate Technology) పెంపొందించుకొనే దిశలో పరిశోధనలు చేయవలసిందిగా హెచ్చరించేరు. ఈ విషయాన్నే ఒక సయన్స్ కాంగ్రెస్‌లో అప్పటి ప్రధాని శ్రీ వి.పి.సింగ్ కూడా విజ్ఞానుల దృష్టికి తెచ్చారు.

సముచిత సాంకేతిక శాస్త్రమంటే, దేశంలోనున్న వనరులను గుర్తించి, దేశీయులు అవసరాలను దృష్టిలో పెట్టుకొని వారికి ఉపయోగపడేడట్లు వనరులను వినియోగిస్తూ పరికరాలను నిర్మించడం. దానికి దేశభక్తి, సంఘాభ్యుదయకాంక్ష. సామాజికి స్పృహ అత్యంతావశ్యకాలు. ఆ దిశలో పాశ్చాత్య విజ్ఞానులకున్న కుతూహలం మన విజ్ఞానులకు ఉన్నట్లు కనపడదు. ప్రతి పరిశ్రమకు, సాధారణంగా, ఒక పరిశోధన సంస్థ అనుబంధమై ఉండాలి. పరిశ్రమలకు విశ్వవిద్యాలయాలకు సన్నిహిత సంబంధముండాలి. మన దేశంలో అవి చెప్పుకోతగినంతగా లేవు. పాశ్చాత్య దేశాల నుండి సాంకేతిక శాస్త్రం దిగుమతి చేసుకొనే స్థితిలోనే ఇంకా, భారతదేశముంది.

అయితే, ఇటీవల కొంత చైతన్యం కలిగిందని చెప్పుకోవచ్చు. వ్యర్థ పదార్థాలనుండి శక్తి విడుదల చేసే విషయంలో బయోగేస్ వంటి ఇంధనాలను ఉత్పత్తిచేసే పరికరాలను నిర్మించేరు. మనకు సౌరశక్తి విరివిగా లభిస్తుంది. ఏడాదిలో ఎనిమిది నెలలైనా ఎండ బాగా కాస్తుంది.

ఆశక్తి వ్యర్థమైపోతుంది. దానిని సద్వినియోగం చేసుకోగల పరికర నిర్మాణం విరివిగా జరిగితే గ్రామాభ్యుదయనికి ఆ శక్తిని చవకగా వినియోగించుకోవచ్చు. సౌరశక్తితో నీరు కాచుకొనే సోలార్ హీటర్లు నిర్మించే ప్రయత్నంలో ఆంధ్రవిశ్వకళాపరిషత్ అప్లైడ్ ఫిజిక్స్ శాఖ విజయం సాధించింది. దాదాపు అయిదువందల రూపాయిల ఖర్చుతో నిర్మింపబడిన పరికరం,ఎండలో ఉంచినంత మాత్రాన సాయంకాలానికి వేడి నీరు తయారవుతుంది. ఇట్టివి ఇంకా విరివిగా తయారుచేసే సాంకేతిక శాస్త్రాని మన విజ్ఞానులు పెంపొందించాలి.

వ్యవసాయ క్షేత్రంలో విజ్ఞానం ప్రధాన పాత్ర వహించే సమయం వచ్చింది. మంచి వంగడాలను రూపొందించి రైతులకు ప్రభుత్వం సరఫరా చేసేకాలం సమీపిస్తూంది. విజ్ఞాన దృష్టి జనంలో పెంపొందించాలంటే, విజ్ఞాన విషయాలు వారికి అర్థమయ్యే పద్ధతిలో వివరించాలి. విజ్ఞాన పట్టభద్రులను ఆ కార్యక్రమానికి వినియోగించవచ్చు. అందుకు డిగ్రీస్థాయివరకు తెలుగులో విజ్ఞానం బోధించవలసిన అవసరముంది. అప్పటికి వైజ్ఞానిక భావాలను బాగా ఆకళించుకొని విద్యార్థులుంటారు. వారు గ్రామాలలో దక్షతతో విజ్ఞాన ప్రచారం చేయగలరు. కాబట్టి విజ్ఞానంలో డిగ్రీ తీసుకొన్నవారు ఆరు నెలలైనా గ్రామాలలో సంచరిస్తూ విజ్ఞానం విశదీకరించాలన్న నియమం విశ్వవిద్యాలయాలు చేసినట్లయితే, వైజ్ఞానిక దృష్టి పెరిగి జీవన స్రవంతిలో విజ్ఞానం నుండి లాభంపొందే అవకాశం కలుగుతుంది. అందుచేత విజ్ఞాన ఫలితాలను పొందడానికి అవసరమైన షరతులు ఏవంటే

1. ప్రాథమిక విద్యను పటిష్ఠం చేసే పద్ధతులను వెంటనే చేపట్టాలి.

2. డిగ్రీస్థాయి వరకు విజ్ఞాన బోధనకు తెలుగు మాధ్యమంగా వినియోగించాలి.

3. పెరుగుతూన్న విజ్ఞానం ఎప్పటికప్పుడు తెలుగులో వివరించే పత్రికలు స్థాపించి, ఇతర భాషల వైజ్ఞానిక పత్రికల అంశాలను వెంటవెంటనే అనువదింపచేయాలి అవి సాధ్యమయ్యే వరకు ఉన్నత విద్యా బోధనకు. విజ్ఞాన విషయంలో, ప్రస్తుతమున్న మాధ్యమాన్నే కొనసాగించాలి.

# జ్యోతిష్యం- ఆధునిక విజ్ఞానం

- డా॥ సి.వి.బి. సుబ్రమణ్యం

ఆధునిక కాలంలో ఎన్నెన్నో విజ్ఞాన శాస్త్రాలు తమ తమ దృక్కోణాలలో పరిశోధనలు సాగిస్తున్నాయి. ఆయా పరిశోధనలను జ్యోతిష దృక్కోణంలో ఆలోచించినపుడు జ్యోతిష్యం లోని సహేతుకత నిరూపితమౌతోంది. గత 40 సంవత్సరాలుగా ఫ్రాన్సులో ఒక పరిశోధన సాగుతోంది. ప్రమాదవశాత్తు వ్యక్తి యొక్క ఎముక ముక్కలైనపుడు ఆ భాగాలను తొలగించి ఒక రాడ్‌ను వేసి ఎముక ఎదిగి కలిసిపోయిన తరువాత మరల ఆపరేషన్ చేసి ఆరాడ్‌ను తొలగించడం సామాన్యంగా జరిగే ప్రక్రియ. ఈ క్రొత్త పరిశోధనలో ఎంతమేర ఎముక భాగం తొలగించాలో అంతమేర పగడపు ముక్కను అతుకుతున్నారు. ఎముకలోని ద్రవ పదార్థం (మజ్జ) ఆ పగడంలోనికి ప్రవేశించి పగడాన్ని ఎముకగా మారుస్తోంది. (7-11-1991-ఈనాడు దినపత్రిక -శీర్షిక -జ్ఞాననేత్రం). ఈ పరిశోధన పూర్తిగా భౌతికశాస్త్ర దృష్టితోనే సాగుతూ అత్యుత్తమ ఫలితాలను అందిస్తోంది. జ్యోతిషశాస్త్రం దృక్కోణంలో ఆలోచిస్తే ఎముక, పగడము కుజునకు సంబంధించిన పదార్థాలే. ఎముక విరగడానికి కారణమైన ప్రమాదానికి కుజుని వ్యతిరేక శక్తి(Negative Force) కారణం. ఆ ప్రమాదాన్ని నివారించడానికి పగడం ధరించాలని జ్యోతిషశాస్త్రం చెబుతోంది. పగడం కుజుని అనుకూల శక్తివలన జన్మించింది. కాబట్టి ఆ ప్రమాదాన్ని నివారించడంలో సమర్థవంతమౌతోంది. విశేషించి ఈ పరిశోధనలో కుజుని వ్యతిరేక శక్తివలన ఏర్పడిన లోపాన్ని పూరించడానికి అనుకూలశక్తివల్ల జనించిన పగడం ఉపకరించడం జ్యోతిష శాస్త్ర పరంగా సహేతుకమైన ఘన విజయమే. ఈ కోణంలో క్రొత్త పరిశోధనలు చేసి దంతాల స్థానంలో కూడా పగడమును ఏర్పరచ వచ్చేమో పరిశీలించవలసి యున్నది.

తులసి కుజ, శనుల ప్రభావం కలిగియున్నది. స్త్రీలకు ఋతుసంబంధమైన అనారోగ్యాలపై కుజశనుల ప్రభావం అధికంగా ఉంది. తులసిలోని జీవశక్తి శని ప్రభావానికి లోబడి ఉంటుంది. తులసి తోటలో మరణించిన కుక్క యొక్క శరీరం వారం రోజులపాటు సహజమైన మార్పులేవి చెందకుండ ఉండడాన్ని ఆధునిక పరిశోధకులు పరిశీలించారు. తులసి పూజించడం, ప్రదక్షిణం చేయడం, తులసి దళంపై నుంచి వచ్చిన నీటిని తీర్థంగా తీసుకోవడం భారతీయ స్త్రీ పాటిస్తున్న ఆచారం. హోమియో సిద్ధాంతం ప్రకారం తులసి నుండి తీసిన మందు పలు ఋతురోగాలపై చక్కని అనుకూల ప్రభావాన్ని చూపించడం ఆధునిక పరిశోధకులు గమనించారు.

జ్యోతిష శాస్త్రరీత్యా గురుడు మేధావి. మేధావులకు సామాన్యంగా వచ్చే అనారోగ్యం షుగర్ వ్యాధి. ఆ వ్యాధికి కారకుడు గురుడే. గురుని వ్యతిరేక శక్తి ప్రభావం వల్లన జన్మించినది పంచదార. ఈ పంచదార షుగర్ వ్యాధిని వృద్ధిచేస్తుంది. గురుని అనుకూల శక్తి ప్రభావం వలన జన్మించిన పసుపు షుగర్ వ్యాధిని నిరోధించడంలో శక్తి కలిగి యున్నదని ఆధునిక పరిశోధకులు గుర్తిస్తున్నారు.

కుజుని రంగు ఎరుపు. ఆ రంగు కాంతిలో కుజుని ప్రభావాలుండటం జ్యోతిష శాస్త్ర పరంగా సహేతుకమైనదే. రష్యాలో రంగుల ప్రభావాలపై విశేష పరిశోధనలు సాగాయి (26-8-1990- ఆంధ్రజ్యోతి -ఆదివారం-దినపత్రిక). ఎరుపురంగు వేసిన గోడల గదిలో పిల్లలను

పెంచినపుడు వారిలో ఎఱ్ఱరక్త కణాలు పెరిగాయి. ఎముకల పుష్టి పెరిగింది. ఉత్సాహం, ఉత్తేజం పెరిగాయి. నాయకత్వ లక్షణాలు పెరిగాయి. హింసా ప్రవృత్తి పెరిగింది. ఈ వరుస క్రమంలో చెప్పిన లక్షణాలన్నీ కుజుని కారకత్వాలకు చెందినవే. జ్యోతిష శాస్త్రరీత్యా తెలుపు రంగుకు. ఆహారానికి అధిపతి చంద్రుడే. తెలుపు రంగు కాంతిలో తినే ఆహారాలు రుచికరంగా ఉంటున్నాయని ఆ పరిశోధకులు గుర్తించారు. ఆకు పచ్చరంగుకు అధిపతి బుధుడు. బుధుడు బుద్ధికుశలతకు, సృజనాత్మక శక్తికి, స్ఫురణ శక్తికి కారకుడు. ఆకు పచ్చని కాంతిలో పెంచిన పిల్లల్లో పై లక్షణాలు వృద్ధి పొందడాన్ని అపరిశోధకులు గుర్తించారు. నీలం రంగుకు అధిపతి శని. అతడు విశ్రాంతికి కారకుడు. నీలి రంగు కాంతిలో వ్యక్తి శారీరకంగా మానసికంగా తక్కువ సమయంలో ఎక్కువ విశ్రాంతిని పొందుతున్నట్లుగా ఆ పరిశోధకులు గుర్తించడం జరిగినది. వైద్యశాలలలో. విశ్రాంతి గృహాలలో ఈ రంగుని వాడమని వారు సూచిస్తున్నారు. పసుపురంగుకు అధిపతి గురుడు. ఇతడు మేధావి. బాలురలో మేధాశక్తి వృద్ధి చెందడానికి పాఠశాలలో లేత పసుపురంగును వాడమని వారు సూచిస్తున్నారు. ఈ పరిశోధకులు జ్యోతిష శాస్త్రాన్ని దృష్టిలో పెట్టుకొని పరిశోధించలేదు. కాని జ్యోతిష శాస్త్ర సూత్రాలతో వారి పరిశోధనా ఫలితాలు ఏకీభవిస్తున్నాయి.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అని ప్రాచీన సంప్రదాయం. సూర్యుని వలన ఆరోగ్యం కలుగుతుందని ప్రాచీనుల భావన స్నానం చేసిన వెంటనే సూర్యనమస్కారాలు చేయటం ద్వారా వ్యాయామం, సూర్యకాంతిలోని శక్తి స్వీకరించటం సంభవిస్తున్నాయి. ఆధునిక పరిశోధకులు నెలలు పూర్తి కాకుండ పుట్టిన బిడ్డ త్వరగా కోలుకొని. శక్తిని పొంది, ఎదగడానికి శరీరంలో 'ఎ', 'డి' విటమిన్లు వృద్ధి చెందడానికి సూర్యుని లేత కిరణాలు ఉపయోగ పడతాయని. నిర్ణయిస్తున్నారు. సూర్యకాంతిలోని 'ఎ' విటమిను కనుల ఆరోగ్యానికి బాగా ఉపయోగ పడుతుందని ఆధునిక పరిశోధకుల కథనం. జ్యోతిష శాస్త్ర పరంగా నేత్ర కారకుడు సూర్యుడే. సూర్యునికి చెందిన ధాన్యం గోధుమలు. ఆరోగ్యానికి అతడే అధిపతి. గోధుమ గడ్డి సారాన్ని రోజూ స్వీకరించడం ద్వారా 53 రకాల అనారోగ్యాలు తగ్గుతున్నట్లు, కేన్సర్, మొదలగు రోగాలను కూడా నిరోధించగల శక్తి దానిలో ఉన్నట్లు ఆధునిక పరిశోధకులు గుర్తించారు. సూర్యునికి చెందిన పువ్వు జిల్లేడు. ప్రాచీన ఆయుర్వేద గ్రంథాలలో "అర్క సంహిత" అనే గ్రంథంలో జిల్లేడు ఏఏ అనారోగ్యాలకు ఏఏ విధంగా వినియోగించాలో వివరంగా వ్రాసారు (13.9.96 వార్త దినపత్రిక శీర్షిక - జిల్లేడు - ఉపయోగాలు).

సూర్యుడు ఆత్మశక్తికి చంద్రుడు మనస్సుకు సంకేతాలు. ఈ రెండు శక్తులు ఏకీకృతమైనపుడు వ్యక్తిలోని అంతర్గత శక్తి ఉద్బుద్ధం అయ్యే అవకాశం ఎక్కువ. మూడు సంవత్సరాల కాలాన్ని పరిశోధన కోసం ఎంచుకొని పరిశీలించినపుడు అమావాస్య, పౌర్ణమి దివసాలలో ఎక్కువ నేరాలు జరిగినట్లుగా గుర్తించారు. అమావాస్య పౌర్ణమి దివసాలలో సూర్య చంద్రులు కలసి ఉండటం కాని, $180^0$ లలో ఉండటంగాని సంభవిస్తుంది. ఆ సమయంలో సూర్యచంద్రుల కాంతులు ఏకీకృతం కావటం వల్ల అంతర్గత భావాలు బహిర్గతమౌతాయి. ఆయా వారాలలో ఆయా గ్రహాల ప్రభావాలు అధికంగా ఉండటం సహేతుకమే అవుతుంది. సోమవారం చంద్రహోరతో ప్రారంభమౌతుంది. చంద్రుడు మనస్సుకు చెందిన వాడు. ఉద్వేగం (Tension) వృద్ధి చెందటంలో ఈ చంద్రుని ప్రభావం ఎక్కువ అనటానికి సందేహించాల్సిన

అవుసరం లేదు. ఆధునిక పరిశోధకులు హృద్రోగ మరణాల 70% వరకు సోమవారం ఉదయం జరగడాన్ని గుర్తించారు (24-3-1991 ఆంధ్రజ్యోతి దినపత్రిక శీర్షిక - "సోమవారం - తస్మాత్ జాగ్రత్త").

చకోస్లోవేకియాలోని ఒక వైద్య నిపుణుడు 7,000 మంది దంపతులకు పురుష సంతానోత్పత్తికై జ్యోతిషశాస్త్ర ప్రకారం గర్భాదాన ముహూర్తం నిర్ణయించాడు. వారిలో 95% మంది పురుష సంతానాన్ని పొందారు (3-6-1987. ఆంధ్రప్రభ, దిన పత్రిక).

మిరియాలు, జీలకఱ్ఱ, ఆవాలు, మెంతులు, మినపప్పు, మొదలైన నిత్యావసర వస్తువులు. అవి తగ్గించే రోగాలు, ఆ రోగాలకు ఆ పదార్థాలకు అనుబద్ధమైన గ్రహాలు మొదలైన వాటిని పరిశీలించినపుడు గ్రహ కారకత్వాలలోనున్న సహేతుక దృష్టి అధికంగా వ్యక్తమౌతుంది. మెంతులకధిపతి గురుడు. గురుని కష్ట కారకత్వాలలోని షుగర్ వ్యాధిని మెంతులు నిరోధిస్తాయి. ఆవాల కధిపతి కుజుడు. కుజుని పిత్త కారకత్వాన్ని ఇవి వృద్ధి చేస్తాయి. రాహువు ఆందోళన కధిపతి. దానిని తగ్గించడంలో రాహువు యొక్క అనుకూల శక్తికి సంబంధించిన మినుములు ప్రముఖ పాత్ర వహిస్తాయి. కేరట్ (Carrot) కు అధిపతి కుజుడు. ఎఱ్ఱ రక్త కణాలకధిపతియైన కుజునికి చెందిన ఈ కేరట్ శరీరంలోని ఎర్ర రక్త కణాలను వృద్ధి చేస్తుంది. దాని సూర్య కారకత్వం గూడా ఉన్నందువలన కంటికి ఆరోగ్యాన్నిస్తుంది. లవణాల కధిపతి చంద్రుడు. లవణం నుంచి జనించిన Natrammore మనోరోగాలను తగ్గిస్తుంది. వడదెబ్బనుంచి కూడ కాపాడుతుంది. చంద్రుడి కాంతి సూర్య తేజస్సులోని దోషాన్ని హరించడంలోను, మనోరోగాలను తొలగించడంలోను ప్రధానమైనదే. విశేషించి మనోరోగాల కధిపతి చంద్రుడే.

ఆకాశంలో కుజుడెఱ్ఱగా కనిపించడాన్కి, కారణం ఆ గోళానికి పైపొరగా తుప్పు ఇనుము ఉండడమేనని ఆధునిక పరిశోధకులు నిర్వచిస్తున్నారు. బెల్లానికధిపతి కుజుడు. బెల్లంలో Iron ఉంది. ఆ Iron కుజుని అనుకూలశక్తికి చెందినది. Iron ఎఱ్ఱ రక్తకణాను వృద్ధి చేస్తుంది. తుప్పు యినుము septic అవడం అందరూ ఎరిగినదే. తగ్గని పుండుకు కారకుడు కుజుడు. గురుని సన్నిధిలో కుజుడు దోష రహితుడౌతాడని జ్యోతిష శాస్త్ర సంప్రదాయం. పసుపు septic ని నివారించడంలో ప్రముఖ పాత్ర వహిస్తుంది. ఆ పసుపు కధిపతి గురుడే. వేపకధిపతి బుధుడు. సామాన్య చర్మరోగాలకు అధిపతి కూడ బుధుడే. చర్మ రోగాలను హరించడంలో వేప కున్న శక్తి అందరూ ఎరిగినదే. ఈ విధంగా పదార్థ విజ్ఞానం గ్రహ కారకత్వం విజ్ఞానం సమన్వయం చేసుకొన్నప్పుడు వేరు వేరు రంగాలలోని మౌలిక సమస్య లెన్నిటికో సమాధానాలు మనకు లభిస్తాయి. అందువలన ఆయా రంగాలలోని నిపుణులు ఆ రంగానికి సంబంధించినంత వరకు మాత్రమైనా జ్యోతిష పరిజ్ఞానాన్ని ఆర్జిస్తే లోకంలోని జనులకు ఆనందకరమైన పరిశోధనా ఫలితాల నెన్నిటినో అందించగలరని ఆశించవచ్చు.

అప్పిచువాడు, వైద్యుడు
ఎప్పుడు ఎడతెగక పాఱు ఏఱును, ద్విజుడున్
చొప్పడిన యూరనుండుము,
చొప్పడకున్నట్టి యూర జొరకుము సుమతీ!

ఈ పద్యం అందరూ ఎరిగినదే. నిజంగా నిత్యావసరాలను ఈ కవి గుర్తించాడు.

జ్యోతిష శాస్త్ర రీత్యా ఈ విషయాలు పరిశీలిద్దాం

| | | | |
|---|---|---|---|
| నీరు | సైన్యాధ్యక్షుడు | బాధ్యత వహించే వాడు Contractor | వైద్యుడు |
| బద్ధకంగల సేవకుడు | | | రాణి |
| పట్టుదల గల సేవకుడు | | | రాజు |
| మేధావి (స్వార్థ రహితుడైన సలహాదారు) | గూఢచారి | జడ్జి | వ్యాపారస్థుడు |

వీరిలో సైన్యాధ్యక్షుడు (మేషరాశి), బాధ్యత వహించేవాడు (వృషభం), రాణి (కటకం), రాజు (సింహం), జడ్జి (తుల), గూఢచారి (వృశ్చికం) పట్టుదల గల సేవకుడు లేక సైనికుడు (మకరం) బద్ధకం గల సేవకుడు (కుంభం) సామాన్య జనాలకు నిత్యావసరం వ్యక్తులు కారు. అప్పిచ్చువాడు లేక వ్యాపారస్థుడు (కన్యారాశి), వైద్యుడు (మిథున రాశి), నీరు (మీనరాశి), మేధావి. (ధనుస్సు రాశి) నిత్యం ఉపయోగపడే మూల స్థంబాలు. అందుకే రాశి చక్రంలో నాలుగు మూలల స్థానాన్ని ఆక్రమించాయి. దీనినే ఆరోగ్య పరంగా గుర్తించినపుడు సంపూర్ణ ఆరోగ్యానికి నాలుగంశాలు ముఖ్యావసరాలు. సమగ్ర పౌష్టికాహారం (కన్య), ఔషధీకృతాహారం (మిథునం) తగినంత నీరు (మీనం) ధ్యానం (ధనుస్సు). ఈ నాలుగు మూల స్థంబాలతో చక్కని ఆరోగ్యం సిద్ధిస్తుంది. ఈ కోణంలో ఆలోచన చేసినపుడు సాహిత్యం, పురాణ గాథలు (ధృవచరిత్ర తారాశశాంక గాథ మొదలైనవి) వేద సూక్తాలు, ఎన్నెన్నో జ్యోతిషాంశాలను వెలువరిస్తాయి. ఆయా రంగాలలోని నిపుణులు జ్యోతిషాన్ని అవగాహన చేసుకొని ఆ కోణంలో ఆలోచించినపుడు మాత్రమే ఈ రహస్యాలు వెల్లడి కావడం సంభవిస్తుంది. కాబట్టి జ్యోతిష దృక్కోణంలో ఆధునిక విజ్ఞానులందరు ఆలోచించడం వలన ఆనందంగా ఆనందం (మోక్షం) కోసం జీవించటం సాధ్య పడుతుంది.

## References :

1) జెమ్ థెరఫీ - బి. భట్టాచార్య, ఎఫ్. కె. ప్రైవేట్ లిమిటెడ్ కలకత్తా, 1992
2) కలర్ థెరఫీ - ఆర్.బి. అంబర్ ఎఫ్. కె ప్రైవేట్ లిమిటెడ్ కలకత్తా, 1992
3) ఆహార విజ్ఞానం, మల్లాది రామమూర్తి శాస్త్రి, శ్రీనివాస పబ్లిషింగ్ హౌస్ రాజమండ్రి, 1937.
4) సుమతీశతకం, బద్దెన
5) బృహజ్జాతకం, వరాహమిహిరుడు
వివిధ వ్యాసాలు - పత్రికలలోనివి.



## అల్లాడు నరసింహకవి
# నారదీయ పురాణం - సంస్కృత నారదీయపురాణం

- పుప్పల శ్రీనివాస శర్మ

క్రీ॥శ॥ 14వ శతాబ్దానికి చెందిన అల్లాడు నరసింహకవి అసాధారణమైన ఒకానొక విశిష్టతగల తెలుగు కృతిగా నారదీయ పురాణాన్ని రచించాడు. నరసింహకవి తండ్రి చెన్నప్ప మహాపండితుడు. తల్లి కృష్ణాంబ మహాసద్గుణశీలురాలు. నరసింహకవి దంపతులకు సింగన్న అనంతుడు మొదలైన సంతానము కలిగిందట. నరసింహ కవి గురువు కొండమాచార్యులు. ఇతడు మహా తపస్సంపన్నుడు. ఇతడు వరంగల్లును (ఏకశిలానగరమును) వైష్ణవ మతయుతంగా మార్చి తనహస్తగతం చేసుకొని రామానుజాచార్య విజయధ్వజంగా నిలిచాడట. గురువైన కొండమాచార్యులు నరసింహ కవికి స్వప్నంలో వచ్చి లోకోపకారార్థం సాత్త్విక పురాణమైన నారదీయ పురాణమును, ఆంధ్రభాషలో రచించి శ్రీకృష్ణునకంకితమియ్యమని సెలవిచ్చాడట. తదాజ్ఞమేరకే నరసింహకవి నారదీయ పురాణాన్ని వ్రాశాడట. ఈ విషయాన్ని కవి నారదీయ పురాణారంభంలో కొన్ని గద్యపద్యాలలో పేర్కొన్నాడు.

నరసింహ కవి సంస్కృత కవులలో క్రీ॥శ॥ 11వ శతాబ్దానికి చెందిన జయదేవ కవిని, తెలుగు కవుల్లో ప్రత్యేకించి కవిత్రయాన్ని మాత్రమే ప్రస్తుతించాడు. కవిత్రయంలో మూడవవాడైన, ఎర్రాప్రగడ క్రీ॥శ॥ 13వ శతాబ్దంలోనివాడు కాబట్టి ఈ అల్లాడు నరసింహకవి క్రీ॥శ॥ 13వ శతాబ్దికి తరువాతి వాడేనని ధృఢంగా చెప్పవచ్చును.

ప్రారంభంలో కవి ఇష్టదేవతా స్తుత్యాదికంచేస్తూ శ్రీ కృష్ణున్ని, రుక్మిణీ దేవిని, ఆదిశేషువును, చింతామణిని పంచాయుధుని విడి విడి పద్యాల్లో కీర్తించాడు. ద్రావిడ వేదానికి మూలకర్తయైన పరాంకుశ మహాయోగిని, భాష్యకారాది ఆచార్యవర్యులను ఒక సీసపద్యంలో నుతించాడు. అనంతరం రామాయణ, మహాభారత కర్తలైన వాల్మీకి వ్యాసులను ఒక పద్యంలో నుతించి కాళిదాసు, భావభూతి, మురారి, మయూర, బాణ, శంకర జయదేవ, మాఘాది సంస్కృత కవి వర్యులను మరొక పద్యంలో ప్రస్తుతించాడు. తరువాతి పద్యంలో తెలుగు కవిత్రయాన్ని నుతించి వేరొక పద్యంలో కుకవులను తిరస్కరించాడు. నరసింహకవి నారదీయ పురాణాన్ని, ఎనిమిదాశ్వాశాల గ్రంథంగా విరచించాడు. ప్రథమాది అష్టమాశ్వాస పర్యంతం ఆయా ఆశ్వాసాల పరంగా ఈ క్రింది గద్య పద్యాలు వున్నాయి.

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసం | - | 516 |
| ద్వితీయాశ్వాసం | - | 252 |
| తృతీయాశ్వాసం | - | 189 |
| చతుర్థాశ్వాసం | - | 354 |
| పంచమాశ్వాసం | - | 235 |
| షష్ఠాశ్వాసం | - | 264 |
| సప్తమాశ్వాసం | - | 230 |
| అష్టమాశ్వాసం | - | 277 |

మొత్తం నారదీయ పురాణంలో అవతారికా పద్యాలతో కలిపి 2317 పద్యాలు, గద్యాలు వున్నాయి

నారదీయ పురాణం అష్టాశ్వాస సంభరితమే కాని, కేవల నారదీయ పురాణానికి సంబంధించిన గ్రంథం ఏడాశ్వాసాలుమాత్రమే వున్నది. ప్రథమాశ్వాసంలో వున్నమొత్తం 516 పద్యగద్యాలలోను ఇష్టదేవతా స్తుత్యాదికాలుగా 24 పద్యగద్యాలను, నారదీయ పురాణ కథా ప్రారంభాదిగానున్న మొత్తం 36 పద్యగద్యాలను తొలగిస్తే మిగిలిన 456 పద్య గద్యాలలో నారదీయ పురాణ కృతిపతియైన శ్రీకృష్ణచరిత్రను అతిలోక కవితావైభవంతో వర్ణించడం జరిగింది.

"ఆ మహాగురు శిఖామణి యొక్క నాడు స్వప్నంబున నన్ను గరుణించి, నారదీయ సాత్విక పురాణంబు లోకోపకారార్థంబుగా నాంధ్రభాష రచియించి శ్రీకృష్ణాంకితంబుసేయుమని యానతిచ్చిన మేల్కాంచి కృష్ణభగవానుని మనంబుననిడుకొని రచియింపబూనితి. దదవతార క్రమంబెట్టిదనిన" అని నరసింహకవి కృష్ణావతారక్రమాన్ని 456 పద్యాలలో దాదాపు ప్రథమాశ్వాసం తుదివరకూ అత్యంత మధురమైన మంజులమైన శైలిలో వర్ణించాడు. మధురాపుర వర్ణన, శ్రీకృష్ణ జననము, శ్రీకృష్ణలీలలు, దుష్టసంహారము, శ్రీకృష్ణుడు దావాగ్నిని గ్రోలుట, వర్షాగమము, వసంతాగమము, గోపికావిహారము, నందుడేకాదశినుపసించుట, అక్రూరుడు యమునాజలముల రామకృష్ణుల గాంచుట, శ్రీకృష్ణుడు కంసుని సంహరించుట, శ్రీకృష్ణుడు ఉద్ధవుని గోపికల కడకంపుట, శ్రీకృష్ణుడు జరాసంధ కాలయవనుల జయించుట, శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్యభామల పరిణయమాడుట, నరకసంహారం పారిజాతాపహరణం ప్రద్యుమ్నవృత్తాంతం, శ్రీకృష్ణుడు బాణాసురునోడించుట, నృగమహారాజ వృత్తాంతం, పౌండ్రకవాసుదేవుడు. కౌరవ పాండవుల సంబంధం, కుచేలోపాఖ్యానం, శ్రీకృష్ణుడు వృకాసురిని బంధించుట, అర్జునుడు, సుభద్రంగొంపోవుట, ద్వారకలో శ్రీకృష్ణుని జీవితం, అన్న వివిధ శీర్షికలతో శ్రీకృష్ణావతార విశేషాలను వర్ణించాడు. అనంతరం కృతిపతియైన శ్రీకృష్ణ సమర్పణంగా ఐదు షష్ఠ్యంతాలైన కందపద్యాలను రచించి, అసలు నారదీయ పురాణంలో" మునులు నారాయణుని దర్శించడంతో కథా ప్రారంభం చేశాడు.

నన్నెచోడుకు మొదలుకొని, అనేకమంది కవులు ఈ షష్ఠ్యంతాలు ప్రయోగించారు. అయితే కొందరు సార్థకంగా షష్ఠ్యంతాల పుట్టుకను దృష్టిలో పెట్టుకొని ప్రయోగించగా మరికొందరు నిరర్థకంగా ప్రయోగించారు.

ఇంతకూ యీషష్ఠ్యంతాల చరిత్రను దృష్టిలో పెట్టుకొన్నప్పుడు కేశవనామాదులపై ఆధారపడి అవతరించిన షష్ఠ్యంతాలు నరసింహ కవి రచించిన నారదీయ పురాణంలో శ్రీకృష్ణ పరంగా సార్థకమై విరచింపబడ్డాయనే చెప్పవచ్చును. నారదీయ పురాణం శ్రీకృష్ణాంకితమైంది కాబట్టి యిందులోని షష్ఠ్యంత పద్యాలు సైతం శ్రీకృష్ణ వర్ణనాత్మకాలై ఉండడం మూలంగా షష్ఠ్యంతాల సంజనితత్వానికి సార్థకతను సమకూర్చాయనే చెప్పవచ్చును.

కృష్ణావతార వర్ణనలో అత్యంత శక్తిమంతమైన తనసహజ కవితా మాధుర్యాన్ని, వైదుష్యాన్ని నరసింహకవి బహుముఖాలుగా చూపించాడు. ప్రబంధకవుల పోకడలను మనస్ఫురణకు తీసుకొనిరాగల్గినట్లుగా తన కవితా ధౌరంధర్యత్వాన్ని ప్రకటించాడు. మధురాపుర వర్ణనాపరమైన నరసింహకవి శబ్దశక్తికి ప్రతీకగా నిలువగల యీ క్రింది పద్యాన్ని తిలకించండి.

శ్రీరాజవశ్యమై శ్రీరాజవశ్యమై
   యఖిలలోకముల విఖ్యాతిగాంచి
కల్యాణ ధామమై కల్యాణధామమై
   యఖిల లోకముల విఖ్యాతిగాంచి
సుమనోభిరామమై సుమనోభిరామమై
   యఖిలలోకముల విఖ్యాతిగాంచి
సత్కళాపూర్ణమై సత్కళాపూర్ణమై
   యఖిలలోకముల విఖ్యాతిగాంచి
ప్రబలె భ్రాంతాభ్ర శుభ్ర తరంగిణీత
రంగ రంగన్మహా ఘనరాజిరాజి
తాజర పయస్సుధాలేపనాంచితోచ్చ
గోపుర శ్రీలనగా మధురాపురంబు

కృతిపతి అయిన శ్రీకృష్ణావతార వర్ణనానంతరం కథాప్రారంభంకాగా మహర్షులు శ్రీమన్నారాయణుని దర్శించి, నుతించి, యాదవశైలక్షేత్ర మహాత్మ్యాన్ని గురించి వివరించవలసిందిగా ప్రార్థిస్తారు. అపుడు విష్ణువు, యాదవశైల క్షేత్రమహాత్మ్యాన్ని బ్రహ్మ సనత్కుమారునికి వివరించగా ఆ సనత్కుమారుని ద్వారా నారదమహర్షి తెలుసుకున్నాడనీ ఆ నారదుడే ఆ యాదవశైల మహాత్మ్యాన్ని మీకు వివరంగా తెలియజేస్తాడనీ చెప్పి విష్ణువు అదృశ్యమవుతాడు. ఈ విధంగా కథాప్రారంభం కాగా ఆ తరువాత నారదుడు మహర్షులకు ప్రత్యక్షమై యాదవశైల క్షేత్రమహాత్మ్యం వర్ణనపేరుతో యీ మొత్తం నారదీయ పురాణ విశేషాలను చెప్పినట్లు స్పష్టమౌతుంది. కాగా యీ పురాణం మూలగ్రంథం నారద ప్రోక్తమై నారదీయ పురాణంగా అవతరించింది. (చూడు తె.నార.పు.పుటలు · 79, 90, 93, 94, 105)

## నారదీయ పురాణం - శ్రుతులు

నరసింహకవి విభిన్న వేదవిషయాలను వివిధ సందర్భాలలో నారదీయపురాణంలో వివరించాడు. కాలచరిత్ర గురించి వర్ణిస్తూ, అది అధోముఖమై పరిభ్రమిస్తూ ఉంటుందనీ, త్రిగుణాత్మకమై మధ్యభాగం నాభిమిళితమై ఉంటుందని ఈ క్రింది పద్యంలో స్పష్టంగా పేర్కొన్నాడు.

ఘనతరమయి యసంఖ్యమయి బ్రహ్మలోక
   మౌనట్టి పరవ్యోమ మరయనెద్ది
యదియ విశుద్ధ తత్త్వాఖ్య తత్వంబును
   శిరమున నామించి చెలగెనె దిత్రి
పాద్భూతి తదురుత్రి పాద్భూత్య ధోభాగ
   మధ్య దేశైక సమాశ్రయమున
దగున తార్క్ష్యాద్భుత తరశక్తికంబుగ
   వ్యయమునవైన కాలాఖ్యతత్వ

మదియధోముఖ చక్రమైయంటి తిఱుగు
బరగు దదవస్థలీ మధ్య భాగనాభి
విళితమై త్రిగుణాత్మయై మెలగనాయ
జాదులకునైన నెఱుగ శక్యంబె దాని (నారదీయ. 370 పుట 214 ప)

ఇందులో, కాలంలో త్రినాభి విభాగం గురించి నరసింహకవి స్పష్టంగా పేర్కొన్నాడు. శుక్ల కృష్ణ పక్షాలు కలిస్తే ఒక మాసమని, రెండుమాసాలు ఒక ఋతువని, ఆరుమాసాలు ఒక ఆయనమని, యీ రూపకంగా సంవతరాత్మకమైన కాలచక్రాలనికి రెండు ఆయనాలు, ఆరు ఋతువులు, పన్నెండు మాసాలు అని, మాసంలో శుక్ల, కృష్ణ భేదాలతో రెండు పక్షాలనీ, ప్రాచీన కాలం నుంచి అందరు భావిస్తున్నారు. నిజానికి రెండు మాసాలొక ఋతువైనట్లుగా రెండు ఋతువులు ఒక నాభికాలమై కాలస్వరూప స్వభావాలను బట్టి ఆరు ఋతువులను రెండేసి ఋతువులకొక నాభివంతున మూడు నాభులుగా - ఉష్ణనాభి - జలనాభి శీతనాభులుగా వేదర్షిగుర్తించి యీక్రింది ఋగ్వేద మంత్రాలలో ప్రకటించాడు.

"ద్వాదశప్రథమః చక్రమేకం
త్రీణినభ్యానిక ఉతిచ్చికేత (ఋ.వే. 1మండ 24 సూ 48 ఋ)
త్రినాభి చక్రమజరమనర్వం
యత్రే మావిశ్వా భువనాధి తస్థుః (ఋ.వే. 1 మం. 164. సూ. 2. ఋ)

నరసింహ కవి శ్రుతులతో పాటు స్మృతులను సైతం ప్రామాణికాలుగా గ్రహించాడు. "ధర్మ శ్రుతి స్మృతి వైరుధ్యతరము చైత్య సేవాది కర్మముల్ సేయుచుందు... (నార పు 442 పుట 219 ప) అని కేవల శ్రుతి వైరుధ్య కర్మలనే కాక, స్మృతివైరుధ్య కర్మలను సైతం ఆచరించే మూఢులను తిరస్కరించాడు." అఖిలమునేనే నాకంటే నన్యంబెద్దియును లేదన్యంబు గలదనుట వేదోక్తంబుగాదు. ద్విజులమైన మనకు వేదప్రమాణ మనరాదు. వేదప్రామాణ్య విసంవాదము బహువాదులకుంగలదని వినంబడియె లోకాయతనాగత కాణాదులు (నా. పు. 430 పుట 169 ప) అని వేదామోదాన్ని తిరుగులేని వేద ప్రామాణాన్ని ఒకసారి పేర్కొనడమేగాక "శ్రుతిప్రామాణ్య విశ్వాస పరత వైదికాచారరుచియు వేదాంత వేద్యుండైన హరియందు భక్తి యనల్పితపము" (నార పు. 440 పుట 210 ప) అని మరొక సారి వేద ప్రామాణ్యాన్ని పునరుద్ఘాటించారు. అంతే కాదు. వేదాలు సత్కార్యపరాలని, సత్ఫలదాయకాలని "సమస్తవేదంబులును గార్యపరంబు, శ్రేయస్సును గార్యపరమే, శ్రుతి తాత్పర్య గోచరమైన శ్రేయస్సు, దానికంటే మరియొకటికాదు" (నార. పు. 420 పుట 51ప) అని స్పష్టంగా చెప్పాడు.

"సాంగంబులై సరహస్యంబులైన వేదంబులు చదివి వ్యుత్పత్తి లేశ జనిత తద్వేదార్థ వివేక రేఖలు గలవారై తద్బోధశోధన నయములను గురుముఖంబులు వలనం దెలిసియు శేషమూర్తియైన స్వామిని సుగమార్థంబుగా నెఱుంగంగలరు.

మ. హరిపాదాబ్జయుగంబు గొల్చి సరహస్యాశేష వేదస్ఫుర
త్పురుషోత్తంస నిజాశయంబెరిగియుద్బోధామృతాస్వాదులై
పరమోత్కృష్టుల జేసి తత్పదరజః పట్టాభిషేకంబుతో
దురసంతామరులెన్నడుండెదరో సాధుల్మెచ్చవీతార్థులై

అని యీరీతి దయాళుదివ్యనివహాత్యంతైక శోచ్యక్రియా
ఘనదుర్బోధ వివిష్ట చిత్తుల వృధా గర్వాంధులన్ వేదవి
త్తనిరోధార్థక రాత్ములంగని వినీతత్వంబునన్ మ్రొక్కమ
న్నన వీక్షించి ప్రియంబు వల్కి దగదెన్నన్ సజ్జనుండెన్నడున్"(నార.పు.406పుట51వ., 52,53 పద్యాలు)

నరసింహకవి వివిధ వేదాలలో పరిశ్రమించాడనడానికి సాక్షీభూతంగా తన నారదీయ పురాణంలో వివిధ సందర్భాలలో విభిన్న వేదమంత్ర భాగాలను ఉట్టంకించాడు.

"ఆత్మ - దేహాదుల" గురించి వివరిస్తూ వేదపురుషుడు నాకుతెలుసునని చెప్పే "వేదాః మేతం పురుషం మహాంతమ్" అనే వేద వాక్యాన్ని (నార పు. 327 పుట 35వ) ఉదాహరించాడు. బ్రహ్మవిద్యారహస్య వివరణ సందర్భంగా -

ఇలలోన బ్రహ్మవిద్యా
కలితులకు బునర్భవములు గలువగవుపరుడై
వెలయు హరినెఱిగి మృత్యు
ప్రళయము దాటునని శ్రుతితిరంబుగ బలికెన్ (నార. పు. 327 పుట, 40 ప)

అని శ్రుతి ప్రమాణ విషయాన్ని పేర్కొన్నాడు. అటుతరువాత శ్రీవిష్ణుధామంబు పునరావృత్తి రహితంబని పార్థసారధి "యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమంమమ" అని యానతిచ్చె" అని భగవద్గీతావాక్యాన్ని ఉదాహరించినా యేషదేవోపయో బ్రహ్మపథానేన పరంగతా ఇమమ్ మానవ మావరంతే" యను శ్రుతి యున్నయదిగాన బునరావృత్తిరహితంబని పార్థస్ఫురర్థములగు వారికి పునరావృత్తి యెక్కడిదియని కొందఱాడుదురు" అని శ్రుతి ప్రామాణ్యాన్ని వక్కాణించాడు. (నార పు. 328 పుట. 41వ) అనంతరం ఈ బ్రహ్మవిద్యా రహస్య విషయకంగానే ఒక వంక శ్రుతి ప్రామాణ్యాన్ని పేర్కొంటూనే, మరోవంక బ్రహ్మసూత్ర ప్రామాణ్యాన్ని సైతం పేర్కొన్నాడు.

భవాదృశ బ్రహ్మవిత్పాద పద్మ సేవా సుధ లేక క్లామ మానవహంసులైన వారికి బ్రజ్ఞాజ్ఞప్తి పుష్టతయెక్కడిది యజ్ఞాది శ్రుతివలన బ్రహ్మవిద్య కర్మాంగకంబెయని వినంబడియె. ఆ బ్రహ్మవిద్యకు నశ్వంబునకు గమన సాధనంబులంబలె బ్రహ్మవిద్యకు సర్వాపేక్షయుం గలదని "సర్వాపేక్షాచ యజ్ఞాది శ్రుతేరశ్వవత్త"ని సూత్రంబొనర్చితివి అయినను నొక సందేహంబు గలదడిగెద". (నార. పు. 331-332 పుట 54 వ)

తరువాత పరబ్రహ్మరహస్యార్థాన్ని వర్ణిస్తూ "అత్రాయం పురుషః పరంజ్యోతి రూపం సంపద్యస్వేన రూపేణాభి నిష్పద్యతే" అవహత పాప్మా విజరోపమృత్యుర్విశోకో విజిషుత్సో విపిపాసన సత్యకామసత్ సంకల్ప (నార. పు. 343 పుట. 112 వ) అని శ్రుతి వాక్యాన్ని

ఉదాహరించాడు. ఇదే విధంగా వైకుంఠలోకాన్ని గురించి, ఆవరణ పంచకం గురించి వివరించే సందర్భంలో ``మధ్యే మధ్యే త్వం సంఖ్యేయాస్తత్తద్వ్యూహన్`` (నార. పు. 358 పుట. 171 ప) అని శ్రుతి వాక్యాన్ని ప్రామాణికంగా పేర్కొన్నాడు. నరసింహకవి అమోఘమైన విష్ణుశక్తిని గురించి వేదమంత్రప్రామాణ్యంతో వివరించిన ఘట్టమిది.

``అపాణిపాదోజననోగ్రహితాపశ్యం తచక్షుః సశ్రుణోనకంనః
సవేత్యవేద్యం నచ వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాంతమ్।
న కస్య కార్యం కరణం చ విద్యతే స తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే
పరాస్య శక్తే ర్వివిధైవ శ్రైయతే స్వాభావికజ్ఞాన బలక్రియాచ॥``

''యనిననది హస్తంబులేక పట్టును, పాదంబులులేక పరువెత్తును. చక్షువులు లేక చూచును. కర్ణంబులు లేక వినును. అవేద్యంబైన యది యెరుంగును. తన్నొకండెరుంగ లేడు. అతండు మహాపురుషుండని యెంతురు. అతనికి కార్య కరణంబులు లేవు. అతనికి ముందు నధికుండు లేడు. అతని శక్తి వివిధంబైన యదియై స్వాభావికంబులు జ్ఞాన బలక్రియలు. అతని వినుతింప నలవియగునే. భగవంతుని శక్తుల వాఙ్మానస గోచరంబులని పురాణం బులం జెప్పంబడియె. ఉత్పత్తి స్థితిలయంబుల యందు సర్వశక్తులు భగవంతునికే కలవు. శ్రుతి స్మృతులే తదర్థ నిర్వాహకంబులై యుండు'' (నార. పు. 364 పుట. 189 వ)

నరసింహకవి జీవ-పరమాత్మల భేదసిద్ధిని వక్కాణిస్తూ ఈ క్రింది వేదమంత్రాన్ని ఉదాహరించాడు.

క్షరం ప్రధాన మమృతో౽క్షరః క్షరాత్మనా విశతే దేవమేకం
భోక్తాభోజ్యం ప్రేరితారంచమత్వా జుష్టస్తస్మాదమృతత్వమేతి'' (నార.పు. 389 పుట 14వ)

నరసింహకవి ప్రబోధనా మహిమ గురించి వర్ణించిన సందర్భంలో వేద వాఙ్మయం యొక్క మహత్త్వ గురించి యెంతో మహోన్నత దృక్పథంతో వర్ణించాడు.

బహువాదమూలమై భాసించువేదంబు
యజ్ఞకర్మ క్రియాద్యంబు వేద
మఖిల గృహస్థాశ్రమ స్ఫూర్తి వేదంబు
స్మృతి మర్మ విద్యయా హృద్యవేద్య
మమిత పురాణ రహస్య తంత్రం వేద
మాదిత్య పురుష జన్మములు జగము
లట్టైన వాఙ్మయంబంతయు నీ పురా
ణంబులయందె ధన్యత వహించె
నట్లుగాన బురాణార్థమధికతరము
తెలియ వేదార్థమున కంటె వెలియుననుచు
సుప్రతిష్ఠము చేసిరి సూటిగా బు
రాణములయందు వేదతంత్రంబులెల్ల (నార. పు. 257 పుట. 53 ప )

## నారదీయ పురాణం - ఉపనిషత్తులు

నరసింహకవి పరబ్రహ్మ రహస్యార్థ విశేషాలను వర్ణిస్తూ అనేక ఉపనిషద్విషయాలను ప్రత్యేక విశిష్టతతో వివరించాడు. పరబ్రహ్మ తత్త్వాన్ని వివరించే సందర్భంలో సర్వాంతర్యామి అయిన హరిని వర్ణిస్తూ ఇందునకు యో బ్రహ్మణా విదధాతి పూరమ్మను నుపనిషద్వాక్యంబు గలదు. (నార. పు. 326 పుట 33వ) అని ఉపనిషద్వాక్యాన్ని ఉదాహరించాడు.

నరసింహకవి జీవపరమాత్మలభేదస్థితి గురించి వివరిస్తూ "తేజంబు వోయిన వెనుక మందిరంబంధకారావృతంబయిన నందకారంబు యని యందురు. ఇత్తెఱంగున విశ్వైకోపనిషద్వాక్యంబులకు గతి గలిగియుండుటంజేసి యైక్య వాక్యంబులకు శ్రుత్యేపి కావగత మహదాద్య చేతనైక్య వాక్యంబులకు ముఖ్యార్థహీనత యెక్కడిది. (నార. పు. 390 పుట 14వ) అని విశ్వైకోపనిషద్విషయాన్ని పేర్కొన్నాడు.

### తులనాత్మకాధ్యయనం

సంస్కృతమూల నారదీయ పురాణ భాగాలను, నరసింహకృత నారదీయ పురాణంలోని ఘట్టాలను కొన్నింటిని తులనాత్మక దృష్టితో యీ క్రింద పేర్కొంటున్నాను. నరసింహకవి అనువాద పద్ధతి మాత్రం నన్నయాదుల భారతాదిగ్రంథాల అనువాద పద్ధతిలోనే నడిచిందని చెప్పవచ్చును. కాని లభ్యమైన సంస్కృత నారదీయ మహాపురాణాన్ని దృష్టిలో పెట్టుకొని చూచినపుడు నరసింహకవి కృతమైన నారదీయపురాణంలో అసలు సంస్కృత మూలంలో లేనటువంటి అనేక విషయాలు కనిపిస్తాయి. తెలుగు నారదీయ పురాణ ద్వితీయాశ్వాసంలో వున్న కల్యాణ తీర్థోత్పత్తి మహిమ, సుచరిత్రుని చరిత్ర, కనకమాలిన యదుశేఖరుల కథ, యాదవాద్రి వర్ణనం, చతుర్వేది కథ, ఇత్యాది విషయాలు, మూలనారదీయ పురాణంలో అసలు కనిపించడంలేదు.

వీటిలో కొన్నియథామూలానువాదాలుగానూ, కొన్ని అత్యంత సంగ్రహీతాలుగానూ, మఱికొన్ని మధ్యమంగానూ, విరచింపబడినట్లు కనిపిస్తున్నాయి.

పాపేంధనస్య ఘోరస్య శుష్కార్ద్రస్య ద్విజోత్తమ ।
కోవహ్నిర్దహతే తస్య తద్భావాన్వక్తు మర్హతి॥
నాజ్ఞాతం త్రిషులోకేషు చతుర్ముఖ సముద్భవః।
విద్యతే తవ విప్రేంద్ర త్రివిధస్య సునిశ్చితమ్॥
అజ్ఞాతం పాతకం శుష్కం జ్ఞాతం చార్ద్ర ముదాహృతః
భావ్యం వాప్యథవాతీతం వర్తమానం వదస్వనః॥
వహ్నినాకేన తద్భస్మ భవేదే తన్మతం మమ

వశిష్ఠోవాచ -

శ్రూయతాం నృపశార్దూల వహ్నినాయేన తద్భవేత్।
భస్మశుష్కం తథార్ద్రంచ పాపమస్య హ్యశేషతా॥

అవాప్య వాసరం విష్ణోర్యోనరః సంయతేంద్రియః।
ఉపవాసపరో భూత్వా పూజయేన్మధుసూదనమ్॥
పధాత్రీస్నాన సహితో రాత్రౌ జగరణాన్వితః।
విశోధయతి పాపాని కితవోహియథా ధనమ్॥ (సంస్కృత నార - ఉత్తరార్ధం 1. అ 3-9 శ్లో॥)

కం ఏ పున శుష్కార్ద్ర ములౌ
పాపేంధన కోటులెల్ల భస్మము సేయున్
దీపించు వహ్నియెయ్యది
తాపసకులనాథ! తెలుపు దయతో మాకున్

సీ॥ మూడు లోకంబుల మునినాథ! నీ వెఱుం
గనియదిలేదు నిక్కముగ(ద్రివిధ
కర్మ నిశ్చితము విఖ్యాతమైన జాత
కలుషంబులెంచ శుష్కములు జాత
కలుషంబు లార్ద్రముల్గా విన్నవించితి
వార్తకెక్కనతీత వర్తమాన
భావికాలోచిత పాపేంధనంబులే
వహ్నిచేనడగు బావన చరిత్ర

తే॥ యనిన హరి వాసరమునియతాత్మమనుజు
డుపవసించి హరిభజించి యుచితభక్తి
గాంచి నిశినెల్ల దామేలు కాంచి ధనము
జూదరియు బోలె బాతకస్తోమమడచు. (తె. నార - పు. 4 ఆ. 189 పుట 3-4 ప)

ఏకాదశీ సమాఖ్యేన వహ్నినాపాతకేంధనం
భస్మతాం యాతి రాజేంద్ర అపి జన్మశతోద్భవం॥
నేదృశం పావనం కించిన్నరాణాం భూప విద్యతే।
యాదృశం పద్మనాభస్య దినం పాతకహానిదం॥
తావత్పాపాని దేహేస్మింస్తిష్ఠంతి మనుజాధిప।
యువన్నోపవసేజ్జంతుః పద్మనాభ దినంశుభం॥
అశ్వమేధ సహస్రాణి రాజసూయశతాని చ।
ఏకాదశ్యుపశానస్య కలాం నార్హంతి షోడశీం॥
ఏకాదశేంద్రియైః పాపం యత్కృతం భవతి ప్రభో।
ఏకాదశ్యుపవాసేన తత్సర్వం విలయం వ్రజేత్॥
ఏకాదశీ సమంకించిత్ పాపనాశం నవిద్యతే।
వ్యాజేనాపి కృతారాజన్న దర్శయతి భాస్కరీం॥
స్వర్గమోక్ష ప్రదా హ్యేషా శరీరారోగ్య దాయినీ॥ (సంస్కృత నార.పు. ఉ.1 అ. 10-16 శ్లో॥)

వచనము : వినుము రాజేంద్రా! ఏకాదశీ సముద్భవానలంబుచే జన్మశతోద్భవంబులైన పాతకేంధనంబులు భస్మంబగు హరి దివసంబువంటి దినంబులేదు హరివాసరంబున నుపవసించు తనకనేక దేహంబుల పాపంబులుడును. హరి వాసరోపవాసషోడశాంశంబునకు నశ్వమేధ సహస్రంబులు వాజపేయ శతంబులు సమంబులు గావు. హరివాసరోపవాసంబున నేకాదశేంద్రియ కృత పాపంబులన్నియు నాశనంబు నొందు. హరిహసర సమయంబుగా బాపంబుల వలన రక్షించునది యొక్కటి లేదు. ఒక్కొక్క వ్యాజంబున హరివాసరోప వాసమాచరించి దండధరునింజూడడు స్వర్గమోక్ష ప్రదంబును, శరీరారోగ్య కరంబును, సుకళత్ర సుపుత్ర లాభ కారణంబునగు, మఱియును. (తె. నార. పు. 4 ఆ. 190 పుట 5వ)

న గంగా న గయా భూప న కాశీ నచ పుష్కరః।
న చాపి కౌరవం క్షేత్రం నరేవా నచదేవికా॥
యమునా చంద్ర భాగాచ పుణ్యాభూప హరేర్దినాత్
అనాయాసేన రాజేంద్ర ప్రాస్యతే హరిమందిరమ్॥
రాత్రౌ జాగరణం కృత్వాసముపోష్యహరేర్దినం।
సర్వపాప వినిర్ముక్తో విస్ణులోకేవ్రజేన్నరః॥
దశైవ మాతృకే పక్షే దశరాజేంద్ర పైతృకే।
భార్యయా దశపక్షేచ పురుషానుద్ధరేత్తథా॥
ఆత్మానమపి రాజేన్ద్ర సనయేతద్వైష్ణవం పురం।
చింతామణి సమాహ్యేషా అథవాపి నిధేస్సమా॥
సంకల్పపాదప ప్రఖ్యా వేదవాక్యోప మాధవ।
ద్వాదశ్యాం యే ప్రపన్నాహి నరా నరవరోత్తమ॥
తే ద్వంద్వం బహవో జాతా నాగరీకృత వాహనాః।
స్రగ్విణః పీత వస్త్రాశ్చ తేయాంతి హరిమందిరమ్॥
ఏష ప్రభావో హి మయా ద్వాదశ్యాః పరికీర్తితః।
పాపేంధనస్య ఘోరస్య పావకాఖ్యో మహీపతే॥
హరేర్దినం సదోపోష్యం నరై ర్ధర్మ పరాయణైః
ఇచ్ఛద్భిర్విపులాన్భోగాన్పుత్ర పౌత్రాదికంస్తథా॥
హరిదినమిహ మర్త్యోయః కరోత్యాదరేణ
నరవరసతు మేక్షింయాతురాప్నోపినైవః
బహువృజిన సమేతో ఽకామతః కామతో వా
వ్రజతి పదమనంతం లోకనాథస్య విష్ణోః" (సంస్కృతనార ఉ 1 అ. 17-26 శ్లో॥)

కం. కురుగంగా కాశీ పు
ష్కర రేవావేణి కావికర్తన తనయా
సరయూ గయాది తీర్థము
లరయన్ సరియనగ దగునే హరిదినమునకున్

మ. అవనీ నాయక కల్మలోకుల కనాయాసంబునన్ నేడువై
ష్ణవ ధామంబుపవాస సజాగరములిచ్చం జేయ నేకాదశిన్
సవిశేషంబుగ మాతృపక్ష పితృపక్ష స్వప్రియా పక్షవం
శ వతంసంబులు వార్తగా బదియు మోక్షం బందుదానుందగున్

కం. ఏకాదశి చింతామణి
యేకాదశి కామధేను వింద్ర మహీజం
బేకాదశి మోక్ష ప్రద
మేకాదశి వేద మార్గమేకాదనియే

శా. ద్వాదశ్యుత్సవమాచరించు నరుడుద్యద్ధ్వోశ్చతుష్కరంబుతో
గాదే నాహిత దివ్య వాహనముతో గౌశేయ వస్త్రంబుతో
నాదిత్యుల్ గొనియాడనా హరిపురోదంచన్మణీవేదికన్
మోదంబందుచునుండు వైష్ణవ సభాముఖ్యుల్ ప్రశంసింపగన్.

కం. హరివాసరోపవాసాం
తరమున జన్మాంతరముల దలరని పాపాం
తరములు జననీ గర్భాం
తర విచ్మాత్రాది లిప్తతయు దొలగుధారన్ (తె. నార. పు. 4 ఆ. 6-10ప; 190-191 పు.)

ఈ విధంగా నరసింహకవి విశిష్ట ప్రతిభాసంపన్న వంతమై బహుముఖ కవితావైభవంతో విరాజిల్లే ఈ నారదీయ పురాణం ఆంధ్ర వాఙ్మయంలో ప్రత్యేకస్థానం వహించుతుందనడంలో యేమాత్రం సందియంలేదు.



# తెలుగు తదితర ప్రముఖ జాతీయ భాషల్లో గ్రంథాలయ సమాచార శాస్త్ర బోధన - పరిశోధనలపై జాతీయ సదస్సు (23 - 25 ఏప్రిల్, 1996) - నివేదిక

- డా॥ యం. శంకర్‌రెడ్డి

"తెలుగు తదితర ప్రముఖ జాతీయ భాషల్లో గ్రంథాలయ సమాచార శాస్త్ర బోధన - పరిశోధన"లపై మూడు రోజుల పాటు (ఏప్రిల్ 1996, 23 - 25 తేదీలలో) నిర్వహించిన జాతీయ సదస్సు ప్రారంభోత్సవ సమావేశం తేది : 23-04-96 ఉదయం 10.00 గంటలకు తెలుగు భవనం ఆవరణలో జరిగింది.

ఈ సమావేశానికి తెలుగు విశ్వవిద్యాలయం ప్రథమ ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్ప గారు ముఖ్య అతిథిగా విచ్చేసి జ్యోతి ప్రజ్వలన చేశారు. అనంతరం గ్రంథాలయ శాస్త్ర పితామహులైన కీ॥శే॥ డా. ఎస్.ఆర్. రంగనాథన్, కీ॥శే॥ అయ్యంకి వెంకటరమణయ్య గార్ల చిత్ర పటాలను ఆవిష్కరించారు.

తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయానికి ఎంతో అరుదైన, విలువైన పుస్తకాలను విశాల హృదయంతో బహుకరించిన ఏడుగురు దాతలను తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారి గారు, దుశ్శాలువ, మొమెంటోలతో సత్కరించారు.

ఆచార్య నాయని కృష్ణకుమారి గారు తమ అధ్యక్షోపన్యాసంలో - "భావ ప్రకటనకు భాష అడ్డంకి కాదనీ, ఎవరు ఏ భాషలో మాట్లాడినా ఆ వ్యక్తి ముఖ కవళికలు, హావ భావాలను బట్టి ఆ భాష రాకపోయినా అతడు చేప్పే విషయాన్ని అర్థం చేసుకోవచ్చనీ" అభిప్రాయపడ్డారు. తరగతి గదిలో విద్యాబోధనకు విద్యార్థులు కరువై 'దూర విద్య' ప్రాధాన్యత సంతరించుకుంటున్న ఈ సమయంలో గ్రంథాయాలు విద్యార్జనలో కీలకమైన పాత్రను వహించగలవని వారు చెప్పారు.

ఆచార్య తూమాటి దొణప్ప గారు 'ముఖ్య అతిథి' సందేశమిస్తూ - విశ్వవిద్యాలయంలో గ్రంథాలయం ప్రధాన అంగమనీ, విశ్వవిద్యాలయంలో ఉండే వివిధ శాఖల సమూహ రూపమే గ్రంథాలయమనీ, కాబట్టి ఆ శాఖలన్నింటి పై విడివిడిగా ఎంత శ్రద్ధ చూపుతారో, మొత్తంగా ఆ శ్రద్ధ నంతటినీ గ్రంథాలయం పైన కేంద్రీకరించ వలసి ఉంటుందనీ తెలిపారు. అలాగే విద్యార్థి తనజ్ఞాన సముపార్జనలో మూడొంతుల జ్ఞానాన్ని గ్రంథాలయం ద్వారానే పొందుతాడనీ, కేవలం ఒక వంతు జ్ఞానాన్ని మాత్రమే తరగతి గదిలో నేర్చుకుంటాడనీ, అందువలన గ్రంథాలయాలను అభివృద్ధి పర్చటంలో విశ్వవిద్యాలయాలు ప్రత్యేక శ్రద్ధ వహించాలని సూచించారు. తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం అన్ని గ్రంథాలయాల వంటిది కాదనీ, మిగతా గ్రంథాయాల్లో లభ్యంకాని పుస్తకాలు ఇక్కడ లభ్యమవుతాయనీ, పేర్కొన్నారు.

**తేది: 23.04.96** మధ్యాహ్నం 12.00 గంటలకు ఆచార్య యం.వి. వేణుగోపాల్ గారు మౌలిక పత్రాన్ని (కీ పేపర్) సమర్పించారు. శాస్త్రం అంటే ఏమిటి, శాస్త్ర విషయాలను తెలుగులో బోధించే విధానాలను గ్రంథాలయ సమాచార శాస్త్రం శాస్త్రమేనా, దాన్ని ప్రాంతీయ భాషల్లో బోధించటంలో ఎదురయ్యే సమస్యలు, తెలుగు తదితర భారతీయ భాషల్లో బోధన -

పరిశోధనల అవసరం, తీరు తెన్నులు మొదలయిన వివిధ అంశాలపై ఆసక్తికరమైన వివరాలను ప్రస్తావించారు.

అదే రోజు మధ్యాహ్నం గం. 2.15ల నుండి 5.00 గంటల వరకు మొదటి సమావేశం జరిగింది. విషయాంశం- "తెలుగులో గ్రంథాలయ సమాచార శాస్త్ర విద్య - పూర్వాపరాలు ఈ సమావేశానికి ఆచార్య ఎ.ఎ.ఎన్. రాజు గారు అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలో - ఆచార్య ఎ.ఎ.ఎన్. రాజు. డా॥పి. సోమరాజు. ఆచార్య ఎల్. ఎస్. రామయ్య, డా॥యం. శంకరరెడ్డి, కె. రమణయ్య పి. రాజరత్నంచెట్టి, కె.పి. అశోక్‌కుమార్, ఎస్. అంజయ్య, ఎస్. పాండురంగారెడ్డి ప్రభృతులు (మొత్తం 9 మంది) తమ పత్రాలను సమర్పించారు.

తేది : 24.04.96 ఉదయం 10.00 గంటలకు రెండవ సమావేశం ప్రారంభమైంది. విషయాంశం - "ఇతర ప్రముఖ భారతీయ భాషల్లో (తెలుగు మినహా) గ్రంథాలయ సమాచార శాస్త్ర విద్య" ఈ సమావేశానికి ఆచార్య ఇజారీ గారు అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలో ఆచార్య ఇజారీ, ఆచార్య ఎస్.ఎస్. జనార్ధన రావు, ఆచార్య ఎం.ఆర్. రిస్వాడ్కర్, అమితాభ ఛటర్జీ, శ్రీమతి ఎస్. పార్వతమ్మ, డా॥ ఎస్. సుదర్శన్‌రావు, డా॥ త్రితిబ్ త్రిపాఠి ప్రభృతులు (మొత్తం ఆరు మంది) తమ పత్రాలను సమర్పించారు.

అదే రోజు మధ్యాహ్నం 2.15 గంటల నుండి సాయంత్రం 5.00 గంటల వరకు మూడవ సమావేశం నిర్వహింపబడింది. విషయాంశం - "గ్రంథాలయ సమాచార శాస్త్ర విద్య - సమస్యలు - దృక్పథాలు" ఈ సమావేశానికి డా॥ వెలగా వెంకటప్పయ్య గారు అధ్యక్షత వహించారు. ఇందులో డా॥ వెలగా వెంకటప్పయ్య, డా॥ వి. విశ్వమోహన్, డా॥ బి. రమేష్‌బాబు, ఆళ్ల రాఘవయ్య, డా॥ ఎం.కె. చారి, ఎస్.బి. ఇనాందార్, ఆచార్య పి. కామయ్య, డా॥ ఎస్. రమాదేవి ప్రభృతులు (మొత్తం ఎనిమిది మంది) తమ పత్రాలను సమర్పించారు.

తేది : 25.04.96 ఉదయం 10.00 గంటలకు నాల్గవ సమావేశం జరిగింది. విషయాంశం - "గ్రంథాలయ సమాచార శాస్త్రం - పరిశోధన సృజనాత్మకత" ఈ సమావేశానికి ఆచార్య ఎం.వి. వేణుగోపాల్ అధ్యక్షత వహించారు. ఇందులో ఆచార్య ఇజారీ, సన్నిధానం నరసింహ శర్మ, డా॥ కె. తాతారావు, ఆచార్య ఎస్. ప్రకాశరావు, డా॥ఎం.కె. చారి, డా॥ సుదర్శన్‌సింగ్, ఆచార్య జె.వి.ఎస్.ఎల్.ఎన్. రాజు, ఎస్. హరికృష్ణారెడ్డి, టి. అశోక్‌బాబు, నరేంద్రలఖర్ ప్రభృతులు (మొత్తం పది మంది) తమ పత్రాలను సమర్పించారు.

పిమ్మట మధ్యాహ్నం 2.15 గంటలకు ఆచార్య ఎల్.ఎస్. రామయ్య గారి అధ్యక్షతన నిర్వహింపబడిన ముగింపు సమావేశంలో కీలకమైన విషయాలపై చర్చించి క్రింది విధంగా తీర్మానించడమైంది.

**తీర్మానాలు :**

1. గ్రంథాలయ సమాచార శాస్త్ర బోధనలో తెలుగు/భారతీయ భాషను ధ్రువీకరణ పత్రం (Certificate) స్థాయిలో నిస్సందేహంగా ప్రధాన మాధ్యంగా అనువర్తింవచ్చు. స్నాతక, అధ్యయన స్థాయిలో అదనపు మాధ్యంగా చేపట్టవచ్చును. తెలుగు/భారతీయ భాషలో పరిక్షలు రాయదలచిన విద్యార్థులకు ఆ అవకాశాన్ని కల్పించవచ్చును.

2. తెలుగు/భారతీయ భాష మాధ్యపరంగా గ్రంథాలయ సమాచార శాస్త్ర బోధన ముఖ్యంగా ఉన్నత స్థాయి బోధన, అనేక విధాల అభ్యాసపరమైన సమస్యలకు తావు కలిగి ఉండడటం వల్ల వాటి పరిష్కారార్థం (ఎ) పారిభాషిక పదకోశాలు. సమగ్ర వాఙ్మయ సూచీలు, (బి) అవసరమైన ఆంగ్ల రచనల తెలుగు/భారతీయ భాషానువాదాలు, (సి.)మూల రచనలు, ప్రచురణలు కావించటానికి ప్రభుత్వ పరమైన ఆర్థిక తదితర సదుపాయాలు, (డి) పరిశోధన, మౌలిక రచనలు, సాహిత్య విస్తరతలను సుకరం, వేగతరం చేయటానికి గ్రంథాలయ సమాచార శాస్త్రంలో తెలుగు/భారతీయ భాషల్లో నూతనంగా పత్రికలను ప్రచురించటం అవసరమని సూచన చేయటమైంది.

3. సంస్కృతి పరివృద్ధి, తెలుగు భాషను శాస్త్ర, సాంఘిక, సాహిత్య విషయాలకు అనువైన భాషగా వృద్ధి చేయటానికి ప్రేరణగాను, ముఖ్యమైన కార్య సంస్థగాను ఏర్పాటైన తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయ సమాచార శాస్త్ర రంగంలో కూడా తగు బాధ్యతలు నిర్వహించాల్సి ఉంది. ఈ ప్రకారం (ఎ) పరిశోధనా కార్యక్రమాలు, పథకాలు, (బి) ప్రచురణలు ప్రోత్సహించటానికి, (సి) విద్వత్సమాఖ్యలు, గోష్ఠులు, సదస్సులు నిర్వహించటానికి, ఇంకా ఇతరత్రమైన కార్యకలాపాలను చేపట్టటానికి వీలుగా తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో భాగంగా ఒక పరిశోధనా శాఖను నెలకొల్పటం అవసరమని భావించటమైంది.

4. ఈ ప్రకారమే ఇతర భారతీయ భాషల్లో గ్రంథాలయ సమాచార శాస్త్ర బోధనకు ఊతగా నిలవటానికి పరిశోధనా సంస్థలు ఏర్పాటు కావాలి.

5. దూర విద్యలో ప్రప్రథమంగా బోధన చేపట్టిన డా॥బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ప్రస్తుతం నిర్వహిస్తున్న స్నాతక విద్యా కార్యక్రమ సంబంధమైన పాఠ్యాలను, అలాగే ముందు ముందు చేపట్టాలని, సంకల్పించిన స్నాతకోత్తర విద్యా కార్యక్రమాలకు చేయనున్న పాఠ్యావళిని తెలుగులో కూడా అందించాలి. దీనికి తోడుగా వృత్తి పాలకులకు, వృత్తి విద్యా బోధకులకు అనువాదం తదితర విషయాలపై శిక్షణా కార్యక్రమాలను నిర్వహించటం కూడా అవసరం.

6. తెలుగు/భారతీయ భాషల్లో బోధన, విద్యార్జనలను ప్రోత్సహించటం కోసం యు.జి.సి. నిర్వహిస్తున్న "నెట్" ప్రశ్నా పత్రాలను కూడా ఈ భాషల్లో కావించటం సబబు కాబట్టి ఈ విషయమై యు.జి.సి. అధికారులను అర్థించటం జరగాలి.

7. జాతీయ స్థాయిలో చర్చావేదికను ఏర్పాటు చేసి అతి కీలకమైన చర్చాంశాన్ని ఎన్నుకొని సదస్సులో పాల్గొనటానికి పలువురికి అవకాశం ఏర్పరచి విజయవంతంగా నిర్వహించేందుకు డా॥ యం. శకంరరెడ్డి గారి కృషిని కొనియాడి తమ హర్షం ప్రకటించారు.

8. తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు, రిజిస్ట్రార్ తదితర అధికారులు ఈ సదస్సుకే కాక యూనివర్సిటీ లైబ్రేరియన్, గ్రంథాలయానికి కూడా మన్ననలు కావించినందువల్ల వారికి ధన్యవాదాలర్పించటమైంది.

9. సదస్సులో సమర్పించిన వ్యాసాలన్నీ విలువైనవి, ఉపయుక్తమైనవిగా ఉండటం వల్ల వాటిని పుస్తక రూపంలో తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం వారు త్వరలో ప్రచురించాలని విన్నవించటమైంది.

10. ఈ తీర్మానాలను సదస్సులో పాల్గొన్న వారికి, విద్యా విషయ ఆసక్తమైన సంస్థలకు, అన్నింటికి పంపించాలని తుది తీర్మానం.

అన్ని సమావేశాలకు ఆచార్య ఎస్.ఎస్. జనార్ధన రావు గారు ర్యాపోర్టర్ జనరల్‌గా వ్యవహరించారు. వీరికి సహాయంగా ఆయా సమావేశాల్లో డా॥ జె. యాదగిరి రెడ్డి, డా॥ విశ్వమోహన్, డా॥ బి. రమేష్‌బాబు, ఎస్. హరికృష్ణారెడ్డి, గార్లు ర్యాపోర్టర్సుగా వ్యవహరించారు.

సదస్సుకు సంబంధించిన వీడ్కోలు సమావేశం తేది: 25.04.1996 సాయంత్రం 4.30 గంటలకు తెలుగు భవనం ఆవరణలో జరిగింది.

ఈ సభకు జాతీయ సార్వత్రిక పాఠశాల ప్రాంతీయ కో-ఆర్డినేటర్ డా॥ వి.వి. ఎల్. నరసింహారావు గారు అధ్యక్షత వహించగా, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషన్ సభ్యులు, ప్రముఖ కవి డా॥ జె. బాపురెడ్డి గారు ముఖ్య అతిథిగాను, తెలుగు విశ్వవిద్యాలయం భాషాభివృద్ధి పీఠం డీన్ ఆచార్య బి. రామకృష్ణారెడ్డి గారు గౌరవ అతిథి గాను విచ్చేశారు.

మొదట డా॥ యం. శంకరరెడ్డి గారు తమ స్వాగతోపన్యాసంలో సదస్సు సారాంశాన్ని వివరించారు. ర్యాపోర్టర్ జనరల్ ఆచార్య. ఎస్.ఎస్. జనార్ధన రావు గారు తమ నివేదికను సమర్పించారు.

డా॥ వి.వి.ఎల్. నరసింహారావు గారు తమ అధ్యక్షపన్యాసంలో - శాస్త్ర గ్రంథాలయ ప్రాంతీయ భాషల్లో అనువదించటంలో తీసుకోవలసిన మెళుకువలను గురించి ప్రస్తావించారు. గౌరవ అతిథిగా విచ్చేసిన ఆచార్య బి. రామకృష్ణారెడ్డి గారు "భాష-భాషకున్న పరిమితులు, మాధ్యమంగా భాష నిర్వహించే పాత్ర" మొదలైన విషయాలను సోదాహరణంగా వివరించారు.

ముఖ్య అతిథి డా॥ జె. బాపురెడ్డి గారు తమ సందేశంలో - సమాచారం దిన దినాభివృద్ధి చెందుతున్నదనీ, ఈ సమాచారానికి, సమాచారం అందుకునే ఉపయోక్తకు మధ్య అంతరం పెరుగుతున్నదనీ వీటి మధ్య సమన్వయాన్ని సాధించే బాధ్యత గ్రంథాలయాలదేనని అభిప్రాయపడ్డారు. అలాగే - "ఆలోచన" గొప్పదనీ, ఆ ఆలోచనను అక్షరంగా మలిస్తేనే పుస్తకంగా మారుతుందనీ, అలాంటి పుస్తకాలు శక్తివంతమైనదనీ, వాటిని భద్రపరచే గ్రంథాలయాలు మరింత గొప్పవనీ పేర్కొన్నారు.

సదస్సు ఆహూతుల పక్షాన శ్రీ ఆళ్ల రాఘవయ్య, టి. రమేశ్‌బాబు గార్లు ప్రసంగించారు. శ్రీ యం. రాంచందర్, డిప్యూటీ లైబ్రేరియన్ గారు వందన సమర్పణ చేశారు.



# చిగుళ్ళు - శిఖరాలు

*(కవితా సంకలనం. సంకల కర్త : ఆచార్య మాధవరావు రేగులపాటి. వెల రు. 50/- ప్రతులకు- సాహితీ సమితి, 6-7-42/ఎ, రాగన్న దర్వాజ, హన్మకొండ - 506001)*

ఎవరి మతాలు వాళ్ళవిగా, ఎవరి సిద్ధాంతాలు వారివిగా కనబడుతున్న ఈ రోజుల్లో బాటలు వేరైన, అన్వేషణలు వేరైన కవులందర్నీ ఒకే వేదికపై తీసుకురావటం స్వాగతించవలసిందే. పూర్వం ఒక ప్రాంతమే సాహిత్యంలో డామినేట్ చేసేది. ఇప్పుడా పరిస్థితి మారింది. అన్ని ప్రాంతాల్లో చైతన్యం తొణికిసలాడుతోంది. అందుకే ప్రాంతీయమైన కథా సంకలనాలు వెలువడుతున్నాయి. అలాగే ప్రాంతీయమైన కవితా సంకలనంగా "చిగుళ్ళు శిఖరాలు" వెలువడింది. దీనివల్ల ఆ ప్రాంతీయుల ఆలోచనలు, ప్రతిస్పందనలు, శైలి మొదలైన వాటిని అంచనా వేసే అవకాశం ఏర్పడుతుంది. అందుకని నమలి కొండ బాలకిషన్ రావు, రేగుపాటి మాధవరావులు తెలంగాణలోని వరంగల్ నుండి వెలువడుతున్న కవిత్వానికి అద్దం పట్టే ప్రయత్నంగా ఈ 62 కవితల సంపుటిని ప్రచురించినందుకు అభినందిద్దాం.

నేటి కవిత్వంలో దళిత, స్త్రీ వాదాలు కొంతమేరకు ఆధిక్యత సంపాదిస్తున్నా చట్రాల మధ్య ఇమడటానికి ఇష్టంలేని కవులు కూడా కలాలకు పదును పెడుతూనే వున్నారు. అలాగని సమాజం నుంచి విడిపోవటం లేదు. పద్యం, గేయం కూడా తమ ఉనికిని చాటుకుంటూనే వున్నాయి. ఒక పక్క నిబద్ధత ఎంత తీవ్రంగా వుందో- మరో పక్క అనిబద్ధతా అంత తీవ్రంగానూ వుంది. ఇది ఒక వింత స్థితిగా కనబడుతుంది. ఈ "చిగుళ్ళు -శిఖారాలు" లో ఈస్థితి ప్రస్ఫుటంగా వుంది. ఇందులో అన్ని ప్రకియాలూ వున్నాయి. అన్ని కోణాల కవులూ వున్నారు. వెరసి ఇది వరంగల్ కవిత్వ సంపుటి అయింది.

అనుముల కృష్ణమూర్తి,అనుమాండ్ల భూమయ్య వంటి పద్య కవులున్నారు. పద్య కవిత్వం రాయగల సుప్రసన్న, సంపత్కుమారల వచన కవితలున్నాయి. కాళోజీ కనిపిస్తాడు. దళిత కవి అయిలయ్య కనువిప్పు కలిగిస్తాడు. భారతిని చూపించే సీనియర్ 'కవి' లాంటి భండారు సదాశివరావు గారినీ ఇందులో చూడవచ్చు. ఈతరం కవులలో ఒక స్థాయిగల దర్భశయనం శ్రీనివాసాచార్య, వఝల శివకుమార్, వి. ఆర్. విద్యార్థి మొదలైన వారిని చదవవచ్చు. ఒక నాడు వచన కవిత్వానికి ప్రాచుర్యం కల్పించిన పేర్వారం జగన్నాథం, మాదిరాజు రంగారావు, రామాచంద్రమౌళిల కవితల్ని పరిశీలించవచ్చు, ఇప్పుడిప్పుడే కవితారంగంలో తమ కలాలకి పదును పెడుతున్న ఎ.వి. నర్సింహారావు, కాంచనపల్లి, పొట్లపల్లి శ్రీనివాసరావుల కవితల్ని అధ్యయనం చేయవచ్చు. వరంగల్‌లో కవయిత్రులు కూడా తీసిపోలేదని శివపురం శైలజ, శీలం రాజేశం, సి.వి. పద్మజలు తెలియజెప్తారు.

ఇంజనీరింగ్, కామర్స్, గణితం, వృక్షశాస్త్రం, రసాయన శాస్త్రం వంటి వాటిల్లో విజ్ఞాన వంతులైన వారి తెలుగు కవిత్వం ఎలా వుంటుందో, ఉర్దూ- హిందీ- ఇంగ్లీషు పండితుల తెలుగు కవిత్వం పంథా ఏమిటో ఈ సంకలనం పరిశీలించి ఒక అవగాహనకు రావచ్చు. సాహిత్య కార్యకర్తల కవితారీతిని తెలుసుకోమంటారు కిషన్ రావు, తాళ్లపల్లి రామస్వామి, బాలకిషన్ రావు, పెద్దివెంకటయ్యలు.

"ఒక విధంగా ఇది కలగూర గంప కవితా సంపుటి కాదా?"అనవచ్చు. ఇందులోని కవితలన్నీ కవిత్వం ఉన్నవేనా? అందరూ మంచి కవులేనా? అసలు కవులేనా? అని

ప్రశ్నించవచ్చు. సమాధానాలు అటూ ఇటూ ఉంటాయి. ఒక కవి రాసిన కవితా సంపుటిలోనే అన్ని మంచి కవితలు ఉండనప్పుడు- ఇంతమంది రాసిన కవితల్లో అన్నీ బాగుండాలని ఆశించటం అత్యాశే అవుతుంది. "బాగోగులు" నేది ఎప్పుడూ సాపేక్షమే! కాని వస్తువై విధ్యం వుంటుంది. అభివ్యక్తిలో వైశిష్ట్యం వుంటుంది. సమాజానికి, ప్రపంచ సంఘటనలకి ఎవరు ఎలా స్పందిస్తారో ఎలా స్పందించరో స్పష్టంగా అవగాహనవుతుంది. ఎవరు భక్త కవి? ఎవరు దేశభక్తకవి? ఎవరు ప్రగతి శీలకవి? ఎవరు అనుభూతి కవి? అని పరిశీలించవచ్చు. వరంగల్ కవుల కవిత్వతత్త్వం ఏమిటో బేరీజు వేసుకోవచ్చు. అందుకోసం ఈ కవితా సంకలనం అవసరం వుంది.

సంకలన కర్త అయినా ప్రచురణ కర్త అయినా మంచికవితల్ని వెయ్యాలనీ, విశిష్ట కవితా సంకలనంగా ప్రచురించాలనీ పాటు పడతాడు. అది సఫలం అవటానికి కవుల నిజాయితీ సహకరించాలిమరి. ఒక ఆశయంతో ఒక నైతిక బాధ్యతతో కొన్ని చిగుళ్ళనూ, కొన్ని శిఖరాలనూ ఒకచోటికి తీసుకురావడం....కొన్ని ఆలోచనలైనా వెలిగించాలనుకోవడం.....ఒక కదలికకు మూలం కావాలనుకోవడం...మా ఈ ప్రయత్నానికి ప్రేరణ" అన్న సాహితీ సమితి కార్యదర్శి మాటలు సమంజసమే! 'చీకటిని తిడుతూ కూర్చోవడం కన్న చిరుదీపాన్ని వెలిగించడమే మిన్న' అనే సూక్తిని తలపించే కవితా సంకలనం ఇది.

- డా॥ ద్వానా శాస్త్రి



# అద్దంలోగాంధారి మరి పదకొండు కథలు

సాహితీ ప్రక్రియలో కథానికకి ప్రత్యేక స్థానముంది. ఈ ప్రక్రియ అంతర్జాతీయ స్థాయివరకు ఎదిగిందన్న విషయం మనందరికీ తెలుసు. మంచి కథానికలు రాసే కథకులెందరో వున్నారు. వాళ్లందరూ ఆధునిక తెలుకు కథానికని సుసంపన్నం చేస్తున్నారు. మన కథానికలు ఇతర భాషల్లోకి వెళ్ళడంతోపాటు ఇతర భాషల కథానికలు మన భాషలోకి రావలసిన అవసరం ఉంది. ఈ అవసరాన్ని గుర్తించి తెలుగు కథానికల్ని ఇతర భాషల్లోకి అనువదిస్తూ , ఇతర భాషల్లోని మంచి కథానికల్ని తెలుగులోకి అనువదిస్తున్న రచయితలలో నలిమెల భాస్కర్ ఒకరు. ఈయన 'శ్వేతరాత్రులు' కథల్ని తమిళంలోకి అనువదించారు. అలాగే తెలుగులోకి అనువదించిన మళయాళీ కథానికల సంకలనం 'నూరేళ్ళ పది ఉత్తమ మలయాళ కథలు' అనే పుస్తకాన్ని ప్రచురించారు.

కన్నడ, తమిళ మలయాళ, హిందీ, మరాఠి, బెంగాలీ, భాషల నుంచి రెండేసి కథల్ని అనువదించి అద్దంలో గాంధారి,' మరి పదకొండు కథలు' అనే సంకలానాన్ని తెచ్చారు. ఈ కథల్ని చదువుతుంటే అనువాద కథలు చదువుతున్నట్లనిపించదు. చక్కటి సులభ శైలిలో సాగిపోతాయి కథలన్నీ. ఈ విషయంలో నలిమెల భాస్కర్‌ని అభినందించి తీరాల్సిందే! కథా వస్తువుల్లో వైవిధ్యం కనిపిస్తుంది.

మొదటి రెండు కన్నడ కథలు 'నల్లమబ్బు వెండి అంచు, అద్దంలో గాంధారితో పాటు మూడవ తమిళ కథ 'బొమ్మకు అటువైపు' వరుసగా స్త్రీ వాద కథలను చదివిన మనకు నాలవకథ 'ఆకలి' చదవగానే హఠాత్తుగా బ్రేక్ వేసినట్లవుతుంది. ఆకలిని చల్లార్చుకోబోయి ప్రాణాలనే

కోల్పోయిన దీనుల గాథ 'ఆకలి'. చదవగానే ఎవరికైనా అయ్యో! అనిపించక మానదు. ఆకలి కరాళ నృత్య ప్రదర్శన 'ఆకలి' అయితే తనని హింసిస్తున్న భర్తకి బుద్ధి చెప్పడానికి విధవగా అతను చనిపోగానే పునిస్త్రీగా మారిన చంపకం కథ 'బొమ్మకు అటువైపు'. ఆ రెండూ మంచి కథలే! ఒకటి వున్న పరిస్థితుల్ని వున్నట్టుగా చిత్రిస్తే, మరొకటి బొమ్మకు అవతలివైపుని చూపించి కొందర్ని హెచ్చరిస్తోంది. వీటి ప్రక్కనే వున్న మలయాళ కథ 'ఆగస్ట్ 25' ఈ సంకలనంలో వుండకుండా వుంటే బాగుండేది. కన్నుకి కన్ను, ప్రాణానికి ప్రాణం తీయడం అతిహేయమైన చర్య అంటూ నేరస్థులని చంపడమే నీచమని భావించే ఈ రోజుల్లో తండ్రి మీద కక్షతో పిల్లవాణ్ణి చంపే కణారన్ చేష్టని ఎంత వరకు సమర్థించగలం? ఇలాంటి కథా వస్తువు ప్రభావం చదువరి మీద ఎలాగుంటుంది?

'మూర్తి దంపతులు, కాలుష్యం, ఇల్లు, బలి, గిన్నీ పిగ్, గురుత్వాకర్షణ,ఎవరు హిందువు' - మిగతా కథలు.

ఎవరు హిందువులో మతంకన్నా మానవత్వం గొప్పదనుకున్న వ్యక్తి చనిపోతే అతని పేరు మీద తమ మత పిచ్చిని ప్రదర్శించుకున్న వ్యక్తుల మీద చక్కటి వ్యంగ్యాస్త్రాన్ని సంధించారు రచయిత. కులం, మతం మాత్రమే గుర్తుంచుకుని మానవత్వాన్ని మరచిపోయిన వాళ్ళకి చెంపపెట్టు ఈ కథ.

చదివే సమయం కన్నా కూడా చదివేసిన తర్వాత ఆలోచించడానికి ఎక్కువ సమయం కేటాయించేట్లు చేయగల శక్తివంతమైన ప్రక్రియ కథానిక. ఆ ఆలోచన అతనికే కాక మరికొంతమందికి మేలు కలిగించడానికి తోడ్పడిందైతే అది 'మంచికథ' వినాశనానికి దారితీయడానికి సహకించేదైతే అది అవాంఛనీయ కథ. ఏరి, కోరి ఇతర భాషల నుంచి కథల్ని తెలుగులోకి తెచ్చేప్పుడు 'ఆగస్ట్ 25 లాంటి కథల్ని పట్టించుకోకుండా వుంటే మంచిది. ఈ ఒక్క కథనీ వదిలిస్తే ఈ సంకలనంలోని కథలన్నీ మంచి కథలే! ఇతర భాషా కథల ధోరణికి ఇవి కొన్ని ఉదాహరణలు.

*('అద్దంలో గాంధారి - మరి పదకొండు కథలు. అనువాదకుడు- నలిమెల భాస్కర్. పేజీలు 113. వెల- రూ. 30/- ప్రతులకు- నవోదయ బుక్ హౌస్, ఆర్య సమాజ్ ఎదురుగా కాచిగూడ, హైదరాబాద్).*

**డా॥ వేదగిరి రాంబాబు.**



**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి పుస్తకాలు బహూకరించిన శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి**

పత్రికా వ్యాసంగంలోను, రచయిత గాను, విశేషానుభవం కలిగిన కీ॥శే॥ అబ్బూరి వరద రాజేశ్వరరావు గారు సేకరించిన పుస్తకాలను వారి జ్ఞాపకార్థం శ్రీమతి అబ్బూరి ఛాయదేవి గారు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయానికి విరాళంగా ఇచ్చారు. ముఖ్యంగా, ఆంగ్ల, సంస్కృత సాహిత్యాలకు సంబందించినవే కాక, తత్త్వశాస్త్రం, మతం, మనోవిజ్ఞాన శాస్త్రం మొదలైన విషయాలకు సంబంధించినవే కాక మొత్తం 198 పుస్తకాలు, బండార్కరువారి సంస్కృత భారతం - 21 సంపుటాలు ఉన్నాయి. పరిశోధక విద్యార్థులకు, కవి పండిత విమర్శకులకు, ఇతరత్రా చదువరులకు ఇవి ఎంతో ఉపయోగపడతాయి.

## రచయితలు


1. ఆచార్య నాయని కృష్ణకుమారి - ఉపాధ్యక్షులు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాదు - 500 004.
2. డా. పి.ఎస్. పార్వతీ దేవి - రీడర్ ఇన్ తెలుగు, మేరీస్ స్టెల్లా కాలేజ్, విజయవాడ - 520 002.
3. డా. జి.యస్. భాస్కర రావు - సాహిత్యపీఠం, తెలుగు విశ్వ విద్యాలయం, బొమ్మూరు, రాజమండ్రి - 533 124.
4. అవంత్స సోమసుందర్ - 'కళాకేళి', పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా.
5. డా. ఎం. కులశేఖర రావు - B-10, F-2 విజ్ఞానపురి ఫ్లాట్స్, విద్యానగర్, హైదరాబాదు - 44.
6. డా. కె. ఆనందన్ - డిప్యూటి డైరెక్టర్ కమ్ రీడర్, విజ్ఞాన సర్వస్వ కేంద్రం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 500 004.
7. ఆచార్య తుమ్మపూడి కోటేశ్వర రావు - రిటైర్డ్ ప్రొఫెసర్ ఇన్ తెలుగు, స్టాఫ్ క్వార్టర్స్, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.
8. డా. ఆర్వీయస్. సుందరం - M-929, వివేకానంద నగర్, మైసూరు - 570 023.
9. ఆచార్య పి.ఎస్. సుబ్రహ్మణ్యం - సి.ఎ.ఎస్. ఇన్ లింగ్విస్టిక్స్, అణ్ణామలై విశ్వవిద్యాలయం, అణ్ణామలై నగర్, తమిళనాడు.
10. డా. గాలి రాధాకృష్ణ - లెక్చరర్ ఇన్ లింగ్విస్టిక్స్, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి - 517 502.
11. ఆచార్య జాస్తి సూర్యనారాయణ - 512, బాలాజి కాలని, తిరుపతి - 517 502.
12. డా. డి. కృష్ణకుమారి - తెలుగు అధ్యయన శాఖ, శ్రీ పద్మావతి మహిళా విశ్వ విద్యాలయం, తిరుపతి - 517 502.
13. డా. జమ్మలమడక కామేశ్వర రావు - ప్రచురణల విభాగం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 500 004.
14. డా. సి.వి.బి. సుబ్రమణ్యం - శాఖాధిపతి, జ్యోతిష్య శాఖ, తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాదు - 500 004.
15. పుప్పల శ్రీనివాస శర్మ - సంస్కృత అకాడమీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 500 007.